Phone 3732. Codes: "BENTLEY'S."




HIGH CLASS VIOLINS, BEST STRINGS & OTHER ACCESSORIES.

**2. BROADWAY, MADRAS.**

గొప్పరకము ఫిడేళ్లు, శ్రేష్ఠమైన తీగెలు, యింకా యితరపరికరములకు

**2 బ్రాడ్వే, మద్రాసు.**

ప్రారంభకులకు పనికివచ్చు ఫిడేళ్లు అన్నినైజులలోను
మిక్కిలి సరసమైన ధరలకు దొరుకును.

**RADHA BROS.**

**OPHTHALMIC OPTICIANS.**



**174, BROADWAY, MADRAS.**

నమ్మకమైనవి, పరీక్షచేసి ప్రశంసింపబడిన గొప్పరకము ఫ్రేములు కలవి.

**విద్యార్థులకు తగ్గింపురేట్లు.**

26 సంవత్సరములనుండి నాణ్యాదనమునకు పేరొందియున్నాము.
మహారాజులు, హైకోర్టుజడ్జీలు, డాక్టరులు మున్నగువారిచే ఆదరింపబడుచున్న కంపెనీ.

రాధా బ్రదర్సు, 174 బ్రాడ్వే, మద్రాసు.

# బలము . ప్రసన్నత

బహుధాన్యలో సర్వజనులకు ఆరోగ్య ప్రసన్నతల బహూకరణము.



ఇంటిల్లిపాదీ

బలప్రసన్నలతో సుఖించాలి.
నీరసము, నిస్తేజము
బలహీనత
రక్తక్షయము
యివి లేకుండా
సుఖముగా వుండటానికి

## జీవామృతము

నకు అలవాటుపడండి.

జీవామృతము నమ్మిన బంటుగా మీకు ఉష్ణరక్తం, ఉత్సాహం, ఉజ్వల యవ్వనం ప్రసాదించి వజ్రకాయులను చేస్తుంది. నేటి నుండే జీవామృతము ఒక అలవాటుగా చేయండి.



ఇంక

బాల బాలికలకు
ప్రసన్నత ఉండాలి.
అప్పుడే వారికి ఆరోగ్యము,
వృద్ధి వుంటవి.
పసిపిల్లలలో వచ్చే బల్లగడ్డ అనబడే
లివర్ అండు స్ప్లీన్
ఘాతుకవ్యాధులను దగ్గరకు
రానీయనిది, వస్తే తరిమివేయగలది

## బాలభాస్కర

అజీర్తి, విరేచనములు, కామెర్లు, ఉబ్బు, ఉష్ణము వీటన్నింటిని పారద్రోలగలది బాలభాస్కర. వేలకొలది మందికి ఆరోగ్యము ప్రసాదించి ప్రసన్నత నీయగలది బాలభాస్కర అని జ్ఞాపకం ఉంచుకోండి.

ఈ మహత్తర బల ప్రసన్నతలను ప్రసాదించగల ఔషధరాజములను
1898 నుండి మీకు అర్పిస్తూ ఉన్న ప్రముఖసంస్థ

## ఆయుర్వేదాశ్రమం,

గోవిందప్పనాయక వీధి, మద్రాసు.

బాగుగా పనిచేయుటకు
మితవ్యయమునకు
నమ్మకమునకు

## యెలిక్సు బల్బులను

కొనుడు.

**1,000** గంటలకు
గ్యారంటీ యివ్వబడును.

సినిమా స్విచ్‌బోర్డులు
మోటార్ జనరేటర్లు వగైరా
మోటార్ పంపులు
సీలింగ్ అండ్ టేబిల్ ఫ్యాన్సు
ఓవర్ హెడ్‌లైన్—
పరికరములకు

**R. M. S. & CO., ELECTRICAL ENGINEERS,**

**55/57, Rattan Bazar, Madras.**

## యస్. వి. రామానుజం శెట్టి అండు కంపెనీ.

(Estd. 1863)

12, బ్రాడ్వే, మదరాసు.



ఒంటినాళము తోట తుపాకి
హెచ్. & ఆర్. రూ. 45/-. రూ. 50/-.
రెండునాళము తోటా తుపాకి రూ. 65/-.
రెండునాళము కేపు తుపాకి రూ. 35/-.
ఇంగ్లీషు తోటాలు నూరు రూ. 10-0-0.

క్యాటలాగు ఉచితము.
మంచి గ్యారంటీతో రిపేర్లు చేయుదుము.

## ద్వాదశలవణవైద్యము రు 1-0-0

ఇందు 12 ఔషధములతో ఏరోగమునైనను తనంతట తాను కుదుర్చుకొనవచ్చును. గర్భిణి స్త్రీలు, పసిపిల్లలు, వృద్ధులు, సేవించినను, మోతాదు ఎక్కువ తక్కువయైనను, ఒక రోగమునకు ఒక మందు వాడినను ప్రమాదము కలుగదు. సీసా 1-కి రు. **0-1-3** మాత్రమే.

మూత్రపరీక్ష చేయు విధానము రు **0-8-0**
హోమియోపతి శిశువైద్యశాస్త్రము రు **0-8-0**

వలయువారు —

## హోమియోపతి మెడికల్‌హాల్,

డాక్టరు బి. యల్. నారాయణరావు,

కింతాడ కోటపాడు పోస్టు,
చోడవరం (S O) విశాఖపట్నంజిల్లా.

# ఆంధ్ర పత్రిక

ఇరువది తొమ్మిదవ

# బహుధాన్య సంవత్సరాది సంచిక

అధిపతి : సంపాదకుడు

కా. నాగేశ్వరరావు

ఆంధ్రవిద్వన్మహాజనులచే వ్రాయబడిన

ఆంధ్ర సారస్వత, చారిత్రక, సాంఘికాదివిషయక

వ్యాసములును, చిత్రములును గలవు

చెన్నపురి

ఆంధ్రపత్రికా ముద్రాలయమున

ముద్రితము.

1938 సంవత్సరము ఏప్రిల్ నెల 1 వ తేది

1938 - 1939

# విషయానుక్రమణిక



## చిత్రములు

# అమృతాంజనము




శా. రంతుల్ మానుమ కుక్కుటాధమ! దరిద్ర క్షుద్ర శూద్రాంగణ
ప్రాంతోలూఖలమూల తండుల కణగ్రాసంబుచేఁ గ్రొవ్వి; దు
ర్దాంతాభీల విశేషభీషణ ఫణాంతర్మాంస సంతోషిత
స్వాంతుం డైన ఖగేంద్రు కబ్బెదుర నీ జంజాటముల్ సాగునే?

# పెనుగొండ కొండ

[ముఖపత్ర చిత్రము]

రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ

చనిననాళుల తెనుఁగుకత్తులు
సానపెట్టినబండ యీ పెనుగొండ కొండ.

రంధ్రముల ప్రహరించుశత్రుల
రక్తధారల త్రావి త్రేచిన
ఆంధ్రకన్నడ రాజ్యలక్ష్మల
కరిది సీలపుదండ యీ పెనుగొండ కొండ.

వెరపు లెరుఁగని బిరుదునడకల
విజయనగరపు రాచకొడుకులు
పోరలఁబోయఁగ కరుడుగట్టిన
పచ్చినెత్తురుకుండ యీ పెనుగొండ కొండ.

తిరుమలేంద్రుని కీర్తిదేనెల
బెరసిదించిన కాపుకవనపు
నిరుపమ ద్రాక్షారసంబుల
నిండి తొలఁకెడికుండ యీ పెనుగొండ కొండ.

[ప్రాచీనేతిహాసములో కొన్ని దుర్గ్రాహ్యములు, అవిభేద్యములు నగు సన్నివేశము లుండును. ప్రాక్తన విమర్శకుల సంశోధనలచేత అట్టి నిగూఢములు వెలిబుచ్చబడును. 'పెనుకొండ కొండ' యిట్టి విమర్శనలచే తెలియబడు నొక చారిత్రికదృశ్యము.

పెనుకొండ అనంతపురం జిల్లాలోని ఒక తాలూకా. ఇది చరిత్రాత్మకమగు పురమని తెలియనివా రుండరు. 'పెనుకొండ' అనునప్పుడు మనకు స్ఫురణకు వచ్చున దీగ్రామము కాదు; ఈ గ్రామమున కతిసమీపముననే పశ్చిమమున పడమటి కనుమలవోలె ఉన్నతమైయున్న గొప్పదుర్గము. 'ఘనగిరి' యని దీనికి మరియొకపేరు.

* కాలరాక్షసుని నర్తనపాదాఘాతములకు బలియై, ఛిన్నాభిన్నమై శేషించిన తణుకు మిణుకులై మెరయు ఆంధ్రరాష్ట్రీతిహాస రేణువుల ప్రకాశమును సంస్మరింపజేయు ఒకతార యీ గిరియన్న అతిశయము కాదేమో!! ఆంధ్రకర్ణాటకంబుల నఖండవిఖ్యాతిచే నేలిన శ్రీకృష్ణదేవరాయ సార్వభౌమునంతటివాని నాకర్షించి అతని వేసవినెలవగుట కీదుర్గపు ఘనత యొద్ది? సాహితీసమరాంగణ సార్వభౌముడగు కృష్ణరాయల అష్టదిగ్గజకవీంద్రులలో పేర్గన్న భట్టుమూర్తి "బాపనయ్యల నడుమ పల్లకినెక్కించి భట్టుమూర్తికి కీర్తి దెచ్చింది పెనుకొండ" అన్నట్టి భట్టుమూర్తి, తనవసుచరిత్రములో యీగిరికన్యను వర్ణించునప్పుడు ఈ పెనుకొండకొండను, దీని సమీపముననే ప్రవహించు 'ఉపేంద్రనది'ని పోల్చిన దీదుర్గమును మనస్సునం దుంచుకొనియే కాబోలు!! రాయలనాటి ఘనకళానైపుణ్యము ఈ దుర్గనిర్మాణములో ఇప్పటికిని కేంద్రీభూతమై యున్నది.

ఈ గిరిచుట్టును శత్రునిర్భేద్యము లగుకోట ఏడువరుసలుకలిగి, కొండపైన రాయలు వేసగిలో నివసించుట కేర్పరచుకొన్న "కిల్లా" యను శిబిరముతో కూడియున్నది.

"మంత్రి బుద్ధిబలమే సామ్రాజ్యమునకు సర్వాంగరక్ష" యను దివ్యసూత్రమును సత్యమనిపింపజేసిన అప్పాజీ (తిమ్మరుసు) మంత్రిసమాధి యీగిరి యడుగుభాగమున నుండుట యీగిరి కొక పవిత్రత నొడగూర్చును. ఈదుర్గమహత్త్వము, చరిత్ర, యీ ఐతిహాసిక సంకేతము ఈదుర్గపు గతవైభవజీవితమును కనులకు కట్టినట్లు కనుబరుపజేయును.

—టి. వి. నాథముని అయ్యంగారు.]

శ్రీ శివాభ్యాం నమః

# శ్రీ బహుధాన్యసంవత్సర సిద్ధాంత పంచాంగము

శ్లో. శ్రీకల్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం, గంగాస్నాన విశేషపుణ్యఫలదం గోదానతుల్యం నృణామ్,
ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతానసంపత్ప్రదం, నానాకర్మ సుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్.

## రాహుకాలము

సూర్యోదయం 6 ఘం. అయ్యేదినములకు

| వారములు | మొదలు | వరకు |
|---|---|---|
| ఆదివారము | $4\frac{1}{2}$ | 6 |
| సోమవారము | $7\frac{1}{2}$ | 9 |
| మంగళవారము | 3 | $4\frac{1}{2}$ |
| బుధవారము | 12 | $1\frac{1}{2}$ |
| గురువారము | $1\frac{1}{2}$ | 3 |
| శుక్రవారము | $10\frac{1}{2}$ | 12 |
| శనివారము | 9 | $10\frac{1}{2}$ |



## గుళికకాలము

సూర్యోదయం 6 ఘం. అయ్యేదినములకు

| వారములు | మొదలు | వరకు |
|---|---|---|
| ఆదివారము | 3 | $4\frac{1}{2}$ |
| సోమవారము | $1\frac{1}{2}$ | 3 |
| మంగళవారము | 12 | $1\frac{1}{2}$ |
| బుధవారము | $10\frac{1}{2}$ | 12 |
| గురువారము | 9 | $10\frac{1}{2}$ |
| శుక్రవారము | $7\frac{1}{2}$ | 9 |
| శనివారము | 6 | $7\frac{1}{2}$ |

పంచాంగకర్తలు :

## కుప్పా విశ్వపతిశాస్త్రి, చివుకుల వేంకటరమణశాస్త్రి

## శ్రీ బహుధాన్యసంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరమున రాజులకు అన్యోన్యకలహములుగల్గి జననాశనము గల్గును. పశువులకు రోగపీడ గల్గును. గాలియు వర్షములున్ను అధికముగా నుండును. తొలకరిపంటలు సామాన్యముగా ఫలించును. మధ్య సస్యములకు కొంత అరిష్టము గల్గినను మధ్యరకముగా ఫలించును. అంత్యసస్యములు బాగా ఫలించును. ఎఱ్ఱధాన్యములగు కందులు, శెనగలు, వేరుశెనగ, మిర్చి బాగాఫలించును. నువ్వులు, ఆముదాలు, మినుములు, పెసర మొదలగు నల్లధాన్యములపంట చాలాభాగము చెడిపోయి కొద్దిగ ఫలించును. జొన్నలు, సజ్జలు, గోధుమలు, వరిధాన్యములకు కొంత అరిష్టముగల్గి సామాన్యముగా ఫలించును. దూది పంట ప్రారంభములో బాగుగానుండి చివరకు చాలా చెడిపోవును. వెండిధర బాగా పెరుగును. ధాన్యముధర సామాన్యముగా పెరిగి నిలబడివుండును. దూదిధరలు గొప్ప హెచ్చుతగ్గులతో కూడియుండును. మొత్తముమీద తొమ్మిదవీసముల పంటపండును. కార్తిక పూర్ణిమనాడు సంపూర్ణ చంద్రగ్రహణముండును. కార్తిక శు ౧౨ నాడు సింధునదీ పుష్కరము. ఫాల్గునమాసమున గురుమౌఢ్యమున్ను కార్తిక బ ౫ నుంచి మార్గశిర శు ౨ వరకు శుక్రమౌఢ్యమున్ను గలుగును.

స్వస్తి సర్వేషాం సమస్తసన్మంగళాని భవంతు. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## ఇష్టదేవతా ప్రార్థన

వాగీశాద్యాస్సుమనసస్సర్వార్థానా ముపక్రమే,
యం నత్వాకృతకృత్యాస్స్యు స్తన్నమామి గజాననమ్
అచింత్యావ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే,
సమస్త జగదాధారమూర్తయే బ్రహ్మణే నమః
బ్రహ్మాణ మీశాన హరీ సురేశ్వరం
గ్రహాన్నవాప్యర్కముఖాన్ మహాత్మనః,
ఋషీన్ దినర్క్షాధిపతీన్ దివౌకసః
పుణ్యాన్ ప్రపద్యే శరణం ప్రతిక్షణమ్.

## సంవత్సరాది దివసకృత్యం

అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నాన మాచరేత్,
వస్త్రై రాభరణై ర్దేహ మలంకృత్య తత శ్శుచిః.
విఘ్నేశం భారతీం ఖేటాన్ దైవజ్ఞ మభిపూజ్యచ,
సంవత్సరఫలం సమ్య క్ఛ్రుత్వా విప్రాన్ సమర్చయేత్.

## అబ్దత్రయ నిరూపణం

అస్మిన్దేశే చాంద్రమానాబ్దో గ్రాహ్యః. శేషాచలస్య దక్షిణ దేశే సౌరమానాబ్దో గ్రాహ్యః. వింధ్యస్యోత్తర దేశే బార్హస్పత్యమానాబ్దో గ్రాహ్యః. సర్వత్ర సురూడయ మానీయవర్షో గ్రాహ్యః. చాంద్రమానేన బహుధాన్యసంవత్సరః. సౌరమానేన ఏతత్సంవత్సర. **చైత్ర కృ ౧౪ పర్యంతం ఈశ్వరసంవత్సరః. తదుపర్యబ్దాంతపర్యంతం బహుధాన్యసంవత్సరః.** బార్హస్పత్యమానేన అబ్దాదిప్రభృతి ఫాల్గున **శు ౧౫ పర్యంతం** విక్రృతిసంవత్సరః. తదుపర్యబ్దాంతపర్యంతం ఖర **సంవత్సరః.** సురూడయవశాత్ భాద్రపదాబ్దః అస్య సమస్తకళ్యాణ **భాజనస్య,** సకలశాస్త్రనిత్యకర్మానుష్ఠాన క్రియాతంత్ర వ్యవ **హార హేతుభూతస్య,** సృష్ట్యాదిగత సౌరాబ్దాః ౧౯౫౫౮౮౫౦౩౯ **కల్యాది** గతాబ్దాః ౫౦౩౯ శాలివాహనశకగతాబ్దాః ౧౮౬౦ విక్ర **మార్కశక** గతాబ్దాః ౧౯౯౪ హూణశకే 1938-1939 ఫార్సీశకే **౧౩౪౭**-౧౩౪౮. శ్రీ సూర్యసిద్ధాంతోక్త మార్గేణ అద్య బ్రహ్మణః. **పరమాయుశ్శతార్ధంగతం.** అనంతరం ప్రథమవర్షే, ప్రథమమాసే, **ప్రథమపక్షే,** ప్రథమదివసే. అహ్నః ఘ ౧౩-౪౭ గతాః. ద్వాదశ **యుగానాం** మధ్యే తృతీయే, శక్రదేవతాకేయుగే, ద్వితీయో బహు**ధాన్యనామకః,** అర్కదేవతాకః పరివత్సరః.

అస్య సంవత్సరస్య రాజాదినిర్ణయో యథా.

| | |
|---|---|
| రాజా శుక్రః | అర్ఘాధిపః కుజః |
| మంత్రీ బుధః | మేఘాధిపః బుధః |
| సేనాధిపః కుజః | రసాధిపః చంద్రః |
| సస్యాధిపః శనిః | నీరసాధిపః శనిః |
| ధాన్యాధిపః శుక్రః | |

పురోహితః శనిః. పరీక్షకః శనిః. గణకః రవిః. గ్రామపాలకః బుధః. దైవజ్ఞః కుజః. పశుపాలకః గోపాలః. స్థానసంరక్షకః బలభద్రః. అశ్వాధిపః శుక్రః. గజాధిపః బుధః. అజాధిపః బుధః. యుద్ధాధిపః బుధః. పూర్వసస్యాధిపః శనిః. అపరసస్యాధిపః శుక్రః. వ్యాపారాధిపః కుజః. ధనాధిపః కుజః. వ్యవహారాధిపః రవిః. వస్త్రాధిపః రవిః. గృహాధిపః శనిః. పశ్వధిపః బుధః.

పుష్కరనామక మేఘః. మేరో రీశాన్య దిగ్భాగే అస్యోత్పత్తిః. నందసారినామక నాగః. ప్రవహనామక వాయుః. ఆఢక చతుష్టయ పరిమితం వర్షం. ఆఢకత్రయ పరిమితో వాయుః. భూవాహకః. విరాటః.

## వర్షధాన్యాదయః

వర్షం ౧౩, ధాన్యం ౧౩, శీత ౨, తృణ ౧౩, ఉష్ణ ౧౩, మారుత ౨, ప్రజావృద్ధి ౧౫, క్షయ ౧౫, రాజవిగ్రహ ౧౧, ఉగ్ర ౧౧, పుణ్య ౧౧, పాప ౧౧, వ్యాధి ౨, ఉపశమ ౨, ఆచార ౧౫, అనాచార ౧౯, జన్మ ౫, మరణ ౧౧, దేశోపద్రవ ౨, దేశస్వాస్థ్య ౧౩, చోరభీతి ౧౫, తన్నాశః ౧౫, అగ్నిభయ ౧౫, తన్నాశ ౧౨, మృగోపద్రవ ౫, తన్నాశ ౧౫, కీటభయ ౧౫, తన్నాశః ౫, మూషకవృద్ధి ౩, తన్నాశ ౧౧, సర్పోపద్రవ ౧౩, తన్నాశః ౯, కామ ౧౨, లోభ ౩, మోహ ౧౯, మద ౧౫, మాత్సర్య ౨, సుఖ ౧౩, దుఃఖ ౧౨, భోగ ౧౯, విడంబం ౧౯, మనోవ్యథ ౧౨, ద్వేష ౧౩, ప్రతిష్ఠ ౨, అప్రతిష్ఠ ౧౨, ద్యూత ౯, మత్తత ౧౨, పురుషోత్పత్తి ౨, స్త్రీజామృత్పత్తి ౧౩, ధాతు ౧౯, భయ ౨, శౌర్య ౧౧, దుష్టనిగ్రహ ౧౫, శిష్టపాలన ౧౯, సత్య ౫, అసత్య ౨, విశ్వాసం ౯, **అవిశ్వాసం ౧౧, దయ ౧౧, నిర్దయ ౧౫, న్యాయ ౧౨, అన్యాయం** ౧౯, జ్ఞానం ౧౧, అజ్ఞానం ౧౫, కపట ౫, నిష్కాపట్యం ౫, ధార్మికత్వ ౧౨, అధార్మిక ౧౨, గోమాయు ౧౦, తన్నాశ ౧౦, సస్యకీట ౨, తన్నాశః ౧౦, శలభ ౧, తన్నాశః ౨, మశక ౧౦, తన్నాశః ౧౦, మత్కుణ ౧, తన్నాశః ౧౩, వృశ్చిక ౧, తన్నాశః ౧౦, వ్యాఘ్ర ౧౩, తన్నాశః ౧౦, సస్యవృ ౬, తన్నాశః ౨, పశువృద్ధి ౮, తన్నాశ ౫, శుక ౮, తన్నాశః ౫, ద్రుమకీటవృ ౯, తన్నాశః ౮, క్షుధా ౨, తృష్ణ ౨, నిద్ర ౧౩, ఆలస్యం ౧, ఉద్యోగం ౧, నిరుద్యోగ ౧౧, శాంతి ౧, క్రోధం ౯, డంబం ౯, మిత్రభేదం ౨, మైత్రి ౫, రసనిష్పత్తి ౨, ఫలనిష్పత్తి ౧౧, ధేను ౧, తన్నాశః ౧, గజ ౧, తన్నాశః ౪, ఉష్ట్రి ౧, తన్నాశః ౫, విప్ర ౧, తన్నాశః ౫, క్షత్రియ ౧, తన్నాశః ౪, వైశ్య ౭, తన్నాశః ౫, శూద్ర ౫, తన్నాశః ౭, మ్లేచ్ఛ ౩, తన్నాశః ౫, సంకర ౧, తన్నాశః ౫, గారుత్మతి ౪, పద్మరాగ ౭, వజ్ర ౪, వైడూర్య ౧, గోమేధిక ౭, పుష్యరాగ ౩, ఇంద్రనీల ౪, ప్రవాళ ౫, మౌక్తిక ౫, ఇతరరత్న ౫, సువర్ణ ౮, రజత ౮, తామ్ర ౭, కాంస్య ౮, లోహ ౮, అయః ౭, త్రపు ౧౦, సీసం ౧౦, రసం ౬, వ్రీహి ౭, శాలి ౧౪, కులుత్థ ౭, తిల ౧౪, మాష ౭, ముద్గ ౭, సర్షప ౧౦, చణక ౧౬, ఆఢకీ ౧౦, గోధూమ ౭, కోద్రవ ౪, ప్రియంగు ౧౦, యావనాల ౧౭, శ్యామాక ౬, రాజమాష ౧౪, నీవార ౧౬, శింబిధాన్య ౧౭, పనస ౩, నారికేళ ౧౧, మాతులుంగ ౩, జంబీర ౯, ఖర్జూర ౧, రంభా ౫, చూత ౫, కపిత్థ ౧౩, తింత్రిణీ ౧౨, ధాత్రీఫల ౧౨,

అతివృష్టి ౧౧, అనావృష్టి ౭, శలభ ౩, తన్నాశః ౩, శుకశ ౩, తన్నాశః ౧౧, మూషిక ౧౧, తన్నాశః ౭, స్వచక్రభయ ౩, పరచక్రభయ ౧౧, అండజాః ౧౩, స్వేదజ ౧౩, ఉద్భిజ ౭, జరాయుజ ౧౩, స్థావరా ౧౩, జంగమా ౭, ఇతరజీవరాశయ ౧౫, రాజపూజ్యత ౬, అవమానం ౫, ఉత్సాహ ౯, విద్యుత్ ౭, శిలాపాత ౪, గర్జితం ౩.

## అథ కందాయఫలాని

| అశ్వ | భ | కృ | రో | మృ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్లే | మఘ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ |
| ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ |

| పూఫ | ఉఫ | హ | చిత్ర | స్వా | వి | అనూ | జ్యే | మూ |
|---|---|---|---|---|---|---|---|---|
| ౬ | ౧ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ |

| పూషా | ఉషా | శ్రవ | ధని | శత | పూభా | ఉభా | రేవ |
|---|---|---|---|---|---|---|---|
| ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ |
| ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ |

ఆదిశూన్యే మహావ్యాధిః మధ్యశూన్యే మనోవ్యథా,
అంత్యశూన్యే ఫలం స్వల్పం త్రిశూన్యే నిష్ఫలం భవేత్.
విషమేష్వర్థలాభం స్యాత్ సమేతు సమతా భవేత్,
శూన్యే శూన్యత్వ మాప్నోతి కందాయ ఫలమీదృశం.

## ఆదాయవ్యయౌ

| | ఆ. | వ్య. | | ఆ. | వ్య. |
|---|---|---|---|---|---|
| మేషవృశ్చికయోః | ౨ | ౮ | సింహస్య | ౧౧ | ౫ |
| వృషభతులయోః | ౧౧ | ౧౪ | ధనుర్మీనయోః | ౫ | ౧౪ |
| కన్యామిథునయోః | ౧౪ | ౧౧ | మకరకుంభయోః | ౮ | ౮ |
| కటకస్య | ౮ | ౧౧ | | — | — |

మొత్తం పాట్లు ౧౫

## రాజ్యపూజ్య రాజావమానాని

| | పూ. | అ. | | పూ. | అ. |
|---|---|---|---|---|---|
| మేషస్య | ౧ | ౭ | తులాయాః | ౫ | ౬ |
| వృషభస్య | ౪ | ౭ | వృశ్చికస్య | ౧ | ౨ |
| మిథునస్య | ౭ | ౬ | ధనుషః | ౪ | ౨ |
| కటకస్య | ౩ | ౩ | మకరస్య | ౭ | ౨ |
| సింహస్య | ౬ | ౩ | కుంభస్య | ౩ | ౫ |
| కన్యాయాః | ౨ | ౬ | మీనస్య | ౬ | ౫ |

## సంవత్సర ఫలాని

| | |
|---|---|
| అశ్వి, పుష్య, స్వాత్యభిజితాం | మనస్తాపః |
| భర, ఆశ్లే, విశాఖ; శ్రవణానాం | రాజపూజ్యతా |
| కృత్తికా, మఘ, అనూ, ధనిష్ఠానాం | కలహః |
| రోహిణీ, పూఫ, జ్యే, శతతారాణాం | భూషణం |
| మృగ, ఉఫ, మూలా, పూభాణాం | రోగః |
| ఆర్ద్ర, హస్త, పూషా. ఉభాణాం | ఆయుర్వ్యయం |
| పున, చిత్ర, ఉషా, రేవతీనాం | అర్థలాభః |

## అబ్దత్రయ ఫలం

### చాంద్ర సౌరమానాభ్యాం బహుధాన్య సంవత్సర ఫలం

అనీతిరఖిలావృష్టి ర్బహుధాన్యాఖ్యవత్సరే,
వివిధై ర్ధాన్యనిచయై స్సంపూర్ణానిఖిలాధరా.

సంపూర్ణ వృష్టిచేత భూమి అన్ని ధాన్యములను ఫలించును. అవినీతి లోకమం దధికము. బార్హస్పత్యమానేన అబ్దాది ఫాల్గున బ ౧౨ పర్యంతం.

### వికృతి సంవత్సర ఫలం

ముష్ణంతి తస్కరాలోకం వికృతప్రకృతి స్తథా,
వికారా అల్పవృష్టిశ్చ వికృతేబ్దే ప్రజారుజః.

లోకమున చోరభయమధికము. స్వల్పమైన వృష్టిగల్గును. రోగ బాధ గల్గును. ప్రజలు వికారముగల్గిన ప్రకృతి గలవా రగుదురు.

### గురూదయమానీయ భాద్రపదాబ్ద ఫలం

అబ్దేభాద్రపదేవృష్టిః క్షేమారోగ్యం క్వచిత్క్వచిత్,
పూర్వసస్య సమృద్ధిస్స్యా న్నాశం యా త్యపరంఫలం.

మంచివర్షము లుండును. అచ్చటచ్చట జనులు క్షేమారోగ్యములు గల్గివుందురు. తొలకరిపంట పండును. పైరపంట నశించును.

## అథ రాజాదీనాం ఫలాని

### తత్ర రాజ్ఞశ్శుక్రస్య ఫలం

శుక్రస్యరాజ్యే బహుసస్యసంకులాసు.తీవ్రవేగాస్సరితోంబురాశిభిః,
ఫలంతివృక్షాబహుగోప్రసూతిర్వ సుంధరాపార్థివసౌఖ్యసంయుతా.

భూమి చక్కగా ఫలించును. నదులు జలపూర్ణముగా ప్రవహించును. వృక్షములు ఫలించును. గోవులు క్షీరప్రదము లగును. రాజులు సౌఖ్యముగా నుందురు.

### మంత్రిణః బుధస్య ఫలం

మంత్రిణిశశాంకతనయే ప్రభూతవాయు ర్నిరంతరం వాతి,
మధ్యమఫలదాధరణీయ వచణగే హామహర్ఘతాపి.

వాయువు అధికముగా వీచును. భూమి సామాన్యముగా ఫలించును. యవలకు గోదుమలకు ధరలు పెరుగును.

### సేనాపతేః కుజస్య ఫలం

రోగాగ్ని బాధాజంతూనాం పయోదాశ్చాల్పవృష్టయః
తుషధాన్యాశ్చతామ్రాణాం లాభస్స్యాత్క్రయవిక్రయే,
సేనాధిపే యదాభౌమే యుద్ధే భూపాలయంయయుః.

జనులకు రోగబాధయు, అగ్నిభయపద్రవములున్ను, గల్గును. వర్షము తక్కువ. రాజులకు కలహము గల్గును. పొట్టుగల ధాన్యములకు రాళ్లకు రాగికిన్ని ధర పెరుగును.

### సస్యాధిపతేశ్శనేః ఫలం

రవిసుతేయది ధాన్యపతౌజనాన్నృపతిభిఃపరిపీడితవిగ్రహాః,
గదభయంతుషధాన్య మహర్ఘతాదురితవాదవివాదయుతా వరాః.

ప్రజలు వ్యాధిగ్రస్తులయి రాజులచేత పీడింపబడుదు అన్యోన్య కలహము గల్గియుందురు. పొట్టుగల ధాన్యములకు ధర పెరుగును.

### ధాన్యాధిపతేశ్శుక్రస్య ఫలం

అతివృష్టి స్సుభిక్షంచ ఫలితాధాన్యజాతయః
మానవానిరుజాస్సర్వే పశ్చాద్ధాన్యం నపచ్యతే
ధాన్యంసమర్ఘతాంయాతి శుక్రేధాన్యాధి పేసతి.

అధికమైన వర్షము లుండి లోకము సుభిక్షముగా నుండును. పూర్వధాన్యములు ఫలించును. అపరధాన్యములు ఫలించవు. ధాన్యములకు ధరలు సామాన్యముగా నుండును.

### అర్ఘాధిపతేః కుజస్య ఫలం

భౌమేచార్ఘపతౌ స్వల్పవృష్టి ర్వాయుసమన్వితా
క్వచిద్వృష్టిః క్వచిద్ధాన్యం ప్రజారోగ్యం క్వచిత్క్వచిత్.

గాలి అధికముగాను వర్షము స్వల్పముగాను వుండి, సస్యధాన్య ప్రజారోగ్యములు నియతముగా లేక దేశభేదముచే మారుచుండును.

### మేఘాధిపతే ర్బుధస్య ఫలం

గర్జితాశని పాషాణ వాతాన్వితపయోధరాః,
మధ్యదేశే మహావర్షం శుభధాన్యమహార్ఘతా
బుధేమేఘాధిపే చైవ బహుసౌఖ్యయుతామహీ.

మేఘములు, అధికమైన గాలితోను, గర్జనముతోను, పిడుగులుపడుటతోను, వడగండ్లతోను కూడియుండును. మధ్యదేశమందు మంచివర్ష ముండును. పొట్టుగల ధాన్యములకు ధర పెరుగును. ప్రజలు సుఖముగా నుందురు.

### రసాధిపతేశ్చంద్రస్య ఫలం

బహువారి ముచో మేఘా ధనధాన్యఫలామహీ,
తిలతైలగుడక్షౌద్ర పయాంసిఘృత శర్కరాః,
అర్ఘవృద్ధ్యాప్రజాయంతే చంద్రేయది రసాధిపే.

తగినవర్షము లుండుటచే లోకము సుభిక్షముగా నుండి ధనధాన్యములతో తులతూగుచుండును. నువ్వులు, నూనె, బెల్లము, మైనము, పాలు, నెయ్యి, చక్కెర వీట్లకు ధర పెరుగును.

### నీరసాధిపతేశ్శనేః ఫలం

అయఃపిండాదిలోహానాం కృష్ణవస్త్రాదివస్తునాం,
శృంగాశ్మపలలానాంచ లోహత్రపుతిలాంభసాం
అర్ఘవృద్ధిః ప్రజాయేత మందే నీరసనాయకే.

ఇనుము, లోహము, నల్లనివస్తువులు, వస్త్రములు, కొమ్ములు, రాళ్లు, మాంసము, సీసము, నువ్వులు, నూనె వీట్లకు ధర పెరుగును.

### పురోహితస్యశనేః ఫలం

మధ్యసస్యార్ఘవృష్టిస్స్యా ద్బుద్ధిహీనాః పురోహితాః,
నరాణాంసుఖమత్యంతం సూర్యపుత్రే పురోహితే.

పురోహితులు మందబుద్ధిగల వారగుదురు. వర్షములు ధరలు, పంటలు సామాన్యముగా నుండును. జనులు సుఖముగా నుందురు.

### పరీక్షకస్యశనేః ఫలం

పరీక్షకే సూర్యసుతే బుద్ధిహీనాః పరీక్షకాః,
అనర్ఘ అల్పవృష్టిశ్చ కృష్ణద్రవ్య సమృద్ధితా.

పరీక్షకులు బుద్ధిమాంద్యము గలవా రగుదురు. నల్లనిధాన్యములు బాగాపండి ధరలుతగ్గి స్వల్పమైన వర్ష ముండును.

### గణకస్యరవేః ఫలం

సర్వేయుద్ధరతా భూపా అనర్ఘం వ్యాధిసంకులం,
అన్యోన్యవైరిణ స్సర్వే గణకే భాస్కరేసతి.

రాజులు అన్యోన్యకలహము గల్గి యుద్ధాసక్తులగుదురు. లోకమున వ్యాధులు అధికముగా నుండును. ధరలు తగ్గివుండును.

### గ్రామపాలకస్య బుధస్య ఫలం

గ్రామాణాంపాలకే సౌమ్యే సుఖినో గ్రామవల్లభాః,
గ్రామాణాం సుఖమత్యంతం రాజానో నయశాలినః.

గ్రామములున్ను గ్రామాధిపతులున్ను సుఖముగా నుందురు. రాజులు నీతితో ప్రవర్తింతురు.

### దైవజ్ఞస్య కుజస్య ఫలం

చోరాగ్నిశస్త్రబాధాచ రాజానో యుద్ధకాంక్షిణః,
దైవజ్ఞే భూమితనయే దైవజ్ఞాః స్త్రీ ప్రబుద్ధయః.

దైవజ్ఞులు స్త్రీలవంటి స్వభావము గల్గియుందురు. లోకమందు చోరాగ్నిబాధ యుండును. యుద్ధము గల్గును.

### పశుపాలకస్య గోపాలస్య ఫలం

పశువృద్ధిస్సుభిక్షంచ బహుసస్యార్ఘసంపదః,
సంపూర్ణతృణవృష్టిశ్చ గోపాలే పశునాయకే.

పంటలు బాగాపండి లోకము సుభిక్షముగా నుండును. పశువులు క్షీరప్రదము లగును. వర్షము లుండును.

### స్థానసంరక్షకస్య బలభద్రస్య ఫలం

ప్రవర్ధనం-ధాన్యఫలపుష్ప క్షీరములు సమృద్ధిగా నుండును.

### పుష్కరాఖ్య మేఘ ఫలం

నైకకందఫలమూలవివృద్ధి ర్జాయతే వివిధపాతకవృద్ధిః,
రోగతో జనకృశత్వ మనల్పం పుష్కరేజలధరే జలమల్పం.

వర్షము స్వల్పముగా నుండును. జనులు వ్యాధిచే పీడింపబడుదురు. పాపము అధిక మగును. కందమూలఫలాదులు ఫలించవు.

మేరోరీశాన్య దిగ్భాగే మేఘోత్పత్తిః,
తేన ఆఢక చతుష్టయ పరిమితం వర్షం భవతి,
వర్షవిభాగక్రమః అష్టభాగాన్సముద్రేషు పర్వతేషు తథాపర,
త్రిభాగాశ్చ ధరణ్యాంవై ఏవంవర్షతి చ త్రిధా

### ఆఢక ఫలం

చతురాఢకే వర్షం మధ్యమం,
ఆఢకో బ్రాహ్మణహస్తగతః, తత్ఫలం దుర్భిక్షం.
ప్రవహాఖ్యో వాయుః,
తేనఆఢక త్రితయ పరిమిత వాయుర్వ్యాప్తి,
నందసారి నామక నాగఫలం
మహావృష్టిం కురుతే నందతేజనః.

అధికమైన వర్షము లుండుటచే జనులు సంతోషించెదరు.

### భూవాహకస్య విరాటస్య ఫలం

భూమివాహో విరాటేతు భూమిస్స్వస్థావిభీతాస్యాత్,
ప్రజానాం ప్రబలారోగ్యం సువర్షం సర్వదిక్షుచ.

ప్రజలు భయములేక ఆరోగ్యవంతులై సుఖముగా నుందురు. వర్షము అన్ని దేశములందును బాగుండును.

### ర వి చా ర ఫ లం

అథ, చైత్ర శు ౧౨, బుధవాసరే ఉదయాది ఘ ౫౨-౪౫ సమయే రవే ర్మేష ప్రవేశత్వా త్తత్ఫలాని.

కాలఫలం : సౌభాగ్యం.

సమయఫలం : అనర్ఘ కలహప్రదా.

వారఫలం : అతివృష్టిః.

మేష సంక్రాంతిఫలము, అధికమైన వర్షము ఉండి పంటలు పండుట. ధరలు తగ్గివుండుట, అన్యోన్యకలహము గల్గివుండుట.

(ఈఫలము చైత్రవైశాఖ మాసములందు జరుగును)

### ఆ ర్ద్రా ప్ర వే శ ఫ లం

జ్యేష్ఠ ౱ ౯ భుజవాసరే ఉదయాది ఘ ౫౧-౪౩ సమయే రవే రార్ద్రా ప్రవేశత్వా త్తత్ఫలాని.

కాలఫలం : సస్యాభివృద్ధిః

తిథిఫలం : అల్పవృష్టిః.

వారఫలం : వృష్టివినాశనం.

నక్షత్రఫలం : వృష్టి ర్మధ్యమా.

యోగఫలం : శుభం.

కరణఫలం : దుర్భిక్షం.

వర్షము తక్కువ. పూర్వసస్యము ఫలించును. (ఈఫలము ఆషాఢ శ్రావణమాసములలో జరుగును) దుర్భిక్షభయము గల్గును.



### మకర సంక్రాంతి ఫలం

ఏతద్వంగీర పుష్య ౩ ౯ శనివాసరే ఉదయాది ఘ ౫-౧౨ సమయే రవే ర్మకరప్రవేశత్వా త్తత్ఫలాని.

ద్విముఖం కృష్ణవర్ణంచ సురూపంచ త్రినేత్రకం,
షడ్భుజాహుం ద్విపాదంచ త్రిశీర్షం గజవాహనం
సప్తాయుధధరం పూజ్యం రూపం సంక్రమణే స్మృతం,
అష్టవక్త్రో విశాలాక్షో లంబభ్రూర్దీర్ఘ నాసికః.
శతయోజన మౌన్నత్యం విస్తీర్ణం ద్వాదశస్మృతం,
ఏవం రూపం సువిజ్ఞేయం సంక్రాంతేః పురుషస్యహి.

అస్యపురుషస్య రాక్షసనామధేయః చండాలారిష్టం. నిర్మలోదకస్నానం శుభం. నీలవస్త్రధారణం మహాభయంలాక్షారసగంధః యుద్ధం. జపాకుసుమ ధారణం యశోహానిః గోమేధికాభరణం పశునాశనం పీఠపాత్రే భక్షణం ఆరోగ్యం. పయఃపానం పశునాశనం. బదరీఫలభక్షణం శుభంభవతి॥ గజవాహనం రాజారిష్టం కోదండాయుధః యుద్ధంభవతి। కాంచనఛత్రం స్వర్ణనాశనం। అస్త్రధారణం రోగభయం। ఆగ్నేయ దిగ్యానం తద్దేశారిష్టం విస్మయచేష్టా ప్రజావ్యాధిః। నివిష్టావస్థా సస్య వృద్ధిః.

### ప క్ష ఫ లం

కృష్ణపక్షే యదాపుష్యే మకరం యాతిభాస్కరః.
సువృష్టిః క్షేమమారోగ్యం సుభిక్షం సస్యపదః

తిథిఫలం : ఈతిబాధా.

వారఫలం : వ్యాధిదుర్భిక్ష తస్కరైః భయం.

మతాంతరే ఫలం : రాజయుద్ధం.

కాలఫలం : పూర్వాహ్ణే నృపతీన్హంతి.

ముహూర్తఫలం : మహార్ఘ.

లగ్నఫలం : రోగబాధా. నక్షత్రఫలం. సస్యారిష్టం.

రాజులు అన్యోన్య కలహములు గల్గివుందురు. ప్రజలు వ్యాధి తస్కర దుర్భిక్షములచేత పీడింపబడుదురు. లోకమున యుద్ధభయము గల్గును. చండాలురకు రాజులకు అరిష్టముగల్గును. పశువులు వ్యాధివల్ల నశించును. అంగవంగదేశములకు దుర్భిక్షాదివిపత్తు సంభవించును. ధరలు పెరుగును. బంగారము విశేషముగా వ్యయమగును. (ఈ ఫలము పుష్య మాఘ మాసములలో జరుగును.)

### చంద్రచారః

భరణ్యాది వహ్నిమండలఫలం : క్షేమం.

జ్యేష్ఠశుక్ల ప్రతిపద్యుక్తవారఫలం :
సుభిక్షం క్షేమమారోగ్యం వృష్టిసస్యవివర్ధనం.
ఆనందనిరతా ధాత్రీ.

ఆషాఢశుక్ల పంచమీయుక్త వారఫలం : తాపం.

ఆషాఢశుక్లపంచమీ యుక్తచిత్రాఫలం.
సర్వసస్యసమృద్ధిస్స్యాత్ప్రమోదంతే నిరామయాః.
తత్కృష్ణపక్ష రోహిణీ యోగఫలం : మధ్యమా.

వర్షములు చక్కగా కురియును. పూర్వసస్యములు (తొలకరి పంటలు) బాగాపండును. జనులు సౌఖ్యముననుభవించెదరు. (ఈ ఫలము జ్యేష్ఠాషాఢమాసములలో జరుగును.)

# శ్రీ బహుధాన్యసంవత్సర పంచాంగ పీఠిక

ఉ

నిమీ సంమీ

ప పూ

మోక్ష స్పర్శ

ద

ఏతత్సంవత్సర కార్తీక శుక్ల పూర్ణిమా సోమవాసరే భరణీ నక్షత్రే. కేతుగ్రస్త సంపూర్ణ చంద్రగ్రహణం. కపిలవర్ణః. అవమర్దననామకః ఆగ్నేయమండలం.

| | | ఘ-వి. | గం-ని. |
|---|---|---|---|
| సూర్యోదయాది | ఆగ్నేయ స్పర్శకాలః | ౪౯-౧౬ | 1-48 |
| | ఈశాన్య సంమీలనకాలః | ౫౧-౫౭ | 2-52 |
| | మధ్యకాలః | ౫౩-౩౩ | 3-30 |
| | వాయవ్యనిమీలనకాలః | ౫౫-౨౦ | 4-17 |
| | నైరుతి మోక్షకాలః | ౫౭-౨ | 5-18 |
| ఆద్యంతపుణ్యకాలః | | ౮-౪౬ | 3-30 |

వారఫలము : రాజులు కలహింతురు. ధాన్యధరలు పెరుగును. మాదిధర పెరుగును.

రాశిఫలము : జనులకు రోగపీడగల్గును. పంటలకు అరిష్టము. పాంచాల, కాంభోజ, కిరాత త్రిలింగ దేశములకు పీడగల్గును.

గ్రాసఫలం : దుర్భిక్షం.

నక్షత్రఫలం : దూది, వెండి, చక్కెర మొదలగువాటికి మూడుమాసములవరకు ధర పెరుగును.

అయనఫలం : బ్రహ్మక్షత్రియులకు పీడ గల్గును.

దిక్కుఫలం : పశువులకు పీడగల్గును.

వర్ణఫలం : మృగములకు, పశువులకు, మ్లేచ్ఛులకు పీడగల్గును. దుర్భిక్షముగా నుండును.

మాసఫలం : మగధ, కోసల, శూరసేన దేశముల కరిష్టముగల్గును.

మండలఫలం : ప్రజలకు పశువులకు రోగబాధ, సస్యారిష్టము.

ఈ రోజున మధ్యాహ్నకాలమందు నిత్యభోజన ప్రత్యాబ్ది కాదుల నాచరించుట కభ్యంతరములేదు. రాత్రిభోజనము పనికిరాదు.

## వర్షవిషయక కార్తెప్రవేశవాహనాదుల చక్రం

| ఇంగ్లీషు తేదీ | ఫార్సీ తేది | మాసం తిథి | వారం | కార్తె | ప్రవేశకాలం ఘ-వి | స్త్రీ. పుం. వివరం | జలరాశి వివరం | వాహనం | ఫలము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1938 | ౧౩౪౭ | | | | | | | | |
| 18 ఏప్రిల్ | ౯ ఖుర్దాద్ | చైత్ర శు ౧౪ | బు | అశ్వని | ౨౮-౨౫ | స్త్రీ. పుం | నిర్జల | మండూక | తుషారవృష్టి |
| 27 ,, | ౨౩ ,, | ,, బ ౧౨ | ,, | భరణి | ౯-౨౬ | పుం. పుం | ,, | మహిష | అనావృష్టి |
| 10 మే | ౫ తీర్ | వైశా శు ౧౧ | మం | కృత్తిక | ౫౩-౪ | స్త్రీ. పుం | ,, | జంబుక | ,, |
| 24 ,, | ౧౯ ,, | ,, బ ౧౦ | ,, | రోహిణి | ౫౧-౦ | పుం. పుం | పూర్ణజల | మయూర | సువృష్టి |
| 7 జూన్ | ౨ అమర్దాద్ | జ్యేష్ఠ శు ౧౦ | ,, | మృగశిర | ౪౯-౪౨ | స్త్రీ. పుం | ,, | అశ్వ | అర్ధవృష్టి |
| 21 ,, | ౧౬ ,, | ,, బ ౮ | ,, | ఆర్ద్ర | ౫౨-౧౮ | ,, | నిర్జల | మేష | పాదవృష్టి |
| 5 జూలై | ౩౦ ,, | ఆషాఢ శు ౮ | ,, | పునర్వసు | ౫౬-౨౩ | స్త్రీ. స్త్రీ | అర్ధజల | నర | ,, |
| 19 ,, | ౧౩ మహాశేవర్ | ,, బ ౭ | ,, | పుష్యమి | ౫౯-౨౬ | ,, పుం | పూర్ణజల | జంబుక | అర్ధవృష్టి |
| 3 ఆగస్టు | ౨౮ ,, | శ్రావణ శు ౮ | బు | ఆశ్లేష | ౦-౫౧ | ,, స్త్రీ | ,, | మహిష | పూర్ణవృష్టి |
| 16 ,, | ౧౦ మెహెర్ | ,, బ ౫ | మం | మఘ | ౫౭-౧౬ | ,, పుం | ,, | అశ్వ | అర్ధవృష్టి |
| 30 ,, | ౨౪ ,, | భాద్ర శు ౫ | ,, | పుబ్బ | ౪౮-౧౬ | ,, నపుం | నిర్జల | మూషక | అనావృష్టి |
| 13 సెప్టెం | ౮ ఆబాన్ | ,, బ ౪ | ,, | ఉత్తర | ౩౨-౪౧ | ,, పుం | పూర్ణజల | నర | పాదవృష్టి |
| 27 ,, | ౨౨ ,, | ఆశ్వ శు ౪ | ,, | హస్త | ౧౦-౨౪ | ,, నపుం | పాదజల | మేష | అనావృష్టి |
| | ౧౩౪౮ | | | | | | | | |
| 10 అక్టో | ౫ అజార్ | ,, బ ౧ | సో | చిత్ర | ౪౧-౫ | స్త్రీ. పుం | నిర్జల | మూషక | ,, |
| 24 ,, | ౧౯ ,, | కార్తిక శు ౧ | ,, | స్వాతి | ౪-౪౫ | ,, స్త్రీ | పాదజల | అశ్వ | పాదజల |
| 6 నవం | ౨ దైసన్ | ,, శు ౧౪ | ఆ | విశాఖ | ౨౨-౧౮ | పుం. నపుం | పూర్ణజల | మేష | ,, |
| 19 ,, | ౧౫ ,, | ,, బ ౧౩ | శ | అనూరాధ | ౩౪-౧౮ | స్త్రీ. నపుం | నిర్జల | మహిష | ,, |
| 2 డిశం | ౨౮ ,, | మార్గ శు ౧౦ | శు | జ్యేష్ఠ | ౪౧-౫౩ | పుం. నపుం | ,, | అశ్వ | అనావృష్టి |
| 15 ,, | ౧౧ బహుమన్ | ,, బ ౯ | గు | మూల | ౪౬-౦ | స్త్రీ. పుం | ,, | మేష | ,, |
| 28 ,, | ౨౪ ,, | పుష్య శు ౬ | బు | పూ. షాఢ | ౫౧-౪ | పుం. పుం | పాదజల | మహిష | పాదవృష్టి |
| 1939 | | | | | | | | | |
| 10 జనవరి | ౭ ఇస్పంది | ,, బ ౫ | మం | ఉ. షాఢ | ౪౯-౩౯ | స్త్రీ. పుం | ,, | అశ్వ | ,, |
| 23 ,, | ౨౦ ,, | మాఘ శు ౩ | సో | శ్రవణం | ౫౨-౪౦ | పుం. పుం | ,, | మండూక | ,, |
| 5 ఫిబ్రవరి | ౩ ఫర్వర్ది | ,, బ ౧ | ఆ | ధనిష్ఠ | ౫౮-౧౭ | స్త్రీ. పుం | పూర్ణజల | మహిష | పూర్ణవృష్టి |
| 19 ,, | ౧౭ ,, | ,, బ ౩౦ | ,, | శతభిషం | ౮-౨ | పుం. పుం | నిర్జల | గజ | స్వల్పవృష్టి |
| 4 మార్చి | ౩౦ ,, | ఫాల్గున శు ౧౪ | శ | పూ. భాద్ర | ౨౨-౨౬ | స్త్రీ. పుం | ,, | మేష | ,, |
| 17 ,, | ౧౨ ఆర్దీబేహె | ,, బ ౧౨ | శ | ఉ. భాద్ర | ౪౩-౬ | పుం. పుం | పాదజల | మహిష | ,, |

# శ్రీ బహుధాన్య సంవత్సర పంచాంగ పీఠిక

| శ్రీ వైష్ణవసాంప్రదాయమున తిరు నక్షత్ర నిర్ణయము | | | | | |
|---|---|---|---|---|---|
| చైత్ర | శుక్ల | ౧౩ | మంగ | శ్రీరంగనాచ్చియార్ | తిరునక్షత్రం |
| ,, | బహు | ౧౪ | శుక్ర | వడుగనంబితిర్ | ,, |
| వైశా | శుక్ల | ౧ | ఆది | ఉయ్యకొండార్ | ,, |
| ,, | ,, | ౫ | బుధ | ఎంబెరుమానార్ | ,, |
| ,, | ,, | ౬ | గురు | చక్రవర్తి తిరుమఘనార్ | ,, |
| ,, | ,, | ౧౨ | బుధ | తేవప్పెరుమాళ్ | ,, |
| ,, | ,, | ౧౩ | గురు | మధురకవులతిర్ | ,, |
| ,, | ,, | ,, | ,, | అనంతాళ్వార్ | ,, |
| ,, | ,, | ౧౪ | శుక్ర | అళహసింగర్ | ,, |
| జ్యేష్ఠ | ,, | ౧౩ | శుక్ర | నమ్మాళ్వార్ | ,, |
| ,, | ,, | ౧౪ | శని | పెరియభట్టర్ | ,, |
| ఆషా | ,, | ౧౦ | గురు | పెరియాళ్వార్ | ,, |
| ,, | ,, | ౧౨ | శని | నాధమునులతిర్ | ,, |
| శ్రావ | ,, | ౪ | శని | ఆండాళ్ తిర్ | ,, |
| ,, | ,, | ౬ | సోమ | బదరీనారాయణ పెరుమాళ్ | ,, |
| ,, | ,, | ౧౪ | బుధ | తెర్కాళ్వార్ | ,, |
| ,, | ,, | ౧౫ | గురు | విఖనసాచార్యతిర్ | ,, |
| ,, | బహుళ | ౯ | శుక్ర | కణ్ణన్ తిర్ | ,, |
| ఆశ్వి | శుక్ల | ౧౦ | మం | వేదాంతదేశికతిర్ | ,, |
| ,, | కార్తి | ౫ | శుక్ర | మనవాళ మహామునితిర్ | ,, |
| కార్తి | ,, | ౬ | శని | సేనైనయ్ మొదలియార్ | ,, |
| ,, | ,, | ౯ | సోమ | పొయిఘయాళ్వార్ | ,, |
| ,, | ,, | ౭ | మం | పూధత్తాళ్వార్ | ,, |
| ,, | ,, | ౧౧ | గురు | పేయాళ్వార్ | ,, |
| మార్గ | ,, | ౧౪ | మం | తిరుమంగైయాళ్వార్ | ,, |
| ,, | ,, | ౧౫ | బుధ | తిరుప్పాణియాళ్వార్ | ,, |
| ,, | బహుళ | ౩౦ | బుధ | తొండరడిప్పొడియాళ్వార్ | ,, |
| మాఘ | ,, | ౧ | ఆది | తిరుమడిశై యాళ్వార్ తిర్ | ,, |
| ,, | ,, | ౫ | బుధ | కూరత్తాళ్వార్ | ,, |
| ఫాల్గు | శుక్ల | ౭ | మం | తిరుకచ్చినంబియార్ | ,, |

| శ్రీ మాధ్వసాంప్రదాయమున నిర్ణయించిన పుణ్యదినములు | | | | | | |
|---|---|---|---|---|---|---|
| చైత్ర | శుక్ల | ౨ | శని | వేదవ్యాస | తీర్థానాం | పుణ్యదినం |
| ,, | ,, | ౯ | శుక్ర | కవీంద్ర | ,, | ,, |
| ,, | ,, | ౧౩ | మం | సత్యవ్రత | ,, | ,, |
| ,, | బహుళ | ౩ | ఆది | వాగీశ | ,, | ,, |
| ,, | ,, | ౧౦ | సోమ | సత్యవిజయ | ,, | ,, |
| వైశా | శుక్ల | ౨ | సోమ | విద్యాధిరాజ | ,, | ,, |
| జ్యేష్ఠ | ,, | ౨ | మం | సత్యసంధ | ,, | ,, |
| ,, | బహుళ | ౨ | మం | సత్యపూర్ణ | ,, | ,, |
| ,, | ,, | ౨ | బుధ | రఘువీర | ,, | ,, |
| ఆషా | శుక్ల | ౭ | మం | సత్యాధిరాజ | ,, | ,, |
| ,, | బహుళ | ౫ | ఆది | శ్రీ విజయ | ,, | ,, |
| ,, | ,, | ౩౦ | బుధ | రాఘవేంద్ర | ,, | ,, |
| శ్రావణ | శుక్ల | ౭ | మం | సత్యవర | ,, | ,, |
| భాద్ర | ,, | ౧౦ | ఆది | సత్యేష్టకామ | ,, | ,, |
| ,, | బహుళ | ౩౦ | శుక్ర | మాధవ | ,, | ,, |
| కార్తి | శుక్ల | ౭ | ఆది | సత్యవీర | ,, | ,, |
| ,, | ,, | ౭ | ఆది | వేదనిధి | ,, | ,, |
| ,, | బహుళ | ౩ | గురు | విద్యానిధి | ,, | ,, |
| ,, | ,, | ౧౪ | ఆది | పద్మనాభ | ,, | ,, |
| మార్గశి | శుక్ల | ౧౧ | శని | సత్యనిధి | ,, | ,, |
| ,, | ,, | ౧౨ | ఆది | రఘునాథ | ,, | ,, |
| పుష్య | ,, | ౧౧ | సో | రఘూత్తమ | ,, | ,, |
| ,, | బహుళ | ౬ | బుధ | సత్యకామ | ,, | ,, |
| ,, | ,, | ౮ | గురు | నరహరి | ,, | ,, |
| ,, | ,, | ౩౦ | శుక్ర | పురందరదాస | ,, | ,, |
| ఫాల్గు | శుక్ల | ౨ | మం | సత్యబోధ | ,, | ,, |
| ,, | ,, | ౪ | గురు | వ్యాసరాజస్వామి | ,, | ,, |
| ,, | ,, | ౬ | శని | సత్యవ్రత | ,, | ,, |

## గురు శుక్రయో ర్మౌఢ్యనిర్ణయః

ఫాల్గున శు ౧ సోమవారం నుంచి బ ౩౦ మంగళవారము వరకు గురుమౌఢ్యము. కార్తిక బ ౫ శనివారంనుంచి మార్గశిర శు ౨ బుధవారంవరకు పక్షాదత్రమిత శుక్రమౌఢ్యము.

## పుష్కర నిర్ణయః

కార్తిక శు ౧౪ ఆదివారంనాడు సింధునదీ పుష్కరారంభము.

చాంద్రార్ఘ్యలు = చైత్ర, వైశా, జ్యేష్ఠ, ఆషా, భాద్ర, ఆశ్వి, మాఘ, ఫాల్గున మాసములందు సమార్ఘ శ్రావణ మార్గశిరములందు మహార్ఘ్యము, కార్తిక పుష్యమాసములందు అల్పార్ఘ్యు.

సౌరార్ఘ్యలు = మేష, మిథున, సింహ, కన్య, తుల, వృశ్చిక, ధనుర్మకర మీనమాసములందు అల్పార్ఘ్యు కర్కాటక మాసమందు సమార్ఘ్యు వృషభ కుంభమాసములందు మహార్ఘ్యు.

## రాజాద్యు ప్రమాది సం॥ ర రాజాదిసూచన

రాజు బుధుడు
మంత్రి గురుడు
సేనాపతి గురుడు
సస్యాధిపతి రవి
ధాన్యాధిపతి శని
అర్ఘాధిపతి గురుడు
మేఘాధిపతి గురుడు

రసాధిపతి కుజుడు
నీరసాధిపతి రవి
అర్ధ్రాప్రవేశకాలము పగలు
పంటలు ౫ వీసములు
పశుపాలకుడు బలరాముడు
స్థానసంరక్షకుడు కృష్ణుడు

గురునకు నాలుగు ఆధిపత్యములు గల్గుటవల్లను, బుధుడు రాజగుటవల్లను పంటలు చక్కగాపండును. సకాలమున వర్షముండును. ప్రజలు క్షేమముగానుండి క్షీరప్రదములగును. లోకము సుఖితముగా నుండును. ౩ తూములవర్షము.

కుజనక్షత్ర చారఫలము :— చైత్ర శు ౧ నుంచి బ ౧౨ వరకు, కృత్తికలో నుండుటవల్ల దక్షిణదేశములో విపత్తుగల్గును. గ్రామములలో అగ్నిబాధలు విశేషముగా నుండును. ధాన్యముల ధర పెరుగును. చైత్ర బ ౧౩ నుంచి వైశా బ ౨ వరకు, రోహిణిలో నుండుటవల్ల వర్షముండదు. చెట్లకు తెగులు తగులును. పశువులకు పీడ గలుగును. ప్రత్తినూలు వస్త్రములకు వెండిబంగారములకు ధర పెరుగును వైశా బ ౩ నుంచి జ్యే శు ౭ వరకు, మృగశిరలో నుండుటవల్ల వర్షము కురియును. ప్రత్తిధర పెరుగును. జ్యేష్ఠ శు ౮ నుంచి బ ౧౩ వరకు ఆర్ద్రలో నుండుటవల్ల అధికముగా వర్షించును. జ్యే బ. ౧౩ నుంచి ఆషా బ ౮ వరకు పునర్వసులో నుండుటవల్ల గోమహిష్యాది క్షీరప్రద జంతువులకు పీడ గల్గును. నువ్వులు, నూనె, వేరుసెనగ, ఆముదాలకు ధర పెరుగును. ఆషాఢ బ ౫ నుంచి శ్రావ శు ౧ వరకు పుష్యమీ నక్షత్రములో నుండుటవల్ల వర్షములు తక్కువగా నుండును. లోకమున చోరరోగాదిబాధ లుండును. రాష్ట్రములు అన్యోన్యము కలహించు చుండును. నెయ్యి, వెండి, బంగారములకు ధర పెరుగును. అదిమొదలు భాద్రపద, శు ౨ వరకు ఆశ్లేషా నక్షత్రమం దుండుటవల్ల వర్షమునకు ప్రతిబంధకము పైరుల కరిష్టము వ్యాధిభయము ధాన్యాదుల ధర పెరుగుట గల్గును. అదిమొదలు భాద్ర బ ౯ వరకు మఘా నక్షత్రములో నుండుటవల్ల వర్షముండదు. నువ్వులు, నూనె, వేరుసెనగ, ఆముదాలు, పెసలు, మినుములు వరగ్రాలకు ధరలు పెరుగును. అదిమొదలు ఆశ్వి శు ౧౮ వరకు పూ. ఫ యం దుండుటవల్ల ప్రజలలో వ్యాధి తస్కరాది భయము, వర్షముండక పోవుట. నూనెలకు నూనెగల ముడిధాన్యములకు ధర పెరుగును. అదిమొదలు కార్తి శు ౬ వరకు ఉ. ఫయం దుండుటవల్ల నల్లధాన్యములకు ధరలు పెరుగుట, స్వల్పముగా మాత్రమే వర్షముండుట, పశువులకు పీడగల్గుటయూ తటస్థించును. అదిమొదలు కార్తి బ ౧౩ వరకు హస్తయందుండుటవల్ల వేరుసెనగ, మిర్చి, పొట్టుధాన్యము, బెల్లము, ఉప్పు, బంగారములకు ధరలు పెరుగుట, స్వల్పముగా వర్షించుటయూ తటస్థించును. అదిమొదలు పుష్య శు ౧౦ వరకు చిత్రా స్వాతుల యం దుండుటవల్ల, వర్షముండదు. ప్రజలకు పశువులకున్ను రోగపీడ కల్గును. ధాన్యము, గోధుమలు, బంగారము, మిరియాలు, వక్కలు మొదలుగాగల వాటికి ధరలు పెరుగును. అదిమొదలు మాఘ శు ౩ వరకు విశాఖయం దుండుటవల్ల దూది, వేరుసెనగ, నువ్వులు, సెనగలు, మినుములు పెసలు మొదలగువాటికి ధరలు పెరుగును. అదిమొదలు ఫాల్గు బ ౩ వరకు అనూరాధా జ్యేష్ఠలం దుండుటవల్ల స్వల్పవృష్టి, ప్రజలకు, పశువులకు వ్యాధిపీడ, ధాన్యాదుల ధరలు సమానముగా నిలబడియుండుటయూ జరుగును. అదిమొదలు సంవత్సరాంతమువరకు మూలయం దుండుటవల్ల వేరుసెనగ మొదలగు పొట్టు కలయూ చెగింజలకు ధరలు విశేషముగా పెరుగును.

బుధునకు నక్షత్ర చార ఫలము :— అశ్వాది, వైశా, బ ౭ వరకు అశ్వనియందు వక్రించియుండుటవల్ల వర్షము తక్కువ. లోకము సుభిక్షముగానుండును. ధాన్యము గోధుమలు, చెరుకు, చక్కెర, బెల్లము, నెయ్యి, మిర్చి పొగాకు మొదలగువానికి ధర పెరుగును. అది మొదలు జ్యేష్ఠ శు ౩ వరకు భరణియందుండుటవల్ల ఏనుగలకు చండాలురకు పీడ గల్గును. లోకమందు చోర, రోగాగ్ని బాధలుండును. వేరుసెనగ మొదలగు పొట్టుధాన్యముల ధరలు పెరుగును— అదిమొదలు జ్యేష్ఠ శు ౧౧ వరకు కృత్తికయందుండుటవల్ల వర్షము స్వల్పముగానుండి ఎండ తీవ్రముగానుండి ప్రజలకు వ్యాధిభీతి గల్గును. ధాన్యము, సెనగలు, నువ్వులు, వెండి, బంగారములకు ధరలు తగ్గును— అదిమొదలు జ్యేష్ఠ బ ౨ వరకు రోహిణియందుండుటవల్లను అస్తమించుటవల్లను దూది వేరుసెనగలకు ధరలు బాగా పెరుగును. వర్షము తక్కువ - అదిమొదలు జ్యే బ ౭ వరకు మృగశిరయందుండుటవల్ల మంచివర్షము లుండి పైరులు చక్కగానుండును. లోకమందు వ్యాధి మొదలైన ఉపద్రవములు తొలగిపోయి సుభిక్షముగా నుండును. అదిమొదలు జ్యేష్ఠ బ ౩౦ వరకు ఆర్ద్రయందుండుటవల్ల అధికమైన వర్షము లుండును. జనులు సుఖముగా నుందురు. గోధుమలు, ధాన్యము, నువ్వులు, మినుములు, పెసలు, నూనె మొదలైనవాటికి ధర తగ్గియుండును. అదిమొదలు ఆషాఢ శు ౩ వరకు పునర్వసునందుండుటవల్ల బాలురకు రోగపీడగల్గును. దూది, బంగారము, వేరుసెనగ మొదలగువాటికి ధరలు తగ్గును. అదిమొదలు ఆషా శు ౧౮ వరకు పుష్యమియందుండుటవల్ల రాజులు పరస్పర కలహములు గల్గియుందురు. ధాన్యము, గోధుమ, వెండి, బంగారముల ధర తగ్గును— అదిమొదలు ఆషాఢ బ ౭ వరకు ఆశ్లేషయందుండుటవల్ల వర్షము లధికముగా నుండును. వేరుసెనగ, గోధుమ, వరిధాన్యములకు ధరలు తగ్గును. అదిమొదలు శ్రావణ శు ౬ వరకు మఘయం దుండుటవల్ల, వర్షము లుండవు. వేరుసెనగ, అవిసెగింజలు, ఆముదాలు, గోధుమ, మిర్చి, వరగ్రాలకు ధరలుండును - అదిమొదలు శ్రావ బ ౩౦ వరకు పూర్వఫల్గునియం దుండుటవల్ల రాజులు అన్యోన్యము కలహించు చుందురు. వర్షములుండక సస్యములకు అరిష్టముగల్గును. ధాన్యము, దూది, వెండి, నువ్వులు, నూనె, ఆముదాలు, మొదలగువాటికి ధరలు తగ్గును - అదిమొదలు భాద్ర బ ౩ వరకు వక్రించి మఘలో నుండుటవల్ల వర్షములుండును. ధాన్యము, గోధూమ, వేరుసెనగ, అవిసెగింజలు, కందులు, మిర్చి, బెల్లములకు ధరలుతగ్గును - అదిమొదలు ఆశ్వి శు ౧ వరకు వక్రించి పూర్వఫల్గునిలో నుండుటవల్ల ధాన్యాదులకు వెండి, దూదులకు ధరలు పెరుగును — అదిమొదలు ఆశ్వి శు ౮ వరకు ఉత్తరఫల్గునియం దుండుటవలన జొన్న, మిర్చి, మినుము, జనుము, వరిమొదలకు పైరులకు అరిష్టముగల్గును. వర్షములుండవు. ధాన్యములు, మినుములు, పెసలు, ఆముదాలు, గోధుమ, వేరుసెనగలకు ధరలు పెరుగును. అదిమొదలు ఆశ్వి. శు పూర్ణిమవరకు హస్తయందుండుటవల్ల, వర్షము లధికముగా నుండును. లోకమున ప్రజాపశు పక్ష్యాదులు ఆరోగ్యముగా నుందురు. బంగారము, వేరుసెనగ, అవిసెగింజలు, మిర్చి, పొగాకులకు ధరలు పెరుగును — అదిమొదలు కార్తిక శు ౫ వరకు చిత్రాస్వాతులయం దుండుటవల్ల వర్షములుండవు. జనులు ఆరోగ్య

ముగా నుండును. బంగారము, వెండి, దూది, పచారీదినుసులు వేరు సెనగలకు ధరలు పెరుగును. అదిమొదలు కార్తి బ ౧౧ వరకు విశాఖ యందుండుటవలన లోకమున వ్యాధిభయముండును. వర్షములు స్వల్ప ముగా నుండును. నువ్వులు, నూనె, ఆముదాలు, అవిసెగింజలు, వేరు సెనగ, దూది, వగయిరాలకు ధరలు పెరుగును. అదిమొదలు కార్తి బ ౨ వరకు అనూరాధయందుండుటవల్ల లోకమున జనులకు వ్యాధులు తగ్గి ఆరోగ్యము చేకూరును. పశుపక్ష్యాదులకు మాత్రము పీడగల్గును. పప్పు ధాన్యములకు ధరలుతగ్గును - అదిమొదలు మార్గశిర శు ౧ వరకు జ్యేష్ఠయం దుండుటవలన స్వల్పముగా వర్షముండును. గుగ్గిలము, ఇంగువ, బెల్లము, చక్కెర, కర్పూరము, వెండి, కంచు, ఇత్తడి, వరిధాన్యము, నెయ్యి మొదలగువాటికి ధరలు పెరుగును. అదిమొదలు మార్గ బ ౬ వరకు మూలయందుండుటవలన లోకమున బాలురకు, ప్రజలకు, పశువులకు వ్యాధిభయముగల్గును. దూది, వెండి, వేరుసెనగ, రసవస్తువులకు ధరలు బాగాతగ్గును - అదిమొదలు పుష్య శు ౧౨ వరకువక్రించి జ్యేష్ఠయందుండుటచే, వర్షములుండవు. పచారీదినుసులు, చెరుకు, చక్కెర, బెల్లము, వరిధాన్యము, కర్పూరము, వెండి, కంచు, దూది, మొదలగువాటికి ధరలుతగ్గును—అదిమొదలు పుష్య బ ౧౧ వరకు మూలయందుండుటవలన లోకమున వ్యాధులు తగ్గి ఆరోగ్యము గల్గును. వర్షములు స్వల్పముగానుండును. వెండి, దూది, వేరుసెనగ మొదలగువాటికి ధరలుపెరుగును - అది మొదలు మాఘ శు ౨ వరకు పూ-షాయందుండుటవల్ల వర్షము బాగా కురియును. ధాన్యములు, వేరుశెనగ, శెనగలు, మినుములు, కందులు, దూది వగైరాలకు ధరలుతగ్గును - అదిమొదలు మాఘ శు ౧౩ వరకు ఉ-షా యందుండుటవలన బాలురకు అరిష్టముగల్గును. ధాన్యాదుల ధరలుతగ్గును—అదిమొదలు మాఘ బ ౮ లు వరకు శ్రవణమందుండుటచే చెరుకు, శెనగ, పసుపు, మిర్చి, పొగాకు, వేరుశెనగ, దూది, వెండి మొదలగువాటికి ధరలుపెరుగును. మంచు విపరీతముగా నుండి అప్పుడున్న పైరుల కరిష్టము గల్గును. స్వల్పవర్షముండును - అది మొదలు ఫాల్గు శు ౬ వరకు ధనిష్ఠ శతతారలం దుండుటవలన గోవులకు జాడ్యములు గల్గును. జనులకుగూడ రోగబాధగల్గును. వెండి, బంగారము, మణులు, ముత్యములు, వక్కలు మొదలగుపచారీద్రవ్యములు, దూది మొదలగువాటికి ధరలుపెరుగును - అదిమొదలు ఫాల్గు శు ౧౪ వరకు పూ-భాయం దుండుటవల్ల పైనున్న పశువులయొక్కయు, జనులయొక్కయు రోగబాధలు తగ్గి క్షేమముగా నుండును. వెండి, కంచు వేరుశెనగలకు ధరలుండును. అదిమొదలు సంవత్సరాంతమువరకు ఉ-భాయందును రేవతియందును వుండుటవలన పశువులకు జనులకు పూర్ణముగా సౌఖ్యము చేకూరును. రాజులకు అన్యోన్యకలహములు గల్గును. వెండి, మణులు, ముత్యములు, ధాన్యము, బెల్లం, చక్కెర, నువ్వులు, వేరుశెనగ, దూది, ద్రాక్షకాయలు, ఏలక్కాయలు, కుంకుమపువ్వు మొదలగువాటికి ధరలు పెరుగును.

**బుధునకు ఉదయాస్తఫలము:**— చైత్ర శు ౧౩ నాడు బుధాస్తమయమువల్ల లోకము సుభిక్షముగా నుండును. వర్షముండును దూదిధరతగ్గును. వెండిధర పెరుగును. వైశా శు ౧ బుధోదయఫలము గోవులకు రోగపీడగలుగును. వస్త్రములు, వరిధాన్యము. గోధుమ, దూదిధరలు పెరుగును—జ్యేష్ఠ శు ౧౨ బుధాస్తమయము వలన గోవులకు రోగపీడగల్గును. దూది, వేరుశెనగ, వెండి బంగారాది ధాతువులు, రసవస్తువులకు ధరలుపెరుగును - ఆషా శు ౬ బుధోదయమువల్ల వర్షముండదు. పశువులకు రోగబాధపోయి సుఖముగల్గును. ధాన్యములు, వేరుశెనగ, దూదిధరలు తగ్గును. శ్రావణ బ ౧౦ బుధాస్తమయమువల్ల వర్షము చాల తక్కువగానుండును. దూది, నూనె, నువ్వులు, ఉన్నిధరలు తగ్గును. వెండి, వేరుశెనగల ధర పెరుగును-భాద్ర, శు ౧౭ బుధోదయమువల్ల గోవులకు అరిష్టము గల్గును. వేరుశెనగ, అవిశెగింజలు, నూనె, ఆముదాలు, నువ్వులకు ధరలు తగ్గును_ అశ్వ, శు ౭ బుధాస్తమయమువల్ల వర్షములు తక్కువగానుండును. చోరభయ ముండును. వరి ధాన్యము, వేరుశెనగ, మినుములు, పెసలకు ధరలుపెరుగును. కార్తిక, శు ౬ బుధోదయమున లోకమున పరస్పరకలహములు. భూకంపాద్యుపద్రవములు గల్గును. దూది, వేరుశెనగ, నువ్వులు, పెసలు, ఆముదాలు, శెనగలకు ధరలు పెరుగును. మార్గశిర శు ౧౨ బుధాస్తమయమువల్ల ప్రజలకు రోగభయము గల్గును. రాజులు అన్యోన్యము కలహింతురు. దూది, వేరుశెనగ, వెండి వగైరాలకు ధరలు పెరుగును. మార్గశిర బ ౩౦ బుధోదయమువల్ల రాజులు అన్యోన్యము కలహించు చుందురు. కాని ప్రజలకు ఆరోగ్యము కల్గును ధాన్యాదులకు దూది వెండి వేరుశెనగలకు ధరలు తగ్గును. మాఘ శు ౧౭ బుధాస్తమయమువల్ల పంటలు స్వల్పముగా పండును వేరుశెనగ, నువ్వులు, నూనె, ఆముదాలు, అవిశెగింజలు, చక్కెర, బెల్లం, వెండి, బంగారము, దూది, మొదలగువాటికి ధరలుపెరుగును. ఫాల్గున శు ౧౪ బుధోదయమువల్ల అధికమైన వర్షములుండి సస్యాదులకు నాశము గల్గును. జనులు, రోగాదిపీడితు లగుదురు. మణులు, రత్నములు, వెండి, ముత్యములు చక్కెర, నువ్వులు, ధాన్యములకు ధరలు బాగా పెరుగును.

**గురుచారఫలము :**—అబ్దాదినుంచి జ్యేష్ఠ బ ౬ వరకు కుంభరాశియందు ఋజుగతిలో నుండుటవల్ల లోకము సుభిక్షముగా నుండును. కంచు, ఇత్తడి, రాగి, సీసము, బంగారము, లోహము, మంజిష్ఠలకు ధరలు తగ్గియుండును. చైత్రమాసమున జనులు రోగపీడితు లగుదురు. ఉప్పు, ధాన్యములు, దూది మొదలగువాటికి ధరలు పెరుగును. అదిమొదలు ఆశ్వ శు ౧౦ వరకు కుంభమందు వక్రించుటవల్ల జనులు ఆరోగ్యవంతులుగా నుందురు. దూది, వెండి, బంగారము మణులు, ముత్యములు రత్నములు, వేరుశెనగ, వక్కలు, పిప్పళ్లు ధాన్యములకు ధరలు తగ్గియుండును. అదిమొదలు ఆశ్వ బ ౧౩ వరకు వక్రగతిలో మకరమం దుండుటచేత, ధాన్యాదులు దూది, వేరుశెనగ వెండి, బంగారము, ఇనుములకు ధరలు తగ్గియుండును. వర్షములుండును. అదిమొదలు కార్తిక శు ౧౪ వరకు మకరమం దుండుటచేత గోవులకు పీడగల్గుట, వర్షములేకపోవుట, లోకము దుర్భిక్షముగా

యుండునట్లు తోచుట, నూనె, నెయ్యి, పాలు, బంగారం, వెండి, వేరుశెనగ, కందులు, శెనగలు, మిర్చి మిట్లకు ధరలు పెరుగుట, మ్లేచ్ఛ దేశమున కరిష్టముగల్గుటయు తటస్థించును. అదిమొదలు సంవత్సరాంత మువరకు కుంభరాశియం దుండుటవల్ల లోకము సుభిక్షముగా నుండును. వెండి, బంగారము మొదలగుధాతువుల ధరలుతగ్గును. ఉప్పు, ధాన్యములు, వేరుశెనగ, దూదిధరలు పెరుగును. దూదివస్త్రముల ధరలు విశేషముగా పెరుగును. ఫాల్గున మాసములో సూర్యగ్రహణము వల్ల అధికవర్షము లుండును. జనులు రోగపీడితు లగుదురు. గర్భిణీస్త్రీలకు అనారోగ్యము గల్గును. వెండి, బంగారాది ధాతువులు, దూది వేరుశెనగ మొదలగువాటి ధరలు బాగా పెరుగును. అబ్దాది నుంచి పుష్య శు ౫ వరకు గురుడు ధనిష్ఠా శతతారా నక్షత్రములం దుండుటవల్ల లోకము సుభిక్షముగానుండి అన్నిపంటలు చక్కగా పండును. వర్షములుండును. తరువాత సంవత్సరాంతమువరకు పూర్వాభాద్రయం దుండుటవల్ల వర్షమునకు ప్రతిబంధకముగా నుండి, జనులు రోగాదిబాధితులై లోకము దుర్భిక్షభీతితో నుండును.

శుక్రచార ఫలము :—అబ్దాదినుంచి చైత్ర శు ౧౧ వరకు అశ్వినియం దుండుటవల్ల ధాన్యము, యవలు, గోధుమలు, నువ్వులు, మినుములు, దూది, వస్త్రములకు ధరలు పెరుగును. అది మొదలు చైత్ర బ ౬ వరకు భరణియం దుండుటవల్ల వేరుశెనగ, ధాన్యము, నువ్వులు, ఆముదాలు, మొదలగువాటికి ధరలు విశేషముగా పెరుగును. అదిమొదలు వైశా శు ౩ వరకు కృత్తికయం దుండుటవల్ల వెండి, బంగారము, ధాన్యము, గోధుమ, శెనగలు, నువ్వులు, ఆవాలు, మినుములకు ధరలు పెరుగును. అదిమొదలు వైశా శు ౧౪ వరకు రోహిణియం దుండుటవలన లోకము ఆరోగ్యముగా నుండును. ధాతువులు వేరుశెనగ, దూది మొదలగువాటి ధరలు పెరుగును. అది మొదలు వైశా బ ౧౦ వరకు మృగశిరయం దుండుటవల్ల ధాన్యము లన్నిటికి ధరలు పెరుగును. అదిమొదలు జ్యేష్ఠ శు ౭ వరకు ఆర్ద్రయం దుండుటవల్ల వర్షము స్వల్పముగా నుండును. అదిమొదలు జ్యే బ ౧ వరకు పునర్వసునం దుండుటవల్ల లోకమున జనులకు అనారోగ్యము గల్గును. సస్యములకు అరిష్టముగల్గును. అదిమొదలు జ్యే బ ౩౦ వరకు పుష్యమియం దుండుటవల్ల లోకమున దుర్భిక్షభయమున్ను చోరాది బాధయున్ను గల్గును. అదిమొదలు ఆషా శు ౧౧ వరకు ఆశ్లేషయందుండుటవల్ల వర్షములుండవు. అదిమొదలు శ్రావ బ ౨ వరకు మఘ పూ. ఉ ఫయం దుండుటవల్ల వర్షములుండక జనులు అనారోగ్యవంతు లగుదురు. అదిమొదలు శ్రా బ ౩౦ వరకు హస్తయం దుండుటవల్ల వర్షము లధికముగా నుండును. అదిమొదలు భాద్ర శు ౧౩ వరకు చిత్రయందుండుటవల్ల జనులు అనారోగ్యవంతు లగుదురు. అదిమొదలు భాద్ర బ ౧౪ వరకు స్వాతియం దుండుటవల్ల జనులకు ఆరోగ్యము కల్గును. అదిమొదలు ఆశ్వ బ ౧ వరకు విశాఖయం దుండుటవల్ల వరిధాన్యము, వేరుశెనగ మొదలగు పొట్టుధాన్యములకు ధరలు పెరుగును. అదిమొదలు కార్తిక బ ౮ వరకు అనూరాధయం దుండుటవల్ల వర్షములు తక్కువగానుండి, పశువులకు వ్యాధిగల్గును. ఈకాలమందు శుక్రుడు వక్రించి అస్తమించుటవల్ల అధికమైన గాలిన్ని వర్షమున్ను గల్గి సస్యారిష్టము సంభవించును. అదిమొదలు పుష్య శు ౧౦ వరకు వక్రించి విశాఖయందుండుటవల్ల వరిధాన్యము, వేరుశెనగ మొదలగు పొట్టుధాన్యములకు ధరలు బాగా తగ్గును. తరువాత పెరుగును. మార్గ. శు. ౨. శుక్రోదయమువల్ల వర్షము లుండును. అది మొదలు పుష్య బ ౧౨ వరకు అనూరాధయందుండుటవల్ల వర్షములు తక్కువగా నుండును. పశువులకు రోగములు గల్గును. అది మొదలు మాఘ శు ౧౧ వరకు జ్యేష్ఠయందుండుటవల్ల బెల్లం, కర్పూరము, సుగంధద్రవ్యములు, కంచు, రాగి, వెండి, దూది మొదలగువాటికి ధరలు పుంజగించి యుండును. అదిమొదలు మాఘ బ ౯ వరకు మూలయం దుండుటవల్ల వెండి, వేరుశెనగ, దూదిధరలు బాగా పెరుగును. అదిమొదలు ఫాల్గు శు ౫ వరకు పూ-షాఢయందుండుటవల్ల కందమూలములు, పొట్టుధాన్యముల ధరలు తగ్గును. అది మొదలు ఫా. బ ౩ వరకు ఉ-షాఢయం దుండుటవల్ల లోహం, వెండి, రాగి, ఇత్తడి మొదలగువాటి ధరలు తగ్గును. అదిమొదలు సంవత్సరాంతమువరకు శ్రవణయందుండుటవల్ల చక్కెర, పిప్పళ్లు, వక్కలు, వేరుశెనగ మొదలగు వాటి ధరలు పెరుగును. వర్షముండును.

ద్వారానుసారము శుక్రచారఫలం:—అబ్దాదినుంచి ఆషా. శు ౧౧ వరకు మేఘద్వారమం దుండుటవల్ల అధికవర్షము లుండును. ధాన్యము ధర మందముగా నిలబడివుండును. అదిమొదలు భాద్ర శు ౧౩ వరకు ధూళిద్వారమందుండుటచే వర్షములుండవు. పైరులకు నష్టముగల్గును. లోకమున జ్వరాది రోగపీడ యుండును. ధాన్యాదుల ధరలు పెరుగును. అదిమొదలు ఫాల్గు బ ౩ వరకు రాజద్వారమందుండుటచే రాజుల కన్యోన్యకలహము లుండును. జననాశ ముండును. ధాన్యాదుల ధర పెరుగును. అదిమొదలు సంవత్సరాంతము వరకు కనకద్వారమందుండుటవల్ల లోకము సుభిక్షముగా నుండును. జనులు ఆరోగ్యము గల్గివుందురు. ధాన్యాదుల ధరలు నిలబడి వుండును. శుక్రుడు అనూరాధానక్షత్రమందుండి కార్తికమాసమున అస్తమించుటవల్ల ఘూర్జరమాలవదేశములందు దుర్భిక్షము, ప్రజాకల్లోలము గల్గును. ముందు ధాన్యములధర పెరిగి నెలదినము లైనతర్వాత తగ్గును. ఖురాసాన దేశమందు విపరీతనష్టమున్ను జననాశమున్ను గల్గును. ప్రచండవాయుసహితవర్ష ముండును. వెండిధర విపరీతముగా పెరుగును.

శనిచారఫలము:— ఈ సంవత్సరమంతయు శని మీన రాశిలో నుండుటవల్ల, లోకమున భూకంపము, గాలివాన మొదలగు ఉత్పాతములు గల్గును. పంటలునశించును. రాజులకు అన్యోన్యకలహములు గల్గి యుద్ధమందు జననాశము గల్గును. గ్రామములకు ఉపద్రవములు గల్గును. లోకమందు మారీవిషూచ్యాది రోగపీడ గల్గును. మీన రాశిలో ఉదయాస్తమయములు గల్గుటవల్ల పంటలకు నష్టము గల్గును. జనులకు రోగాదిపీడ గల్గి నష్టముగల్గును. రాజులకు అన్యోన్యకలహములుగల్గి జననష్టముగల్గును. అశ్వ, భర, మఘ, పూఫ, మూ, పూషా,

ఉ భా, రేవతి నక్షత్రములందు జన్మించినవారలకు ఈ సంవత్సరము శని విశేష కష్టనష్టములు కలుగజేయును. వీరు తసుశాంతి చేసుకొనుట మంచిది.

రాహుచారఫలం:— అబ్దాదినుంచి ఆషాఢ బ ౩౦ వరకు వృశ్చికమందుండుటవల్ల నెయ్యి, వస్త్రములు, దూది మొదలగువాటికి ధరలు విపరీతముగా పెరుగును. అదిమొదలు సంవత్సరాంతమువరకు తులారాశియం దుండుటవల్ల, మినుములు, గోధుమలు, ఆవాలు, వ్రీహిధాన్యములు, కంబళి, కంచు, వెండి మొదలగు వాటి ధరలు విశేషముగా పెరుగును.

## వర్షయోగములు

### చైత్ర మాసము

గురువుగాక మిగిలిన గ్రహములు దుష్టనాడియందుండుటవల్లను బుధుడు వక్రించుటవల్లను, రవి, బుధ, శుక్రులకు ముందు కుజుడు సంచరించుటవల్లను, శని రేవతి యందుండుటవల్లను వర్షములధికముగా నుండవు. శు ౩-౧౦ మధ్య కాలములోను బ ౨-౬ మధ్యకాలములోను మేఘాడంబర ముండి, దేశభేదముచే కొద్దివర్ష ముండును. బ ౭ శని వారయోగమువల్ల జలము శోషించి ఎండ తీక్ష్ణముగా నుండును. శు ౧౮ అశ్వనికార్తె నిర్జలరాశిలో ప్రారంభమయినను కొద్దివర్ష ముండును. బ ౧౭ నుంచి భరణికార్తె ప్రారంభమై అగ్నిభయము గల్గును.

### వైశాఖ మాసము

గ్రహముల దుష్టనాడీ సంచారము వలనను, ౫ ఆదివారములు సంభవించుటవల్లను, శు ౧౧ నుంచి కృత్తికకార్తెయు, బ ౧౦ నుంచి రోహిణికార్తెయు అగ్నిమండలమం దుండుటచే, వర్షము లుండక, అధికమైన ఎండలు, అగ్నిభయములు, మారీస్ఫోటక జ్వరాది బాధలున్ను గల్గును. బ ౪-౧౨ మధ్యకాలములో స్వల్పవర్షము దేశభేదముచే గల్గును.

### జ్యేష్ఠ మాసము

గురుశుక్రులు సౌమ్యనాడియందు సంచరించినను కుజుడు గూడ సౌమ్యనాడియం దుండుటవల్ల వర్షమునకు ప్రతిబంధకము. శు ౧౦ మృగశిరకార్తె ప్రారంభమగుట, బుధు డస్తమించి గురునిచే చూడబడుటవల్లను, పురశ్శుక్ర సంచారమువల్లను, దశమినుంచి వర్ష ముండును. బ ౩-౧౦ మధ్యగూడ వర్ష ముండును. రోగాది బాధలు పూర్తిగా నెమ్మదించవు. అగ్ని బాధలు వడగాడ్పులు ఇంకను వుండును.

### ఆషాఢ మాసము

శనితప్ప మిగతా గ్రహములు శుభనాడియందు సంచరించుటవల్లను, శు ౭ పునర్వసుకార్తె అర్ధజలరాశియందు ప్రవేశించుటవల్ల శు ౭-౧౩ మధ్యలో సామాన్యవర్ష ముండును. బ ౪ పుష్యమికార్తె పూర్ణజలరాశియందు ప్రవేశించుటవల్లను, బ ౬-౧౧ మధ్యలో మంచి వర్ష ముండును. ఈ మాసమున ౫ మంగళవారము లుండుటవల్లను శు ౯ శనియోగము వల్లను పూర్ణిమామంగళ, పూ-షా యోగమువల్లను అధికమైనగాలి వీచును. రోగాది బాధ లధికముగా నుండును. యుద్ధములు కలహములు సంభవించును.

### శ్రావణ మాసము

అంగారకునకు పశ్చాచ్చలనము, గురుశుక్రులకు సమస్తకము, బుధశనులు వక్రించుటవల్లను వర్షమునకు ప్రతిబంధకము శు ౭ ఆర్ద్రే నక్షత్రకార్తె, పూర్ణ జలరాశియందు జలవాహనమువల్ల శు ౭-౧౮ మధ్య వర్ష ముండును. బ ౯ మఖ కార్తె పూర్ణజలరాశియందు ప్రారంభమై వర్ష ముండును. దుర్భిక్షము, పశ్చిమ దేశములందు యుద్ధభీతి, ప్రజాకల్లోలము గల్గును.

### భాద్రపద మాసము

కుజుడు సింహరాశియం దుండుట వర్షమునకు ప్రతిబంధకమైనను, రవి బుధులతో గూడుటవల్లను, రవి బుధులకు ముందు శుక్రుడు సంచరించుటవల్లను, రవి బుధులు పరివర్తనను బొందియుండుటవల్లను, మాసాంతిమభాగమందు దేశభేదముచే స్వల్పవర్ష ముండును. శు ౯ పూఫ కార్తెయందు వర్షముండక పైరులకు అరిష్టము గల్గును. బ ౮ నుంచి ఉఫ కార్తె పూర్ణజలరాశియందు ప్రవేశించి వర్ష ముండును.

### ఆశ్వయుజ మాసము

ఈ మాసమున గురు కుజులు తప్ప మిగతా గ్రహములు దుష్టనాడియందుండుటవల్లను, బ ౩౦ ఆదివార యోగమువల్లను, ౫ శని ఆదివారము లుండుటవల్లను లోకమున వ్యాధులు విపరీతముగా నుండును. దుర్భిక్షభీతిగల్గును. అన్యోన్యకలహము లుండును. అధికమైన గాలియు, వర్షమున్ను వుండును. శు ౮ హస్త కార్తెలో స్వల్పవర్షమున్ను బ ౧ చిత్త కార్తెలో మంచివర్షమున్ను వుండును.

### కార్తిక మాసము

గ్రహములు అతివాత, వాతనాడులయం దుండుటవల్లను చంద్రగ్రహణముండుటవల్లను, శుక్రాస్తమయమువల్లను, గాలిన్ని వర్షములున్ను అధికముగా నుండును. రాజకలహములు, ప్రజాకల్లోలములు, భయోత్పాతములు, తుపాను వీచుటయు, సస్యములకు అరిష్టమున్ను గల్గును. శు ౧ స్వాతి కార్తెయందు విశేషవర్షములులేక స్వల్పవర్షమున్నను గాలి అధికముగా నుండును. శు ౧౮ విశాఖకార్తె పూర్ణజలరాశియందు ప్రారంభమగుటవలన బ ౪ వరకు మంచివర్షము లుండును.

### మార్గశిర మాసము

మాసాదినుంచి శు ౧౦ వరకు అనూరాధ కార్తెయందు వర్షముండదు. అది మొదలు జ్యేష్ఠ కార్తె నిర్జలరాశియందు ప్రారంభమగుటవలన వర్షమునకు నిరోధకరమైనను, బుధ శుక్రులమధ్య రవి సంచారమువలనను, కుజుడు చిత్తానక్షత్రమందుండుటవలనను, స్వల్పవృష్టియుండును. బ ౯ నుంచి మూలకార్తె నిర్జలరాశియందు ప్రారంభమగుటవలనను, కుజుడు స్వాతియం దుండుటవలనను వర్షముండదు.

## పుష్య మాసం

శు ౮ ఆదివార యోగమువలన ఈమూడు మాసములున్ను ప్రజలకు, పశువులకు రోగపీడ గల్గును. శు ౬ నుంచి పూషా కార్తెయందు వర్షముండదు. శు ౧౧ నుంచి మాసాంతమువరకు కుజుడు విశాఖయం దుండుటవల్ల బ ౧౦ లోపుగా అచ్చటచ్చట స్వల్పవృష్టి యుండును.

## మాఘమాసము

ఈమాసమున అంగారకుడు అనూరాధాసంచారమువల్ల, వర్షముండదు. శు ౩ శ్రవణ కార్తె పాదజలరాశియందు ప్రారంభమగుట వల్ల స్వల్పవర్షము దక్షిణదేశమం దుండును. బ ౧ ధనిష్ఠ కార్తె పూర్ణ జలరాశిలో ప్రవేశించుటవలన వర్షముండును. బ ౩౦ ప్రాంతమున సూర్యోదయమువలన వర్షముండును.

## ఫాల్గునమాసము

శుక్లపక్షమున శత తారాకార్తె నిర్జలరాశిలో ప్రవేశించుటవల్ల వర్షముండదు. బ ౧౨ ఉ భా కార్తె పాద జలరాశియందు ప్రారంభ మగుటవలనను, కుజ, బుధ, శుక్రచారములవలనను కొద్ది వర్షముండును.

# ధరలు

## చైత్రమాసము

శు ౩ నుంచి నువ్వులు వెండి, పసుపు, బంగారములకును, శు ౧౮ నుంచి మినుములు, వేరుశెనగ మొదలగు పప్పుధాన్యములకును, చెరకు, బెల్లం, చక్కెరకును, దూదినూలు, నెయ్యి, వెన్న మొదలగు వాటికిన్ని ధరలు పెరుగును. వీటికే మాసాంతమందు తగ్గును. గోదుమలు, బుడమవడ్లు, కొఱ్ఱలు, జొన్నలు, వక్కలు మొదలగు పచారీ వస్తువులకు ధరలు నిలబడివుండును.

## వైశాఖమాసము

శు ౫ నుంచి నువ్వులు, నూనె, నెయ్యి, సెనగలకును, వేరుశెనగ మొదలగు పప్పుధాన్యములకును, ధరలు పెరిగి బ ౪ నుంచి తగ్గును. పూర్ణిమనుంచి ప్రత్తి, నూలు, వస్త్రములు, గోదుమలు, మిర్చి, పొగాకులకు ధరలు పెరిగి అమావాస్యకు తగ్గును. బ ౪ నుంచి వెండి, బంగారు, ఇత్తడి, రాగి, పసుపులకు ధర పెరుగును.

## జ్యేష్ఠమాసము

శుక్లపక్షమున పప్పుధాన్యములకును బియ్యముకున్ను, బహుళపక్షమున గోదుమలు, దూది, వేరుశెనగ, కందులు, మిర్చి, చక్కెర, నెయ్యి, వక్కలు, ఏలకులు మొదలగు పచారీవస్తువులకున్ను ధరలు పెరుగును. మాసాంతమున తగ్గును.

## ఆషాఢమాసము

శు ౬ నుంచి బియ్యముకు, వేరుశెనగ మొదలగు పప్పుధాన్యములకున్ను ప్రత్తి, వెండి, చక్కెరకున్ను ధర పెరుగును. ధాన్యముధర మందముగా నిలబడి వుండును. పూర్ణిమాప్రాంతమందు దూదిధర బాగా పెరుగును. కృష్ణపక్షమున కంచు, రాగి మొదలగు లోహములకున్ను, పసుపు, కర్పూరము మొదలగువాటికిన్ని తగ్గును. బ ౫ నుంచి వెండిధర పెరుగును. ధాన్యముధర తగ్గును.

## శ్రావణ మాసము

శు ౪ నుంచి నువ్వులు, మినుములు, వేరుశెనగ మొదలగు పప్పుధాన్యములకున్ను, దూది, చక్కెర, వెండి, బంగారములకున్ను, ధరలు పెరుగును. బ ౧౦ ప్రాంతమునుంచి పప్పుధాన్యములకు బియ్యము, ధాన్యములకు ధరతగ్గును. వెండికి ఇంకను పెరుగును.

## భాద్రపద మాసము

శు ౨ నుంచి పప్పుధాన్యములు, బియ్యములకున్ను, నువ్వులు, నూనె, ప్రత్తులకున్ను పెరిగి బహుళపక్షమున తగ్గును. వేరుశెనగకు బ ౫ నుంచి పెరిగి అమావాస్యకు తగ్గును. చక్కెర, వక్కలు, నెయ్యి, దూది మొదలగువాటికి తగ్గును. బహుళపక్షమున పసుపు, బంగారము, వెండి, మణులు, మిర్చి, పొగాకులకు ధరలు పెరుగును. మాసాంతమున వెన్నధర పెరుగును.

## ఆశ్వయుజ మాసం

శు ౧ నుంచి ౧౦ వరకు ధాన్యముల ధరలు పెరిగి తరువాత తగ్గును. పప్పుధాన్యములకును, దూది, వెండి, బెల్లం, చక్కెరలకున్ను, పసుపు, మిర్చి, పొగాకులకున్ను శుక్లపక్షమున ధరలు పెరిగి కృష్ణపక్షమున తగ్గును.

## కార్తిక మాసము

ఈ మాసమందు ధాన్యమును నిలువవుంచి రాబోవు సం॥ ర, ఆర్ద్రాకార్తెయందు అమ్మినవారికి విశేషలాభముండును. పప్పుధాన్యములకు శు ౩ నుంచిన్ని, శు ౧౦ నుంచి పచారీదినుసులకున్ను, ధరలు పెరిగి పూర్ణిమనుంచి మాసాంతమువరకు తగ్గును. వెండిధరమాత్రము నిలబడును.

## మార్గశిర మాసము

ధాన్యములకు శు ౪ నుంచి బ ౫ లోపల ధర పెరుగును. శు ౪ నుంచి వెండిధర పెరుగును. బ ౪ నుంచి వేరుశెనగ మొదలగు పప్పుధాన్యములకు, గోదుమలకు, మిరియాలు మొదలగు సుగంధద్రవ్యములకు ధరలుతగ్గును. రసద్రవ్యములకు ధర చాలాతగ్గును. ఈ మాసము మొదలు దూది, వస్త్రములు, పాదరసముల ధర పెరుగును.

## పుష్య మాసము

ఈ మాసమునుంచి మాఘమాసములవరకు ధాన్యముల ధర పెరుగును, ఇపుడును నిలవవుంచి జ్యేష్ఠమాసములో అమ్మినలాభముండును. రక్తవస్తు ధాన్యములుగూడ ఇపుడు కొని నిలవజేసి ఆర్ద్రా కార్తెలో

# ఆంధ్రగ్రంథమాల గ్రంథములు

## శ్రీమద్భగవద్గీత

(టీకా తాత్పర్య విశేషార్థ వివరణ సారాంశ సహితము)

### కా. నాగేశ్వరరావుగారు

చిరకాలము శ్రమించి టీకా, తాత్పర్య, విశేషార్థ, వివరణ, సారాంశములను స్వయముగా, స్వోపజ్ఞముగా రచించియున్నారు. అందమైన గ్లేజుకాగితములమీద ముచ్చటగా ముద్రింపబడియున్నది. 550 పుటల గ్రంథము. ఖద్దరుగుడ్డబైండు. గీతాధ్యయనము చేయువారికి మహోపకారకమైన పుస్తకము. వెల రూ. **1-0-0**

## బసవపురాణము

పాల్కురికి సోమనాథకవి - పరిష్కర్త వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

వెల రూ. **2-8-0**

## ఆంధ్రవాఙ్మయ

### సూచిక

(ముద్రితాముద్రిత గ్రంథముల పట్టికలు)

వెల రూ. **1-0-0**

## శతకమంజరి

(భక్తిసంపుటము)

(వృషాధిప; సర్వేశ్వర, దేవకీనందన; రఘువీర, నారాయణ; కాళహస్తీశ్వర; దాశరథి; రామతారక; రంగశాయి; రామచంద్రశతకములు ఇందు గలవు. శతకకవుల చరిత్రలు పీఠికలయందు వివరింపబడినవి.

వెల-రూ. **1-8-0**

(విడివిడిగా ఒక్కొక్కటి) **0-4-0**

శ్రీ మల్లికార్జున

## పండితారాధ్యచరిత్ర

(శైవమత ప్రతిపాదకమగు ద్విపదకావ్యము)

ఇందలి పీఠిక కొన్నివందల పేజీలు గలవు. పాల్కురికి సోమనాథకవి రచితము - పరిష్కర్త - డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు.

**గీతాబోధ** (మహాత్మాగాంధీ) **0-4-0**

**సబర్మతీ ఆశ్రమ నియమములు**

(మహాత్మాగాంధీ) **0-4-0**

**ప్రార్థనగీతావళి**

(శనివారపు సుబ్బారావుగారు) **0-4-0**

ఆంధ్ర గ్రంథమాల, 7, తంబుశెట్టివీధి, మద్రాసు.

# ప్రస్తావన

ఓఙ్నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైక మూర్తయే,
నిర్మలాయ ప్రసన్నాయ దక్షిణామూర్తయే నమః.

శ్రీ సచ్చిదానందపరమాత్ముని లీలావిలాసవిలసిత మైన విశ్వమునందు ఒక చాంద్రమానాబ్దము గతించినది. బహుధాన్యసంవత్సరము ప్రారంభమైనది. గత సంవత్సరేతివృత్తమును వ్రాయ సంకల్పించుటగాని, వర్తమాన సంవత్సరఫలమును గుణింపబూనుటగాని దుష్కరము. మహాకాలము అనంతమైన ఈచిత్రవిచిత్రమైన ప్రకృతిలీలలను సర్వత్ర ప్రకృతి ప్రత్యక్షముచేయుచున్నది. ఆత్మపరాయణులైన ధీమంతులు సత్యాన్వేషణమును ప్రపంచోద్ధరణమునకు వినియోగపఱచుచున్నారు. స్వార్థపరాయణులైన అజ్ఞానులు పరపీడనపరాయణులై ప్రపంచ విలయమునకు వినియోగపడుచున్నారు.

**ధర్మాధర్మసంరంభము**

ప్రవృత్తియందు ధర్మాధర్మములకును, పరార్థస్వార్థములకును సంరంభము సహజమై ధర్మసంస్థాపనము సంభవ మగుచున్నను యుగలక్షణములను యథార్థముగ గ్రహించుట దుర్లభము. ప్రపంచ మంతయును శాంతిసంకల్పమును జేయుచు మహాసంగ్రామ ప్రయత్నములను చేయుచున్నది. అబిసీనియా, చీనా, స్పెయిను సంగ్రామములు ప్రత్యక్షప్రమాణములు.

శాంతిస్థాపనమున కేర్పడిన నానాజాతి సమితి శాంతిస్థాపనమునకే కాక ధర్మ నిర్ణయమునకును నిరర్థకమైనది. ప్రపంచమునందు ధర్మసందేహము సంభవించినప్పుడెల్లా మహాసామ్రాజ్యములు తమ మతమును చెల్లుబడి చేసుకొనుచున్నవి. కొన్ని సమయములందు ధర్మనిర్ణయములను చేసినను, నిర్ణయములు కాగితముల మీద కలవుగాని క్రియారూపమును తాల్చలేదు. కారణము స్వార్థపరాయణత్వమునందు గల ప్రతిష్ఠ ధర్మమునకు కలుగకున్నది. ఆసన్నముగ నున్న మహాప్రళయమును నివారించుట ఎవరికిని సాధ్యముకాదు. ఇది స్వకర్మానుఫలము. నాయకులు సంగ్రామకర్మల నారాధించుచున్నను ప్రజలు శాంతిని కోరుచున్నారు.

**బహుధాన్య సంవత్సరము**

సంవత్సరాదిని ప్రజలు శాంతిసంకల్పము చేసి, శాంతిసౌఖ్యములను సాధించుటకు భగవంతుని కోరుట ఆచార మైనది. పంచాంగశ్రవణ మీ సనాతనాచారమును స్మరింపజేయుచున్నది. బహుధాన్య సంవత్సరమునకు శుక్రుడు రాజు, బుధుడు మంత్రి, కుజుడు సేనాధిపతి పంచాంగము గుణించిన సంగ్రామము ఫలించుటకు ఎంత కాలము పట్టునది దైవాధీనము, కాలగర్భమునందు కలదు. ప్రజ లందరును శాంతిస్థాపనమునకును, సంగ్రామనివారణకును హృదయపూర్వకముగ ప్రార్థనలను చేయుదురుగాక !

**గాంధిజీ**

గాంధిమహాత్ముడు శాంతిసంరంభమునందు ప్రదర్శించిన అపూర్వమైన సత్యాగ్రహ సాధనమును ప్రజలు మాటలందుగాక సంకల్పమందును, క్రియలయందును చూపుటకు తపస్సును చేయుట ధర్మము. చిరకాలసంవర్ధిత మైన పశుబలారాధనస్థానమును సత్యాగ్రహము ఆక్రమించుటకు చిరకాలాభ్యాసము అవసరము. ఆయుధనిర్మాణ, ధారణ, విక్రయ సాధనమునను జీవయాత్రను గడపుచు తన్మూలమున శ్రీమంతులు, బలవంతులు, దురభిమానులు నైన పాశ్చాత్యప్రజలకును వారిప్రవృత్తులకును నిది సులభసాధ్యము కాదు. మాటలయందు జపాను అవలంబించిన చీనాసంగ్రామమును తీవ్రముగ ఖండించుచు, క్రియలయందు జపానుకు ఆయుధములను అమ్ముచున్న యూరపురాజ్యముల నీతి ధర్మవిరుద్ధము. ఇట్టిక్లిష్టపరిస్థితులయందు శాంతిస్థాపనమునకు ౩౫ కోట్ల భారతీయుల ధర్మబలమును శతవిధముల వినియోగించుట తగియున్నది. అపూర్వమైన నిర్బంధములవలన కృశించియున్న భారతీయులకు కర్తవ్యమును నిర్ణయించుటయే అసాధ్యముగ నున్నది. భారతీయభౌతికబలము కృశించినను నిత్యమైన ఆత్మబలము క్షీణింపక అఖండముగ ప్రకాశించుచున్నది. ఆత్మసంస్మరణమును జేసి గాంధిమహాత్మునివలె ప్రజలు ఆత్మశక్తిని నారాధించి తాము తరించి ప్రపంచమును తరింపజేయుటకు పాటుపడుట కర్తవ్యము. గాంధిమహాత్ముడు అపూర్వమైన మహాపురుషుడు. ప్రపంచోద్ధరణమునకు అవతరించిన మహానుభావుడు. కేవలము దైవబలసంపన్నుడైన మాన

వుడు. రాజకీయ, సాంఘిక, మతాదివిషయములయందు ఆయన సత్యాగ్రహసమరసాధనమునను పొందిన విజయములు ధ్యాన, మనన యోగ్యములు. ప్రపంచచరిత్రమారంభ మైనతరువాతను దుర్బలభిక్షుకు డొకడు చేయగల్గిన యపూర్వపరివర్తనమును పాశ్చాత్యరాజ్యములు గ్రహించుట భావియోగక్షేమములకు ప్రయోజనకరము. ప్రపంచభావిపరిణామము ఏరూపముదాల్చినను గాంధి మహాత్ముడు బోధించిన అహింసా, ధర్మ, సత్యములు ప్రతిష్ఠను బడయగలవు.

**కాంగ్రెసు విజయము**

గతించిన సంవత్సరమునందు కాంగ్రెసునకు అఖండము, అపూర్వమునైన విజయముకలిగినది. ఇది సత్యాగ్రహప్రభావము. నిరంకుశప్రభుత్వము విశ్రాంతపోయినది. ఆ బాలగోపాలము కాంగ్రెసు పతాకమును, వందేమాతరము గీతములను దేశమునం దంతటను ప్రత్యక్షముచేసినది. ఇది ప్రజాహృదయమునం దంతర్గతమైన పరమోత్సాహమును, ప్రభుత్వ హృదయమందలి భయభ్రాంతులను లోకమునకు ప్రత్యక్షము చేసినది. కాంగ్రెసునాయకులు మంత్రిపదవులను స్వీకరించి కొన్ని రాష్ట్రములందు ప్రభుత్వమును నిర్వహించుచున్నారు. సంపూర్ణ స్వాతంత్ర్య స్థాపనమునకు ఇది ప్రథమ సోపానము. ప్రజలు స్వరాజ్య ప్రభుత్వమునందు రంధ్రాన్వేషణమును చేయక సకలవిధముల పోషించుట కర్తవ్యము. కాంగ్రెసుమంత్రుల ధర్మశీలము గతించిన స్వల్పకాలమందే సువ్యక్తమైనది. గతించిన ఇరువదిమైదేండ్లయందును దేశమునందు సాంఘిక, రాజకీయ, మతాది సకలవిషయములయందును సంప్రాప్తమైన మహాపరివర్తనము భావ్యభ్యుదయమునకు శుభసూచకముగ నున్నది. ఈ మహాపరివర్తనసిద్ధికి ప్రాణమానధనములను సమర్పించిన త్యాగమూర్తులకు జోహారులు.

**ఆంధ్రాభ్యుదయము**

౧౯౧౦-కీలక సంవత్సరమున మా మొదటిసంచిక ప్రచురింపబడినది. బహుధాన్య సంవత్సరమునందు ౨౯ వ సంచిక వెలువడు చున్నది. గతించిన ౩౦ ఏండ్లనుండియు ప్రజాహృదయమునందు గల్గిన మహాప్రబోధమును సంవత్సరాదిసంచికలు దిఙ్మాత్రముగ సూచించుచున్నవి. ఆంధ్రులు సాహిత్య, కళా, మత, సాంఘిక రంగములందు చిరకాలాగతములైన పూర్వాచారములను, నిర్బంధనిర్మాణములను విసర్జించి నవీన మార్గములను అవలంబించిన విధమును కావ్యములు, గీతములు, విమర్శనములు, పరిశోధనలు, చరిత్రాంశములు విశదము చేయుచున్నవి. సాహిత్యమునందు కల్గిన అపారమైన వికాసమును ప్రచురితములైన కావ్యములు, గీతములు విశదము చేయుచున్నవి. నవీనరచనలు ప్రజాదరణమును బడయుచున్నవి. ముప్పదేండ్లకు పూర్వము పరిహాసపాత్రములైన అప్పారావుగారి ముత్యాలసరములు నేడు ప్రజాదరణమునకు పాత్రము లగుచున్నవి. ప్రాతపద్ధతులను క్రొత్తరీతులను ఖండించుట ధీమంతులలక్షణము కాదు. విమర్శనము చేయుటకు సకలజనులును అధికారులు. సంగీతకళయందును ఆంధ్రుల యభినివేశమును గాన సభలు, గానకళాశాలలు, పండితసత్కారములును విశదము చేయుచున్నవి. కళారంగమునందు చిత్రకారు లవలంబించిన నూతన విధానము చిత్రప్రపంచమునందు ప్రశంసలను బడసినది. హరిజనోద్యమము, పునర్వివాహములు విశాలములైన ప్రజాహృదయములను వెల్లడిచేయుచున్నవి. ఆంధ్రులు అస్వతంత్రస్థితియందున్నను స్వయంసహాయమునను రాజకీయరంగమునందును స్వాతంత్ర్య ప్రియత్వమునుగల విధమును సత్యాగ్రహ సమరము విశదము చేసినది. నిరంకుశప్రభుత్వమునందు ఆంధ్రరాష్ట్రనిర్మాణము సాధ్యము కాకపోయినను స్వరాజ్యప్రభుత్వమునందు సాధ్యముకానున్నది. నూతనసంవత్సరమునకు సరిగ మద్రాసు ఎసెంబ్లీ ఆంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకతను అంగీకరించినది. ప్రజలు చిరకాలమునుండి పాటుపడుచున్న రాష్ట్రనిర్మాణమునకు యావచ్ఛక్తిని వినియోగించి తీర్మానము కార్యరూపమును దాల్చుటకు ప్రయత్నించుదురుగాక. ఆంధ్రాభ్యుదయమునకు సకలవిధములపాటుపడి ప్రజాదరణమునకు పాత్రుడైన మహాపురుష వీరేశలింగముగారికి జోహారులు.

ఆంధ్రాభ్యుదయమునకు పాటుపడిన సకల మహాజనులకును కృతజ్ఞతావందనములు. గతసంచికలకును బహుధాన్యసంచికకును ప్రచురణమునందు సహాయము చేసిన మిత్రులకు వందనములు. నా స్వల్పమైన సేవకు ప్రజలు చూపిన గౌరవ ప్రేమాదరణ సత్కారములకు కృతజ్ఞుడను. సచ్చిదానందపరమాత్మ సకలలోకములకును సకలజనులకును శాంతిసౌఖ్యములను ప్రసాదించుగాక!



# "బహుధాన్య"

"ప్రేమలత"

మధుమాసమునఁ దీయమామిడిచివు రాని
        పంచమశ్రుతిఁ బాట పాడెఁ బికము
కడిమిపూకన్నెతీకాలు డిరిచి వీచె
        గంధాచలమునుండి గాడ్పుఁ గుజ్జి
మందిరోద్యానరమాభూషణములైన
        తరులకెల్లను దోహదంబు లెసఁగ
క్రొత్తబట్టలు గట్టుకొనె నార్యగృహమేథి
        అనుకూలయగు ప్రియురాలితోడఁ
దాపునకు వచ్చె నదిగో స్వాతంత్ర్యలక్ష్మి
విజయశంఖానినాదంబు వినఁగనయ్యె
అమ్మ! బహుధాన్య! నీవచ్చునంతఁ దోచెఁ
బ్రాచిమొగమునఁ జైతన్యభాస్కరుండు.

నవరించుఁగాత దేశములోని పరపతిఁ
గసిమసంగిన ఆర్థికవ్యవస్థఁ
జల్లార్చుఁగాత విశ్వమ్మెల్లఁ గాల్చెడి
స్వార్థాభిలాషుల సమరవహ్ని
మాయించుఁగాత "మలోయన్నమో" అంచుఁ
గడగండ్లఁబడువారి కడుపుమంట
చేకూర్చుఁగాత ప్రాచీనస్వరాజ్యాధి
కారంబు మాపుణ్యభారతమున
కార్యవిజ్ఞానలతికల నల్లువెట్టి
ప్రాచ్యదేశనాగరికతారామలక్ష్మి
వింతసత్కారముల గారవించుఁగాత
భరతభాగ్యంబు బహుధాన్యవత్సరంబు.

విత్తునకుఁ బుట్టిగా భూమి విఱుఁగఁ బండి
దేశదేశాల రైతు వర్ధిల్లుఁగాక
భారతీయహృదాకాశపథమునందు
వెలుగుఁగాత! చైతన్యపు వేవెలుంగు.

---



# ఆంధ్ర!

రాయప్రోలు సుబ్బారావు

ఉపనిషన్మీమాంస నోరంత ప్రొద్దుల నవధరించిన పూర్ణాంధ్రజాతి,
సీతమ్మ అతికష్టగీతాలు వినలేక అడవులు బట్టిన ఆంధ్రజాతి,
కురుపాండవుల కత్తికోతల భాగధేయముఁ బంచికొన్నట్టి ఆంధ్రజాతి,
యవనధాటీప్రవాహమును బంధించి ఆర్యావర్త మరసిన ఆంధ్రజాతి,

జయవదితిహాస సూత్రభాష్యములు నేడు
త్రవ్వియెత్తిన ప్రాంత జాదండకవిలె
జమువుకోవలసెను నమ్మఁజాలనట్టి
కట్టుకథలట్లు, సహింపఁగలవె? ఆంధ్ర !

మగధసామ్రాజ్యసీమలు నీసితచ్ఛత్రముక్తాఫలచ్ఛాయ మునుగునాడు,
అలకళింగోపాంతమందు నీ కంఖాణఖురధూళి నెఱసందె గురియునాడు,
కర్ణాట రాజ్యరంగముల నీకవులను బ్రహ్మరథంబులు పట్టునాడు,
తంజాపురోద్యానకుంజమ్ములందు నీసంగీతమధుధార పొంగునాడు

అతిభయంకర శౌర్యధైర్యప్రసక్తి
రసవశంకర నాగర రాగరక్తి
ఏకమై పాకమై ప్రవహించినట్టి
ఆయఖండప్రభావ మేమాయె? నాంధ్ర !

ప్రాకృతపదమంజరీకంఠముల హాలుఁ డమృతకావ్యప్రసాదములు పంచె,
బౌద్ధసూత్రార్థముల్ ప్రవచించి నాగార్జునుం డహింసాధర్మకాండ నిలిపె,
కన్నడనుడికి వంకలు తీర్చి పంపఁడు తొలకరిరచనకుఁ ద్రోవఁదీసె,
సాహిత్యకలశంబు తూళించి పండితరాజు క్రౌంజవుల క్షీరములు నించె,

అన్యభాషల దూరదేశాంతరముల
నుద్ధరించి ప్రకాశించియును, నిజాంధ్ర
జాతి తంతువిచ్ఛేదంబు సలుపలేదు
లేదె నీలోన తత్ప్రిభాలేశ, మాంధ్ర!

తర్కమహాసముద్రమ్ము నాపోశనంబట్టె అన్నంభట్టుపండితుండు,
యావదాయుర్వేదజీవనీయచికిత్సలు గదించె బసవరా జగదవేత్త,
జందెమ్ము తెగద్రెంచి క్షాత్రము నెగయించె అనపోతశర్మ దేశాభిమాని,
గోలకొండకిరీటకోటికాంతులు దిద్ది రక్కన్న మాదన్న లఘరగురులు,

అఖిలపురుషార్థఫలసిద్ధినందినారు
ఆధిభౌతిక భౌతికాభ్యంగణముల
సపితామహ మాతామహానిధులు
మాయనీయ కాంధ్రులసంప్రదాయ, మాంధ్ర!

నాదధేనువుఁ బిండి నవనీత మందించె త్యాగరాజస్వామి తన్మయుండు,
లీలాతరంగిణీకూల తీర్థానందుఁ డయ్యె నారాయణుఁ డమృతమూర్తి,
శ్రీకృష్ణుకాలిగజ్జెలమ్రోతల లయించెఁ బదముల క్షేత్రయ్యపాటకాఁడు,
కావ్యమాంగల్యరేఖాగుచుల్ మెఱుఁగార్చె మల్లినాథ విదగ్ధవల్లభుండు,
సృష్టి నూఁచు సంగీతసాహిత్యకలల
నుగ్గుబాలతోడుతఁ ద్రావి యుమిసి రాంధ్రు;
లా జగన్మోహనాస్త్రము లభ్యసింప
దక్షిణము నుత్తరముఁ జూడఁదగునె? ఆంధ్ర!

విఱిఁగివచ్చిన ప్రాణవిభునకుఁ బసుపెచ్చి వేడినీళ్లను తోడె కోడ లొకతె,
కత్తులతిరునాళ్లఁ గవయవచ్చిన నాథుఁ గొఱకచ్చునుడిఁ దోలె కూఁతు రొకతె,
కులకతులఁ గృశించి కూలనున్న విశాల రాజ్యచక్రముఁ ద్రిప్పె రాణి యొకర్తు,
కవికోకిలమ్మృదూక్తి నవదరించెను తేనెనుడికారమున ఆడుబడు చొకర్తు,
విమల సాహస సౌకుమార్యములు వెలయ
దిఙ్నితంబంబులందుఁ జిత్రించినారు
తమచరిత్ర విచిత్రపత్రముల నాడు
తలఁప వెట్టు లాజాతిచైతన్య, మాంధ్ర!

గడ్డపాఱలు గోగుకాడలవలె ముళ్లు వేసినారఁట కొండవీటిరెడ్లు
తెలివెన్నరాసుల తీరున నల్లకొండలు చీల్చినారట పలనాఁటిగండ్లు,
శివుఁడు గంగను బోలెఁ జెరువుగండిప్రవాహ మాపినా రద్దంకికాపుమగలు,
వాఁకెడేసి శిలాకవాటముల్ గ్రుద్దులఁ గదిపినారఁట తెలంగాణభటులు,
అట్టి బలభద్రు లీభూమిఁ బుట్టినారు
విజయకన్యక వీరగోఱజముఁ బూయ,

# ఆంధ్ర

పులికడుపు చలిచీమలపుట్ట యయ్యె
చూడవోయి ప్రాల్మాలికల్ వీడి ఆంధ్ర!

పూజింపరే రెడ్డిరాజులు వీరశృంగారహారమ్ములు కాన్కలిచ్చి,
సేవింపరే కమ్మసేనాపతులు శత్రురక్తకుంకుమల నరణ మొసంగి,
వెలయింపరే వెల్మవీరులు బెబ్బులిబిడ్డలై పరసీమ గోడ్డువోవ,
అర్చింపరే బ్రాహ్మణాచార్యు లుభయభాషావ్యవసాయసస్యమ్ము లెత్తి
ఈమహాంధ్రదేశభగవతీమతల్లి
నాదినుండి సామ్రాజ్యసమాప్తిదాక,
కులముఁ దడివిరె? పొలిమేరగోలఁ బడిరె?
బోయవలె తల్లిపల్లకీ మోయు, మాంధ్ర!

పెనుజడల్ విరబోసికొని తాండవంబాడు ఈర్ష్యాపిశాచి నట్టింటిలోన,
సవతిబిడ్డవిధాన నవయుఁ దల్లితెనుంగు విశ్వవిద్యాలయవీథులందు
దోషశల్యమ్ములే దోఁచు నుత్సాహసంపన్నవ్యసాహిత్యపాలనమున,
పిన్న లూర్ధ్వముఖంబు పెద్ద లధోదృష్టి ఉభయభాగ్యోపాస్తి నుత్తచూపు,
ఈయభావవేదాంత మే మీయఁగలదు,
చావుబ్రదుకులు తేలు నీసంధియందు,
నాదుజాతి నా దేశము నాదుభాష
అను అహంకారదర్శన మందు, మాంధ్ర!

---

# ఆంధ్ర సాహిత్యాభ్యుదయము



పుట్టపర్తి నారాయణాచార్యులు

తెనుగుబాస జన్మించిన శుభముహూర్తమేమో! ఏస్వర్గీయశిల్పి అమృతహస్తమునుండి అక్షరమూర్తియగు ఆంధ్రవాణి అవతరించినదో అంచనావేయు మహానుభావు డేడీ? ఎన్నియో వాదములు ఉపవాదములు, తోకలు తొండములు బయలుదేరినవి. పుస్తకములు - వ్యాసములు ప్రబలినవిగాని యిదమిత్థమని సత్యమును తేల్చిచూపగల మొనగాడింకను లేడనుటకు చింతగుచున్నది. ఆధారములును చాల తక్కువ. మనలో దేశచరిత్రలుగాని, స్వీయచరిత్రములుగాని వ్రాయు ఆచారమంతగా లేదు. అది మనము పాశ్చాత్య విజ్ఞానుల సహవాసముచే సంపాదించుకొన్న "తెలివి" అన్నను మనము సిగ్గుపడనక్కరలేదు. మనవా రాధ్యాత్మికశక్తి ముదిరినమహనీయులుగదా! తాము చచ్చినయనంతరము తమ్ముగురించి యెవరైన చర్చింతురా? అను తలపే వారికి గలుగలేదు. కేతన లెందరో మల్లన లెందరో కవిసార్వభౌము లెందరో నేరుగా జెప్పువా రెవ్వరు? మనవాఙ్మయమంతయు గందరగోళమే. ఆదోషమునకు పొరపాటునకు మనము వారిపై గ్రుడ్లురిమిన ప్రయోజనము లేదు. ఆ యదృష్టవంతు లెన్నడో చల్లగా కన్నులు మూసికొని మూట గట్టినారు.

అయిన, నింతకు మిగులున దేమి? ఆటబొమ్మలవలె ఊరకుండవలసినదేనా? అది కార్యజ్ఞుల లక్షణము గాదు - మరి సాకుతో తప్పించుకొనవలసిన సోమరయ్యలపని. ఆధారములు లేవే? అని యేడ్చిన కరుణించువారెవరు? ఉన్నదానితో ఒకరీతిగా సత్యాన్వేషణముచేయుట బుద్ధిమంతుడగు జీవికి లక్షణము. ఈవితర్కములు మునుపే తలనూపినవి. మనకన్న తొలుతనే ప్రతిభావంతులు మేలుకొని పోరాడినారు. వారిలో మనమెన్నటికిని మరువరాని, మఱపునకురాని వారు వీరేశలింగముపంతులుగారు. అతని జతలో పనిచేసినవారును, తరువాత వేయికాళ్లతో పోరాడినవారును నున్నారు. అయిననేమి? సత్యప్రియుడనుకీర్తి పంతులుగారికే దక్కినది. "అలికమున అక్షిని దాచినవాడని సోమునన్నను ఒకవేళ ననకున్నను పంతులుగారిని మాత్రము జగచ్చక్షువని ఘోషింతుము. కవుల చరిత్రలను సంగ్రహించుటలోను, వానిని ముద్రించి యొకస్వరూప మిచ్చుటలోను పంతులుగారు పడినకష్టములు ప్రతియాంధ్రుడును స్మరించదగినవి. పోనీ వారుమాత్రము తేల్చిరా? తేల్చు టెటులని? కూడి తీసివేత గాదుగదా అడిగినవెంటనే ఎక్కాలు వచ్చియున్న ఉత్తర మొప్పించుటకు. వారివి యుండిన యాధారములపై యూహలే. కడకు మనకుమాత్రము, కొన్ని సమస్యలలో నిర్ణయములేనివి శంకలే గతియైనవి. కొందరు నన్నయకుముందు వాఙ్మయమే లేదన్నారు. భట్టారకుడు భ్రష్టవాఙ్మయము నంతయు గాలించి- శోధించి- యేర్చి కూర్చి-తిద్ది తీర్చి-భావకు స్వరూపమును బ్రసాదించెనట. మరి కొందరు నన్నయకుముందు వాఙ్మయమే లేదన్నచో-భారత మాకాశమునుండి యూడిపడినదాయని గద్దించుచున్నారు. వేరొకరు శాసనవాఙ్మయము ప్రబంధనిర్మాణక్షమమై యుండలేదని పట్టుపట్టుదురు. కొందరు పగల్రాత్రి కష్టించి ప్రతీతాటియాకులు వెతకి వెలుగుచూపి "యిదిగో ప్రాచీనవాఙ్మయ" మన్నారు. ప్రతివాదులు వీరిని మీరే వ్రాసి ప్రాతపేరు లతికించినారలెమ్మని వేళాకోళములకు దిగినారు. "పేరులు దాచుకొన వలసిన కర్మ వీరికేమిరా" అనువిచారము వారికి బట్టలేదు. కడకు సత్యము మూతిముడిచి ప్రతిజ్ఞలకు దిగి వాఙ్మయ మొకయుద్ధరంగమైనది.

నాకు జూడ సాహిత్యమునే పరమార్థముగా భావించు కడుపుకక్కురితిగల మనము పైన నిలిచి తమాషగా వీరివివాదముల జూడవచ్చును. మన ఆనందమున కేమి పరవాలేదు.

ఒకకవి ముందువాడైనను వెనుకవాడైనను మనకు వచ్చుమహాపద లేదని నామనవి. కావలెనని మునిగాళ్లపై యెదురెక్కిన జెప్పలేను గాని లేకున్న మనము కంటియెదుట గనపడు గ్రంథముల జూచియే హెచ్చుతగ్గు లేర్పరింపవచ్చును. వారు వ్రాసినగ్రంథము లెదుట నున్నవి. చేసినపరిశ్రమలనుపకుచు నేయున్నవి. భావములలోని మేలిమి, రసములోని పరిణతి వారిగ్రంథములు స్పష్టముగా వివరించుచునేయున్నవి. వానిని జూచియే తరతమ భావమును నిర్ణయించుట తంటాలేనిపని.

“అయిన సాహితికి కాలనిర్ణయమే యక్కరలేదా! ఆనాటి భావములు ప్రవృత్తి నివృత్తులు మొదలగునవి గమనింపకున్న కవి హృదయము బోధపడుననుట నవ్వులాట గాదా! జీవితమునకు కళ ప్రతిబింబమేగదా!” నిజమే. అట్లు వాదించువారిలో నేను నొకడను. కాని అంతమాత్రముననే తూ- చా- దప్పక చావుపుట్టుకలు, వివాహమైన తేదీలు పుత్రోత్పత్తిగలిగిన శుభలగ్నములు వల్లించి మెదడున కంటించవలెననుట న్యాయము గాదుగదా! ఏబదివత్సరములు క్రిందైనను మీదైనను మనము పట్టి సాధింపవలసినపని లేదు. అయింత స్వల్పకాలములోనే సంఘము గుర్తుపట్టలేనంత పూర్తిగా మార్పుచెందుట యసంభావ్యము కనుక మనము కవుల కాలనిర్ణయమునుగురించి యాలత జెందకుండుట మేలు. వారిచేతులలోనిపని గాదుగదా ఆలోచించి ముందుచుట్టుటకు మరి మూడవవాడగు ముసలి బ్రహ్మది.

## నన్నెచోడుడు:

ఇంతవరకును- నన్నెచోడుని కాలవిచార మొడుకు దొడుకులలోనే యున్నది. “కవిరాజ శిఖామణిని” “కవిచరిత్రకారుడు” నన్నయకు తరువాతివానిగా నెన్నుకొనెను. మానవల్లి రామకృష్ణ కవిగారును- నడకుదుటి వీరరాజు పంతులుగారును- నన్నయకు ముందటివాడనియే. నేడు పండిత శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు తిక్కనకన్నను తరువాతివానిగా దేల్చినారు. ప్రాచీనగ్రంథముల లోని విమర్శల కన్నిటికిని సమాధానము లొసగినారు. సయుక్తికముగ ఖండించినారు. ప్రయోగ విశేషముల బొందుపరచినారు. వీరు తేల్చిన విషయములలో నన్నెచోడుని కుమారసంభవ ముద్భటుని కుమారసంభవమునకు పరివర్తనము గాదనుటయు నొకటి. మనవాఙ్మయమున నున్న గొప్పచిక్కే యిది. ప్రబలాధారములు లేవు సత్యము తేలదు. ఇంతకన్న నుత్కృష్టములగు ఆధారములు దొరకువరకు మనము లక్ష్మీపతి శాస్త్రులవారి వాదమునే అంగీకరింపవలసి యుండును. అధిక పరిశ్రమతో కాలవిచారములను, ప్రయోగ విశేషములను, కొన్ని పాఠభేదములను విమర్శించి సత్యము తేల్చిన లక్ష్మీపతి శాస్త్రులు గారికి ఆంధ్ర యువకుల తరఫున పరశ్శత ప్రణామము లర్పించుచున్నాను.

అయిన మనము మొదట నుదాహరింపవలసిన దెవరిని? “విద్యాదయితు” నేనా? న్యాయమే. కాని నాతలంపుమాత్రము నన్నెచోడునే దిలకించుచున్నది. కాలవిచారమటులుంతము. అతనిశైలిలో వైలక్షణ్యమున్నది. భావములలో ప్రాచీనత యున్నది. రచనలో దేశీయత యున్నది. కవితాదృష్టి, జాతీయతావాదము ముఖ్యమైనచో నన్నయ నన్నెచోడులలో “కవిరాజ శిఖామణియే” మొదట రావలసినవాడని నామతము. విజ్ఞులు కోపగింపకుందురుగాత. నన్నెచోడునకు కన్నడ వైదుష్యము నరముల కంటినదగుటచే “తెనుగుతన”మంతగా ప్రతిఫలింపలేదని కొందరందురు. కాని ముద్దులుగులుకు తెనుగుపదములు జాతీయములు పాదలయం దందందు నిక్కిచూచు పూమొగ్గలవలె గిరికొనియే యున్నవి దానిని కొంత పండినట్లు బసవపురాణమున జూడవచ్చును. తావిని పుక్కిటబట్టి గంభీరముగనుండు నిండుమొగ్గలవలె నర్థగౌరవముగల చిన్ని పదములకు, మధురస్వభావ వర్ణనలకు సోమనాథుడు కాణాచి.

పంతులుగారు నన్నెచోడుని కవిత్వమును క్రిందికి లాగిరి అన్యదేశ్యము లతనికవితలో నెక్కువట అందుచే కవిత్వమునకు పుష్టి దగ్గి కొరత గల్గినదట. అన్యదేశ్యములు వాడని గ్రంథములు మనభాషలోనే లేవని గట్టిగా జెప్పవచ్చును. మనకవులు “తావి మోవి”- మొదలగున వన్నియు నన్యదేశములే యన్నప్పడిక నీయరిష్టమునకు తొలగి నిలిచినవా రెవరో మీరే యోచింపుడు. అట్టివానినెల్ల నిషేధించుచు బోయినచో తుదకు మనకు మిగులునది లక్షణకారులు మాత్రమే. అప్పకవి “యన్యదేశ్యములు” ప్రస్ఫుటార్థ రసములు గావని నిరసించెను. అటులే తలచిన అన్యదేశ్యములేనా అపరాధులు? తిక్కననాటి కూడు కంపు చీరలు మొదలగున వీనాడు వాడుకలో కవిబ్రహ్మ వాడిన యర్థములలో నున్నవా? అతనికాలమునాటి భావ పైకాలపు వారి కర్థముగాదని యోచించి ప్రశ్నయడిగి తెలిసికొన్నాడా తిక్కన? ఎల్లకాలము మారని ప్రసిద్ధపదములే కవి వాడవలెనని విధించుట యస్వాభావికమని వేరే చెప్పవలెనా? ఆనాటి కది ప్రసిద్ధార్థము. ఇప్పటికి కాకపోయినంతమాత్రమున కవి శిక్షార్హుడగునా? కవులు తెలివి గలిగినవారేగదా? ఇతరులు చదివి యానందింపనేగదా గ్రంథములు వ్రాసిరి. అట్టిచోట “పనివడి” మారుమూల పదములు వాడినచో ప్రయత్నించి చదువు “మంగలి రంగ డుంజ” యని వారికిమాత్రము దెలియదా? ఆయాకాలములలో, ప్రసిద్ధమైన పదములనే వారు వాడుదురు. ఈనాడవి ప్రసిద్ధములు గావని మనము నిందించినచో న్యాయమగునా? నన్నెచోడుడు వాడిన “నాయి”, “కండెవడము” మొదలగున వన్నియు ఆనాటి సామాన్యవ్యవహారములోనివే. అట్టివానినే యాతడు గ్రహించెను. అట్లుగాకున్న నాతడు తెలుగులో “ప్రబంధము”ను వ్రాసి కన్నడము లోని మారుమూలపదము లేల కుప్పతెప్పలుగా నిండించును? అంతటి యభిమానము కర్ణాటముపై నున్న కన్నడగ్రంథమే యొకటి వ్రాయలేకపోయెనా? దేశ్యములకును తెలుగునకును తీరని సంబంధ మున్నది. దేశ్యములను గ్రహించుట తెనుగువారికి చాల పురాతన కాలమునుండియు విడువక వెన్నంటి వచ్చుచుండు నాచారము. ఆవశ్యకము గూడ. దేశ్యములకుమాత్రము బహిష్కార పత్రము నొసగి సాగనంపినచో సంస్కృతము మనయింటి పిన్నమ్మబిడ్డ గాదుగదా! అట్టియెడ సంస్కృతము వాడుటలో నున్న న్యాయమేమి? పరస్పరసంబంధి భాషా పదములు వాడినచో గలుగు దోషమేమి? ఈ సత్యాగ్రహ మచటనే న్యాయమగును గదా! ప్రస్ఫుటార్థత కంతమెక్కడ? ఎంత యోచించిన భావముయొక్క లోతును తఱచి చూచి పూడు దెచ్చితినను ధైర్యముగల బుద్ధిమంతు డుండునా? కనుక నన్నెచోడుడు అన్యదేశ్యముల వాడినా డన్నంతమాత్రముననే పెరటిదారిని సాగనంపవలసినది లేదు. అతనికి గొప్పస్థాన మీయవలసినదే!

రాజకవి యాటచేగాబోలు శృంగారము వైపు మనసీడ్చినది. వీరశైవుడైనను మతాభి

మానముకన్న కళయం దనురక్తి మెండు. పదములతిమృదులములై చూచినవెంటనే పాఠకునికి భావము బట్టియిచ్చును. తాను గావింపబూనినది పరివర్తనము. నన్నెచోడుడు కాళిదాసుని యుపమానములకు మెఱుగుదిద్ద యత్నించినాడు. అద్వితీయుడగు ఆ మహానుభావుని దాటువాడెవడు? "కవిరాజశిఖామణి" కృతార్థుడైన పట్టులును లేకపోలేదు. వ్రాయబూనినది "ప్రబంధ"మైనను హద్దు ఆజ్ఞలేని వర్ణనములకు దిగలేదు. ఆంగికవర్ణన మున్నది కొన్నిచోటుల వెక్కసమనికూడ ననిపించును. కాని దోషమంతయు తెనుగు కవిదే గాదు. చేయబూనినది పరివర్తనము గదా! అంతయు నితనికే ముడిపెట్టుటకన్న కొంత విడదీయుట మంచిది. కాళిదాసుడు సౌందర్యపక్షపాతముతో సందర్భమును గమనింపని ఘట్టములు లేకపోలేదు.

అసలు శృంగార మన్ననే మనము పండ్లునూరుట సహజము. ఆదోషము మనది గాదు. మనదౌర్భాగ్యపు బ్రదుకులలోనే యున్నది. ఏ గ్రంథమునందైనను కాసంత శృంగార మెక్కువగా కానబడినంతనే పండ్లునూరుట మనవిధి. మనకొట్టము, మనగాదె, మనగేదె, మన గృహపరిస్థితులతో కావ్యమును గొలుచుటకన్న వారు ప్రత్యేకములగు యుగములలో భోగము లనుభవించి సుఖించిన రసికులని సరిపెట్టుకొనుట శాంతికి త్రోవ. ఇతని వర్ణనలు మెఱుగిచ్చి తీర్చిన సజీవచిత్రములు. అచట నచట నన్వయకాఠిన్యము శబ్దాలంకారములు లేకపోలేదు. అలంకారముల ఘాటు తగిలినది. కాని ప్రసన్నత గలపట్టు లెక్కువ. మారుమూలపదములకన్న వాడుకలో వడిదిరిగిన మాటలు కొల్లలు. అక్కడక్కడ ప్రయత్నించి యోచించి పడవేసిన భావములు లేకపోలేదు. కాని సులభముగ నర్థమగు సరసభావములపైననే యాతనికి మక్కువ. నన్నయ పురాణకవితకు నాయకు డెట్లయ్యెనో అట్లే "కవిరాజశిఖామణి" కావ్యకవితకు మగడు. కన్నడవైదుష్యము ముదిరియుంటచే తరువాతి గ్రంథములవలె "తెనుగుతన" మంతగా ముదిరియుండలేదని విన్నవించితినిగదా! బహిరంగసృష్టియెక్కువ. ఆంతరిక చిత్రణముగూడ లేకపోలేదు. జడప్రకృతిని వర్ణించుటలో కవికిగల ఆసక్తి మెండు. గ్రంథ మంతయు వెదకినను ఒకటి రెండు చోటులనే వీరశైవపు వాసనంటియున్నది. ఇక తక్కినచోట నంతయు పరిణతకళాహృదయమే తప్ప వేరులేదని విన్నవింతును.

నన్నయ :

ఇక తిన్నగా "విద్యాదయితుని" బరికింతము. నన్నయ రెండుభాషలయందును సంపూర్ణమగు స్వాతంత్ర్యముగల పండితుడు కన్నడమునుగూడ పరిశోధించి యుండునేమో! పుట్టినది శ్రోత్రియకుటుంబము. పట్టినది రాజపురోహితము. నాలుక కందిన తెనుగుమీదికన్న నుసాధించిన సంస్కృతముపై యభిమాన మెక్కువ. కావుననే తెనుగున భారతమంత బృహద్గ్రంథమును రచించిన "మహితాత్మునకును" శాసనములుమాత్రము మఱుభాషతోనే వ్రాయవలసివచ్చినది అయిన ఆంధ్రాభిమానము తగ్గినదా? లేదు. అట్లున్న తెనుగున లోకస్వరూపమునే యిచ్చియుండడుగదా! సంస్కృతమునందే కావ్యములు వ్రాసియుండిన నెవరు గా దనియుందురు? ఇంతకష్టపడి చింతామణిని పట్టవలసినపనేమి? కొందరు తొలుత చింతామణిని బూరించి దానికి లక్ష్యగ్రంథముగా భారతమును రచించినా డందురు. అట్టిమర్యాద - వాడుక మనవాఙ్మయములలో నున్నది. సంస్కృతమున భట్టికావ్యములవంటి, అక్కరకురాని యత్నము లెన్నియో గలవు. వానికళ వ్యాకరణకవిత్వమే. "కాని శ్లేషకావ్యమే యుత్తమకావ్యద్వయ మైనపుడు అట్టివిమాత్రము కావ్యములుగావా? వాఙ్మయమున కన్నివిభాగము లున్ననేగదా సమగ్రత?" అని కొంద రందురు నిజమే. అట్టిప్రజ్ఞలను జూపింపవలసినపద్ధతులు వేరు. అన్నిటికిని కవిత్వమే గతియగుట కది సానివాడ గామగదా! మందుకు గావలసివచ్చుననియు, మంచిదనియు ఇంటినిండ జిల్లేడులు నాటు పరమ దౌర్భాగ్యచక్రవర్తు లున్నారా? "ఇంతేల నన్నయయే స్వయముగా "జగద్ధితమును" బూని కావ్యమును రచించెద నన్నాడుగాని చింతామణీలక్షణ సమన్వయమునకు గాదు. అట్లున్న చోనా మహామహుడే చెప్పియుండును. అహోబల పండితాదులు భారతమునుండి లక్ష్యముల నుద్ధరించుట భారతమున చింతామణికి సరిపోవులక్ష్యము లుండుట ప్రబలాధారము గాదు. అతడు రచించిన వ్యాకరణమునకు భారతమునుండియే యుదాహరణముల నిచ్చుట, సముచితమని వారు తలచియుండవచ్చును. అంతమాత్రమునకే నన్నయభట్టుయొక్క హృదయము - లక్ష్యలక్షణములనుమాత్రమే ముఖ్యముగా నుంచుకొనె ననుట పొసగునా? మొదటినుండియు నాతని కాదృష్టియేయున్న కావ్యము రక్తికట్టియే యుండదు

నన్నయకవిత సలక్షణమైనది. ఆతని నైదికావేశము గొప్పది. ప్రతిపదమును ముంచుకొనివచ్చు నావేశముచే తూగాడుచుండును అందుకే స్థలములు మారిన ట్లంతయు నిలుకడలేక సాగినది కవిత. తెనుగుపదములకుమారు సంస్కృతపదములే తఱచు వాడుచుండుటచే విడదీయరాని బిగియున్నది. ప్రసాదగుణము మాత్రము కొంచెము తక్కువే. తిక్కనకు వలెనే నన్నయకు జీవితమున సంపూర్ణమగు శాంతి గుదురుకొన్నది ఎక్కువగూడనేమో. అయిననేమి? ఆయువు భాషాసంస్కరణముతో తీరిపోయినది. భావమనన తక్కువేమో యనిపించును. నన్నయకు బాహ్యప్రకృతిని సృష్టించుటలోనున్న యభినివేశము ఆంతరికవృత్తిని జొచ్చిచూచుటలో గానము. చిత్రములు కాలుసేయి కదలుపని మూగబొమ్మలు. తిక్కన కవనములోని జాజ్వల్యమానమగు క్షణక్షణ చంచల ప్రవృత్తిని నన్నయయందు జూడలేము. కొందరు దీని నభిరుచిభేదముచే సమర్థింపవత్తురు. ఆవితర్కములకంతములేదు. వారెంతగా వాదించినను తిక్కనకన్నను ఒకమెట్టు తక్కువయని యొప్పుకొనుట విధి. కవిబ్రహ్మ నన్నయను "విద్యానిధి"యని, "విద్యాదయితు"డని, "మహితాత్ము"డనిబొగడియుండుట నన్నయ కళామహత్తునకు వలచిగాదు, సరిగదా తిక్కన నన్నయను పెద్దజేసి చెప్పినను మనకు బాధలేదు. వారిద్దరికవిత్వముల నేర్పరించుటలో సంపూర్ణాధికార మున్నది మనకుగాని వారికి గాదు ఎవ్వరేమన్నను కాలమున తిక్కనకన్న నన్నయ పెద్దవాడైనను కళావివేకమున పిన్నవాడనియే నాయభిప్రాయము. రెప్పలల్లార్చు స్వభావవర్ణనలు లేకపోలేదు. కాని తిండిలేక సప్కించిన వృత్తము లెక్కువ. "జగద్ధితముగ" పురాణమును నిర్మింపదలచిన బ్రాహ్మణుడగుటచే తనకావ్యమునకు కళాత్వ మివ్వలేదు. సారవంతములగు పట్టులకన్న సారహీనము లెక్కువ దోషము. నిజముగా నన్నయ సందర్భశుద్ధిగల ధారకు ప్రథమాచార్యుడు. శ్రీనాథుడు నన్నయను ధారాశుద్ధికై యుపాసించినాడని స్పష్టముగా బలుకవచ్చును

కొందరు శ్రీనాథుని వ్రాతను నన్నెచోడుని కుమారసంభవము మాతృకయందురు. ఏమో; శ్రీనాథుడు కుమారసంభవమును జూచి యుండునేమో చెప్పలేను. కాని పరిశీలించి నచో శ్రీనాథునిధారకును నన్నెచోడుని పలుకునకును కొంతభేద మున్నది. అదెన్ని యోసారులు నేను స్వయముగా ననుభవించిన స్థితి. నన్నయసంభావణలలో "తెనుగుతన" మున్నది. ఒక్కొక్కచోట పరిస్ఫుటముగ హృదయమునుగూడ దాచుచున్నది. కాని ధార సంస్కృతపదజటిల మగుటచే చాలచోటుల పాఠకుడు గ్రహింపలేనంత సన్నగిల్లినది. ఇత నికి సంభావణల గూర్పుటయందు తిక్కన కున్నంత నిపుణత లేదు. తెనుగుజాతి కొకస్వ రూపమిచ్చిన మహనీయుడని మ్రొక్కుదుము గాని కవిత్వవేత్తలలో మొనగాడని బరాబరులు సేయు పరమభక్తులము గాము. నన్నయ యరణ్యపర్వమును బూరింపకుండుటకై యె న్నియోగాథలు మొలిచినవి. అందేదినిజమో, యేది యసత్యమో నిర్ణయింపువా రెవరు? ఎట్లయినదో భారతమేమో నిలచినది. అది యు మనభాగ్యమే.

### భీమన :

నన్నయను దశపుటలో భీమనను పలుకక పోరాదు. ఇతడు "శాపానుగ్రహదక్షు"డట. ఆబిరుదముచే మనకు లాభనష్టములు రెండును లేవు. ముందుగానే చచ్చి క్రిమినల్ లాను దప్పించుకొన్నాడని సంతోషపడవలసినదే. భీమన కృతులు వ్రాసియుండెనట - రాఘవ పాండవీయమును నూరన చేర్కొన్నాడు. నృసింహపురాణ మనియు వేరొకగ్రంథము. అతని చాటువులని చెప్పబడుపద్యములు కొన్ని గలవు. అవి సంస్కృతనిబడములు, వానిచే మనకు ప్రయోజనము లేదు. కాగా భీమన్న మనకు లక్షణకారుడుగా మాత్రము మిగిలినాడు. తెనుగువారమగు మనపాలిటి కాతని చావుపుట్టుకలు రెండును నొకటియే యైనవి.

### పాల్కురికి సోమనాథుడు :

నన్నయకాలమునకు కొంత వెనుకగా తెను గును వెలయించిన కవినాథుడు వేరొక డున్నాడు. పాల్కురికి సోమనాథుడు. వీర శైవు డగుటచే మతాభిమానముచే శివభక్తుల చరితముల వర్ణింపదొరకొనినాడు. కొంత మంది యీతనికి కథావస్తువు సముచితమైనది దొరకలేదన్నారు. కాని నాకేమో దాని యందు తృప్తిలేదు. మానవహృదయములు పరి ష్కృతములే యైనచో కథావస్తువుపై తప్పు వేయబనిలేదు. పరిమాణమును ప్రదర్శించుటలో వివిధభేదము లుండవచ్చును. కాని లలితహృద యముపై పనిసేయునధికార మొకటే. మహా త్ముడగు కార్లైల్ పండితు డేమనుచున్నాడో చూడుడు:

The poet, we imagine, can never have far, to seek for a subject The elements of his art are in him, and around him, on every hand. For him the ideal world, is not remote, from the actual, but, under it, and within it. Nay, he is a Poet, precisely, because, he can discern it, there, where ever, there is a sky above him - and, a world around him, the Poet is in his place

(Essay on Burns - page, 14).

పైని జెప్పిన నియమములు కవికేగాదు. స హృదయుడగు పాఠకునికిని నని నావిన్నపము.

నిజముగా "ఆంధ్రజాతీయతను"పోషించిన దెవరు? అనుచర్చయే ప్రధానమైనచో నన్నయకన్నను, సోమనాథుడు కడిచేయి యనవచ్చును. అందుకు మీరు కోపించిన లాభ ములేదు. సత్యమున్నచోట తల నొగ్గవలసి నది మనవిధి. ఆమహనీయుని కలమున సంపూ ర్ణముగ సరసముగ ముస్తాబై "తెనుగుతల్లి" నాట్యమాడినది. ఆతనియుద్దేశ్యముననే జాతీ యతయున్నది. సంస్కృతభూయిష్ఠరచన సర్వసామాన్యము గాని జానుతెనుగులకు దిగి నాడట - ఎంత చక్కని యభిప్రాయము! ఆతడు రచించిన భక్తులకథ లెన్నడో గడచి పోయినవైనను చదువునపుడు నేడు మన కన్నులయెదుట జరిగిన ట్లుండును. నన్నె చోడునికివలె నీతనికిని కన్నడవైదుష్యము గొప్పది. కర్ణాటసీమలయందే యీతనికి గౌరవ మెక్కువ. మనవాఙ్మయమునకన్న కన్నడమునకే యెక్కువసేవ జేసినా డీయా రాధ్యుడు. "జానుతెనుగున" వ్రాసిన దొక కావ్యమైనను ఆణిముత్తెములపంట; తెనుగు వారి వెన్నెగ. ప్రతిచరణమునను తెనుగుపదము లేనిది తృప్తిలేదు. పదపదమునను భావముండని తావు లేదు. ధారాశైలి నితని లలితశయ్యా మేనుమురపించునది. అల్పశబ్దమున "ననల్పార్థర చన గల్పించుట" యితని సాధనయట. భావము లును భావవలెనే లలితములై చల్లగా జేలి పోవుచుండును. అనవసరమగు అహంకార ముతో తోసివేసిన చెప్పలేనుగాని నిజముగా



అమరావతీస్తూపములోని శిల్పము

సోమనాథుడు ప్రాచీనులలో లెక్కపెట్టదగినవాడు. అనుత్తమమగు నిట్టి గ్రంథమును గడ్డకు దెచ్చి పరిశోధించి తెనుగువారి కందించిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ధన్యులు.

సోమనాథుని తరువాత నీయుగమున నంతగా మఱచిపోక నెన్నదగినవారు లేరు. మల్లన శాస్త్రమును బూరించినాడు. తక్కిన వారు నీతిని నిండించినారట. ప్రతాపరుద్రుని నీతి రాజనీతి; బద్దెననీతి ప్రజలకు రాష్ట్రమునకు సంబంధించిన సాంఘికనీతి. వా రిరువురును కవు లనుటకన్న ప్రపంచమెరిగిన విజ్ఞాను లనుట మేలుగదా!

## తిక్కన సోమయాజి :

ఇంతటిలో నన్నయయుగమున తెనుగువాణి మో మరవాల్చినది. నెల్లూరి నెరజాణతనమునకు వలచివచ్చినది గాబోలు. మనుమసిద్ధిరాజునకు మామయైనాడు మాసోమయాజి. లౌకికమును వైదికమును చక్కగా బరిశోధించి "పులుగడిగిన ముత్తెము"వలె మెదడును ప్రకాశవంతముగ జేసికొన్నాడు. బుద్ధిని కేవలము "పెరంబూరు కార్ఖానావలె" గ్రంథములతో నిండించుటయే విజ్ఞానమునకు ఫలము గాదని యెరిగిన మహనీయుడు. మనసును శాంతి చంద్రికలకు నివాసము గావించిన కర్మయోగి. చూచినవెంటనే వస్తువుల అంతరంగ బహిరంగ వృత్తులను గనిపెట్టగలిగిన కవిబ్రహ్మ తిక్కనమహాకవి. ప్రపంచములోని కొరతను గమనించినాడు, తన్నూరార్చుకొన్నాడు. మిగిలిన భారతమును బూరించుటకై చేయి గలిపినాడు. దేవాంశసంభూతుడగు కవిబ్రహ్మ కసాధ్యమైన దేమున్నది? సంస్కృత భారతమును సమగ్రముగా బరిశోధించినాడు. ఔచిత్యము వీడినచోటుల పెదవి విరిచినాడు. లలితత తగ్గినచోట నవ్వుకొన్నాడు. సర్వాంగ సౌందర్యముగ దానికి తెనుగుభాషలో స్వరూప మివ్వదలచినాడు. నిత్య వ్యవహారములోనున్న పలుకుదనమును జోడించినాడు. "రాజనీతి" యనుమూసలో గరగిపోసినాడు. చదివిన శాస్త్రములను, నేర్చినభాషను గుప్పించవలెనను పేరాసగలవాడు గాడు. సౌందర్య మున్నదా యనియే యాతనిపరీక్ష. అనౌచిత్యములగు పట్టుల వదలి అస్థానపతితములగు పెంపకముల దగ్గించి రసహీనములగు స్థలములలో హృదయరసమును జిలికి సొట్టపోయిన భావముల నొక్కలు నొక్కి కవితాపిపాసువుల కమృతభాండము తయారు చేసినాడు. తిక్కన కరుణచే తెనుగుజాతికి "బ్రదుకుపంట" దొరకినది. అతనిసృష్టి బ్రహ్మను జూచి కేకిసలువైచినది. ఆ మహామహుని జన్మభూమి పవిత్రములలో పవిత్రము. అతని నాదరించిన మహనీయుడగు మనుమసిద్ధిజన్మ మహోన్నతములలో మహోన్నతమైనది. తిక్కనభారతమున మనము జూడరానిది లేదు శబ్దసాధుత్వము గొప్పది. పలుకులపొందిక మహనీయమైనది ధారానిరర్గళతయా వానకారులో విరిసికొనివారు నదీజలములకన్నను ద్రుతతమముగ బ్రవహించును. సంభాషణావైచిత్రి మేధావులకు గుణపాఠము నేర్పినది ఔచిత్యము క్షేమేంద్రుని చెవులు నులిమి చెప్పునది. అతని రసపోషణ తపస్వుల కొజ్జబంతి యైనది. అతని ధ్వనిపుష్టి ఆనందవర్ధనుని హెచ్చరించునది ఆవేశమా! అమితమైనది. అలంకారనిర్వహణమా! ఆలంకారికులకు గళబద్ధమైనది. వ్యాసునిలోనున్న కత్తిపోటు-రక్తప్రవాహము, వాల్మీకి మృదుమధురవాణిలో దాగియున్న సురభిళోద్యానములు మనోహరశరచ్చంద్రికలు, లలితలవలీలతావిలాస నాట్యభంగిమలు, మలయమందసమీరవిచాలనవాచాలతలు, అప్సరఃకామినీ కర్ణపూరములలోని ఘుమఘుమలు - సర్వము భారతమున నిండించినాడు శాంతిలో పరాకాష్ఠ నందినాడు. భవభూతివలె నిరంతరము ధగధగమండిపోవు ఆవేశి గాడు. కాళిదాసువలె ఖడ్గముల కిణకిణలలో కౌగిలింతలు జూపు శృంగారసౌందర్యసేవకుడు గాడు. సంపూర్ణముగ మనసును అదుపాజ్ఞలలో నుంచుకొన్న వశి అధ్యాత్మికశక్తితో పరిపూర్ణతనందిన యాత్మశక్తిలో లౌకికముద్రవేసిన మహనీయుడు ప్రియురాలిహృదయము, తల్లిప్రేమ, స్వామిభక్తుడగు సేవకునిచిత్తవృత్తి, కార్యజ్ఞుని జీవితము, మొరకుపట్టుదల-అది యిది యననేల, సమస్తప్రపంచము నరచేత నాడించిన మహనీయుడు తిక్కనమహర్షి. ఆ ప్రసన్నలలిత గంభీరమగుశైలికి ప్రపంచము తలవంచినది. మధురములను నాతని వర్ణనాసన్నివేశములు కొండలను గరగించినవి. భారతవీరులను తెలుగువీరులు గావించినాడు. ఆర్యావర్తమున కంతటికి కాదు, భారతమున కంతటికి సంబంధించిన రాజపుత్రులను తెలుగువారిగా, మన గోదావరీ-తుంగభద్రా ప్రశాంతామలతర భూములలో జీవితమును గడపినవారుగా జిత్రించినాడు. వారిసంభాషణలలో, వారి ప్రవర్తనలలో, వారిభావములలో వారివస్త్రధారణాదులలో తెలుగుతనమును బెంచినాడు. కట్టుకథలకు కళాతత్త్వ మిచ్చినాడు. తెనుగుజాతి కతడు పెట్టినది భిక్ష. తెనుగుగడ్డ, తెనుగుపురుగున్నచోట - వాటిగర్భకుహరములనుండి తిక్కనార్యుని నామపారాయణము వినవచ్చుచునేయుండగలదు. తిక్కన మహాశయుడే లేకున్నచో మనవాఙ్మయములో ఉండునదియే లేకుండునది. నేడు "తెనుగుభాషలో" లేకుండునదియే లేదు అతడు కీచకునిపాత్రను జిత్రించుటలో జూపించిననేర్పు, ద్రౌపదీ పాత్రరచనమున గావించినకూర్పు, కృష్ణుని పాత్రమున నిర్మించినతీర్పు, దుర్యోధనున కిచ్చిన మార్పు, మాతయగు కుంతికి గావించిన చేర్పు, కర్ణునిపాత్రమున పొంగిపొర్లెడు స్వామిభక్తికి ధీరోదాత్తత కొసగినతార్పు తలచి తలచి ధ్యానించదగినవి. తిక్కనను ముందు నిలుపుకొని మన మేవాఙ్మయముతోనైనను పోటీచేయవచ్చును. సంస్కృత సాహిత్యమును గాలించి వెదకినను తిక్కనను వెనుక వేయుమనీషి గిలుగలేదని చెప్పుధైర్యము నాకున్నది. షేక్స్పియర్ సృష్టించిన నాయికలు మన ద్రౌపదిసుందర బలాదూర్. మిల్టన్ మహాకవి 'సైతాను' పాత్రమును సృష్టించిన యసాధారణమగు ప్రజ్ఞకు తల నూపుదుము. కాని అంతకన్న నెన్నోరెట్లధికమగునేర్పు తిక్కనార్యుని కీచకపాత్రమున నున్నది. రసికులలో చక్రవర్తి. పండితులకు ప్రథమాచార్యుడు. వైజ్ఞానికులకు బ్రహ్మర్షి. కర్మయోగులలో జనకుడు. రాజనీతిజ్ఞులలో చాణక్యునకు కుడిచేయి కవి బహ్మ బ్రహ్మాండమగు భారతమును బూరించునపుడు ఒకచోటనైన అలత, శ్రమ, వేసరిక యున్నదా? దోషైక దృష్టితో రాత్రి బగలు మనజీవితమెల్ల గప్పించి చూచిన నొక్కలోపము నెత్తిచూపగలమా? ఓమహాకవీ! నీవు తెనుగుజాతి కారాధ్యుడవు. మాపున్నెముల నోముపంటవు. మాజీవితముల కమృతమయమూర్తివి మాశరీరముల చర్మమును జీల్చి నీకు పాదుకలుగా సమర్పింతుము. కవితాప్రపంచరవీ! నీకు నమస్కారము నీనామము మాజీవితముల యం దెప్పుడును మరువకుందుముగాత.

## ఎర్రాప్రెగడ :

తిక్కనతరువాత యెర్రాప్రెగ్గడను దలపకపోరాదు గదా! ఇతని సాహితి త్రివేణి

నన్నయలోని వైదికావేశము, తిక్కనలోని కళామహత్తు, విద్యాదయితుని ఆర్యమత సంస్కారము తిక్కనలోని ఆంధ్రజాతీయతయు నైక్యమై శంభుదాసునకు మార్గమునూపినవి. ఇతడు ప్రబంధ పరమేశ్వరుడట. శైలి లలితమైనది. ఔచితిని ప్రధానముగ బాటించినట్లున్నది. వస్తుకవిత మెండు. దేశికవితలో మార్గమును సాగించినాడు. సమాసముల వాడుటలో నన్నయలోని నిరంకుశతగాని, తిక్కనలోనిమృదులత గాని యంతగాబట్టక ఇతనికవిత మూడవ మార్గమున కెక్కి ముదిరినది. నృసింహపురాణమున చాదస్తమునకు జేరిన ఘట్టములు లేకపోలేదు చల్లగా శరద్రాత్రులలో వెన్నెలలో జదివి యానందింపదగిన కవనము. కవిత్రయమునఁ జేరదగినవాడేనని కొందరన్నారు. లేదు ఇతనిస్థానము చాల తక్కువని కొందరీసడించినారు నాకు దోచునదేమి? ఆయా సముపషని రచయిత. చల్లగా సాగిపోవువాడు. గొప్ప తీక్ష్ణదృష్టిగాని, గభీరాశయములుగాని నాకు దోచలేదు మనోహరమగు శయ్య. తెలుగుపదములు నడపినచోట సుఖముగనే యుండుననుటకు సందేహములేదు కాని పదచాపల్యము మొదలగు గుణములును లేకపోలేదు. నాదృష్టి కితడు సామాన్యకవులలో నెన్నదగిన వాడేగాని గొప్పగా చెప్పి యానందించవలసినవాడు గాడు. అట్టివాడు కవితాప్రపంచరవి యొకడే! అయిననేమి, మరల నట్టి సకలగుణసంపూర్ణుడు పుట్టనేలేదు ప్రెగ్గడయు తెలుగువారి కారాధ్యుడే.

## నాచన సోమనాథుడు :

తరువాతివాడు నాచన సోముడు మహామేధావి. తాను తిక్కనశిష్యుడనని చెప్పకొన్నాడు తిక్కనంతటివా డగుటకు యత్నించినాడు. గమ్యము గొప్పదే. కాని కృతార్థత యెంతవరకు? వీరేశలింగముగారితని నుత్తమోత్తము డన్నారు. "అలికమున నక్షిని డాచిన సర్వజ్ఞు'డని చిన్నయసూరి కీర్తించినాడు. సీతారామాచార్యులవారు సోమనాథుని మిగుల శ్లాఘించినారు. మొన్నమొన్నటివర కితనివిషయమున వివాదములే జరిగినవి. శర్మగారితని "నవీనగుణసనాథ" బిరుదము భావమే గాని భావములకు జెందరాని దన్నారు. మరికొందరితనిని శ్రీనాథునికన్నను క్రింది కీడ్చినారు. నాకు జూడ నిది యర్థములేనిమాట. ఎఱ్ఱన సోమనలకు భేదమును బాటించుటలో దృష్టిభేదమున్నది. రుచిభేద మున్నది. కాని శ్రీనాథుని కన్నను నాచనసోముడు క్రిందనుట యవిచారమూలకమే. శ్రీనాథునిశైలికి సోముడే యొరవడి. భావములలోను కావలసినంత సామ్యమున్నది అట్టియెడ శ్రీనాథునికిమాత్రము సంతోషముతో కనకాభిషేక మాచరించి సోమునిపై పినతల్లిమమత యేలనో తెలియకున్నది. ఇక యెఱ్ఱన సోమనలకా? నా దృష్టి కిరువు రొకటే. ఎఱ్ఱనలోని యౌచితీ నిర్వహణము సోమునికి లేదు. సోముని కున్న యావేశ మెఱ్ఱనకు తక్కువ. అతనిలలితత యితనికి లేదు. సోమునిలోని నిర్లక్ష్యపు నడక ప్రెగ్గడయెడ గానము. ఇక భావముల విషయముననా? అక్కడనే రుచిభేదము. అది హృదయమును నమ్మినది. కొందరికి కేవలము స్వాప్నికప్రపంచముపై మక్కువ. మరికొందరికి బాహ్యజగత్తును జూచిననే యానందము. కొందరికి లోనికి జొచ్చి యాంతరికతత్త్వమును విమర్శించిననే సంతోషము. వానిలో తరతమభావమును విచారించి తేల్చుట కత్తిపై సామువంటిది. మీరే చెప్పుడు ముగ్ధ మేలా! మధ్య మేలా? ప్రౌఢ మేలా? పనస మేలా? మామిడి మేలా? కాకర మేలా? చుక్కడి మేలా? ఇర్వురును నొకటే త్రోవను గైకొనియున్న విచారము న్యాయమగునుగాని రెండువిభిన్నములగు మార్గముల బట్టి యెంతవరకు వాదించుటని? మాకు దానియందును నానంద మున్నది. దీనియందును రసానుభూతి యున్నది కాన "నవీనగుణసనాథ బిరుద" మొకభావమాత్రమే చెందినదని వచించుధైర్యము మాకు లేదు. అతని భావములయందును నూతనత లేకపోలేదు. అవి బాగ లేకనుపోలేదు ఇక శ్రీనాథునివిషయమా! అతని "పదప్రసిద్ధధారాశుద్ధి" నాచనసోముని భిక్షయే. కాన "కవిసార్వభౌముడు" సోముని కీర్తించి బ్రదుకుట కృతజ్ఞత. నాచనసోమునికవితలో తెనుగువారి భండారము లున్నవి. తెనుగుపలుకుదన మున్నది. నిజముగా సోముడు తిక్కనశిష్యుడే. అయితే ఆంతరికమగు భావసంపదను గుర్తించియుండెనా తిక్కనయంతటివా డయ్యెడివాడే కాని ప్రయత్నమంతయు సఫలముగనే యుండుట యరుదుగదా! తిక్కనప్రారంభించిన జాతీయతాధర్మము సోమునికాలమునకు భాషకు దిగి భావముల నెరవుగజూచిన దనవచ్చును.

## పోతన :

ఇక మనకు మిగిలినవాడు పోతనగదా! ఆత డలౌకికుడగు ఋషి. ఆకాశమున విశృంఖలగతి నేగు పక్షులవంటి వాతని భావనలు. అతని తలపులను భావించుటకుగాని, మననచేయుటకుగాని మా బుద్ధుల కందవు. అది యువకులగు మాలోపమే. పోతనామాత్యుని భావముల నూహించుపుణ్యదినము లికముందు వచ్చునేమో చెప్పలేను. నేడుమాత్ర మాతనికి చేతులెత్తి వందన మాచరింతును. అతనియమకములు, ప్రాసములు శ్రుతియోగ్యములై యుండును. సంస్కృతసమాసముల నడపుటలోనీతని కొక సున్నిత మగుమార్గము గలదు. శ్రీనాథుని నాచన సోమనలవంటి ఘట్టనలును, నన్నయవంటి తీగెసాగుడు, తిక్కనకువలె విపులభావ సాహచర్యమును లేక అటునిటు తూగాడుచుండును. వాడిన తెలుగులకన్న జొప్పించిన సాంస్కృతికము లెక్కువ. గ్రంథ మంతయు లలితముగనే యుండవలె ననుమూపు పోతనకు లేదు. కొన్ని చోటుల కావలెనని పనివడి తెచ్చిన పోకడలును గలవు. మధురమగు ధారతో యతిప్రాసలకు త్రెంచిత్రెంచి వాడుట యాతనికి ప్రియమగు పద్ధతి.

## శ్రీనాథుడు :

ఇక కవిసార్వభౌము డగు శ్రీనాథుని దర్శింతము గాక. నాదృష్టి కీతడు పరిణతి నందిన సాధకుడు గాని ఋషి గాడు. ఈ యభిప్రాయ మీతడు క్రమక్రమముగా వ్రాసిన గ్రంథములనున్న భావపరిణతినిబట్టి యూహింపవచ్చును శాస్త్రముల జదివిన పండితుడు. సభలలో హుంకృతులు సలిపి ఢంకా బజాయించినవీరుడు. అతనికాలములో నున్న హడావుడియు, అతని జీవితమును భావమననకవకాశ మొసగియుండవనుట సత్యము. నిరంతరము వాదోపవాదములే. దొమ్మరగడమీది యాటలే. ఇంకను శ్రీనాథుడు కొంత సంస్కారి యగుటవల్లనే తన "సొంత యాస్తిని" అంతయో యింతయో నిలుపుకొనగలిగినాడని మనము సంతోషింపవలసి యున్నది. ఇత డయఃపిండమగు కాశీఖండమును దెనిగించినాడు. బిరుసుమీసముల కోడెవయసులో నైషధమును తెనిగించినాడట. అయిననేమి యొకటే సమాసము చూడుడు:

గీ. ప్రస్తుతింపంగదగు సముద్భటకఠోర
చటుల గుణటంక్రియాఘన స్తనితఘోష
చాపనీరద భీషణశరాసారశమిత
బలవదమిత తేజోదవానలుఁడు నలుఁడు

ఇది యాతనిధార తెనుఁగుతనమేదీ? పుంజుకొన్న సంస్కృతసమాసములు నిరంకుశముగ నడచు అంతులేని భాషాస్వాతంత్ర్యము. ధారలో నొకవిధమగు వేంగిరము గోచరించుచుండలేదా? ఇంటిభాషయగు తెనుఁగుమీఁదికన్న సంస్కృతముపై స్వామ్యమును ముద్రించినారు మనకవులు ఎక్కడ దాకినను సంస్కృతిపువాసన, శాస్త్రీయఘోష, భావములలో సుడిగుండులు "నానారసాశ్రయము" శ్రీనాథుని ధారాశుద్ధి నామనసునకేమో శ్రీనాథునియందు ధారాశుద్ధియు గోచరించుటలేదు ధారయందు శుద్ధియనగా పదములను యతిప్రాసములతో చిక్కుబడక నడపుటయే గాదు సరిగదా సమగ్రగుణములతో సర్వాలంకారశోభితముగా వెదజల్లుట. యతిప్రాసల విచార మానుషంగికమే. వాటికొరకే కవిత యావిర్భవింప లేదుగదా నాయభిప్రాయమున ధారాశుద్ధి యిట్టిది

సీ. "లలితంబులగు మట్టియలచప్పుడింపార
నంచకైవడి నడ నల్ల వచ్చి
యొడమేని సెత్తావి సుడియంగఁ బయ్యెద
సగము దూలించి పై మగుడఁ దిగిచి
సోలెడు సెలదీగెలీలఁ గ్రాలుచు వింత
చెలువంబు దలకొనఁ జేరి నిలిచి
తెలిగన్నుఁగవకు నెచ్చెలియైన లేఁతన
వ్వొలయంగ సరసంపుఁబలుకుఁ బలికి
(విరాటప)

ఈ కవిబ్రహ్మ యపూర్వ పద్యమునందే విషయమున నైనను దప్పుబట్టగల ధీరుఁడున్నాఁడేమో చెప్పుఁడు. "సోలెడు సెలదీగలీల గ్రాలు"టలో నున్నమధురత యాసన్నివేశమున వేయి యుపమానములు బూరించినను సాధ్యము గాదుగదా! ఎంత భాషాస్వాతంత్ర్య మున్ననేమి? ఒక్కఁగడుసుదనము పాండిత్యప్రకర్ష యున్నదని యెత్తి చూపగలమా? తిక్కనపద్యమున యతిప్రాసలెంత సరళముగా బరగినవో చూడుఁడు పాదరసమునకన్న వేగముగా నుండలేదా? "తెలికన్నుఁగవకు నెచ్చెలియైన లేఁతన" వ్వట. భళిరా! ఎంత సుకుమారముగ నవ్వుచున్నది! ఎదుట నిలిచి, తెలుఁగుకన్నె మాటలాడించుచున్నట్లున్నది, చూడుఁడు. ఇది యొకటియే గాదు. ఏసన్నివేశమున నెత్తినను తిక్కన మహాశయుని పలుకుదన మింతే శాంతిపర్వము నందలి కొన్ని పద్యముల జూడుఁడు

చ. అలజడివొందిగాఁ దగనియట్టిది
ద్రోవది మేరుకల్పులన్
కొడుకుల నల్వురన్ జనుమగొన్న-
నలంకురి జూడనేర్తునే
పుడమి గిరీంద్రపంచకము బొల్చినఁ
బాశరినట్టులున్న య
ప్పడకక యెట్టులోర్చు గృహభారము
నెమ్మది నిర్వహింపగన్
(శాంతి ౧-౨౦౭)

చ. వినుము నరేంద్ర విప్రుఁడలివెన్-
జమదగ్ని సుతుండు శాప మి
చ్చె నమరభర్త వంచనము సేసె
సుతుండని పల్కె కుంతి మా
న్చె నలుక భీష్ముఁడర్ధరథుఁ జేసె
యశంచె గలంచె మద్రరా
జనుచితమాడి శౌరి విధియయ్యె
నరుం డనిజంపె గర్ణునిన్
(శాంతి ౧-౩౫)

ఈ రెండుపద్యములును శాంతిపర్వములోనివి. మొదటిది రసోదాహరణము. రెండవది శైలికి జూపితిని. "అలజడివొందగాఁ దగనియట్టి" దన్నమాటలో నాపెకాలీనత యున్నది మృదుహృదయ మున్నది. పవిత్రత యున్నది. ఉదాత్తత తలనూపుచున్నది పైన ధర్మరాజు "లేతమనసు" రసప్రవాహముపై జలపక్షివలె కేలియాడుచున్నది. "మేరుకల్పులన్" అను నుపమానము చక్కనిదై చచ్చిన సుతుల గన్నులయెదుట నిల్పజాలియున్నది "ఎట్టులోర్చు గృహభారము నెమ్మది నిర్వహింపగన్"—ద్రౌపదీ సౌశీల్యము నిగర్వము మొదలగు గుణము లున్నవి. మొదటిపాదము నందలి వాక్యమునందును, నాలుగవపాదమునందును గల వ్యవహారశుద్ధి యెంతచక్కనిదో లోకమును జదివినవారెరుగగలరు. ఇక రెండవపద్యము శతపత్రమువంటిది. ఎన్ని వాక్యములతో గూడినదో చూడుఁడు. ఆగతిభేదమును మలపుటలో జూపినపనితన మనన్యసాధారణమైనది. వానకాలమున, వేయి మెలికెలు దిరిగి లలితగతి దిగజారు సెలయేరువలె పైనుండి క్రిందివరకు నొకవేగతితో మెలికలు తిరిగితిరిగి ప్రవహించినది తిక్కనవాణి. ఆపద్యబంధమునను న్న వ్యవహారశుద్ధి వేయిజన్మములుఁ మరువరానిదిగదా! ఈ రీతి నిన్నిక్రియలను సమగ్రముగా క్రమముదప్పక నప్పగొట్టిన కవి నింకొకని జూపగలరా?

ఇక శ్రీనాథునిధారాశుద్ధి యెట్టిదో యించుక బరిశీలింతము. "కవిసార్వభౌమునివి" ధారాశుద్ధి యనుటకన్న "నెత్తుగడల మేలిమి" యనుట నాకు దోచిన మాట పద్యము మొదలిడినవెంటనే శరవేగమున బోయి గట్టుదాకుట యాతనియలవాటు. భావముండనీ యొండనీ, సముచితములగు పదము లుండనీ మాని గ్రిప్పనీ ప్రారంభించిన వృత్తమునేమో ముగింపను ఆశరవేగము విన్నపుడుమాత్రము హాయి యనిపించును! తల దిప్పి చూచితిమా కవితాలక్షణములు కొరవడియేయుండును "ఔచిత్యమును బోషించియు భావం బుపలక్షించియు" వ్రాసిననైషధమున గూడ నిటువంటిదోసములు లేకపోలేదు. చూడుఁడు

"గమికర్మీకృత నైకనీవృదుడనై గంటిన్ విదర్భంబునన్"

* * *

"సమపేన స్తని నస్తినాస్తి విచికిత్సాహేతు శాతోదరిన్."

పదములధారాళత బాగుగనే యున్నది. అవియును ప్రసిద్ధములే కాని యాస్ఫాటముండలేదా? ఏమో కొంత కీతని ధారాశుద్ధి చాల గొప్ప దన్నారు. నాదృష్టికిది కేవల మెత్తుగడల మేలిమిమాత్రమేనని వినయమున విన్నవించుచున్నాను. పెద్దనయ్యు నీతని శిష్యుడే అతనిధారయు శ్రీనాథుని కటాక్షమే కాని యది రసము మొదలగు తక్కిన గుణములచే నింతకన్న గొప్పతనమును ధార సవరించుకొన్నదని నామతము. నన్నయలోనిధార కొంచె మెదిగినదిగా శ్రీనాథునియందు గానుపించును అది యాతని తెనుగుసుడికారముచే గుదురుకొన్న దందును. నిజముగా వాడినచోట శ్రీనాథుని తెలుఁగులు మధురములే. విచ్చినపూవువలె వెంటనే యర్థమును వెదజల్లుట వాటివాడుక. నాచనసోముని తెనుఁగులకు గాంభీర్య మెక్కువ. శ్రీనాథునిధారకే స్పష్టత జీవము. ప్రాయశః దీనిని జూచియే కొందరు నాచన సోముని కన్న శ్రీనాథుడు కుడిచేయియని మోసపోయి

రేమో. శ్రీనాథుని "ధారాశుద్ధి" యర్థమగుటకై యొకపద్య ముదాహరింతును. అదియును నాతడు ప్రౌఢతమమని పొగడిన నైషధ గర్భాంతరితమే.

సీ. చిగురుతామరపాకు చివ్వనం ? నుదోయి
మొనల క్రొవ్వేడిని మునుఁగఁబాఱె
తరుణరంభాగర్భ దళతాళవృంతంబు
పై గాలిసోఁకిన పలుక బాఱె
లలితముక్తాహార నలికాకలాపంబు
ఘ్రాణానిలంబున గందఁబాఱె
కర్ణపూరకలాప కల్హారదళరాజి
యశ్రుధారల నురియంగఁబాఱె.

గీ. దర్పు మొలయ నాళీఢపాదమున నిల్చి
మండలీకృతచాపుఁడై మన్మథుండు
గనలి సవ్యాపసవ్య మార్గములఁ దొడిగి
పువ్వుదూపులు పుంఖానుపుంఖ మేయ

(నై—119 ప.)

ఇది యాతనిధారాశుద్ధి మునుగబారు, కంద బారు, పలుకబారు మొదలగు క్రియలు చక్కగనేయున్నవి క్రొత్తక్రొత్త క్రియారూపములు వాడుట, వానిచే మిగిలిన పదములకు శోభ గలిగించుట శ్రీనాథుడు నేర్చిన పనితనము. "చౌకళించు-ఒడ్డారించు" మొదలగు నపూర్వ క్రియారూపములు శ్రీనాథుని నుండియే క్రిందివారికి సరఫరా యైనవి. పుట్టినది తెనుగు నాట. పెరిగినది తెనుగుగడ్డ. తిరిగినది తెనుగు సీమ యగుటచే వివిధభాగములలోని నుడికారములు సేకరించినాడు. తలచినచోట చిలుక గుంపులవలె వెదజల్లినాడు. ఇంతకును మహానుభావుడే కవిసార్వభౌముడు.

నా కతని గ్రంథములలో నెల్ల నచ్చునది హరవిలాసము. వయసు పడమటిదెసకు వ్రాలినతరువాత ప్రారంభించిన దగుటచే కోడెప్రాయములోనియుడుకుపోతలు హుంకరింతలు అరపులు ఆర్భాటము లేక చల్లగా చదువుదమనిపించుచున్నది. ఇక తక్కిన గ్రంథము లన్నియు సంస్కృతములోని పండితరాయలను, వేదాంత దేశికులను దలపునకు దెచ్చునేగాని వేరు గాదు. మన మీ సందర్భమున నెత్తిచెప్ప వలసిన దీతని పలనాటి చరితము. శ్రీనాథుడాకాలములో పలనాటిచరితమును వ్రాసినా డన్న యాశ్చర్య పడదగినదే. అయిన నేమి? ఈగతిని నడుపుట కాతని కలవాటు లేదు. పద్యములలోనున్న అయింత మేలిమియు పలనాటిచరితలో లేదు. వీరుల కందరికిని అలౌకికత యనునొక ధర్మ మతికించబడినది. అయిననేమి వర్ణింపబడినది తెలుగురాజులు, వ్రాసినది తెనుగునాట జరిగిన కథ. అందువలన తెనుగుతనము ప్రతిఫలింపకతప్పినది గాదు శ్రీనాథుఁ డెన్ని గ్రంథముల వ్రాసినను వ్రాసిన కావ్యములలో హరవిలాసమును, కాశీఖండమున కొంతభాగమును, పలనాటి చరితయును శ్రీనాథుని చిరంజీవిని జేసినవై చివని. "శ్రీనాథుడు" కవిసార్వభౌము డెంత మాత్రమో గాని పలనాటిచరితమునకు మా మాత్రము సువర్ణాభిషేకము జరుగుట మా భాగ్యమే

వేమన :

శ్రీనాథునితరువాత ముఖ్యముగా గీర్తింప దగినవాడు వేమనమహర్షి. పుట్టినది కాపు కులము. అనుభవించినది రాజభోగమే నివృత్తిమార్గము నాశ్రయించినాడు. అందులోమాత్రము సామాన్యమా? ఒడ్డుదాకినాడు. "మొదటబుట్టలేదు-తుదగనులేదని" కట్టినగుడ్డను మొలత్రాడుగూడ విసరివేసినాడు. వ్యుత్పత్తిని సాధించినవాడు గాడు. సంస్కారము మాత్రము కావలసినంతకన్న నెక్కువగా నున్నది. అదియే ముందై కవితను నడపిన దా కాపుకవిని.

ఇతడు వాడినపదములు, నెదజల్లిన లోకోక్తులు గ్రంథములు చదివి సంపాదించినవి గావు. పదములు దైనికజీవితములోనివి. లోకోక్తులు తెనుగునాట బుట్టి పెరిగినవి. ఆశ్రయించిన దాటవెలది. అందుకు దగిన, చిన్ననిపదకములవంటి పదము లేర్చి కూర్చుకొన్నాడు. ఇమ్ముఓగు మొప్పె పాజు బక్క మొదలగునవి. ద్రాక్షఫలముల బోలు తీయనిపదములు. వేముపాలు, చేదువిఱుగు, మాటదెలియు, కులమీడేర్చు, వెఱివాసు, పాట్లుబడు-మొదలగునవి నేటికిని పంటపొలములలో అమాయకులగు రైతులు వాడుచున్న - వాడబోవు పదములే. వేమన మహాకవియొక్క పలుకు పలుకునందును జాతీయత యున్నది. ఇతని యుదాహరణములు పల్లెపడుచుల సిగ్గుతెరల జీర్చి విడలిన రసబిందువులే. చూడుడు

౧. "వెఱ్ఱివాసు బారు వేగ బొర్లి .

౨. ఎలుకతోలు దెచ్చి యేడాది వుతికినా
నలుపు నలుపెగాని తెలుపు గాదు

౩. పాలు పంచదార పాపర పండ్లలో
జాల బోసి వండఁ జవికిరాదు

౪. మేక కుతుక బట్టి మెడచన్ను గుడువగా
నాక లేల మాను నాకఁగాక

౫. కోతినొకని దెచ్చి కొత్తపుట్టము గట్టి
కొండముచ్చులెల్ల గొలిచినట్లు"

ఒక్కొక్కసారి వేమనయొక్కపలుకు వేయి కత్తులకన్న వాడియైనది

ఆ "చెప్ప తినెడికుక్క చెఱకుతీపెరుగునా?
గ్రద్దవంటివాడు గజపతి గాడొకో
పసిడి గల్లువాని బానిసకొడుకులు"

మొదలగునవి. ఇతని హాస్యము రమణీయమైనది తిట్టినను మనసు చివుకుమనిపించని శక్తి యీతని హాస్యములో నున్నది

ఆ. "ఎద్దుకైనగాని యేడాది దెల్పిన
మాట దెలిసి నడచు మర్మమెరిగి
మొప్పె దెలియలేడు ముప్పదేండ్లకునైన

ఆ. కానివానిచేత కాసువీసం బిచ్చి
వెంట దిరుగువాడు వెర్రివాడు
పిల్లితిన్నకోడి పిలిచిన పలుకునా

ఆ. అలిమాటలు విని యన్నదమ్ముల బాసి
వేఱె పోవువాఁడు వెఱ్ఱివాడు
కుక్కతోకఁబట్టి గోదావరీదునా

ఆ. ముచ్చు గుడికిఁ బోయి ముడివిప్పునేగాని
పొసగ స్వామి జూచి మ్రొక్కఁ డతడు
కుక్కయిల్లు సొచ్చి కుండలు వెదుకదా

వేమన మహాకవియొక్క తెగువ సాహసము కోపము ప్రతియొకటియు తెలుగువారిదే. నఖశిఖపర్యంతము వేమనయొక్కడే తెనుగుపోఁడని వేయిగుండెలతో నుచ్చరింపవచ్చును. ఇతని దెబ్బ తిననివాడు లేడు. "తెలివిలేనివాడు దేవు డెట్లాయెరా" యని బ్రశ్నించినాడు మూడు లోకములపై నున్న మూలవిగ్రహమునకును వేమన్న తెనుగుతనపువాసన దాకినది.

"కొంకణంబు పోవ కుక్క సింగము గాదు,
కాసి కరుగఁ బంది గజము గాదు,
వేఱుజాతివాడు విప్రుండు గాడయా"

యని బ్రాహ్మణులను శ్లాఘించినాడు. వేరు చోట "బాపనకులజులు బానిసకొడుకు" లని తనివిదీర దిట్టినాడు. కాపుకులము సర్వశ్లాఘ్య మన్నాడు. ప్రక్కనచే మొగమున నీళ్లు దించినాడు. ఒక నియత

మను వ్యవహారము లేదు. దానిచే మాకు ను బాధలేదు. అతనిని మేము మతప్రవక్త యనియు, భావ్యకారుడనియు దండము లర్పించుట లేదు. మరి తియ్యనితేనెలో విసము గలిపి తెనుగుతనము నందించిన కవిశిఖామణి. వేదాంతు లేమందురో, వైజ్ఞానికు లేరీతి మూతి ముడుచుకొందురో గాని తెనుగువారమగు మాకుమాత్రము వేమనసూక్తి యింటివేలుపు. అతనిమూర్తి సర్వధా ధ్యానింపదగినది. వేమనపేరు జెప్పినంతటనే గ్రాంథికవాదులు మూతి ముడుచుకొందురేమో? అబ్బతద్దినము మీదికన్న అత్యంతపరమార్థముగదా! పోనీ మాకుమాత్రము మెప్పే భావములను జూచి సంతసించు నల్పతృప్తులము మేము. భావసముచితమైన "ధారాశుద్ధితో" తీగెలు సాగకున్ననూనె చెప్పినది చెవుల కింపుగా నున్న జాలును. మా మతమున వేమన పేరుమోసిన యాంధ్రమహాకవి

రాయలయుగము :

ఇక మనము తిన్నగా బరిశోధించి చూడవలసినది రాయలయుగము. కృష్ణరాయని కాలమాంధ్రభాషకు సువర్ణయుగమని చెప్పవచ్చును పేరుమోసిన యష్టదిగ్గజములు, సరసహృదయులగు నితరకవులు రమణీయముగ గానము జేసి జీవితమును జాలించుకొన్నారు. పెద్దనలోని ధారాళత పదములపొందు తెనుగువారమగు మనమెల్ల రాదరించదగినది. చతుర్థాశ్వాసములోని వేటవర్ణనమంతయు—రాయలసీమకాదు-పశ్చిమాంధ్రజనులలోని యాటవిక జీవితమే. అందలి ద్రాక్షాగుళుచ్ఛములు కొండకోనలు మొదలగున వన్నియు నేటికిని పెనుగొండలోనిలిచి రసికుల నాహ్వానించుచున్నవి.

పారిజాతాపహరణమును వ్రాసిన యరణపుకవి నమస్కారార్హుడు. వీరందరికన్న తెలుగువారి విలక్షణతను నిలువబెట్టిన "సాహితీసమరాంగణసార్వభౌముడు" నిరంతరము మన మనసులలో బారాడవలసినవాడు.

కృష్ణరాయని యనంతరము తిరుమలరాయనికాలమున నొకసారి "తెనుగుమెరపు" తటుకున మెఱసిచన్నది తరువాత రఘునాథ భూపాలుని కొలువుకూటమున నాంధ్రభారతి కొలువుదీర్చినది. ముద్దుపళని మధురరాగములు విరిసినవి. మొల్ల మునుపే గడచినది చేమకూర పాకము నసనసమన్నది

శతకయుగము :

అటుతరువాత శతకయుగ మారంభమైనది జాతీయతాదృష్టియే ప్రధానముగా జూచినచో చాల ప్రబంధములకన్నను శతకము లుత్కృష్టము లనవచ్చునేమో? తత్వములు బుట్టినవి తందనాలపదములు బుట్టినవి తత్వములు పామరులకు వేదాంతమును బోధించు దృష్టితో నారంభించిరి పల్లెపదములు సరస ఖండములు. తెనుగుతనము, ఆంధ్రజీవితము సంపూర్తిగా పల్లెపదములయందు ప్రతిబింబితమైనది. బొబ్బిలికథ బాలనాగమ్మకథ మొదలగుపదము లుత్కృష్టకావ్యము లనుటలో సందేహములేదు. కాని యీ నాటికిని ఆపదముల సేకరించుటకు ప్రయత్నము జరుగకుండుట విచారావహము. యక్షగానములు మొదలగునవి జాతీయతాచ్ఛాయలను వెదజల్లుచునే యున్నవి. వాటి నన్నిటిని సేకరించవలెను. పల్లెపదముల నన్నిటిని ముద్రించవలెను ప్రతి మండలములోను పల్లెలలో దిరిగి తెనుగువారి వాడుకలోనున్న జీవవంతములగు పదముల సేకరించి నిఘంటువుల దయారు జేయవలెను. చేయువారెవరు? చేయబూనిరిపో వారికి ప్రోత్సాహ మేదీ? కడుపు జరిగినగదా కళారాధన? నేటి మనయాంధ్రజాతి తెనుగువారమని చెప్పుటకు సిగ్గుపడుచున్నది. ఇంగ్లీషువలె తెనుగు రుచించదని యుత్తరమొసగిన విద్యార్థికుల నెందరినో నాయనుభవమున జూచియున్నాను. వారొకసారి తమ ప్రాచీనతవైపు చూపు మరలించి చూతురుగా! అదిగో అఖండ సామ్రాజ్యమేలిన రాజరాజ నరేంద్రుడు. అతని యాస్థానకవి నన్నయ. నెల్లూరివైపు దిలకింపుడు కవితాప్రపంచ రవి తిక్కన మహర్షి. నన్నయతో ప్రారంభమైన వైదికావేశము తిక్కననాటికి ఆంధ్రత్వమును స్వీకరించినది. మరల సోమనాథ శ్రీనాథుల యుగముల భావనలయందు మూర్ఛిల్లి వేమన మహాకవి కవితా సంజీవినిచే లేచి తెప్పరిల ముందుకు సాగినది. రాయల యుగమున వెక్కసమై విజయవిలాసమున నసనసయై యక్షగానములలో, పల్లెపదాలలో తలదాచుకొన్నది. నాతోడి యాంధ్రయువకులు, తెనుగు నుజ్జీవింప వాంఛించు కార్యశూరులు ప్రాచీనౌన్నత్యము నొక్కసారి మనముల నావేశింపజేసికొని వారి యైక్యతను హృదయముల గుర్తించి కార్యశూరులై ఫలపర్యంతము పట్టుదల వీడక ప్రయత్నింపవలె నని ప్రార్థించుచున్నాను.

సీ. రణరక్తబంధురారుణమైన ఖడ్గతి
క్కనకత్తి గడిగిన కదనభూమి
అమృతాఖ్యకు వికాసమైన యాసుకవి పో
తనలేఖిని ప్రశాంతి గనినచోటు
భాషాకుమారి కబ్రపు పెండ్లియైన
కృష్ణరాజ్యము వెలింగినతలమ్ము
నానావిదేశ నాకానీకవిపులాశ్ర
యంబైనరేవురూపటినతావు" —

—రాయప్రోలు సుబ్బారావు.



# నతి

అద్దేపల్లి నాగగోపాల రావు

శ్రీసంపన్మణిభూషణాభరణ ! లక్ష్మీనాథ ! పూజ్యాంధ్రధా
త్రీసామ్రాజ్యరమాధినాయక ! యశశ్శ్రీయోఽంగనాసంస్థితాం
కా ! సాంద్రోరుగభీర ! శిక్షితపరా ! కల్యాణభావాభిరా
మా ! సాష్టాంగనమస్కృతుల్ గొనుము, దేవా ! ఆంధ్రవిష్ణుప్రభూ !

నీనాఁ డాంధ్రకులప్రతిష్ఠ గడియించెన్ వన్నె; చెన్నొందె వి
జ్ఞానప్రౌఢిమ, దోఃప్రతాప మెసగెన్, శబ్దించె నీదిగ్జయ
ధ్వానంబుల్, ఫలియించె తెల్గుల శకస్వామ్యంబు నీపేర; వీ
రానీకాగ్రణి ! శాతవాహనమణీ ! అర్పింతు పుష్పాంజలిన్.

భాసురభారతార్థములభంగు లెఱుంగని తెల్గువారికిన్
వ్యాసమునిప్రణీతపరమార్థము తెల్గుముసేయు నీపవి
త్రాశయమున్ ఫలించెను ; కృతార్థుడవైతివి ; నీయశమ్ము ది
గ్దేశము నిండిపోయెను ; సుధీంద్ర ! జొహారులు రాజరాణ్మణీ !

హరిహరబుక్కరాయపరమార్థము : సాయణసృష్టియైన - యా
గురుతరరాజ్యభారమునకుం దగు దీవ, మహానుభావ ! నీ
తరము మహత్తరంబు! కవితాసుకళారతి పండె గండపెం
డెరపు బహూకృతిప్రకృతి : నిత్యనమస్సులు కృష్ణభూపతీ !

ఇతరాంధ్రక్షితిపాలకోత్తముల నెంతేఁ బ్రీతిఁ గొండాడి, త
త్ప్రతిభాదోర్బలశేముషీవిజయసౌభాగ్యమ్ము కీర్తించి ; సం
స్తుతిపాత్రంబగు వారిగాథల దిశాస్తోమంబు ప్రాకించి - సం
తత మాంధ్రాక్షరమాలికావితతి కానుకంబెట్టి కేల్మోడ్చెదన్.

---

# తెనుగు వృత్తము - దేశికవిత

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

తెనుగుకవులు - తెనుగు సాహిత్యము అని పేరుగాని తత్త్వ మాలోచించగా పెత్తనముగల స్వత్వమును 'చలాయించు' తెనుగుతనము మన పూర్వసారస్వతములో అగపడదు.

ఛందస్సాంప్రదాయములు - ఆలంకారికసూత్రములు - కవిసమయములు - వ్యాకరణ ధోరణులును, సంస్కృతప్రభువు ఆజ్ఞాగంభీరకంఠస్వరమునకు అడుగుదాటకుండ ఒదిగిపోవలసిన వే.

గీర్వాణి 'అమ్మలగన్న యమ్మ' అయిన కావచ్చు. దానికి 'పసిఫిక్' మహాసముద్రమంత వాఙ్మయ మున్న దన్న దో సత్యము.

సీకు లేనిమాటలను దానినుండి తెచ్చికొనవచ్చును. అందమైన అలంకారములను 'ఎరవు' కూర్చుకొనవచ్చును. తప్పనిసరియైన పారిభాషికపదములను గ్రహించవచ్చును.

అందలి అద్భుతరచనను కొంతవరకు ఆదర్శముగను నిల్పుకొనవచ్చును.

కాని ——

నీచక్కని సాంప్రదాయమును - కమ్మని పలుకుబడిని - విశిష్టమైనభాషామర్యాదను - చవులూర్చు జాతిచ్ఛందస్సులను - నీజన్మహక్కుగా పోరాడి రక్షించుకోవలసిన అవసరము మాత్ర మున్నది.

జీవవతివై ' నవంనవ 'నిత్యవికాసమున కట్టులుచాపు ఆంధ్రికి గీర్వాణి ముదివేషములతో సూత్రించి ఉరిపెట్టుటయును భరించరానిది.

ఆదికవి నన్నభట్టు నాటినుండియును తెనుగుతనము ఒకప్రక్కకు ఒరిగిపోయినది.



అతడు తన శ్రీమహాభారతాంధ్రీకరణమునకు తీసికొన్నది చాలవరకు సంస్కృతకవితావిధానము. కారకము చాలమట్టుకు సంస్కృతీయము. మూడువంతులు భాషయును అదే. ముఖ్యమైన ఛందస్సుగూడ సాంస్కృతికమే.

నన్నియకంటె తిక్కనలో నవేలమైన ఆంధ్రాభిమాన మున్నది. కాని అది మార్గకవితకు కూర్చినంతపుష్టిని దేశికవితకు కూర్చలేదు. ఎట్టిన నన్నయఅడుగుజాడలలో నడచినాడు. సంస్కృతభూయిష్ఠమైన ప్రబంధరచనకు పరమేశ్వరు డైనాడు.

తరువాతికవు లించుమించుగా నందరును అనువైనంత సంస్కృతత్వమును పురస్కరించుకొని, ద్వ్యర్థి-శ్లేష - నిరోష్ఠ్యాదిప్రబంధములను - చతుర్విధ కవిత్వమును పట్టుకొని తమశిష్టత్వమును నిలబెట్టుకొన్నారు.

ఆంధ్రలాక్షణికుల లక్షణగ్రంథాలలోగూడ సంస్కృతభాషయును - సాంప్రదాయములును అక్కర లేనన్ని అకాండతాండవము చేసినవి[1] తెనుగునకు అసహజమైన కర్మణిప్రయోగమును వీ రందరును ప్రవేశపెట్టినారు.

శ్రీనాథాది ప్రఖ్యాతాంధ్రకవుల కావ్యములలో కాళిదాసాది కవుల అమూల్యభావము లెన్నో అనువాదరూపముగ ఉన్నవని శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు 'భారతి'లో సోదాహరణముగా నిరూపించినారు.

ఇట్లు నన్నయ్యామొదలు చిన్నయ్యదాక నున్న చాలమందికవులు, లాక్షణికులు, పండితులును దీక్షాబుద్ధితో సంస్కృతకైవల్యమును భజించి దేశికవిత్వమును నాశనము చేసినారు.

కావ్యమునకు స్థూలశరీరరూపమైన ఛందస్సును గ్రహించుటలో చక్కని అనేక జాతియవృత్తములను నిరాకరించి మన పూర్వాంధ్రకవులు తియ్యని తెనుగుకవితకు రూక్షరుచులు కల్పించినారు.

తెనుగునుడికారమునకు సహజముగా ఒదుగునట్టి తేనెపెఱవంటి

---

1. చూ—౧. ఆంధ్రశబ్దచింతామణి; ౨. వికృతివివేకము; ౩ కవిశిరోభూషణము; ౪. కావ్యాలంకారసంగ్రహము; ౫. బాలవ్యాకరణరచనా విధానము.

తెనుగువృత్తములనుగూర్చియు, దేశికవిత్వపు ప్రశస్తినిగూర్చియును ఈ వ్యాసములో కొంచెము నివేదింప బోవుచున్నాను.

పూర్వము దేశికవితను అనాదరించుటయేగాక దానిని సాహసముగా తెగడినవారుకూడ నున్నారు.

"మఱివిటులు విభవలంజలు
పదకవితలు—"

అనియును

."ద్విపదకవిత దిడ్డికంత"

అనియును బ్రువ్వాదిట్టినారు.

మహానుభావుడు పాల్కురికి సోమనాధారాధ్యుడు తననాటి సారస్వత ప్రవాహమున కెదురీది దేశికవితకు ముఖ్యాంగమైన 'ద్విపద' నాదరించి మనీషి యనిపించుకొని ద్విపదతో రెండు ఉద్గ్రంధములను రచించినాడు.

నాటిద్విపదయందలి నైచ్యభావము నెదురించి బసవపురాణమున నిట్లు జవాబు చెప్పినాడు.

"ఒప్పదు ద్విపదకావ్యోక్తినాజనదు"

*　　　*　　　*

"ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జానుదెనుగు విశేషము ప్రసన్నతకు.

*　　　*　　　*

ఉరుతర గద్యపద్యోక్తులకంటె
సరసమై పరగిన జానుదెనుంగు
చర్చింపగా సర్వసామాన్య మగుట
కూర్చెద ద్విపదలు కోర్కెదైవార.

*　　　*　　　*

అల్పాక్షరముల ననల్పార్థరచన
కల్పించుటయగాదె కవివివేకంబు"

బసవపురాణ పీఠికలో బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు దేశికవితనుగూర్చి యిట్లువ్రాసినారు.

"మనపూర్వులు పౌరాణికము లగు నార్యకథలమీదను సంస్కృతచ్ఛందస్సుమీదను సంస్కృతప్రాయమైన తత్సమభాషమీదను నభిమానముగలవారై దేశీయచ్ఛందస్సులను దేశీయేతివృత్తములను దేశభాషను జిదుకుద్రొక్కిరి. నేఁడు మనము శ్రీపామరాదుల గేయరచనములని యనాదరముగాఁ జూచు పదరచనముల వరుసలే ద్రవిడభాషలోని ప్రౌఢకావ్యములందలివృత్తములుగా నున్నవి."

సోమనాధుని తరువాత ద్విపద పరమార్థమాధుర్యములను గుర్తించి రంగనాథుడు, గౌరన్న - చిన్నన్న మొదలైనవారు కొద్దిమంది మాత్రమే తద్రచనకు సాహసించినారు.

'శానైతే' శ్రీనాధుడును పల్నాటివీరచరితను ద్విపదలో వ్రాసినాడు. కాని అతనిగీర్వాణపరబుద్ధి అంతకంటె దేశికవితను భజింపనీయలేదు.

నిజమునకు నన్నయకు పూర్వమే చాలా జాతిచ్ఛందస్సులు (ద్విపదాదికము) శాసనములలో ఉన్నవని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'ఉదయినిపత్రిక'లో వ్రాసినారు.

నన్నయమాత్రము తెనుగు వృత్తమునకును, దేశికవిత్వమునకును అంతగా ప్రాముఖ్య మివ్వక తన భారతాంధ్రీకరణమును సాగించినాడు. 'అయితే' అతనికి తెనుగభిమానము లేదనము కాని ఆయుగ ధర్మము తెనుగుసాహిత్యమునకు వెన్నెముకవంటి దేశికవితావృత్తములను ముందుకు రానీయలేదు.

అందుకు కారణము:— అప్పుడు అనగ్రజాతులవారు దేశికవితను ఆదరించువారు. అది అగ్రజాతులకు సరిపడదు.

మొదట శివకవులు దేశికవితకు బాసటగా నిలిచినారు. అది భవికవులకు కంటకప్రాయ మైపోయినది.

మార్గకవులు (భవికవులు) సంస్కృతవృత్తములను శిష్టత్వముకొరకు తీసికొన్నారు. జాతివృత్తములను అక్కడక్కడ వినోదప్రాయముగా వాడినారు. అది వారి 'దయాధర్మభిక్షమే' కాని వీనికి తెనుగుకావ్యములలో స్వత్వము లేదు.

మార్గకవులు తీసికొన్న వృత్తములలో ముఖ్యమైనవి శార్దూలము, మత్తేభము, చంపకము,ఉత్పలము.

సంస్కృత చంపూనాటకములలో శార్దూల విక్రీడితము విపులముగా ప్రయుక్తమైనది. ఇందలి మొదటి మగణములోని తొలిగురువును రెండు లఘువులనుగా జేయ తత్సమముగా మత్తేభము వచ్చినది.

చంపకమును మాఘుకవ్యాదులు ప్రయోగించినారు పూర్వశాసనములలోగూడ ఉన్నది. దీని తొలి నగణమునందలి మొదటిరెండులఘువులను గురువుగా మార్చుటతో తత్సమముగా ఉత్పలము బయలు దేరినది.

మనకవులు వీనిని కావ్యవృత్తములనుగా తీసికొనుటలో ఔచిత్యము పోయినది.

సంస్కృతపంచకావ్యకవులు రఘువంశాది మహాకావ్యరచనకు అనువుగాను, తమవిపులభావవిన్యాసమునకును, ఇతివృత్తసారస్యమునకును పొందికగాను కుదురునట్టి వంశస్థ - ఉపజాతి - వియోగిన్యాది వృత్తములను తీసికొన్నారు. సర్గాంతమున భిన్నవృత్తములకొఱకు చిత్రవృత్తములను వాడువారు. వాల్మీక్యాదులు అనుష్టుప్పునుమాత్రమే తీసికొని (సర్గాంతమున తప్ప) దివ్యకావ్యములను వెలయించినారు.

పూర్వాంధ్రకవుల కావ్యరచనకు ఆదర్శమైనది సంస్కృతచంపువు. అందు సుదీర్ఘములైన వృత్తములు - వర్ణనలు - కేవల రచనావైచిత్రియును ప్రధానములు. మహాకావ్య నిర్మాణదృష్ట్యా ఈ రచన పరిమితప్రయోజకమును, సంక్షిప్తమును అయి ఉన్నది. కనుకనే కనుపర్తి మార్కండేయశర్మగారు ‘భారతి’లో స్మరించిన ఎన్నో సంస్కృతచంపువులు నేటికి నశించిపోయినవి.

శ్రీ మహాభారత రచనకు నన్నయ ఏర్పరుచుకొన్న సంస్కృత వృత్తబాహుళ్యము సమంజసమైనదా యని నా సందేహము. వేదవ్యాస మహర్షి బహుళముగా వాడిన అనుష్టుపువంటి పొందికైన చిన్న దేశీయ వృత్తమును గ్రహించినచో నన్నయ భారతము ఇంకను సర్వసామాన్యమై సులభగ్రాహ్యమై తెలుగుల ప్రత్యేకపుసొత్తుగా నుండియుండును.

పరిశీలించి వ్యాసునిశ్లోకములతో నన్నయపద్యములను కలిపిచూడగా, నన్నయ పెద్దవృత్తమును నడుపుటకు కొన్ని అనవసరపదాలను చేర్చినట్టు తోచుచున్నది. శార్దూలాది వృత్తములకు తెనుగులోని యతిప్రాసబలులును కొంత వ్యర్థపదసంచయమును తెచ్చిపెట్టినవి. మచ్చుకు:

"నవనీతం హృదయం బ్రాహ్మణస్య
వాచి క్షురోనిశిత స్తీక్ష్ణధారః,
తదుభయ మేత ద్విపరీతం క్షత్రియస్య,
వాఙ్నవనీతం హృదయం తీక్ష్ణధారమ్."

"నిండుమనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్క మీ, రెండును రాజులందు విపరీతము కావున విప్రుఁ డోపు నో,పం డతిశాంతుఁడయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మరింపఁగన్."

వ్యాసునిశ్లోకమునందలి బ్రాహ్మణహృదయ నవనీతాధ్యవసాయమును - వాక్క్షురాధ్యవసాయమును నన్నయ పద్యమున ఉపమాన పర్యవసానము నందినవి; అధ్యవసాయమునందలి యందము కొంతకుకొంత పద్యమున తరగినది. మరియు నిండు వాడిమైన క్షురమునకు బదులు ఆఖండల శస్త్రము అత్యతిశయోక్తియై ‘ప్రాస’ పోటును ఎదురొడ్డుటకు పట్టిన ఆయుధముగా కాన్పించుచున్నది. జగన్నుత యనుసంబుద్ధి యతిభిక్షకొరకని నన్నయభారతభాగ సుపరిచితులకు తెలియు ననుకొందును. ఇది నన్నయ మహాకవీంద్రుని సామర్థ్యమును మలినపరచు విపరీతతర్కమని మతిమంతు లూహించగూడదు.

ఆశ్లోకమునకు నన్నపార్యుఁ డొక గీతపద్యమును తీసికొన్నచో నింతకన్న ఎంతయో సూటిగా చెప్పగలిగియుండునని నానమ్మకము. దీనికొక సామాన్యపండితుఁ డీగీతపద్యమును వ్రాసెను:

"బ్రాహ్మణుమనమ్ము వెన్న,
తద్వాక్కుకఱకుఁ
గత్తి యగు; నివ్విపరీత
గతులుగాఁగ,
క్షత్రియుని హృదయమ్ముఁ
గఱకుఁగత్తి,
మాటయును నవనవనీత
మార్దవకము."

ఇప్పట్ల తిక్కన చాల గడసరి. వ్యాసుని యనుష్టుప్పునకు సరియైన కందమును గ్రహించి తనరచనను చాలవరకు తెలుగులసొత్తు చేసినాడు. విశ్వనాథ వెంకటేశ్వర్లుగారు నన్నయ తిక్కనల సౌపర్ణోపాఖ్యాన సందర్భమును తీసికొని తిక్కనకవితా సౌష్ఠవమును ‘జయంతి’పత్రికలో సోదాహరణముగా చర్చించినారు.

ఇక తిక్కనతరువాత తక్కిన కవు లందరును తెనుగుతనమును మరచి తమ కావ్యములను ఇంచుమించు సంస్కృతపరములు చేసినారు.

ఎట్లనగా :—

సంస్కృతీయములైన శార్దూలాది వృత్తములను తీసికొన్నప్పుడు సంస్కృతభూయిష్ఠముగా నడపిన రచన మొలచిన ట్లుండును.

నన్నయవృత్తములలో సంస్కృత సమాసము లేనిరచన సాధారణముగా దొరకదు,

భారతాదినున్న "రాజకులైక భూషణుడు", "ఘన దురితాను బంధా"ది పద్యములును, అతని సుప్రసిద్ధ "మదమాతంగ", "శారద రాత్రులు", "వివిధోత్తుంగ తరంగ ఘట్టనా"ది పద్యములును సంస్కృత సమాసలలితములు.

యతి విశ్రాంతిసంజ్ఞక మైనను అక్కడ ఆగకుండ నడపుట ప్రౌఢత్వ మైపోయినది. దీనికి ఓజోగుణ[2] ప్రధానరచన ఎక్కువ అనువు.

కమ్మని విడితెనుగుమాటలతో వృత్తమును నడపి రక్తికట్టించుట కష్టము. అట్లని అట్టివారు మన తెనుగుకవులలో లేకపోలేదు. కాని అట్టివి తక్కువ యనియు, సమాసాలింగితవృత్తముల నడక హుందా వీనికి రాదనియు గ్రహించవలయును.

ఇట్టి సంస్కృతవృత్త సంగ్రహణమువలన సంస్కృతభాషకు తప్పనిసరిగా ప్రాముఖ్యమువచ్చినది. పద్యమునుబట్టియు, గ్రహించిన భాషనుబట్టియు మన పూర్వకవులు మూడువంతులు సంస్కృత కవితా విధానమును అనుసరింపవలసినవారైరి. ఇందువలన తెనుగుజాతీయతకు దూరములైన శ్లేష - రూపక - ఉత్ప్రేక్షాది అలంకార ప్రాబల్యమును - అనుప్రాసములు - కారకములు - ప్రయోగములును (కర్మణ్యాది) మన ప్రబంధములలో 'జబర్దస్తీ'గా ప్రవేశించినవి.

శిష్టులందరును సంస్కృతప్రతిబింబరూపమైన సాహిత్యమును సృష్టించుకొన్నందుకు చాల మురిసినారు.

దేశికవిత తెల్లని కమ్మని పాల మీగడవంటిది. దీనికి తియ్యని కలకండవంటి జానుదెనుగుమాట పొందికయే విలక్షణమాధుర్యమునుగూర్చి రసానందమును పోషించును. ఇందులో రూక్షరుచులుగల సంస్కృత కవితావిధానము అపారముగా కలిపినచో దీనిరుచి విరిగిపోవును. కనుక దేశికవితతీరే వేరు.

దీని ననుసరించియే దేశికవులు చక్కని జాతివృత్తములను తీసికొన్నారు. ఇందు ముఖ్యమైనవి రగడభేదములు - ద్విపదలు - గీతములు - ఆటవెలదులు - మొదలైనవి[3]. వీనిలో వేనిపాదములును సుదీర్ఘములై యుండవు. ఉత్తరపాదములతో కలసికొనిపోయి అన్వయక్లేశమును, వ్యర్థపదాడంబరమును కలిగించవు. భావౌన్నత్యము - పలుకుపొందిక - రససిద్ధి యులేని కవి కిందులో సమాసముల ఫులుముడు కంతగా నవకాశ ముండదు.

ఇట్టిపరోత్తమమైన కవిత్వము తెనుగుజాతి కన్ను తెరచిననాటి నుండియు పుట్టి నాగరికాడంబర మెరుగని పల్లెజనుల ముగ్ధవాక్కును - భిక్షుకగీతములను - సంస్కృతవాసనకు దూరముగాడున్న శ్రీసారస్వతమును ఆశ్రయించుకొని అనుశ్రుతముగా నేటివరకు కొందరు హృదయమున్నవారి కొరకు నిలచియున్నది.

నేడు మనము భిక్షుకులనోటివెంటను, కార్మికులవద్దను, స్త్రీలవద్దను విని ఆనందించు చాలపాటలు ద్విపదకు చాలా దగ్గరగ నుండును. కొన్ని పూర్తిగ ద్విపదలే. కొన్ని పాటలు రగడభేదములలో అంతర్భవించును. కొన్ని ప్రత్యేకము పదభేదములు. సోమనాథుడు తనపండితారాధ్యచరిత్రలో స్మరించిన 'తుమ్మెదపదములు - ప్రభాతపదములు - పర్వతపదములు - ఆనందపదములు - నివాళిపదములు - గొబ్బిపదములు - వెన్నెలపదములు మొదలైనవి నన్నయకు పూర్వమునుండియు మన జాతి నిక్షేపసంపదగా దాచుకొన్న నికరమైన దేశికవిత్వము.

ఏనాడు ఎవరు వ్రాసినారో తెలియదుగాని శ్రీసారస్వతము[4]లోని శెల్ల అతిరసవంతములైనలంకాయాగము, కుశలవకథ, లక్ష్మణదేవర నవ్వు, ఊర్మిళనిద్ర మొదలైన పుస్తకములలోని సహజభావసంపద ఎన్నో ఇనుపప్రబంధములలో లేదు.

'లంకాయాగము'లో హనుమంతునితో సీతఅన్న ఒకమాటతో ఆమె కష్టాల చురుకు ప్రత్యక్షమగును.

2. ఓజస్సమాసభూయస్త్వమ్ - ప్రతా॥

3. సీసము 'శీర్షక'భవ మనియు, కందము ఆర్యాగీతినుండి వచ్చిన దనియు కొందరు విమర్శకులు తలచుచున్నారు. అవి ద్రావిడచ్ఛందము లేయని కొంద రందురు.

4. మన స్త్రీ వాఙ్మయమునుగూర్చి ఎవ్వరును కూలంకషమైన పరిశోధన చేసినట్లు కనపడదు. ఇటుమీదనైనను మధురభావరమణీయమై చాలవరకు భ్రష్టమైయున్న స్త్రీవాఙ్మయమును సంస్కరించి, పరిష్కరించి ముద్రించవలసియున్నది.

"జివదిన గండాలు దెయ్యాలతో పోరు,
హనుమన్న చెప్పనున్నా!"

'లక్ష్మణ దేవర నవ్వు' లో రాముడు లక్ష్మణుని అనునయించు సందర్భము—

"దీపమ్ములేనిల్లు ఎట్టి దటుపోలు,
ఉదకమ్ములేనికలశ మెట్టి దటుపోలు,
పతిలేని సతిబతుకు ఎట్టి దటుపోలు,
తమ్ముడా! నీవు లేనిసభ యటుపోలు".

ఇందలి యుపమానసౌష్ఠవము గమనింపదగ్గది.

ఒక భిక్షుకగీతములో సీత లవు నోదార్చుచు పలికినపలుకులు నా హృదయముమీద చేసిన గాయము నేటికిని మానలేదు.

"అటుకొండ యిటుకొండ ఆరెంటినడుమ,
నిను గంటి నా కొడుక ఏడువకు తండ్రి!
చెట్లే చుట్టాలు మనకు రాళ్లే బంధువులు,
ఏడిస్తే నిన్నెవ్వ రెత్తుకుంటారు".

ఒక కార్మికునిపాటలోని ఈ చరణము నన్ను లోభపెట్టినది.

"పాలవర్ణపు;చినుకు! కల చాయ (త్రీ;)'.

వెంకయ్య చంద్రమ్మ పాటలోని చంద్రమ్మమాట—

"తెలిసందమామలో తియ్యపానక ముంది,
తెచ్చి పెడుదువుగాని రారో వెంకయ్య
తెచ్చి పెడుదువుగాని రారా!!"

మోహనరంగపాట కథానాయిక పలుకు—.

"బలమైన అలలు లేగి
చలియించు సాగరాన
సంగీతమాలకింతము పదర
చల్ మోహనరంగ—"



పెనుకొండ రామస్వామి దేవాలయమందున్న శిల్పనైపుణ్యము: రామాయణచిత్రములు

గ్రంథము పెరిగిపోవు ననుభవము లేనివో ఆనందమును, అశ్రువులను పొంగించే ఎన్నో గేయములను ఇక్కడ ఉద్ధరించియుందును.

ఇట్టి దెంతయో మనోహరగేయ సాహిత్యము మనశిష్టకవుల దుష్ట పిశ్వాసములవల్ల నశించిపోవుచుండగా ధైర్యము వహించి కొందరు బుద్ధిమంతులు సమకాలికుల ఈసడింపులను త్రొక్కి ఆదరించినారు. అందు ముందు పేర్కొనదగినవాడు సోమనాథుడు. ఇతని కావ్యభాష కండగల చిక్కని తెలుగు. కవిత్వము సర్వజనాస్వాదయోగ్యము.

కొంచెము మచ్చునకు —

"వడిబారు జలమున కొడవెల్ల గాల్లు
పడిగాలు చిచ్చున కొడవెల్ల నోల్లు
వడివీచు గాడ్పున కొడవెల్ల దలలు
వడిజేయు బసవన కొడవెల్ల భక్తి

* * *

క్షీరాబ్ధిలోపల గ్రీడించుహంస
కోరునే పడియలనీరు ద్రావంగ"

తరువాత చెప్పదగ్గవాడు రంగనాథుడు. ఇతని నుడికారపుహోయి రామాయణమందలి వెన్నెలవర్ణనలో చవిచూడవచ్చును.

"పాలవెల్లిని దచ్చి పఱసినవెన్న
కూలియాడలపువ్వు చుక్కలనవ్వు
నెరిచకోరములకు నెలనెలపంట
ఉరవేది విరహుల నుడికించుమంట
గగనంబుతోడవు దొంగలగుండెదిగులు

* * *

సరసిజరిపుడైన చంద్రుండు వొడమె"

సోమనాథ, రంగనాథు లిర్వురును దేశకవిత కాధారస్తంభప్రాయులైనను సమకాలికసంస్కృతకవితా విధానసంపర్కము కొంచెము సోకినది.

పిదప గౌరన యెన్నదగినవాడు- ఋషి హరిశ్చంద్రు నమ్మజూపు నపుడు ప్రజలు—

"కడగి పీనుగుమీద కంచంబువెట్టి
కుడువగా జూచు కఱకుర్తిగా డితడు"

అనిరి.

వేమనయోగి శుద్ధ దేశికవి. తన సుభాషితములను వేలకొలది ఆటవెలదివృత్తముతో వెలయించెను. కనుకనే యితనిపద్యములు రాని ఆంధ్రు లుండరు.

ఇట్లు జాలువారిన దేశికవితనుండి యక్షగానరచన ఒకపాయగా చీలిపోయినది.

ఏమైనను ఎంతోమంది ఆలంబములేని దేశికవిత నేటివరకు ఒక్కతనఅనశ్వరప్రాణశక్తితో జీవించుచు వచ్చినది.

పందొమ్మిదవశతాబ్దిలో ఆధునికాంధ్రకవిత్వ మార్గదర్శి గురజాడ అప్పారావు పంతులుగారు తాము సంస్కృతాంధ్రములలో అనితరసాధ్యమైన పాండిత్యమును సంపాదించియు దేశికవిత్వము - తెనుగు వృత్తముల అకృతకసౌందర్యమును బాగుగా గుర్తించినవారై వృషభగతిరగడలోని తుదిపాదమునకు కొంచెము మార్పుతెచ్చి నవ్యాంధ్రసరస్వతికంఠసీమలో ముత్యాలసరముగా నలంకరించినారు. యనమండ్ర నారాయణమూర్తిగారుకూడ కొన్ని గేయములను వ్రాసి క్రొత్తతెనుగు కైతకు తోవతీసినారు. గురజాడకవి నిర్మించిన ముత్యాలసరము మీద తరువాతి నవ్యాంధ్రకవులు విచ్ఛిత్తి విశేషములను చేసిరి. దానికి క్రొత్త గమనమును, ఒయ్యారములను చాలమంది యిచ్చినారు[5]. ఇంతట దేశికవితకును, తెనుగు వృత్తమునకును చక్కని ఒకస్థాయి యేర్పడినది.

పరిశీలింపగా ౧౯-వ శతాబ్దిలోని అంతిమాధ్యాయములో - చతుర్విధ కవిత్వ - ప్రబంధవాసన ఎవ్వరికిని గిట్టలేదు.

దీర్ఘసంస్కృతవృత్తములమీద - కృతకకవితావిధానముమీద అందరికి ఏవగింపు పుట్టినది.

దేశికవిత యదృష్టరేఖ బయల్పడినది.

వెంకటపార్వతీశ్వరుల 'ఏకాంతసేవ' దిద్దిన ద్విపదరచన - రుచియైన తెనుగునుడికి గుడి - తేటగీతకు -ఆటవెలందికి వీరుప్రాణప్రతిష్ఠ చేసినారు.

దేశములో ప్రబలిన స్వాతంత్ర్యోద్యమము ఒకవంకను-బెంగాలీ శాంతినికేతనపు స్వేచ్ఛావాయువు లింకొకవంపను చెలరేగగా మన సారస్వతరంగములో జాతీయములైన వెలుగుబాటలు వెంటనే తెరచుకొన్నవి.

నాటితో నవ్యాంధ్రకవుల కవితావాహినిలో జాతీయచ్ఛందస్సులును-భావములును పొంగివచ్చి కలిసినవి.

ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారి 'జడకుచ్చుల'లో ఉజ్జ్వల

5. చూ:—శ్రీరంగం శ్రీనివాసరావుగారు 'ఉదయిని'లో వ్రాసిన "ముత్యాలసరము" ఒకకృషి.

మైన జాతీయరేఖ కన్పడును. ఈయన మేలి దేశీయవృత్తములను తీసికొని కండగల చిక్కని తెలుంగుల గలిపి పాడినారు.

అబ్బూరి రామకృష్ణరావుగారు 'ఊహాగానము'లోను, కృష్ణశాస్త్రి గారు 'కన్నీరు, మహతి, కృష్ణపక్షము, ఊర్వశి' కావ్యములలోను మనోహర గీతములను పలికి తెనుగుగీతికా ప్రాభవమును ప్రకటించినారు. ప్రస్తుతము కృష్ణశాస్త్రిగారు భావబంధురమైన విశాలగేయ సాహిత్యమును పెంచుచున్నారు.

విశ్వనాథవారి 'కిన్నెరసానిపాటలు' అను గేయకావ్యము నేటిశిష్ట కవులకును దేశికవితావృత్తముల యందలి సాముఖ్యమును చాటి చెప్పుచున్నది

నాయని సుబ్బారావుగారు ముఖ్యముగా తేటగీతను తీసికొని 'తమ' 'సౌభద్రుని ప్రణయయాత్రను' ఎంతో హాయిగా గడపినారు.

పైకవు లందరికిని సంస్కృతకవితావిధానసంపర్క మున్నప్పటికిని దేశీయవృత్తములును - కవిత్వమును వారి గ్రంథముల ప్రాముఖ్యమును వహించినవని గట్టిగా చెప్పగలను.

ఇంక గురజాడకవివలె తెనుగు కవిత్వము గేయములోనే బాగుగా ఒదిగి మనోజ్ఞముగా ఉండునని నమ్మిన క్రొత్త తెనుగు కవులును ఉన్నారు వీరిరచనములతో తెనుగు వృత్తముల్ల కొకతీపీ - దేశికవిత కొక మెరుగున్ను వచ్చినవి

స్వర్గీయ బసవరాజు అప్పారావు గారి 'చిట్టిపాటలూ'[6] 'ప్రేమగీతాలూ' నగ్నముగా వచ్చి మనహృదయములలోని రసగ్రంథులను కదిపి పారవశ్యము పొందించును

పిమ్మట దీక్షితులుగారి 'కవి - కన్యక' 'నెమలిపింఛము' వంటివియు, అడవి బాపిరాజుగారి 'తొలకరి' తదితర కావ్యములును, కవికొండలవారి 'శివరాత్రి ప్రభాదిక'మును' తురగా వారి 'రాధాకృష్ణ గీతములు'ను, 'సామ్యవాద గీతములు'ను, చావలి బంగారమ్మగారి 'కప్పతల్లి పెళ్లి' వగైరాయును జాతికవితకు మేలిబంగారునగలుగా ఎన్నతగినవి వీరందరును(కవికొండలవారుతప్ప)శార్దూలాది చతుష్పాదుల పొంతకు పోక ద్విపదాది జాతికవిత నుద్ధరించినారు

ఇప్పట్ల ప్రత్యేకస్మరణకు పాత్రములైనవి 'ఎంకిపాటలు' ఈకావ్యము ప్రాకృతకావ్యమువలె సర్వజనసాధారణమై, హృదయములో రసతంతువున్న ప్రతిభావుకుని ఆకర్షించినవి

నేటి కవికుమారులలో వాసికెక్కిన శ్రీరంగం శ్రీనివాసరావుగారు కొన్నాళ్లు పద్యరచనచేసి తమ స్వచ్ఛందభావ విహారమును చతుష్పాత్పద్య మరికట్టుచున్నదని తెలిసికొని జాతిచ్ఛందములకు వింత ఒయ్యారము లిచ్చి తెనుగువృత్తమునకు జీవనౌషధము పోసినారు.

ఇట్లు మన తెనుగుజాతి రససన్నివేశమును అనుభవించురుచి పొందిన నాటినుండియును జన్మహక్కుగా సృష్టించుకొన్న జాతివృత్తమును, దేశికవితను కొందరు గీర్వాణపరులు త్రొక్కివేయగా పందొమ్మిదవశతాబ్దిలోని నవకవులు వానిసహజసౌందర్యమును గుర్తించి ఆదరించి ఉన్నతజాతీయాదర్శమును నిలిపినారు

ఇందులో, కవిత్వము - సారస్వతమును ఏనలుగురు పండితులసొత్తో కాక గుండె ఉండి అనుభవించగల్గిన ప్రత్యాంధ్రునికి వాక్కుగల దని చెప్పు సామ్యవాద సూత్రరహస్య మిమిడియున్నది.

పూర్వాంధ్రకవులు తమ కావ్యానుభవమును అందరికీ అందనీయని స్వామ్యవాదులు వారు కావ్యాంగములుగా తీసికొన్న వృత్త-భావావిష్కరణ - కవితా విధానములు విజాతీయములై పరిమిత జనైకప్రయోజకము లైపోయినవి

మెత్తని నుడికారము - చక్కని సాంప్రదాయము-తో కూడిన తెనుగు సాహిత్యమునకు తెనుగువృత్తమును, దేశికవిత్వమును అపరిమితప్రయోజకములును, అతిరసస్ఫోరకములును అయి ఉన్నవి

ఇట్లు చెప్పుటచేత శార్దూలాది వృత్తములను పురజనులు హరిజనులను బహిష్కరించినట్లు వెలిపెట్టుమని నాయూహ కాదు.

ఇదివరకు వానికున్న ప్రాధాన్యమును ఇప్పుడు తగ్గించి జాతివృత్తములకు ప్రాముఖ్య మిచ్చి వినోదప్రాయముగా మాత్రము శార్దూలాదివృత్తములను - సంస్కృతకవితావిధానమును తీసికొనవచ్చునని ఈ వ్యాసమునకు నాస్వస్తివచనము.

6 ఇందులో నేను స్మరించని ఆధునిక కావ్యములు సుప్రసిద్ధము లగుటచే ఉదాహరణములు పిష్టపేషణములని యివ్వలేదు.

# తంజావూరు మహారాష్ట్రనాయకులు: ఆంధ్రవాఙ్మయము

వావిలాల వెంకట్రామ సోమయాజులు

విజయనగర సామ్రాజ్యాస్తమయమునకు వెనుక రెండు శతాబ్దులకాల మాంధ్రవాఙ్మయ పోషకులుగానుండిన దక్షిణదేశ నాయక రాజులు స్వతంత్రించిరి. వీరు మొదట విజయ నగర సామ్రాట్టులచే బ్రతినిధులుగా నంపబడిన తెలుగునాయకులు. వీరిపాలనకాలములో తమిళదేశమునకు దెలుగుతెగ లనేకములు వలస పోయినటుల స్థానికచరిత్రలవలన దెలియు చున్నది. ఈతెలుగునాయకులు ఆంధ్రవా ఙ్మయపక్షపాతులై వెలలేని సాయమొనర్చిరి. తిరుచునాపల్లి, పుదుక్కోటల రాజులగు తొండమాన్‌వంశజులు తమిళులైనను తెలుగు కవితాకుమారికి వశులై సారస్వతాంబుధి నోలాడిరి. ఈకాలమున తంజావూరు, మధుర, తిరుచునాపల్లి, పుదుక్కోట లాంధ్ర వాఙ్మయమునకు విద్యాస్థానములై విలసిల్లిన వని చెప్పవలయును. విజయనగర రాజులతో ప్రబంధయుగ మంతరించినది. ఈయుగమున నాటకములు, వచనకావ్యములు విరివిగా వభి వృద్ధిలోనికి వచ్చినవి. కావున నీయుగమును 'నాటక వచనకావ్యయుగ' మనిగాని, దక్షిణ దేశమున నీకాలమునం దాంధ్రవాఙ్మయ మభి వృద్ధిబొందుటవలన 'దక్షిణదేశ ఆంధ్ర వాఙ్మయయుగ' (౧౬౦౦-౧౮౦౦) మనిగాని పిలువవచ్చును. ఇది ప్రబంధ అధునాతన యుగములకు సంధియుగము.

పైనపేర్కొనబడిన విద్యాస్థానములలో తంజావూరును క్రీ. శ. ౧౫౩౫ — ౧౬౭౫ వరకు నాంధ్రనాయకులు పరిపాలించిరి. వీరి తరువాత తంజావూరునందు క్రీ. శ. ౧౮౦౦ వరకును మహారాష్ట్రులు తమపరిపాలనమును నెలకొల్పి యాంధ్రభాషను బోషించి మహా యశస్సును గడించిరి. అన్యదేశీయులైనను వీరు శిల్పమునకు నాదేశమున పారంపర్య ముగా వచ్చు నాంధ్రసారస్వతమునకు జేయూత నిచ్చిరి. దక్షిణహిందూదేశమున వీరిపరిపాలనాకాలమున గట్టబడిన దేవాలయ ములు ప్రాచీనహైందవ చిత్రకళానైపుణ్య మును, శిల్పనైపుణ్యమును జాటుచున్నవి. వీ రాంధ్రవాఙ్మయమును బోషించుటలో నాంధ్రనాయకుల యడుగుజాడలబట్టి నడ చిరి. ఆంధ్రసారస్వతమును బోషించిన యన్య దేశీయులలో నగ్రస్థానము వీరికే జెందవలసి యున్నది. పాఠకుల సౌకర్యార్థమై నీరాజ న్యుల వంశవృక్ష మీక్రింద పొందుపరుప బడుచున్నది.

నా వంశవృక్షము రాబర్టు సూయల్ **'Lists of Antiquities — Part, ii'** ననుసరించి యీయబడినది.

### తంజావూరు
### మహారాష్ట్రనాయకుల వంశవృక్షము

షాహాజి భోన్‌స్లే (క్రీ. శ. 1594)
- జిజిబాయి
  - శంభాజి
  - శివాజీఛత్రపతి
- తుక్కాబాయి
  - (మొదటి) ఏకోజి (క్రీ. శ. ౧౬౭౪—౧౬౮౭) (తంజావూరుమహారాష్ట్ర రాజ్యస్థాపకుడు)
    - శాహజి (క్రీ. శ. ౧౬౮౭ — ౧౭౧౧)
    - శరభోజి (౧౭౧౧ — ౧౭౨౯)
    - (మొదటి) తుళజాజి (క్రీ. శ. ౧౭౨౯ — ౧౭౩౬)
      - (రెండవ) ఏకోజి లేక బాబాశీ (మైన రైనందున తల్లి జిజి క్రీ. శ. ౧౭౩౬-౧౭౪౦(?)వరకు రాజ్యపాలన మొనర్చెను)
        - శాహజి (క్రీ. శ. ౧౭౪౦ నుండి ౧౭౪౧ వరకు రాజ్యపాలన మొనర్చినపిదప నాతని తమ్ముడు ప్రతాపసింహునిచే రాజ్య భ్రష్టుడు గావింపబడెను)
        - శివాజి
        - ప్రతాపసింహుడు (క్రీ. శ. ౧౭౪౧ — ౧౭౬౪)
          - (రెండవ) తుళజ (౧౭౬౫ — ౧౭౮౭)
            - శరభోజి (క్రీ. శ. ౧౭౯౮ — ౧౮౩౩)
              - శివాజీ (క్రీ. శ. ౧౮౩౩ — ౧౮౫౫)
          - అమరసింహుడు (క్రీ. శ. ౧౭౮౭ — ౧౭౯౮)

---

* ఈమధ్య ఆంధ్రవిశ్వవిద్యాలయము ద్వారిచే ముద్రింపబడిన తంజావూరు శర భోజీసరస్వతీమహాల్ నందలి యాంధ్రతాళపత్రగ్రంథములపట్టికలో అమరసింహుడ్ను

'ఇది చోళసింహాసనాధ్యక్ష భోసల ప్రతాపసింహరాజ పూర్వపుణ్య పరిపాకస్వరూప యామునాంబికా గర్భశుక్తి ముక్తికాయమానామరసింహ మండలాధీశ్వర నామాంకితంబైన' యని యుండుటచే పైపట్టికయందు చూపబడినది తప్పుగా దోచుచున్నది.

## ఏకోజి (1)

(క్రీ. శ. ౧౬౭౪ - ౧౬౮౪)

ఛత్రపతి శివాజీమహారాజు తమ్ముడగు నీతడు తంజావూరు ప్రథమ మహారాష్ట్ర పరిపాలకుడు. ఇతడు తంజావూరిని క్రీ. శ. ౧౬౭౪ లో ముట్టడించెను. ఇతడు నాయకరాజ్య విచ్ఛేదమునకై బద్ధకంకణుడైన బిజాపుర సుల్తానుచే పంపబడిన సేనానాయకుడైనట్లు శాసనప్రమాణములు గలవని కురుగంటి సీతారామయ్యగారి తంజావూరి యాంధ్రనాయకుల చరిత్రవలన దెలియుచున్నది. కాని 'ఏకోజి' తంజావూరి ఆంధ్ర నాయకులలో కడపటివాడగు విజయరాఘవుని ప్రేరణమున తంజాపురమును ప్రవేశించి యాతని మరణానంతరము బలవంతుడై సింహాసన మధిష్ఠించెనని శ్రీయుత జయంతి రామయ్య పంతులవారు నుడువుచున్నారు.1 తన రాజ్యకాలము నంతయు రాజ్యసుస్థాపనార్థమే వినియోగించిన యీరాజన్యునకు సారస్వత సేవకు గాలము కరవయ్యెను. అందువలన నతని కాలమున సంస్కృతవాఙ్మయముగాని, తెలుగు వాఙ్మయముగాని, యేవిధమగు పోషకత్వమును బడసినట్లు కన్పింపదు. శత్రురాజులతో సమరములుసల్పి రాజ్యస్థాపన మొనర్చు మహారాజుల రాజ్యకాలములో వాఙ్మయపోషణ మరుదు.

## శాహాజీ

(క్రీ. శ. ౧౬౮౪ - ౧౭౧౦)

ఏకోజీ మహారాజు పరిపాలనానంతరము ఆతని జ్యేష్ఠపుత్రుడగు శాహాజీ సింహాసన మలంకరించెను. తండ్రిరాజ్యమును సుస్థిరతర మొనర్చి స్వర్లోక ప్రస్థాన మొనర్చుటచే నీ రాజన్యునకు సారస్వతసేవ యొనర్చుటకు తగినంత విశ్రాంతి దొరకినది. ఇతడు దేవభాష, యాంధ్రముల రెంటను అసమాన పాండిత్యము గడించిన కవి రాజన్యుడు. ఇతని యాస్థానకవి యగు విచిత్రరాయావతంస కవి యీతనిని 'సరససాహితీలక్షణవిభు' డని పొగడియున్నాడు. తానే తన 'విష్ణుపల్లకి సేవాప్రబంధ' మను నాటకమున తన్నుగూర్చి 'కవిత సంగీత తాన శృతి స్వరస్థాన రాగాంగ గాన క్రియాస్థాయి గమక ప్రబంధ ధాతు గాయనగణితతానద్ధర్మాహరుండ'(?)నని చెప్పకొని యున్నాడు. కాని యితనికి కవితాకళ, గానకళలందు పాండితి యపారమని తెలియుచున్నది. స్వయముగా తాను కవియగుటయే గాక తనయాస్థానమునం దనేక కవులకు గాయకులకు పోషణము కల్పించెను. ఈత డనేక కృతులకు భర్తయు కర్తయు నగుటయే గాక కృతులలో నాయకుడుగూడనై యున్నాడు. ఇత డిట్లు భాషకపారసేవ యొనర్చి తన నామమునకు వాఙ్మయచరిత్రయందు చిరస్థాయిత్వము కల్పించుకొని యున్నాడు. ఇతనికి గానకళాభిరుచి మెండు.

త్యాగరాజ స్వామివారి వంశకర్తలలో నొకడగు వెంగనార్యు డను గాయకశిరోమణి యీతని యాస్థాన మలంకరించెను.2 శాహాజీ మహారాజు సంస్కృతమునం దసమాన ప్రతిభావంతుడై 'చంద్రశేఖర విలాస'మను రసవత్కావ్యమును రచించెను. శాహాజీ యాస్థాన మలంకరించిన సంస్కృతకవులలో శ్రీకంఠ దీక్షితుని తమ్ముడగు అతిరాత్రయాజి యొకడు. ఇతడు కవితారచనలో నఖండుడు. సర్వస్వతంత్రుడు. ఇతడు మృదుమధుర పదభూయిష్ఠమగు 'కుముద్వతీ పరిణయ' మను నైదంకముల రూపకమును రచించెను. సంస్కృత వాఙ్మయమునగల చంపువులలో నగ్రస్థానము వహింపదగిన 'ధర్మవిజయ' మను గ్రంథము నల్లదీక్షితకవిచే శాహజీ మహారాజు కోరికపై రచింపబడెను. శాహజీ మహారాజు పరిపాలన కాలమున ఆతనినే కావ్యనాయకునిగా నొనర్చి రచించిన కావ్యపరంపర బహుళము. అట్టివానిలో సంస్కృతమునందు చొక్కనాథ కవిచే రచింపబడిన 'కాంతిమతీ పరిణయ' మను రూపక మొకటి. అయ్యావా లనబడు శ్రీధర వెంకటేశ్వరకవిపండితుని శాహరాజాష్టపదియు, గంగాధరపండితుని భోసల వంశావళియు, లక్షణకవి శాహరాజ సభాసరోవర్ణనియు పైరకమునకు జెందిన గ్రంథములు. తంజావూరి మహారాష్ట్ర నాయకచరిత్ర వ్రాయదలచుకున్న చరిత్రకారుల కిట్టిగ్రంథములు ముఖ్యాధారములు.

ఇతని కాలమున సంస్కృతముకన్న హెచ్చు తెలుగువాఙ్మయ మభివృద్ధి జెందినట్లు కాన్పించును. ఇత డాంధ్రవాఙ్మయమునందలి బహునాటకములకు కర్త. తంజావూరు విజయరాఘవుని కాలమునందువలెనే యీతనికాలమున హెచ్చు యక్షగానములు, నాటకములు, దండకములు, కొరవంజులు వ్రాయబడినట్లు కన్పించుచున్నది. ఆంధ్ర నాయకులగు రఘునాథ, విజయరాఘవనాయకుల కాలమునుండి వచ్చు నాటకములతో బాటు తాను కొన్ని నాటకముల రచించియు, నితరకవులను ప్రోత్సహించి వారిచే రచియింపజేసియు, రంగస్థలముపై వేషముల వేయించి నటియింపజేసియు ప్రజల నానందాబ్ధి నోలాడించెను. ఇతనికాలమున రచింపబడిన పద్యకావ్యములు కన్పింపవు. ఇతనికాలమున తిమ్మయద్విపదమహాభారతము తిరుగ వ్రాయింపబడినట్టు దెలియుచున్నది3. ఈ గ్రంథమేగాక తనకుగూర్చిన వ్రాయింప

---

ప్రతాపసింహునకు కుమారుని కుమారుడుగా జెప్పబడియున్నది. కాని అమరసింహుడు ప్రతాపసింహునికుమారుడే యనుట సమంజసము. అమరసింహుని యాస్థానకవియగు మాతృభూతుడు తాను రచించిన పారిజాతాపహరణ నాటకమునందు (తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయ తాళపత్రగ్రంథముల పట్టిక, సెం. ౫౪౩.)

1. J. A. H. R. S, Vol. ii, page. 178,

2. మార్తాండకుల శాహమహీపాలుసభను
కీర్తికెక్కినవాడు గిరిరాజసుకవి
సంగీతకళ రహస్యము గన్నవాడు
వెంగనార్యుండు వివేకధనుండు.

(Saraswati Mahal Telugu Manuscripts catalogue: Page, no. 124.)

3. అనఘసన్నుతికి శాహావనిపతికి
నింబాజి వ్రాయించె నిఖిలార్థవితతి
కంభోధియనుచుండు నట్టి భారతము
నిటలాక్షుపదపద్మ నిహితప్రసన్న
పటుచిత్తుడైన కుప్పయమంత్రిచేత.

బడినవియు, క్రిమిదష్టమై శిథిలత్వ మనుభవించుచున్నవియు నగు గ్రంథపరంపర నుద్ధరించెను4.

శాహజీమహారాజు 'శృంగారంబున పొంగారు' 'గంగాపార్వతీసంవాద'మను నాటకమును రచించెను. ఇందలి కథావస్తువు, 'సర్వేశ్వరుడు గంగతో వనమున విహరించువేళ నారదుడు వచ్చి గంగను స్తుతించి పార్వతిని నిందించినసమయమున పార్వతిసఖి దానిని విని దేవికి దెలియజేయుట; ఆ సమయమున సవతులపోరాటము; ఈశ్వరుడు వారి కయ్యామును మాన్ప నొకతెను శరీరమున, మరియొకతెను శిరమున ధరించుట.' ఈతని నాటకరాజము లీతనిపాండిత్యమును వెల్లడిజేయుచున్నవి. సహజవర్ణనలు, పాత్రోచితభావలు, జాతీయములు — ముఖ్యముగా జీవద్భాష. వీ నాటకములకు బెట్టనిశృంగారములు. ఇతడు 'కిరాతవిలాస' మను మరియొకనాటకమును రచియించెను. ఇతడు వ్రాసిన నాటకములలో మేలుబంతియని పొగడదగినది 'త్యాగరాజవినోదచిత్రప్రబంధనాటకము'. ఈనాటకమున మహారాజు అష్టాదశవర్ణనల నిముడింపజేసి ప్రబంధత్వము కల్పించెను. తనపాండితీప్రకర్షను వెల్లడియొనర్చుటకై యీ నాటకమును సంస్కృతపదభూయిష్ఠముగా రచియించి నాటకములన్న పండితుల కామోదమును రగుల్కొల్పెను. తనకవితాశక్తి కూర్చిన యీనాటకమున కవి సంస్కృతము, మహారాష్ట్రము, తెలుగు భాషలకు సమ్మేళనము కల్పించెను. ఈ నాటకమునందలి పాత్రలు పై మూడుభాషలలోను ప్రసంగింతురు. ఈ నాటకమునకు ప్రేక్షకులు శిష్టులుగాని నిరక్షరులు కారు. పండితపామరజనానందముగా నాటకముల రచియింపగల యీకవిరాజన్యుడు ద్రౌపదీకల్యాణమును రచియించెను. నటరాజును నీశ్వరునియొద్ద చెంచు మొదలగు నాట్యకర్తలు తమనటనాకౌశలమును జూపి బిరుదులను బడయుట కథావస్తువుగాగల 'పంచరత్నప్రబంధ'మను నాటకమును శాహమహారాజు కొలదికాలములో రచించితినని చెప్పకొనెను. ఇతడు తన'పార్వతీపరిణయ'మను నాటకమున నాటకమును 'వేషభాషాదియుతముగా' విస్తరింతునని చెప్పెను. కాబట్టి శాహమహారాజుకు నాటకమన్న నెట్టి యభిప్రాయము గలదో తేటతెల్లమగుచున్నది. నాటకమున పాత్రోచితభావ, వేషము లేకపోయినచో నది దృశ్యకావ్య మనిపించుకొనదుగదా! అనగా శాహావనీపతికి నాటకము లెట్లు వ్రాయవలయునో, యెట్లు వ్రాసిన ప్రజలహృదయము రంజిల్లునో తెలియునన్న మాట.

శాహమహారాజు రచియించిన నాటకములలో ఖిలమైపోయినవి పోగా తంజావూరు వాఙ్మయసర్వస్వ మనిపించుకొనిన సరస్వతీమహల్ గ్రంథాలయమున వ్రాతప్రతులుగా మిగిలియున్నవానిలో రతికల్యాణనాటకము, రుక్మిణీసత్యభామా సంవాదము, వల్లీకల్యాణము (కుమారస్వామి వల్లీదేవుల వివాహము), విఘ్నేశ్వరకల్యాణము, శంకరపల్లకి సేవాప్రబంధము, సతీదానసూరము, సతీపతిదానవిలాసము, సీతాకల్యాణము, రామపట్టాభిషేకము, జలక్రీడలు, కంసవధ, సరస్వతీవిలాసము, శచీపురందరము, శాంతాకల్యాణము, విష్ణుపల్లకిసేవాప్రబంధము లనునాటకములు కొన్ని. పైనాటకము లన్నిటిలో సరస్వతీకల్యాణకర్తృత్వమునుగూర్చి కొంచెముగా జెప్పవలసియున్నది. గ్రంథమున శేషాచలపతి రచించె ననియు, గ్రంథాంతమున శాహమహారాజు రచియించె ననియు జెప్పబడియున్నది. సరస్వతీమహల్ గ్రంథాలయము కేట్లాగు సంపాదకులు గ్రంథ మంతయు శేషాచలపతి వ్రాసినదేగాని కారణాంతరమువలన మహారాజు హెచ్చుభాగమును వ్రాయుట వలననో యేమో శాహమహారాజుపేరనే చెల్లుబడియగుచున్నదని చెప్పచూనిరి. కాని యంతకన్న శేషాచలపతి గ్రంథమును కొంతవరకు రచియించి స్వర్లోకమున కేగినవెనుక కొరవడినయధికభాగమును శాహమహారాజు పూరించుటచే నాగ్రంథము ఆతనిపేరుననే చెల్లుబడియగుచున్నదనుట సమంజసముగా దోచుచున్నది.

శాహమహారాజు తెనుగున రచించిన గ్రంథము లన్నియు నాటకములే. కొన్నిటికి నాటకము లనియు, కొన్నిటికి ప్రబంధము లనియు పేరుపెట్టి రెండువరకమువానియందు సంస్కృత పదజాలము, సంగీతశాస్త్ర పాండితీ ప్రకర్ష చూపించెను. 'ప్రబంధం కల్పనా కథా'యనుసూక్తి నాధారముగా గొని వర్ణనల కల్పించి ప్రఖ్యాతఇతివృత్తములనే నాటకములుగా నొనర్చి వాటికి ప్రబంధత్వ మారోపించి నాటకములయెడ పండితులకు గల గౌరవమును పెంపొందించెను. ప్రబంధములకు మిగిలిన రెండవతరగతి 'నాటకము'లు పామరజనవేద్యములు. సంస్కృతవాఙ్మయమునందు వలెనే తెలుగువాఙ్మయమునందును శాహమహారాజును నాయకుని జేసి రచించిన గ్రంథము లనేకములు గలవు. ఇట్టిగ్రంథము లన్నియు నాతని పరిపాలనాకాలమునందే రచింపబడిన వనుట యుక్తము. అట్టివానిలో శాహజిసాహిత్యము, శాహజీయము, శాహజీ దండకములు ముఖ్యములు.

శాహమహారాజునాస్థానము నలంకరించిన తెలుగుకవులలో ప్రథమమున పేర్కొనదగినవాడు గిరిరాజకవి. ఇతడు అనిర్వాచ్యమగు నోంకారమను నాదబ్రహ్మోపాసకుడై గానామృతమును విశ్వముపై నొలికించి బ్రహ్మానందమును గలుగజేసిన త్యాగరాజస్వామికి తాతగారు. ఈతడు వాదవిజయము, సర్వాంగసుందర విలాసములను నాటకముల రచించి శాహమహారాజున కంకితమిచ్చెను. ఇతడు శాహేంద్రచరిత్రమును యక్షగానముగ రచియించెను. అందలి గద్యలో

'కండచక్కెరలీల కల్పించి రుచుల,
గండుమీరిన యక్షగానంబు మిగుల
గరిమను గిరిరాజకవి రచియించె'

అని చెప్పకొనియున్నాడు. ఈతని కవిత సహజమాధుర్యమును పొందియున్నది. ఇతని వర్ణనలు సహజములు. ఇతడు నాటకములందు హెచ్చుగా ప్రబంధపు పోకడల పోయెను. 'కొరవంజి5'ని వ్రాసిన తెలుగు

---

4. తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయ పట్టికయందు లేనిగ్రంథములకు మాత్రమే యిచట నాధారములు చూపబడును. మిగిలిన గ్రంథము లాపట్టికలోనివే.

5. కొరవంజిశబ్దము దేశ్యము – ఎఱుకవాడు, ఎఱుకది, సోది యని యర్థము. ఈ కవితావిభాగము (Poetic form)నకు ముఖ్యలక్షణము నాయకీవిరహము, ఎఱుకది సోది జెప్పుట, తరువాత నాయకీనాయకుల వివాహము. ఇందు కవి ప్రాచీనాంగ్లనాటకములందలి ప్రస్తావన (Prologue) వలె కథావస్తువును దిఙ్మాత్రముగా మొదట సూచించును. ఉదా:

కవులలో నీతడే ప్రథముడుగా కన్పించుచున్నాడు. గిరిరాజకవి 'రాజమోహన కొరవంజి' యను నొకగ్రంథమును రచించి శాహమహారాజున కంకితమొనర్చెను. ఈగిరిరాజకవి రాజకన్యాపరిణయ మను మరియొక కొరవంజిని రచియించి శాహమహారాజుమెప్పు వడసెను. శాహమహారాజు వాహ్యాళి వెడలుచుండగా జూచి రాజకన్య యొకతె ఆయనను ప్రేమించును. ఈవృత్తాంతము నారాజకుమారి తల్లిదండ్రులు తెలిసికొని యామెను మహారాజున కిచ్చి వివాహము గావింతురు. ఇది యిందలి ప్రధాన కథావస్తువు. గిరిరాజకవి బహు నాటకకర్తయని పేరుపొందినవాడు. కాని యితనినాటకములు మాత్రము నేడు మూడో నాలుగో కన్పించుచున్నవి. ఇతడు శాహజీ మరణానంతరము రాజ్యమునకు వచ్చిన యాతని తమ్ముడగు శరభోజి ప్రథమరాజ్యవత్సరములలో జీవించియున్నట్లు తెలియుచున్నది. ఇతడొకానొకచోట గద్యలో 'గిరిరాజనుతలీల శరభోజిభూపాల' యని చెప్పుకొనుటయేగాక శరభోజిభూపాలునిపేర నంకితముగా 'లీలావతీ కల్యాణ'మను నాటకమును రచించెను. ఇతనికవిత రసవత్తరమైన దగుటయేగాక సహజవర్ణనలగూడ కలిగియున్నది.

శాహజీమహారాజుసభ నలంకరించిన కవులలో గిరిరాజకవివెనుక పేర్కొనదగినవాడు విజయరాయావతంసకవి ఇతడు తన గద్యములందు 'సలోహితగోత్రాహోబళార్యపుత్ర కులపావన గిరిరాజ కవివరానుజ' యని చెప్పికొనియుండుటవలన నీతడు గిరిరాజకవి తమ్ముడని తెలియుచున్నది. ఇతడు తెనుగున 'అభినయదర్పణ'మను నాట్యశాస్త్రమును రచించి ఖండోజియనుమహారాష్ట్రసేనానికంకితమిచ్చెను. బాలకవి యను మరియొక కవివరేణ్యుడు తాను శాహమహారాజు కోరికపై పంచకన్యాపరిణయమను నాటకమును రచించితినని చెప్పుకొనెను. మహారాజే నాటకము నాంధ్రభాషలో వ్రాయవలసినదిగా కోరెనట. కాబట్టి యీతడు మరి యితర భాషలలోగూడ కవిత చెప్పగలవాడని యూహించుట కవకాశము కలుగుచున్నది. శాహమహారాజురాజ్యకాలముననే లీలావతీశాహరాజీయ మనునాటకమునకు కర్తయగు బాలకవి సుబ్బన్నయను నొక కవిపుంగవుడు కన్పించుచున్నాడు. పై బాలకవియు, నీ బాలకవి సుబ్బన్నయు నొకడేమోయని తలంచుట కవకాశము కలుగుచున్నది గాని యొక్కరేయని చెప్పుటకు తగినంత యాధారము లేమియు లేవు. బాలకవి సుబ్బన్న 'లీలావతీశాహరాజీయ' మనుగ్రంథమున 'సరికవు లెన్నునట్లుగా వ్రాసినాడ' నని చెప్పుకొనెను. కాబట్టి బాలకవి సమకాలీనులలో పేరుగన్నవా డన్నమాట. 'శేషాచలపతి' యను మరియొకకవి 'శాహమహారాజవిలాస' మను నాటకమును రచించెను. ఇతడు తన నాటకమున 'అష్టభాషా కవిత్వంబులమరు' నని చెప్పియున్నాడు. ఇతని పాండితీప్రకర్ష నిరుపమానమని యీ నాటకరాజము చెప్పకయే చెప్పుచున్నది.

### శరభోజి

### (క్రీ. శ. ౧౭౧౧-౨౮)

శాహమహారాజుమరణానంతరము అతని తమ్ముడగు శరభోజి రాజయ్యెను. ఇతడు శాహమహారాజువలె పండితుడు కవి కాకపోయినను కవులను పోషించెను. ఇతనికాలమున గిరిరాజకవి కొంతకాలము జీవించియున్నట్లు పైన పేర్కొని యున్నాను. ఈతని పరిపాలనాకాలముననే త్యాగరాజస్వామి జీవించి తన గానామృతమును వెదజల్లినది. త్యాగరాజు తాను జీవద్భాషలో వ్రాసిన దివ్యమైన కృతులు గాక 'నౌకాచరిత్రము', 'ప్రహ్లాదచరిత్రము' అను రెండు యక్షగానములుగూడ రచించెను. త్యాగరాజాంధ్రుడు, బ్రాహ్మణుడు, ములికినాటివంశజుడు. శాంతాదేవి రామబ్రహ్మ గర్భశుక్తిముక్తాఫలము. చోళదేశమునందలి పంచనద గ్రామనివాసి. తిరువడి గ్రామనివాసి యని శ్రీయుత జయంతి రామయ్యపంతులవారు వ్రాసియున్నారు. త్యాగరాజస్వామి తన నౌకాచరిత్రమున 'కాకర్లాంబుధిచంద్రుడు శ్రీకరుడగు త్యాగరాజచిత్తనివేశా' యని పేర్కొనుటవలన త్యాగరాజు గృహనామము కాకర్లవారని తెలియుచున్నది[7]. త్యాగరాజస్వామి నౌకాచరిత్రమున తన గురువర్యుడగు రామకృష్ణానందమును

'మ్రొక్కెద దేశికవరునకు,  
మ్రొక్కెద ధర్మార్థకామమోక్షుదునకు(?),  
మ్రొక్కెద పదముల ననిశము,  
మ్రొక్కెద శ్రీ రామకృష్ణమోదాఖ్యునకున్'

అని ప్రార్థించియున్నాడు. త్యాగరాజస్వామికి సంస్కృత ఆంధ్రవాఙ్మయములందు పరిపూర్ణపాండిత్యము కలదు. తమిళదేశమునందు వసించుచున్నను శ్రీ స్వామివారికి తమిళ మంతగా రాదు. పండితకవిగాయకవంశమున జన్మించిన త్యాగరాజస్వామి కవి, నాదబ్రహ్మోపాసకు డగుటలో నాశ్చర్యము లేదు. త్యాగరాజు తనకృతుల మాధుర్యయుతముగాను, సర్వజనప్రియకరములుగాను జీవద్భాషలో రచియించెను. నేటివరకును అరవము, కన్నడము, మళయాళము, తుళు, తెలుగు మొదలగు ద్రవిడభాషలందలి గానకళకు త్యాగరాజుకీర్తనలే జీవనాధారములుగా నున్నవి. ఈ మహాత్ముని కృపవలన నాంధ్రభాష దక్షిణదేశ సంగీతప్రపంచమునకు సామాన్యభాష (Lingua Franca) గా నున్నది. 'తెలుగుభాషయందున్న త్యాగరాజకృతులు ద్రవిడకర్ణాటకుల సంగీతపాటకులుగా తీర్చి దిద్ది నిత్యారాధన మొందుచున్నవి. భక్తి, జ్ఞానము, వైరాగ్యము, నీతి, ధర్మము మొదలగు గూఢ విషయములను గురించిన ఇతనికృతులు అసంఖ్యాకములుగా నున్నవి. ఇతనికృతులయందు కావ్యాత్మయగు జీవితవిమర్శ (Criticism of life) తొలుకాడుచుండును. ఇతడు తనజీవితాంతిమకాలమున కావేరిగట్టున కేగి ధనమునంతయు బీదసాదలకు పంచిపెట్టి సర్వసంగపరిత్యాగ మొనర్చి భగవంతునిగూర్చి ప్రార్థింపసాగెను. దక్షిణదేశమున నపరబ్రహ్మయు, నాంధ్రకవికులసూర్యుడునగు త్యాగరాజకవి ౮౦ట (?) (క్రీ. శ. ౧౮౪౭) పుష్యబహుళపంచమినాడు తనపాంచభౌతికశరీరమును వదిలెను[8].

---

శ్రీసుతతుల్యుడై చెలువొందునట్టి  
భోసలకులశాహభూపాలుమీద  
చెన్నుగా మోహితచిత్తయై రాజ  
కన్నెకామణి సరికాంతలు గొలువ  
గరిమతోడుత మును కదలి వచ్చుటయు  
నెలుకత వచ్చి తా నెలుక చెప్పుటయు  
గురుతుగా శాహేంద్రుగూడియుండుటయు  
అనియెడి రాజమోహనకొరవంజి'

6. J A H R. S, Vol, ii, 178.

7. 'నౌకాచరిత్రము'–వేంకటేశ్వర ప్రెస్, మద్రాసు (1907)

8 Andhra Patrika, 22nd May, 1937.

### తుళజమహారాజు

(క్రీ. శ. ౧౭౨౮ - ౩౫)

ఇతడు సంస్కృత ఆంధ్రవాఙ్మయములు రెంటియందును పాండిత్యముకలవాడు, కవి, సంగీతశాస్త్రజ్ఞుడు. ఇతడు సంస్కృతమున 'సంగీతసారామృత'మను దాక్షిణాత్య సంగీత శాస్త్రగ్రంథ మొకటి రచియించెను. ఇది కర్ణాటజన్యరాగప్రస్తారము వివరించు గ్రంథము. ఇది సంగీతశాస్త్రజ్ఞులకు ప్రామాణిక గ్రంథము. ఇతని సభాపండితుడు 'ఘనశ్యామపండితుడు' భవభూతి యుత్తరరామచరిత్రమునకు 'ప్రజ్ఞాప్రతిష్ఠ' మను వ్యాఖ్యానమును రచించెను9. ఇతడు 'కుమారవిజయ'మను మరియొక సంస్కృతకావ్యమునుగూడ రచియించెను. ఘనశ్యామపండితుని వ్యాఖ్యానము, కుమారవిజయకావ్యము సంస్కృతభాషాభిజ్ఞుల మెప్పువడసినవి. ఇతని యాస్థాన మలంకరించిన వారిలో సుందరి, కమల యనుకవయిత్రులు ముఖ్యులు10. వీరు సంస్కృతమున మంచి ప్రవేశమును సంపాదించి సంస్కృత వాఙ్మయమునందలి విద్ధసాలభంజిక యనునాటకమునకు వ్యాఖ్యానము రచించిరి.

తుళజమహారాజు తెలుగున 'శివకామసుందరీపరిణయ' మను నాటకమును రచించి ప్రదర్శింపించెను. ఈనాటకము ఈమహారాజు పాండితిని, గానకళాభిజ్ఞతను వెల్లడిజేయుచున్నది.

### ఏకోజి

(క్రీ. శ. ౧౬౭౫ - ౧౬౮౧)

ఇతడు తెలుగున రామాయణము సుందరకాండమును ద్విపదగా రచియించెను. విఘ్నేశ్వర కల్యాణమునుగూడ నాటకముగా రచియించెను. ఏకోజి ఈగ్రంథమును రాజ్యమునకు వచ్చినవెనుక రచియించెనో, లేక తండ్రి జీవితకాలముననే రచియించెనో నిర్ణయింపవలసియున్నది. అనేకపాపపరిహారార్థముగా సుందరకాండ పారాయణమొనర్చుటాచారముగా నున్నది. సంస్కృతసుందరకాండమును పారాయణ మొనర్పలేనివారలకు ఈ మహారాజు గానయోగ్యమగు నీద్వి

9. See the famous introduction of Kane to Uttararamacharitra.

10. Quarterly Journal of the Mythic Society, July-October, 1985.




నాగపూజ (అమరావతి)—చిత్రకారుడు: కె. వేణుగోపాలు

పద సుందరకాండమును రచియించి యుండు నని తలపవచ్చును. ఇతని జీవితకాలమున తల్లి రాజ్యమొనర్చుచున్నటుల తెలియుటచే నీతడు రాజకుమారుడుగా నున్నట్లెంచవలయును.

శాహామహారాజు

(క్రీ. శ. ౧౭౩౧ - ౩౯)

ఏకోజీ తరువాత నీతనికుమారుడగు శాహ మహారాజు క్రీ. శ. ౧౭౩౧ నుండి ౧౭౩౯ వరకు రాజ్యపాలన మొనర్చినవెనుక నాతని పదభ్రష్టుని గావించి యాతని సవతితమ్ముడగు ప్రతాపసింహుడు రాజ్యమునకు వచ్చెను. ఈశాహామహారాజు కాలమునగల వాఙ్మయ వికాసమును దెలిసికొనుట కేమియు నాధార ములు లేవు.

ప్రతాపసింహుడు

(క్రీ. శ. ౧౭౩౯ – ౬౩)

ఈరాజన్యుడు విషయలోలుడై రాజ కార్యములందు మనస్సుపెట్టలేదు. కాని కవు లను, ముఖ్యముగా కామకళ నెఱింగినవార లను పోషించినట్లు కన్పించును. ఇతనివిషయ లంపటతను సహింపజాలని 'వాంఛేశ్వరు'డను సంస్కృతకవి యన్యాపదేశముగ 'మూషిక శతకము'ను రచించి యీరాజన్యునిబుద్ధి మా ర్చుటకు బ్రయత్నించెను. వాంఛేశ్వరుడు రాజుగారి గృహామాత్యుడు, విద్వత్కవి. తెలుగున రాధికాసాంత్వనము లేక ఇళాపరిణయ మును రచించిన ముద్దుపళని ప్రతాపసింహుని యుంపుడుకత్తియే. ఈమెతండ్రి ముత్యాలు, తల్లి పోతి. ముద్దుపళని తనకావ్య గద్యమున 'శృంగారరసప్రధాన సంగీత సాహిత్య భరతశాస్త్రాది విద్యాపాటంగత తిరుమల తాతాచార్య పాదారవింద చోళసింహాస నాధ్యక్ష ప్రతాపసింహ బహుకృతానేక చామీకరాంబరాభరణ" యని చెప్పుకొని యున్నది. సంగీతసాహిత్యముల, భరత శాస్త్రమున మంచిపాండిత్య ముండుటవలననే రాజుమనసును చూరగొనగలిగినది. చూర గొనినంతనే యూరకొనక శృంగారరస ప్రధానునిగా నొనర్పగలిగినది. పళనిగ్రంథ మున సంస్కృతాంధ్రసాహిత్య మున్నది. రాధికాసాంత్వనమును పళని రచియించెనా, లేక గురువగు వీరరాఘవదేశికులు రచియిం చెనా యనుసంశయము మొదట సి. పి. బ్రౌ దొరవారికి కలిగినది[11]. పళని మహారాష్ట్రివని తగా కన్పించుటవలన నామె వ్రాసియుండ దని వా రూహపడిరి. కాని పళనితల్లిదండ్రు లనుబట్టి చూచినచో నామె యాంధ్రదేశస్త్రీ గనే కన్పించుచున్నది. ఆంధ్రమున కొంత భాగమును, సంస్కృత పదభూయిష్ఠముగా కొంతభాగమును రచియించియుండుటచే సం స్కృత మున్న భాగము వీరరాఘవాచార్యులు వ్రాసె ననియు, తెలుగుభాగము పళని వ్రాసి యుండు ననియు దొరవా రనుకొనుటలో తప్పున్నట్లు కన్పింపదు. అట్లు సమర్థించు టయే సమంజసమని నాయభిప్రాయము.

పళనిరాధికాసాంత్వనము సంభోగశృం గార రసప్రధానము. ఇందు పళని స్త్రీజన స్వాభావికమగు సిగ్గును విడనాడి శృంగార మును పచ్చిపచ్చిగా వర్ణించినది. ప్రబంధ కవులును సంభోగశృంగారమును విరివిగానే వర్ణించిరిగాని దానిని శైలికాఠిన్యతవలననో, వ్యంగ్య ప్రాధాన్యతవలననో కప్పిపుచ్చుచు వచ్చిరి. 'ఈకావ్యము మృదుపదభూయిష్ఠమై సరసంపుపల్కుల కాకరమై యున్నను,(గ్రంథ కర్త్రి) కథాంతమువరకును ఆలుమగలాటను వర్ణించుట, వివిధగతుల విస్తరించుట మొదలగు శృంగారవర్ణనలయందే తన నెఱజాణతనమును గనబఱచెను. ఆమె కావ్యలక్షణములను లక్ష్య ముజేయక కొంకు కొసరు లేక రసంపుబెంపును సొంపుగా గూర్పదలచి కృతిని బూతులబుంగను జేసె'నన్న సర్వసామాన్యవిమర్శనమునకు గుఱి యైనది. గాని ఈమెగౌరవపాత్రమైన గ్రంథమును రచించెనన్న మన్నన వడసినదిలేదు. కవనము రసవంతమైనది. సజాతీయము. స్త్రీహస్తము మాత్రము కవనమున కన్పించును. శృంగార రసవర్ణనలందు తిమ్మన పెద్దనల శృంగారపు బోలికలు, పోకడలు కలవు. పళనికి సంగీత ప్రావీణ్యము కలదన్నమాట యొప్పుకొనక తప్పదు. పళని రాధికాసాంత్వనమును గ్రం థముగాక సప్తపదులుకొన్ని రచించినది(?).[12] ఇవి యరవభాషయందు గోదాపరనామము ధరించిన చూడుకొడుత్తనాచ్చియారు రచించి నట్లుగా వాడబడుచున్న తిరుప్పావనుపాటకు తెలుగుసేత. ఇందు పదిపాటలు మాత్రమే యున్నవి. కాని యరవపాటయందు(?) ఇరు వదిపాటలు కన్పించుచున్నవి. ప్రతాపసిం హుని కోరికపై నెల్లూరి శివరామకవి కామ కళానిధియను రతిశాస్త్రమును రచించి మహా రాజున కంకిత మిచ్చెను.

కామకళకే ప్రాధాన్యమిచ్చిన యీ రాజ న్యుని పరిపాలనమున కవులనేకులు రాజాదరణ లేకపోయినను గ్రంథములు రచించిరి. అట్టి వారిలో పేర్కొనదగినవాడు రాఘవా చార్యులు. ఇతడు ముద్దుపళనిగురువు. ఇతడు నలచరిత్ర విష్ణుభక్త చరిత్ర అను రెండు ద్విపద గ్రంథములు రచించెను. ఇతడు వైష్ణవుడు. పండితవంశజుడు. తండ్రితాతలు పండితులై సంగీతాదికళలయం దనవద్యులై మెలగిరని చెప్పుకొనెను. ఇతని యింటిపేరు చక్రపురి వారు. రాఘవాచార్యులు తనతాత 'చక్రపురి విహారుం'డని చెప్పియున్నాడు. ఈ చక్ర పురము ప్రస్తుతము చక్రపల్లియని పిలువబడు చున్నది. ఇది తంజావూరుజిల్లా పాపనాశనము తాలూకాయం దున్నది. ఈ గ్రామము నందు చక్రపల్లివా రనేకు లున్నారు. వీరి కులగురువులుగా ప్రస్తుతమును కందాళవారే యున్నారు. ఇచ్చటి చక్రపురివారు రాఘవా

---

11 "An amatory poem written by **Palani............It does not seem probable that the lady herself composed the whole poem, parts of which display much learning. Her name and the other names she introduces as her relations appear to be Maharatta, utterly different from Telugu appellations. Her tutor Vira Raghavachari probably assisted her, but the composition in other parts evinces a female hand and it may be observed that she uses only the changing meteres, those being the easiest and loosest rhymes such as,** అఖండయతి and ప్రబయోరభేదయతి etc."

**C. P Brown's Note on Radhika Santwana. —(Madras Oriental Manuscripts Library Catalogue, Vol II, pt II page. 933)**

**12. Madras Oriental Manuscripts Library Catalogue, Vol. II, Part. III, No 221 (c).**

చార్య దేశికకవి తమవంశమువా డనియు, తమవంశము పండితవంశ మనియు సగర్వముగా చెప్పుకొనుచున్నారు. వావిళ్లవారచ్చు వేయించిన రాఘవాచార్యుని 'నలచరిత్ర'మను గ్రంధమునకు కడపవాస్తవ్యులగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగా రుపోద్ఘాతమును రచించిరి. అందు బ్రహ్మశ్రీ శర్మగారు 'ఇతడు దత్తమండలమున ప్రచారమందున్న మాటలను వాడుటవలనను, ఇతని యింటిపేరు గలవారును, ఇతని గురువంశజులును జెక్కురుండుట చేతను నీమహాకవి దత్తమండలవాసి యని యేబుధుండైనను దప్పక యొప్పుకొను'నని వ్రాసియున్నారు. కాని యితనివంశజులు 'చక్రపురము'నం దున్నారని రాఘవాచార్యులు పేర్కొనుటవలనను, ఇతనివంశజులు దత్తమండలమునకన్న తంజావూరుజిల్లా పాపనాశనము తాలూకాయందు హెచ్చుగ కన్పించుటవలనను, అదియునుగాక రాఘవాచార్యులు 'మాయూరివాడు', 'మావంశము లోని వా'డని సగర్వముగా చక్రపల్లిలోని చక్రపురివారు పేర్కొనుటవలనను నే నీతని నివాసస్థానము తంజాపురమండలముగాని దత్తమండలము కాజాలదని తలచుచున్నాను. బ్రహ్మశ్రీ శర్మగారుచూపిన యాధారములలో చక్రపురి గురువులనుగూర్చి ముచ్చటింపదగి యున్నది. కాని కవిగురువంశమునుబట్టి కవిదేశమును నిర్ణయింపజాలము. అదియునుగాక కందాళవారు రామేశ్వరము మొదలుకొని గోదావరివరకు గల దేశములో ననేక వైష్ణవకుటుంబములకు గురువులుగా కన్పించుచున్నారు. తాళ్లపాకవారున్ అట్టివారే. కాబట్టి కందాళవారినిబట్టి రాఘవాచార్యుని నివాసస్థానమును మనము నిర్ణయింపజాలము. బ్రహ్మశ్రీ శర్మగారు రాఘవాచార్యులు నలచరిత్రమున దత్తమండలపు మాండలికపదముల నుపయోగించి యున్నా డని వ్రాసిరి. కాని నలచరిత్రమునందుగాని, విష్ణుభక్త చరిత్రమునందుగాని దత్తమండలములోని ప్రత్యేకపదము లున్నట్లు కనుపింపవు. అట్టిమాట లన్నియు పూర్వకవులు ప్రయోగించినవే. అదియునుగాక రాఘవాచార్యుడు తన నలచరిత్రమున కందాళ దొడ్డయాచార్యుని ప్రస్తుతించెను. ఈ దొడ్డయాచార్యుని ప్రస్తుతించిన కవు లందఱును తమిళదేశమునందలి యాంధ్రకవులే గాని యాంధ్రదేశమునందలి యాంధ్రకవులుగా కన్పింపరు. కాబట్టి రాఘవాచార్యునినివాసస్థానము తంజావూరు పాపనాశనము తాలూకా యని తేటతెల్లమయినది. రాఘవాచార్యుడు బాల్యము నంతయు తన జన్మస్థానమగు చక్రపురమునందే గడపి తరువాతికాలమున తంజాపురమును ప్రవేశించి తనపాండితీప్రకర్ష వలనను, సంగీత శాస్త్రజ్ఞానమువలనను ముద్దుపళనిని శిష్యురాలిగా బడెయగలిగెను. ముద్దుపళని రాధికాసాంత్వనమునందలి సంస్కృతపద బాహుళ్యమంతయు రాఘవాచార్యుని సహాయమూలకమే. ఇతనికి ద్విపదకవిత్వమన్న నల్లేరుపై బండి. తిరుపతిప్రాంతమువాడగుటవలన తాళ్లపాకవారి అష్టమహిషీ కల్యాణమునందలి పదము లనేకము లీతని విష్ణుభక్త చరిత్రమున[13] గన్పట్టుచున్నవి. ఇతనికవిత్వము నిర్దుష్టము; అలంకారయుతము. కొద్దిపాటి దోషములున్నను త్రోసివేయదగినవి. ఇతడు తనద్విపదకావ్యములను కవిపామరజనవేద్యములుగా నొనర్చెను. పాల్కురికి సోమనాథ, రంగనాథాదు లెట్లు 'ద్విపదకావ్యంబు ముదికొంత దిడ్డికంత' యను నైచ్యభావమును బోగొట్టి కీర్తిపాత్రులైరో యితడు నట్లే తనకావ్యమును నవరసభరితముగ, ప్రబంధలక్షణములకు లోటులేకుండ నన్నివర్ణనల జక్కగ జేసి మృదుమధురములగు పదములతో ద్రాక్షాపాకంబున రచించెను. ఇతడు తన నలచరిత్రమున పరదారాసక్తివలన గలుగునష్టములు, వ్యసనాభిలాషవలన గలుగుకీడులు, పాతివ్రత్యము మొదలగు విషయములను జక్కగ పామరజనవేద్యములుగా రచియించెను.

### తుళజమహారాజు

(క్రీ. శ. ౧౭౬౫-౮౭)

ఇతనిరాజ్యకాలమున సంస్కృతమున 'రామచంద్రశేఖరకవి' యనునతడు 'కళావతీనందక'మను కావ్యమును రచించెను. తుళజమహారాజు సాహిత్యవేత్తగా కన్పించుచున్నాడు. ఆంధ్రవాఙ్మయమునం దీతనికాలమున ముఖ్యముగా పేర్కొనదగినకవు లిరువురే కన్పట్టుచున్నారు. అందు 'ఆంధ్రకాళిదాసు', 'అభినవకాళిదాసు' అను బిరుదుల బొందిన ఆలూరి కుప్పనకవి యొకడు. ఇతడు తనకాంధ్రకాళిదాసబిరుదమును తుళజమహారాజిచ్చినట్లుగా చెప్పుకొనియున్నాడు[14]. ఇతడు బహుకావ్యకర్త. కాని యితని ఆచార్యవిజయ, పార్థసారథివిజయములు[15]తప్ప మిగిలిన కావ్యములను జూచుభాగ్య మాంధ్రసారస్వతవేత్తలకు లభింపలేదు. ఇత డాచార్యవిజయమున తాను రచించిన యితరగ్రంధములను గూర్చి క్రిందివిధముగా చెప్పుకొనియున్నాడు:

సీ. లీల పంచనదస్థలీపురాణము తెని
గించితి వారూఢి కవిత మెరయఁ
బరగు రామాయణభాగవతంబులు,
యక్షగానము జేసి తద్భుతముగను
గర మొప్ప పరమభాగవతచరిత్రయు
కృతియొనర్చితివి యున్నతిదలిర్పఁ
దెలివొందు నిందుమతీపరిణయనామ
కృతి విరచించితి వతులగరిమ

గీ. (శ్రీ)గురుతరోజ్వలసరణి హారిక,
థాసుధాభిధకావ్య ముదారఫణితి
గా రచించితి వెనలేని గద్యపద్యశతులు,
లెక్కింప దఱమె తత్కృతులు జగతి.

ఈతనికావ్యములవలనే యీ నాయకుల పరిపాలనమున రచియింపబడిన గ్రంధములు అనేకము లింతవరకును దృష్టిపథగోచరము కాకున్నవి. ఆలూరి కుప్పనకర్తృత్వమున 'పార్థసారధివిజయ'మను నొకతాళపత్రగ్రంధము మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునం దున్నది. కుప్పనకవి యాచార్యవిజయమున 'అనంతానందగిరి గురురచనా విశేషంబు నానేర్చినంత తెనుంగుగా విశదంబు చేయంబూని' యని చెప్పియున్నాడు. ఇందు పేర్కొనబడిన అనంతగిరి సంస్కృతి శంకరవిజయకర్త కావలయును. ఈసంస్కృతి శంకరవిజయము కొలదికాలముక్రిందట ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచే సంపాదింపబడినట్లు

---

13. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సం. 4, పుట. ౩౨౦.

చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము, నెం. ౧౧౮౨.

14. ఘనుఁడగు తుళజేంద్రుఁడు దయ
తనరగ నీ కాంధ్రకాళిదాసాభిఖ్య మ
న్ననగా నొసంగెనట నీ
యనుపమసాహిత్యమున కహా యెన గలదే?
—(ఆంధ్రకవులచరిత్ర, మూడవభాగము. పేజి, ౧౨౧).

15. **Madras Oriental Library Catalogue, Vol. II, pt. ii. Page, 684.**

తెలియుచున్నది[16]. ఈ శంకరాచార్యవిజయ మును కవి చెన్నపురిప్రజలకోరికపై రచియించితినని చెప్పుకొనియున్నాడు. ఇతనికవనము ప్రబంధకవుల కవితాధోరణి గల్గి రసవంతమై యున్నది.

ఇక రెండవకవివర్యుడు 'కస్తూరి రంగకవి'. ఆలూరి కుప్పనకవి తనగద్యమున 'కస్తూరి రంగ సద్గురు పాదారవింద భజనానందిత హృద్విలాస'యని చెప్పుకొనుటచే నితడతనిశిష్యుడని వెల్లడియగుచున్నది. ఇతడు గొప్పలక్షణ కవి. సర్వస్వతంత్రుడు. కుప్పనకవి రంగకవిని ప్రస్తుతించుచు,

సీ. భారతి కేవి ప్రవర్యునిజిహ్వ ని
  త్యముగ వసించు నాస్థానవాటి
వాణీవధూటి కెవ్వాని నుప్పలుకులు
  ధరియించునట్టి ముత్యములచాలు
శారద కేసుధీస్వామిచేతోవీథి
  యమరిన రత్నసింహాసనంబు
పలుకులవెలది కేభావజ్ఞుని గృహంబు
  నెట్టుగా వసియించు పుట్టినిల్లు

గీ. నలువచెలువకు నెవ్వ డెన్నదగుపుత్రు
  డట్టి కస్తూరి రంగార్యు నచలధైర్యు
  నార్యమతచర్యు మద్గురువర్యు నెంచి
  ప్రణుతిగావింతు పలుమారు ప్రస్తుతింతు

అని చెప్పియున్నాడు. రంగకవి గొప్ప లక్షణవేత్త. రంగకవి తనయానంద రంగ రాట్ఛందముపీఠికలో 'జతుర్విధాంధ్రకవితా సల్లక్షణ గ్రంథశోధన ధీసంయుతుడ' ననియు, 'భావగర్భపదపద్యాళి ప్రబంధానుబంధుడ' ననియు చెప్పుకొనియున్నాడు. ఇతడు లక్షణచూడామణియను నామాంతరముగల 'ఆనందరంగరాట్ఛందమును, 'కృష్ణార్జునసంవాద' మను నైదాశ్వాసముల రసవత్కావ్యమును రచించెను. ఆకాలమున పాండిత్యమున కస్తూరి రంగకవిని మించినవాడు లేడు. రంగకవి ఆనందరంగరాట్ఛందమును ఫ్రెంచిగవర్నరగు డూప్లేకు ద్విభాషి(Translator)గా నుండి పుదుచ్చేరియందు నివాస మేర్పరచు కొనిన యానందరంగపిళ్లై కంకితమిచ్చెను17. ఇతడు తనఛందోగ్రంథ మునం దనేక కవులను, వారిప్రయోగములను పేర్కొని యున్నాడు. ఇతడు సాంబనిఘంటువని పేరు వడసిన శబ్దకోశము నొకదానిని రచించెను. ఇది తాళ్లపాకవారి వేంకటేశ్వరాంధ్రము ననుకరించినట్లు కన్పించును. ఆయాపదముల కానిఘంటువునందుగల పర్యాయపదములనట్లె దీనియందు నుంచెను. కాని వెంకటేశ్వరాంధ్రముకన్న రంగకవిసాంబనిఘంటువు కొంత విపులముగాను, మరికొంత ప్రౌఢముగాను, మిగుల సలక్షణముగాను చూపట్టుచున్నది. ఇందు ప్రయోగసిద్ధములుగాక వ్యవహారైక శరణ్యములగు పెక్కుశబ్దములు కన్పించు చున్నవి. కస్తూరి రంగకవి తా 'నుమామహేశ్వర కరుణాకటాక్షలబ్ధ సాహితీవిభవుడ' నని చెప్పుకొనియున్నాడు. ఇతడు వెంకట కృష్ణార్యుని పుత్రుడు; శ్రీవత్సగోత్రుడు; ఆర్వేలకమ్మనియోగి.

## అమరసింహుడు

(క్రీ. శ. ౧౭౮౭ - ౯౮)

ఇతనికాలమున మాతృభూతుడను తెలుగు కవి పారిజాతాపహరణమను నాటకమును రచించెను. ఇతడు శాండిల్యగోత్రజుడు. ఈ నాటకమున కవి తన్నుగూర్చి 'మాతృభూత స్వామి మహితకటాక్ష చాతుర్య పరిలబ్ధ సరస సాహిత్య, సంగీత మధుర వాగ్ఝరి గల్గువాడ, శృంగారరసము తెలిసిన మేలువాడ' నని వ్రాసికొనియున్నాడు. గద్యయందు 'సుధాసార సంజనిత చతుర్విధ కవితా నిర్వాహకుడ'నని చెప్పుకొనినాడు. ఇతడు తననాటకమును ప్రబంధధోరణిని గానయోగ్యముగా నొనర్చెను. మాతృభూతకవితండ్రిపేరు రంగకవి. ఇతడే గ్రంథములు వ్రాసెనో యెఱుకపడకున్నది. ఇతడు కస్తూరి రంగకవిమాత్రము కాడు. వారి గోత్రమును వీరిగోత్రమును భేదించినవి.

## శరభోజీ

(క్రీ. శ. ౧౭౯౮ - ౧౮౩౨)

ఇతనికాలమున కవులపోషణ మెట్లుండెనో తెలియరాదు. కాని తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయమును చక్కబరచి తాళపత్రగ్రంథములకు ననేకప్రతుల వ్రాయించి భద్రపరపించెను. ఇతడు తాళపత్ర గ్రంథములను తిరుగ వ్రాయించి భద్రపరపించుటకుగాను వరాహప్పయ్యదీక్షితులను ఫౌజుదారును నియమించెను[18]. ఇతడు వేగినాటి బ్రాహ్మణుడు. అందువలననే శరభోజీపేరు ననే తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయము పేర్కొనబడుచున్నది.

## శివాజీ

(క్రీ. శ. ౧౮౩౩ - ౩౫)

ఈరాజన్యుడు తెలుగున 'అన్నపూర్ణాపరిణయ'మను నాటకమును రచించెను. దానిని 'సకలవిద్యా ప్రవీణులైన సభ్యులుగల నాటకశాలలందు నటియింపజేయ దలపెట్టితి' నని గ్రంథావతారికలో జెప్పుకొని యున్నాడు. ఇందు తంజపురమునందలి కొంకణేశ్వర అన్నపూర్ణల వివాహోదంతము సొగసుగా వర్ణింపబడినది. ఇతని యాస్థానకవి వెంకటకృష్ణయ. ఇతడు శివపారిజాతమను నాటకము నొకదానిని రచించెను. అందలిగద్యలో 'శ్రీ శివాజీ మహీపాలుని తెలుగుకవి వెంకటకృష్ణా జెట్టి' యని వ్రాసుకొని యుండుటవలన శివాజీ కొంతమంది సంస్కృత కవులనుగూడ పోషించినట్లు ద్యోతకమగుచున్నది.

ఈ మహారాష్ట్రనాయకుల పరిపాలనకాలమున సేనాపతు లనేకులు వాఙ్మయాభిలాషులై వర్తించిరి. అట్టివారిలో ఖండోజి యొకడు. ఇతడే మహారాష్ట్రనాయకుని సేనాపతియో ప్రత్యేకముగా తెలియదు. ఇతడు కలిగిరి యను కవిని పోషించి రుక్మాంగద చరిత్రమను నేకాదశీ మాహాత్మ్యమును తెనుగున ద్విపదకావ్యముగ రచియింపజేసెను. ఈ కలిగిరి వెనుక శాహజీకాలమున చెప్పబడిన శ్రీగిరికవి వంశజుడు.

మహారాష్ట్రనాయకుల కాలమున వెలసిన ఆంధ్రవాఙ్మయము సింహావలోకన మొనర్చినచో వీరికాలమున 'నాటక వాఙ్మయము' హెచ్చుగా నభివృద్ధిజెందినటుల కన్పించును. ఈ నాటకములు సంస్కృతవాఙ్మయము నందలి నాటకములతో నెట్టిసంబంధమునులేక సర్వస్వతంత్రములైనవి. 'ప్రతిభ' శిశిరసంచికలో శ్రీయుత చింతా దీక్షితులుగారు యక్షగానము లనుశీర్షిక క్రింద ఆంధ్రనాటకముల యభివృద్ధినిగూర్చి విపులముగా చర్చించియున్నారు. ఆంగ్లనాటకములు గ్రీకునాటకసంపర్కము లేకుండా సర్వస్వతంత్రముగా ఒపే.

16. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, Vol. III, P, 20.

17. చూడుడు: ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సం, VIII. "ఆనందరంగపిళ్లై".

18. J. A. H. R. S , Vol. II, pts, 3 & 4, p. 173.

రాల (Operas)నుండి పుట్టినట్లుగా నాంధ్ర నాటకములు తోలుబొమ్మలాటనుండిపుట్టినవి.

మహారాష్ట్రు లన్యదేశీయులైనను ఆంధ్ర భాషను గౌరవించి పోషించిరన్నచో తెలుగుభాష తేనెతెరలవంటి దగుటయేగాక దానికిగల శ్రవణపేయమగు శబ్దమాధుర్యము (Euphony) ఏ యితర దాక్షిణాత్యభాష లకు లేకపోవుటయే ముఖ్యకారణము. కావు ననే కర్ణాటాధిపతియగు కృష్ణరాయలు 'దేశ భాషలందు తెలుగు లెస్స'యని పొగడియు న్నాడు.

జనని సమస్తభాషలకు
సంస్కృతభాష ధరాతలంబునన్
ఘనలలితార్థగౌరవవి
భాసితెనుం గభీరమ్ము మంతనన్
గనుగొనఁ జాతబీజమున
కంటెను గోమలపత్రపుష్ప శో
భనమృదుపల్లవాభినవ
బాలరసాలము సొంపు నింపఁదే.

(శ్రీ పర్వత పురాణకర్త)

---

# ఆంధ్రావనీ!

బొడ్డు బాపిరాజు



తల్లీ! ఆంధ్రపురంధ్రి! యిప్పటికి మూతల్ వడ్డ నేత్రమ్ము లు
త్ఫుల్లాంభోజము లయ్యె; నీ వనగ నేమో యెంచుకోలేని యా
యుల్ల మ్మింతకు తల్లడిల్లినది; నీ యూహాతిపాతాకృతుల్
తెల్లంబైనవి నేటి కీజడుని బుద్ధిన్, ప్రేమవారాన్నిధీ!

తెనుగుందేశము పుట్టినిల్లు, గురులున్ దిద్దించినా రోనమాల్
దెనుగుంబాసను, ఈశరీర మిది తల్లీ! పుష్టిజేకొన్న దీ
తెనుగుంబంటల, చుట్టపక్కములు నీ తెన్గుల్, సమస్తంబు నీ
తెనుగేయంచు నెరింగితిన్ గతపరాధీనప్రసన్నస్థితిన్!

నిలువన్ నీడయు కూడుగూడ కరవౌ నిర్భాగ్యదేశీయమూ
ర్తులకంఠమ్మున నీదువేదన, వెతల్ దోగాడు నాచూపులన్
చెలువుం బాసిన నీముఖమ్ము గనుపించెన్! సత్య, మిన్నాళ్లకుం
దెలిసెన్ నీ కలరూప మెల్లయు! నమస్తే అస్మదాంధ్రావనీ!

# ఆంధ్రసూత్రకారులు
# బోధాయన, ఆపస్తంబులు

గొబ్బూరి వేంకటానంద రాఘవరావు

ఆంధ్రులు బహు ప్రాచీనులు. భారతదేశపు నాగరకతలో నేమి, భరత ఖండపు సర్వంకష కృషిలో నేమి ఆంధ్రులు నిర్వహించినది విశేషాంశము కాని స్వల్పమాత్రము కాదు. మొదట కిరాతజాతులలో పరిగణింపబడినను, వేదవాఙ్మయమున ఆంధ్రునకు కల స్థానము గొప్పది. ఆ కాలపు ఆంధ్రులు తత్త్వ వివేచనమునందును, విజ్ఞానమునందును, కళలయందును, బాహుబలమునందును, శౌర్యధైర్యములయందును ఆర్థిక వాణిజ్యవ్యవస్థలయందును ఒకరికి తీసిపోని దిట్టలని చరిత్ర వేనోళ్ల ఘోషించుచున్నది.

ప్రాచీనాంధ్రనాగరకతాస్వరూపము చక్కగా తెలిసికొనుటకు మనము ప్రాచీనాంధ్రఋషిసత్తములైన బోధాయన, ఆపస్తంబులు చేసిన మహాత్కార్యములు కొన్నింటిని స్మరింపవలెను. బోధాయనుడు ఆంధ్రఋషులలో చాల ప్రాచీనుడు. ఆపస్తంబుడు ఆంధ్ర నాగరకతా ప్రపంచమున నఖండ తేజముతో నిరుపమానముగా వెలుగుచున్న దివ్యజ్యోతి. అయిననేమి? దివాంధములవలె నేటి తెనుగువారా వంక చూడనైన చూడనేరకున్నారు. ఆనాటి ఆంధ్రుల నాగరకతయు, సర్వంకషకృషియు వారు రచించిన కల్పసూత్రములలో మూర్తీభవించియున్న వనుట సత్యము. ఆ మహానీయులనుగూర్చియు, వారిమహోత్తమ గ్రంథములను గూర్చియు తెలిసికొని మేలొందుటలో ఆంధ్రేతరులకు గల శ్రద్ధలో సహస్రాంశమైనను తెలుగువారికి లేదుకదా! అని తీరనిదుఃఖము కల్గుచున్నది. బోధాయనసూత్రములను వియన్నానగరవాస్తవ్యులైన



హుల్ట్‌ష్ దొరగారు ౧౮౮౪-వ సంవత్సరములో జర్మనీదేశపు లీప్జిగ్ పురమున ప్రకటించిరి. ఇంగ్లండులో మాక్సు ముల్లర్ దొరవారి సంపాదకత్వమున వెలువడిన 'సేక్రెడ్ బుక్స్ ఆఫ్ ది ఈస్టు' (Sacred Books of the East) అను ప్రాగ్దేశ పవిత్రగ్రంథమాలికలో ౨-వ సంపుటముగా జార్జి బ్యుహ్లర్ దొరగారు ఆపస్తంబధర్మసూత్రములు ఇంగ్లీషులోనికి అనువదించి ప్రకటించినారు. ఆ గ్రంథమాలికలోనే ౧౪-వ సంపుటములో బోధాయనసూత్రములు ఇంగ్లీషున ప్రకటింపబడినవి. ఇటీవల ౧౯౧౯-వ సంవత్సరములో లక్ష్మణపురి (Lucknow)యందు నవకిశోర ముద్రణాలయమున చతుర్వేది ద్వారకాప్రసాదశర్మగారి సంపాదకత్వమున హిందీభాషలో ప్రకటింపబడుచున్న భారతీయ చరితాంబుధిలో ఆపస్తంబుని గూర్చి మంచి వ్యాసము ప్రకటింపబడినది. మన తెనుగుదేశములో మన జాతీయోద్ధారకులలో నగ్రగణ్యులైన ఆపస్తంబుని పేరు వేయిమందిలో కాదు—పదివేలమందిలో నొకనికైన తెలియునో లేదో అని సంశయము కలుగుచున్నది.

తనకు అమూల్యమైన సేవ చేసి ధన్యులైన మహానీయులను ఏ దేశముమఱచిపోవునో, ఏజాతి తన నుద్ధరించిన మహాపురుషులను స్మరింపదో ఆ దేశమునకును, జాతికిన్ని మోక్షము లేదను గొప్ప సత్యమునకు నేటి ఆంధ్రులే ప్రబలనిదర్శనము.

ఇకనైన మన ఆంధ్రులలో మహానీయులను కొందరిని స్మరించి వారొనరించిన ఘనకార్యములను తలంచుకొందము.

### ౧. బోధాయనుడు

ఇతనికి బౌధాయనుడని పేరు కలదు. బోధాయనుడని వాడుక కలదు. ఆంధ్రఋషులలో నితడు

మిక్కిలి ప్రాచీనుడు. కల్పసూత్రకారులలో నితడు ప్రథముడు. ఆదికాలములలో నాలుగు వేదములు, బ్రాహ్మణములు పూర్తిగా చదువుకొనుటకు నలుబదియెనిమిది సంవత్సరముల కాలము పట్టెడిది. గర్భాష్టమమున నుపనయనమై ౪౮ సంవత్సరములు అధ్యయనము చేయుసరికి ఏబదియైదు సంవత్సరములు నిండెడివి. ఈనాడు మనవారు ఉద్యోగమునుండి విరమించు నీ వయస్సు వఱకును ఒక్కొక్కడు విద్యార్థిగానే ఉండిపోవుట ఆ కాలపువారికి కష్టమైనది. కనుక వేదసారము, ధర్మసారము, కర్మకాండసారము సులభముగా తెలిసికొని అనుష్ఠించుటకు సులభరచనలు — Made easy గ్రంథములు - అవసరమైనవి. అప్పుడే కల్పసూత్రములు రచింపబడినవి. "మాత్ర లాభా — పుత్ర లాభా" అని ఒక్క అక్షరము, ఒక్క స్వరము (one syllable) తగ్గినచో పుత్రలాభమైనంత సంతోషము పొందుచు సూత్రకారు లతి సంగ్రహశీలములు (Very brief)గా నీసూత్రములను రచించిరి. కొంచెము అక్షరములుగల రచనములో విశేషార్థము ఇమిడియుండునట్లు మిక్కిలి నేర్పుతో ఈ సూత్రములు రచింపబడినవి. ఈ సూత్రరచన మనవా రొనరించిన ఘనకార్యములలో నొకటి యని భావింపవచ్చును. "సంగ్రహశీలతయే చమత్కార రచనమునకు ఆత్మ" (Brevity is the soul of wit) అను సత్యమును ఇటీవలకదా ఇంగ్లీషువారు తెలిసికొనిరి ?

బోధాయనుడు తూర్పుసముద్ర తీరమున నాంధ్రదేశములో నెక్కడనో నివసించుచుండెను. అతడుండినస్థల మిది యని నిర్ణయించుట సాధ్యము కాలేదు. అతనికాలము నాటికి సంఘములోనున్న గృహస్థులేదో యొకవిధమున పుత్రులను బడయనిపక్షమున ఊర్ధ్వలోకగతులును, పిండోదకక్రియలును ఉండవని భయపడుచుండిరి. అప్పటికి దేశము విరివి యెక్కువ; జనసంఖ్య తక్కువ. తమ వంశము నిలిపి, తమ యనంతరము ఆస్తుల ననుభవించు పిల్లల కొఱకు ఆనాటిగృహస్థు లతియాతురపడుచుండిరి. స్వభార్యయందు ఔరస పుత్రభాగ్యము పడయలేని గృహస్థులు దేవరన్యాయమున క్షేత్రజులను పుట్టించుకొనుచుండిరి. ఒకస్త్రీ ఒకరింటి కోడలైనపుడును, ఆమె భర్తవలన సంతానము బడయజాలనపుడును ఆయింట నితరపురుషులచే ఆమె గర్భలాభమును పొందవచ్చునను దేవరన్యాయమునుబట్టియే వ్యాసుడు ధృతరాష్ట్ర పాండురాజులను పుట్టించెను. ఔరసపుత్రులు లేనపుడు పాండవులవంటి క్షేత్రజులను, కర్ణునివంటి కన్యాకాపుత్రులను (కానీనులను) - ఈ మొదలగు దశవిధపుత్రులను బోధాయను డంగీకరించెను. ఆనాటి సంఘమునకు ఆ ధర్మము వర్తించెను.

కాని క్రమముగా నట్టి దేవరన్యాయమువలన నసహ్యకరమగు పరిస్థితు లేర్పడుచుండెను. "ఒకమారైన నొకటియు, మరొక్కమారైన మరొకటియునా ?" అని స్త్రీపురుషు లింటింటను కామతంత్రులై యథేచ్ఛగా వర్తింపజొచ్చిరి. పెక్కుగృహములు ప్రత్యక్షనరకములా యనిపించునంతటి దుస్థితి యేర్పడి సంఘమంతయు రోతపుట్టించెను.

### ౨. ఆపస్తంబుడు

ఆ కాలమున నాంధ్రదేశమున నాపస్తంబు డుద్భవించెను. ఆ మహనీయుడు గొప్ప సంస్కర్త. ధర్మశాస్త్ర రచయిత. మహామేధావి. ప్రాచీనకాలపు రేఖాగణితశాస్త్రజ్ఞులలో (Geometricians) ప్రథమస్థాన మందినాడు. అతి పవిత్రమూర్తి. దోషభూయిష్ఠమైన సంఘమును అగ్నిహోత్రునివలె సంస్కరించి పాపముల నూది దహించివైచినాడు. వింధ్యపర్వతశ్రేణికి దక్షిణముననున్న దక్షిణాపథమున గల ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాట, ద్రవిడ దేశములలో ద్విజకోటులలో నూటికి తొంబదిమంది ఆపస్తంబసూత్రులే! అనగా తాము చేయు సమస్తకర్మలను, తా మొనరించు జీవితధర్మములను ఆపస్తంబుడు రచించిన సూత్రముల ననుసరించి నడుపుకొనువా రని అర్థము. యజ్ఞయాగములు చేయునపుడు వారు చెప్పుకొను సూత్రములు ఆపస్తంబరచితములైన శ్రౌతసూత్రములు. నామకరణ, చౌల, ఉపనయన, వివాహ, గర్భాధానాది శుభకార్యములలో పురోహితు లేకరువుపెట్టునవి ఆపస్తంబకృత గృహ్యసూత్రములే.

### ధర్మసూత్రములు

ఆపస్తంబకృతములైన ధర్మసూత్రముల ననుసరించి మనుస్మృతి,

యాజ్ఞవల్క్యస్మృతి రచింపబడినవి[1]. అందు యాజ్ఞవల్క్యస్మృతికి విజ్ఞానేశ్వరయోగి రచించిన మితాక్షరన్యాయమే వారసత్వాది తగువులలో నేటికిని మన న్యాయస్థానముల (Law Courts) లో హిందూధర్మశాస్త్ర (Hindu law)మనవొప్పుచు చెల్లుబడికలిగియున్నది. ఆపస్తంబుడు బ్రహ్మచర్యధర్మములను చక్కగా శాసించి చిన్ననాడే బాలుర అహంకారము నిర్మూలించుకొని, ఇంద్రియనిగ్రహము పొందుటకు క్రమశిక్ష సూచించినాడు (చూ: ధర్మసూత్రము, I. ౧-౨-౧౯):

"అథ బ్రహ్మచర్యవిధి రాచార్యాధీనస్స్యా దన్యత్ర పతనీయేభ్యో, హితకారీ, గురో రప్రతిలోమయన్ వాచా ఉధా ఽఽసనశాయీ నానుదేశ్యం భుంజీత తథా క్షారలవణ మధుమాంసాన్యాది వాస్యా వ్యగంధ సేవీ మైథునం న చరే దుత్సన్న శ్లాఘేంఽగాని న ప్రక్షాళయీనాప్సు శ్లాఘమాన స్నాయా ద్యది స్నాయాద్దండవత్ప్లవే జ్జటిల శిఖాజటో వా వాపయే..."

శిష్యుడు గురువునెడల విధేయుడై మెలగవలెను. కులభ్రష్ట హేతువులైన పాపకార్యములు గురువు చేయుమన్నను చేయనక్కరలేదు. గురువుగారికి హితకరమైన పనులు చేయవలెను. గురువాక్యములు ఆక్షేపింపరాదు. గురునిదిగువ కూర్చొనవలెను. యజ్ఞ పితృకార్యములలో భోజనమునకు పోకూడదు. ఉప్పు, కారము, తేనె, సారాయి, మాంసము మొదలగువానిని వర్జించవలెను. పగలు నిద్రింపకూడదు. గంధాదులు శరీరమునకు పూసుకోకూడదు. స్త్రీసంభోగము చేయరాదు. తన శరీర మలంకరించుకోకూడదు. వేడినీళ్లతో స్నానము చేయరాదు. శరీరము మలినమైనపుడు గురువుగారికి కనబడకుండ మృత్తికాజలములచే శుద్ధిచేసికోవలెను. నీళ్లలో ఆటలాడకయే స్నానము చేయవలెను. ఈదునపుడు కఱ్ఱవలె తేలి ఈదవలెను. తల ముడి వేసికోవలెను.

మఱియు నిట్లు చెప్పబడినది:

అనృత్తదర్శీ సభా స్సమాజాశ్చాగంతా ఽజనవాదశీలో రహశ్శీలో గురో రుదాచారే ష్వకర్తా స్వైరికర్మాణి స్త్రీభి ర్యావదర్థసంభాషీ మృదుశ్శాంతో దాంతో హ్రీమాన్ దృఢధృతి రగ్లాంసు రక్రోధ నోనసూయు స్సర్వం లాభమహారన్ గురవే సాయంప్రాతరమత్రేణ భిక్షా చర్యం చరే ... (I. ౧-3-౧౧-౨౫).

బ్రహ్మచారి నృత్యము చూడరాదు. జూదముజరుగు సభలకు సమాజములకు పోకూడదు. వేడుకలకును, పండుగలకును పోగుపడు జనసమూహములలోనికి పోరాదు. పొల్లుప్రసంగములు చేయరాదు. గురుసమక్షమందు స్వకీయానందకరములైన కార్యములు చేయకూడదు. ఎంతవఱకు అవసరమో అంతవఱకేకాని స్త్రీలతో అనవసరసంభాషణ చేయరాదు. బ్రహ్మచారి క్షమాశీలుడై ఇంద్రియనిగ్రహము కలిగి స్వధర్మ నిర్వహణమునందు విసువులేక పట్టుదలతో పనిచేయుచు ముగ్ధుడై యుండవలెను. క్రోధము వర్జించి అసూయ పరిహరించి ఆర్జవముకలవాడై కార్యతత్పరుడై యుండవలెను. ఉదయమును సాయంత్రమును భిక్షార్థము పోయి తాను తెచ్చినదంతయు గురుసమర్పణ చేయవలెను.

బ్రహ్మచర్యధర్మములనే కాదు నాటిసంఘమును పీడించుచున్న దురాచారములను మహాసంస్కర్తయగు నాపస్తంబుడు ఈదిగువ వాక్యరత్నములలో బలముగా ఖండించి సంఘమును, గార్హస్థ్య జీవనమును పవిత్రవంతముగా చేసి ఆంధ్రజాతి భ్రష్టముకాకుండ సంరక్షించినాడు. చూడుడు: (ఆ. ధర్మసూత్రములు—II. ౧౦-౨౭-3).

"కులాయహి స్త్రీ ప్రదీయత ఇత్యుపదిశంతి

౪. త దింద్రియదౌర్బల్యా ద్విప్రతిపన్నం

౫. అవశిష్టం హి పరత్వం ప్రాణే

౬. తద్వ్యతిక్రమే ఖలు పునరుభయో ర్నరకః

1. See Max Muller's letter to W. H. Morley who published it in his Digest of Indian Cases 1850· "What I consider to be the sources of మానవధర్మశాస్త్ర — are the Sutras I have taken ఆపస్తంబసూత్ర —I find these Sutras contain generally almost all the same words which have been brought into vogue by the compiler of metrical మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి-" etc.

౭. నియమారంభణో హి వర్షీయానభ్యుదయఏవ మారంభణా దపత్యాత్."

"కన్యకువివాహము చేయునపుడు వరునకేకాక, ఆమె వరుని కుటుంబమువారికందఱకును ఇయ్యబడినది. కనుక భర్తవలన సంతానప్రాప్తిలేని భార్య అతనిసోదరులవలన నియోగపద్ధతిచే పిల్లలను కనవచ్చు" నందురు. "ఆ నియోగము సంతానప్రాప్తితో నాగక స్త్రీపురుషుల ఇంద్రియదౌర్బల్యముచే ప్రమాదకర మగుచున్నది. కన్య భర్తకొఱకే ఇయ్యబడినది. దేవరులైనను, ఇతరులైనను ఒకనిభార్యకు పరపురుషులే అగుదురు. పరపురుషదూషితమైన భార్యచే ఆదంపతుల కిరువురకును మహాపాపము కలుగుచున్నది. కులపాలికల నన్యపురుష రేతోదూషితలం జేసి బడసిన సంతానము వలన కలుగు పుణ్యముకంటె సంతానమును బడయక సధర్మిణియై పాతివ్రత్యమును పాలించిన భార్యకును ఆమె భర్తకును అధికపుణ్యము లభించును. గృహమును సంఘమును నరకములు కాక పవిత్రములై నిలుచును" అని యీవిధముగా చక్కగా శాసించి పవిత్రగార్హస్థ్య జీవనమును, ఆంధ్రసంఘజీవనమును శుచిమంతములుగాను, పుణ్యవంతములుగాను చేయుటకు ఆ మహామహుడు ఎంత ధైర్య మవలంబించి పట్టుదలతో పనిచేసెనో మన మూహింపజాలము.

బలవంతులును, ధనవంతులును నగు ఇంగ్లీషు మద్యవిక్రేతలకు జడిసి ఇంగ్లండుప్రభుత్వమువారు మద్యపానముచే సంఘమునకు ప్రాప్తించుచున్న ఘోరవిపత్తును నిర్మూలించు శాసనమును నిర్మింప నశక్తు లగుచున్నారు. ఇది నేటికథ.

నాడు దక్షిణాపథరాజ్యములలో విషయలంపటులైన స్త్రీపురుషులలో నీ ప్రచండశాసనమును అమలులోనికి తెచ్చుటలో ఆ ధర్మకర్త ఎట్టి యిక్కట్టులకు లోనయ్యెనో తెలియదు. కాని ఆ పవిత్రోజ్జ్వల మూర్తి యీ మహత్తరసంస్కారమును జయప్రదముగా సాధించిన మాట నిజము.

వశిష్ఠపుత్రుడైన శక్తిమహాముని శిష్యులలో నొకడు కాలదమను డను వైశ్యుడట! అతడే ఉత్తర జన్మమున నాపస్తంబుడై పుట్టెనట! ఆపస్తంబునిభార్య అక్షసూత్ర; కుమారుడు కర్కి. ఈ వివరములు వామనపురాణమువలనను, పురాణసారసంగ్రహము వలనను తెలియుచున్నవి.

ఆపస్తంబు డనునది పౌరుషనామము. అత డొకసారి నిర్మానుష్యమైనచోట నేదో పని చేయుచుండగా నపవిత్రు లెవరో దోషదృక్కులతో నతనిని చూచుచుండిరట. అది కని పెట్టి అతడు తనచుట్టును నీళ్లు జల్లెనట. వెంటనే అవురుదుబ్బులును, నిలివెడెత్తున రెల్లుగడ్డియు లేచిపోయెనట! అందుచే నితడు వారికు కనపడలేదట! జలప్రోక్షణచే రెల్లు పుట్టించుకొని దోషదృష్టుల పరిహరించుటచేత నితనికి ఆపస్తంబు డని పౌరుషనామము కలిగెనని పలువురు చెప్పుదురు. జలమును స్తంభింపజేయుటచే నితడు ఆపస్తంభు డయ్యెనని యొకరు వ్రాసిరి. కాని



తాడిపర్తి శ్రీ రామలింగేశ్వరాలయ ముఖద్వారము

అశేష గ్రంథజాలములో అతనిపేరు ఆపస్తంబు డనియే యుండుటచే నదియే సరియైన రూపమని పండితులు తలచుచున్నారు.

ఎన్నో సామ్రాజ్యములు తల యెత్తినవి, పడిపోయినవి. రాజ్యము లెన్నో పుట్టినవి; గిట్టినవి. కాని ఆపస్తంబునిచే సంస్కరింపబడి శాసింపబడిన మన సంఘజీవనము, పవిత్రవంతముగ చేయబడిన మన గార్హస్థ్య జీవనముమాత్రము పరిశుద్ధమై నేటికిని చక్కగా నిలిచియున్నది. మహానాగరకుల మని విఱ్ఱవీగు నమెరికా యూరపు ఖండముల దేశములలోను సంఘములలోను గలవారి నాదర్శములుగా నెంచుకొని బానిసలై అనుకరించు మన దేశస్థులలోను స్వచ్ఛమైన సంఘజీవనమును, గార్హస్థ్యజీవనమును గలవని ఎన్నదగిన వెన్ని యుండును? ఇటీవల ఆనాగరకతాప్రసాదమును కొని వచ్చుచున్న గాలి ఇటు బలముగా విసురుచున్నది. ఆదెబ్బ తగులకుండ దేశమును, సంఘమును సంరక్షించుకొను భారము మనపై నున్నది.

### రేఖాగణితవిషయము, శుల్బసూత్రములు

శుల్బ మనగా త్రాడు; కొలత్రాడు (Measuring tape). రేఖానిర్మాణము, చతురస్ర నిర్మాణము, మండల నిర్మాణము మొదలు రాజసూయాశ్వమేధాదు లైన మహాయాగములు జరుపుటకు వలయు వేదీవిహారములను చితులను నిర్మించుటకు మార్గములను సరిగా బోధించు శాస్త్ర మవసర మయ్యెను. ఆ శాస్త్రమే శుల్బసూత్రములలో వివరింపబడినది. శుల్బసూత్రములు కల్పసూత్రములలో కడపటి భాగము. శుల్బసూత్రకారులలో ప్రథముడు బోధాయనుడు; ప్రథమగణ్యు డాపస్తంబుడు. నేటి ఇంగ్లీషు రేఖాగణితమునందు (Geometry) వివరింపబడిన రేఖాధర్మములు, క్షేత్రధర్మములును వేదయుగమునాడే రచింపబడిన శుల్బసూత్రములలో సవిస్తారముగా కలవు. చతురస్ర నిర్మాణము (Construction of squares), మండల నిర్మాణము (Construction of circles), చతురస్రమునకు సమమైన మండలము (Circle equal in area to a square), మండలమునకు సమమైన చతురస్రము (Square equal in area to a circle) నిర్మించవలసిన విధానములు మొదలగునవి శుల్బసూత్రములలో చమత్కారముగా వర్ణింపబడినవి. ఈ సూత్రరచనమునందు ఆపస్తంబుడు చూపిన కౌశలము అద్భుతావహము. ౧౮౭౫-వ సంవత్సరములో డాక్టరు థీబూగారు కలకత్తాలో ప్రకటింపబడు బెంగాలు ఏషియాటిక్ సొసైటీ పత్రిక (Journal of the Asiatic Society of Bengal) లోను, కాశీపట్టణమున ప్రకటింపబడు పండిత (Pandit) పత్రికలోను ఈశుల్బసూత్రములను గూర్చి చక్కని వ్యాసములు వ్రాసినారు.

ఈ సూత్రములు ఎవరును తెనుగున ప్రకటించలేదు[1]. ఆపస్తంబశుల్బసూత్రముల వ్రాతప్రతులు శ్రీపరవస్తువారి గ్రంథాలయమునుండి నేను ఎత్తి వ్రాసుకొనియున్నాను.

భాగవతమునందు “ఘనసింహంబులకీర్తి నీచమృగముల్ గైకొన్న చందంబునన్” అని చెప్పినట్లు ఆంధ్రశుల్బసూత్రకారులకీర్తి పైవారపహరించుకొనిపోవుటయు, ఔనౌనని మనముకూడ తల లూపుటయు మాత్రము సత్యప్రియులకు దుఃఖదాయకము కాకపోదు. ఒక్క అంశముమాత్రము వ్రాయకుండుట మన ఆంధ్రుల సర్వంకషకృషి వివరణసందర్భమున ద్రోహ మగునని అదిమాత్రము వ్రాయుచున్నాను.

సమ చతురస్రము (Square), దీర్ఘచతురస్రము (Rectangle) అనబడు వాని క్షేత్రధర్మములను నిర్ణయించుపట్టున వాని అక్షణయారజ్జుధర్మములను (the properties of the diagonal)కూడ ఆపస్తంబుడు చక్కగా తెలిపియున్నాడు.

సమ చతురస్రము(Square).—దీని నాలుగుప్రక్కలును సమానమైన నిడివి కలిగియుండును; నాలుగుకోణములు సమములు — సరికోణములు (right angles). చతురస్రపు కోణములలో ఒకమూల నుండి ఎదుటి మూలకు గీయబడిన సూటి రేఖ(Diagonal)కు “అక్షణయారజ్జు” వని పేరిడిరి. దీనినే తరువాతి గణకులు “కర్ణము” అనిరి (దీని కింగ్లీషుపేరు Hypotenuse).

సూత్రము:

“సమచతురస్రస్యాక్షణయారజ్జు ర్ద్విస్తావతీం భూమిం కరోతి”

---

1. అందుకగు వ్యయము భరించి పుణ్యాత్ములెవరైన తెనుగున ప్రకటింపదలచినపక్షమున నందుకు సంబంధించిన గ్రంథజాలము నేను ఇయ్యగలను. ఆ వివరముల నిచట వ్రాయుటకు అవకాశము లేదు; వ్రాయను.

ఒక సమచతురస్రముయొక్క అక్షుణరేఖపై నిర్మింపబడిన చతురస్రము మొదటి చతురస్రముయొక్క భూమికంటె రెండింతల భూమికల దగును. భూమి అనగా క్షేత్రము. ఇంగ్లీషులో ఏరియా (Area) అనునదియే భూమి. ఈ సూత్రము ఇంగ్లీషులో ఇట్లు చెప్పనగును :—

The square on the diagonal of a square has an area double that of the original square.

సూత్రము :

దీర్ఘస్యాక్షుణయా రజ్జుః పార్శ్వమానీ, తిర్యఙ్మానీ చ యత్పృథగ్భూతే కురుత స్తదుభయం కరోతి.

దీర్ఘచతురస్రముయొక్క అక్షుణయారజ్జువుపై నిర్మింపబడిన చతురస్రము దానికి ప్రక్కను క్రిందనుగల రేఖలపై నిర్మింపబడిన చతురస్రములు రెండింటి మొత్తమంత భూమికల దగును.

దీర్ఘచతురస్రమధ్యను గీసిన అక్షుణయారజ్జువువలన రెండు సమాన త్రిభుజములు ఏర్పడును. అవి రెండును సరికోణములు గలవే అగును. కాబట్టి సరికోణముగల త్రిభుజకర్ణముపై నిర్మింపబడిన చతురస్రము తక్కిన రెండుప్రక్కలపై నిర్మింపబడిన చతురస్రములభూమి మొత్తమునకు సరిపోవును.

The square on the hypotenuse of a right angled triangle is equal to the sum of the squares on the other two sides.

ఈ సూత్రము త్రికోణగణితమునకు పునాది (basis of the Trigonometrical Science).

ఇట్టి త్రిభుజములు శుల్బసూత్రములో పెక్కులున్నవి.

సూత్రము:

త్రిక చతుష్కయోః;

ద్వాదశిక పంచికయోః; పంచదశికాష్టికయోః; సప్తిక చతుర్వింశికయోః; ద్వాదశిక పంచత్రింశికయోః; పంచదశిక షట్త్రింశికయోః ఇత్యేతా సూపలబ్ధిః"

$(3 \times 3) + (౪ \times ౪) = (౫ \times ౫) = ౨౫$

$3^{2} + ౪^{2} = ౫^{2} = ౨౫$

$౫^{2} + ౧౨^{2} = ౧౩^{2} = ౧౬౯$

$౭^{2} + ౨౪^{2} = ౨౫^{2} = ౬౨౫$

$౮^{2} + ౧౫^{2} = ౧౭^{2} = ౨౮౯$

$౧౨^{2} + ౩౫^{2} = ౩౭^{2} = ౧౩౬౯$

$౧౫^{2} + ౩౬^{2} = ౩౯^{2} = ౧౫౨౧$

ఇది పైతాగరస్ సూత్రము (Pythogorus theorem) అని యూరపుఖండము వారు చెప్పుచున్నారు. పైతాగరస్ అనునతడు క్రీస్తుపూర్వము ఆరువందలసంవత్సరముల క్రిందట నుండెనని చెప్పుదురు. గ్రీకులకు ఈ సూత్రము మప్పినది, రేఖాగణితము బోధించినది పైతాగరసే కావచ్చును. కాని ఈ పైతాగరస్ ఎక్కడివాడు? గ్రీకు లెవరు? ఈ పైతాగరసునకు ఈ సూత్రములు ఎక్కడనుండి వచ్చెను? పైతాగరస్ తనశిష్యులకు కఠినమైన బ్రహ్మచర్యవిధులను, ఐదుసంవత్సరములు మౌనమును, రేఖాగణితపద్ధతులను, జన్మాంతర ప్రాప్తిని (Transmigration of souls) బోధించెను. అవి యన్నియు నాతడెక్కడ తెలిసికొనెను? అని యోజింపవలసియున్నది. ఆపస్తంబునికాలముకూడ మనము స్పష్టముగా తెలిసికోవలెను.

ఆపస్తంబుడు బుద్ధునికిపూర్వుడు. బుద్ధుడు క్రీ. పూ. అయిదవశతాబ్ది వాడని నేడు బడులలో చెప్పునది సత్యముకాదు. బుద్ధుడు కలియుగము ఆరంభమైనపిమ్మట వేయిసంవత్సరములనాటివాడని మహాభారతతాత్పర్యనిర్ణయమునందు చెప్పబడినది. విష్ణుపురాణరాజవంశావళిని మథించి లెక్కించి చూడగా ఈ యంశము స్థిరపడుచున్నది. కావున బుద్ధుడిప్పటికి నాలుగువేలసంవత్సరములకు ముందుండినవాడు. ఆపస్తంబుడు నాలుగువేల అయిదువందల సంవత్సరములక్రిందట నుండెనని నిస్సందేహముగా చెప్పవచ్చును. అతడు కృష్ణానదీతీరమున నాంధ్రసామ్రాజ్య మున్నతదశలో నుండినపు డుండెడివాడని చరిత్రకారులూహించుచున్నారు. గౌతమ బుద్ధుడు బౌద్ధమతస్థాపన కావించిన పిమ్మట బౌద్ధగురువులును, భిక్షువులును (Budhist Missionaries) నానాదేశములకు వెడలి బౌద్ధధర్మములను బోధించుచు ప్రచారము చేయుచువచ్చిరి.

మగధదేశములో రాజవిప్లవాది రాజకీయ హేతువులచేతను, మరి కొన్ని హేతువులచేతను రాజగృహప్రాంత గృహకులును, మాగధీయులలో నొకతెగవారును పరదేశములకు వెడలిరి. మొదట వారందరును నేటి బీహారురాష్ట్రవాసులే. బీహారుదేశమునందు మోదుగచెట్లధికము. కావున నా

దేశమునకు పలాశదేశమని తొలి పేరు కలదు. పలాశదేశస్థులు పెలాస్గీ లనబడిరి. వారే గ్రీకుల పూర్వులు. రాజగృహవాసులే గృహకులు—పిమ్మట గ్రీకులైరి. మాగధీయులతెగ మకిడోనియనులు (Macedonians) అయిరి. అలెగ్జాండరు మగధదేశమును జయించవలెననెడి కాంక్షకు మూలకారణము అది తనపూర్వులదేశ మగుటయే. ఈ యంశము లన్నియు 'గ్రీస్ లో హిందూదేశము'(India in Greece) అను గ్రంథమునందు ఎడ్వర్డు పోకోక్ అనునతనిచే వ్రాయబడినవే కాని క్రొత్తవి కావు. మహంజోదారో ప్రాంతములు త్రవ్వుటచే బయల్పడిన చరిత్రవిశేషములు పై యంశములను స్థిరపఱుచుచున్నవి. హిందూదేశమునుండి వలసలకు వ్యాపారములకు వెడలిన జాతులవలననే ఇచ్చటి నాగరకత ఇతరదేశములకు వ్యాపించెనని నిర్దిష్టమైనట్లు ఫాదరు హెరాస్ దొరగారు మొన్న నే కదా మద్రాసుయూనివర్సిటీలో ఉపన్యాసమిచ్చినారు! ఇటనుండి ఆపస్తంబ విరచితములైన బ్రహ్మచర్యధర్మములను, రేఖాగణితసూత్రములను, సాంఖ్యయోగప్రసిద్ధములైన జన్మపరంపరాసూత్రములను గ్రహించుకొని విజ్ఞానవ్యాప్తికై పరదేశములకు బోయిన బౌద్ధగురువు పైతాగరస్ అయ్యెనని పోకోక్‌పండితుడు వచించుచున్నాడు. బౌద్ధగురూస్,—బుధగురూస్-పుధగురూస్,-పైతాగొరస్ అయ్యెననియు పోకోక్ పండితుడు వ్యుత్పత్తి తెలుపుచున్నాడు. ఈ "పైతాగరస్" అనబడు బౌద్ధభిక్షువు బ్రహ్మచర్యధర్మములను, రేఖాగణితసూత్రములను, జన్మపరంపరాసూత్రములను ఇక్కడ భరతఖండమున గ్రహించినట్లు పాశ్చాత్యుల పరిశోధనలే స్థాపించినట్లు ఆర్. సి. దత్తుగారు 'హిందూదేశసభ్యతాచరిత్రము'(History of Indian civilisation) అను గ్రంథములో స్పష్టముగా వ్రాసియున్నారు.

రేఖాగణితము పిమ్మట గ్రీసుదేశములో వృద్ధినొందినది. రేఖాగణితము నభ్యసింపనివారికి ప్లేటో విద్యాపరిషత్తులో ప్రవేశమే లేదు. "Those that do not know Geometry have no admission here" అని పెద్ద యక్షరములతో వ్రాయించి ప్లేటో తన పరిషత్తు ద్వారముకడ కట్టించెనట. ఈ రేఖాగణితశాస్త్రమూలము లెక్కడివి? ఆంధ్ర శుల్బసూత్రకారులైన బోధాయనాపస్తంబుల గ్రంథములలోనివే కదా? ఈ యంశము లెఱుగని పాశ్చాత్యులతోపాటు మనముకూడ ఈ రేఖాగణిత మూలసూత్రములను పైతాగరస్ సూత్రములని చెప్పుకొనుట తగునా? ఇంకను తగునా అని నా ప్రశ్న.





# రాష్ట్రగానము

తుమ్మల సీతారామమూర్తి చౌదరి

పాటలీపుత్రమ్ముకోటకొమ్మలమీఁదఁ దెలుఁగుజెండాలు నర్తించునాఁడు
ఢిల్లీశు నెదిరి చెండిన తెల్గువిలుకాండ్రు నవలక్ష లోరుగల్ గవియునాఁడు
రాచూరుకదనమం దేచి "తళ్ తళ"మంచుఁ దెలుఁగుజోదులకత్తి తిరుగునాఁడు
అల చోళపాండ్యసీమలఁ దెల్గుసరకార్ల ఘనుపు సూయాణమై ప్రాఁకునాఁడు

> చూచి సంతోషభారంబు మోచి శిరము
> నూఁచు భాగ్యమ్మునకు నింత నోఁచలేక
> యేల పుట్టితి నిపు డిసీ! యేటి బ్రదుకు?
> కటకటా! దాఁటిపోయె బంగారుయుగము.

మంటికొండయు సుల్కుమంచం బెఱుంగక చందవోల్పురము పెంపొందునాఁడు
కొల్లకొల్లగ మోటుపల్లి రేవునఁ బిసాళించు కస్తూరిని దించునాఁడు
రతనాల ముత్యాల రాసులు వోసి రాయలరాచవీటిలో నమ్మునాఁడు
మంచుందెరల నీసడించు సెల్లాలు బందరుదుకాణములందు మెఱయునాఁడు

> అందచందమ్ములకు దీవులైన తెలుఁగు
> సతులు పన్నీటికలయంపి చల్లునాఁడు
> సీవిలాసంబు నిండిన తీవి గాంచి
> పొంగలేనైతి నక్కటా! పురుటిగడ్డ!

౧. జన్మభూమి.

కలము ఖడ్గము పట్టఁగలనేర్పు వడసిన రెడ్డినాగమ్మ నీబిడ్డయఁటవె?
జగమగంటిమి నాంధ్రజగతిఁ బాలించిన గరిత రుద్రమ్మ నీకన్నెయఁటవె?
గండికోటను మల్కుదండుపై దూఁకిన గోవిందమాంబ నీకూఁతురటవె?
మానంబుకై నిజప్రాణంబు బలియిచ్చు మల్లాంబ నీదుకొమార్తయఁటవె?

> వీఁగివచ్చిన హృదయేశు వెక్కిరించి
> పోరి కంపినతరుణి నీపుత్రియఁటవె?
> ఎంత తేజస్వినివి తల్లి! యెఱుకలేక
> నీమహత్త్వంబు తెలియంగలేముగాని.

చెలువమ్ము నెగఁజిమ్ము జిలుఁగుతెల్గులతోడఁ జెన్నగట్టునఁ గృతుల్ పెరుఁగునాఁడు
మందారమకరందమాధుర్యధుర్యమై యోరుగంటఁ గవిత్వ మూరునాఁడు

ధాటీసమాటీకనాటోపమునఁ గొండవీటిలోఁ గావ్యముల్ వెడలునాఁడు
క్రొంగ్రొత్తరుచులపొంగులఁ దుంగభద్రతో వియ్యమై కబ్బముల్ వెలయునాఁడు
ప్రతిపదమ్మున రసచమత్కృతులు వెల్లి
వోడువఁ దంజాపురిన్ గైత నడచునాఁడు
తల్లి! నీభువనైకసౌందర్యరేఖ
కాంచనైతిఁ గదా! కంటికలవు దీఱ.

తనవిద్యచే లోకమున కొజ్జయైన నాగార్జునార్యుండు నాయన్న యనుచు
తనదానధారచేఁ దెనుఁగుగడ్డను ముంచు భాస్కరమంత్రి నాబంధు వనుచు
తనప్రజ్ఞచే మన్ను మిను గుప్పిటం బట్టు ప్రగడ తిమ్మరుసు నాభ్రాత యనుచు
తనగీతిచే జగమ్మునకు జీవముపోయు త్యాగయ్య నాదు సోదరుఁ డటంచు
విశ్వరంగమ్ముపై ఱొమ్మువిఱిచి నిలిచి
లీలమైఁ బల్కు వాక్కు నాకే లభించె
ధన్యతాభాజనంబుగదా! మదీయ
జీవితం బని సమ్మదశ్రీ భజింతు.

ఏతాదృగ్విభవాభిరామ మగు నాయీదేశ మాశాతటీ
మాతంగప్రమదావిశాలకటసీమానిర్గళద్వేణికా
ప్రీతేందిందిరగీతకీర్తినిధియై పెంపొంది నేఁ డక్కటా!
రీతిం, బ్రాక్తనవర్ణనీయగరిమారేఖారమన్ గోల్పడెన్.

"ఆలస్యా దమృతం విష" మ్మనెడు పల్కాలించి మేలెంచి ని
ర్వేలోత్సాహముఁ బెంచి సంశయతమోవిచ్ఛిత్తి గావించి దీ
ప్తాలక్ష్మీవశులై పురాంధ్రమహిమాసంపత్తి నార్జించి సు
శ్రీ లాలిత్యము నిచ్చి తల్లిఋణమున్ జెల్లింపుఁడీ సోదరుల్!

తమిళకర్ణాటబంధము లూడ్చి తెల్గుసీమను స్వతంత్రమ్ముగా మార్చువఱకు
రాష్ట్రనిర్మాణకార్యము నివార్య మటంచు మప్పువారికి బుద్ధి సెప్పువఱకు
ఒడ్డెమాగాణమం దొదిఁగి పేర్వాసిన తెలుఁగుఖండము నెల్లఁ దెచ్చువఱకు
బళ్లారిలో నాంధ్రభాగ మంతయుఁ జీల్చి తెలుఁగురాజ్యమ్ములోఁ గలుపువఱకు
ఇదియు నదియని లెక్కింపనేల? యావ
దాంధ్రవిషయమ్ము నొక్కరాజ్యమ్ముఁ జేసి
పట్టి జయభేరిపై దెబ్బ గొట్టువఱకుఁ
దెలుఁగు పసిపాపకైన నిద్రింపఁదగునె?

## రాష్ట్రగానము

పొలివోవలేదు తెల్గులపరాక్రమరేఖ మన "టంగుటూరి"లో మల్లడించె
సడలలేదాంధ్రవిజ్ఞానతేజఃపుంజ మది రామలింగార్యు నాశ్రయించె
చెదరిపోలే దాంధ్రశేముషీసంపత్తి పట్టాభిసచివు కేల్ పట్టుకొనియె
బీఱువోలే దాంధ్రవీరదాతృత్వంబు నాగేశ్వరునిలోఁ బెనంగియుండె

తఱఁగిపోలేదు తెలుఁగుకైతలపసందు
కులుకుచున్నది చెళపిళ్లకలమునందు
నిస్పృహాహేతు వించుకేనియును లేదు
సోదరా! లెమ్ము నీహక్కు లాడుకొమ్ము.

ఆచక్రవాళమ్ము నాంధ్రజాతీయతామధురసౌరభ్యముల్ మలయుఁగ ం
బిగువెక్క నేల నాలుగుచెఱంగులయందుఁ దెలుఁగురాచఱికంబు వెలయుఁగాత
లక్ష్మీసరస్వతీలలనానివాసమై యాంధ్రదేశమ్ము పేరందుఁగాత
విశ్వమోహనకళావీథియై తెల్గుల శిల్పవిన్యాసంబు చెలఁగుఁగాత

రసికలోకమ్మునకు విందు లొసఁగి పొసఁగి
దేశికవితాలతాంగి వర్ధిల్లుఁగాత
తెనుఁగుజనయిత్రి పచ్చతోరణముతోడ
నిత్యకల్యాణరాశియై నెగడుఁగాత.

"దీక్షం బూనితి నాంధ్రరాష్ట్రమును సాధింతున్ దదీయక్రియా
రక్షన్ జేసెద నెట్టికష్ట మయినన్ రానిమ్ము కానిమ్ము మా
తృక్షోణీయశ ముద్ధరింతు" నని భక్తిన్ గంకణం బూను నీ
కక్షయ్యం బగు నేర్లగడ్డ శివరామా! చల్లపల్లీశ్వరా!

ప్రాకటదీక్షఁ బూని పలుబాముల కోర్చి గడించె మొన్నఁ బ
ర్లాకిమిడిప్రభుండు నిజరాష్ట్రము; నీవు త్రిలింగరాజ్యల
క్ష్మీకమనీయవైభవ విశిష్టమహోత్సవ మూలకారణ
శ్రీ కృతకృత్యతం గని ప్రసిద్ధి వహింపఁగదయ్య భూవరా!

---

# ఆంధ్రదేశమున ఇత్తడి పాత్రల పరిశ్రమ

ఆండ్ర శేషగిరిరావు

ఆంధ్రులలో ఇత్తడిపాత్రల వాడుక హెచ్చు. అగుటనే ఇత్తడిపాత్రల పరిశ్రమ ఆంధ్రదేశమున ఇంచుమించు అన్నిజిల్లాలయందును కానవచ్చుచున్నది. ఆంధ్రదేశమునందలి గృహపరిశ్రమలలో ఇత్తడిపాత్రల పరిశ్రమకు ప్రముఖస్థానము గలదు. అయినను అది పొందవలసినంత అభివృద్ధిని పొందుట లేదు. అరవదేశము నుండి వచ్చు ఇత్తడిపాత్రలపోటీ మనదేశమునందలి ఈ పరిశ్రమ అభివృద్ధికి కొంత అడ్డంకిగా ఉన్నది. కొంచెము శ్రద్ధ చూపుచో అరవదేశము నుండి విశేషముగ వచ్చుచున్న ఇడ్డెనుపాత్రలు మొదలైనవి మనదేశమునందే తయారుచేసికొనవచ్చును. ఈ విషయము మననాయకుల దృష్టికి ఇంకను తగలవలసియున్నది. ఈలోగా మనము తెనుగుదేశపు వివిధములగు జిల్లాలలో ఈ పరిశ్రమ ఎక్కడ ఎట్లు నడచుచున్నదో ఒకపరి పరికింతము.



### విశాఖపట్టణము జిల్లా

ఇత్తడిపరిశ్రమ ఈ జిల్లాలో పలు తావులయందున్నది. అందు వీరవిల్లి తాలూకాలోని కోటపాడు, పార్వతీపురము తాలూకాలోని పార్వతీపురము, బొబ్బిలి తాలూకాలోని బొబ్బిలి, అనకాపల్లి తాలూకాలోని అనకాపల్లి, సర్వసిద్ధి తాలూకాలోని సోమలింగపాలెము పేర్కొనదగినవి. కోటపాడులో నూరు విశ్వబ్రాహ్మణకుటుంబములు ఈ పరిశ్రమలో తగిలియున్నవి. ఇచ్చట ఇరువదియైదు కార్ఖానాలు (శాలలు) ఉన్నవి. పార్వతీపురమున ఇరువది కుటుంబములును, బొబ్బిలిలో నూరు కుటుంబములును, అనకాపల్లిలో అరువదికుటుంబములును, సోమలింగపాలెములో ముప్పదిరెండు కుటుంబములును ఈ పరిశ్రమ సాగించుచున్నవి. బిందెలు, గంగాళములు, గుండిగెలు, తప్పేలాలు, సాదాచెంబులు, మరచెంబులు ఇక్కడ చేయబడు ఇత్తడిపాత్రలలో ముఖ్యములైనవి. పనివాళ్లు సాధారణముగ రోజుకు పది గంటలు పనిచేయుదురు. ఇత్తడి రేకులు రాజమండ్రి, కాకినాడ, పెద్దాపురము, అనకాపల్లి, విజయనగరములనుండి తెప్పింపబడుచున్నవి. పాతఇత్తడి కరగించుటయు కలదు. పోతఇత్తడి పాత్రల అచ్చులకు వాడబడుచున్నది. విజయనగరము, మాడుగులసంస్థానములకు చెందిన దివరవల్లి, గిరిసింగి, తేలగపూడి గ్రామములనుండి బొగ్గు వచ్చుచున్నది. వెలిగారము, తగరము మున్నగునవి ఆయాతావులయందలి కొట్లమీదనే దొరుకును. విశాఖపట్టణముజిల్లాలోని పాత్రలను అచ్చటి షాహుకారులే కాక మద్రాసువరకుగల అన్నిపెద్ద పట్టణములలోని వర్తకులును విరివిగ కొనెదరు. కోటపాడు, అనకాపల్లి, సోమలింగపాలెములందలి సరుకుకు గిరాకీ హెచ్చు. కోటపాడుపాత్రలకు మంచిప్రసిద్ధి గలదు. కోటపాడులోని ఒక్కొక్కశాలలో ఏడాదికి నలుబది మణుగుల తూకమువరకు పలుపాత్రలును, బొబ్బిలి అనకాపల్లులలో ఏడాదికి రెండేసివేల మణుగుల ఇత్తడిపాత్రలును, సోమలింగపాలెములో ఏడాదికి పండ్రెండువందల మణుగుల ఇత్తడిపాత్రలును తయారగును.

### తూర్పుగోదావరి జిల్లా

ఈజిల్లాలో రాజమండ్రి, పెద్దాపురము, జగన్నాథపురముల యందు ఇత్తడిరేకులతో పాత్రలను చేయు పరిశ్రమ ఉన్నది. పెద్దాపురములో ఇత్తడిపనిచేయువారు కంసాలి, సాలి కులములకు చెందినవారైయున్నారు. వలయుపెట్టుబడి అంతయు ఐదారుగురు పెద్దకోమట్లు పెట్టుచున్నారు. జగన్నాథపురములో పది పద్మసాలి కుటుంబములు ఈపరిశ్రమలో తగిలి

యున్నవి. ఇక్కడచేయు పాత్రలలో బిందెలు, చేటలు, చెంబులు ముఖ్యములు. సాలి, పద్మసాలి పనివాళ్లు బట్టలనేతలో కిట్టుబాటు కాక ఈ పరిశ్రమ అవలంబించిరని చెప్పవలసి యున్నది.

## పశ్చిమగోదావరి జిల్లా

ఈజిల్లాలో తణుకుతాలూకాలోని అజ్జరము, నరసాపురము తాలూకాలోని పాలకొల్లు, భీమవరముతాలూకాలోని విస్సాకోడేరు గ్రామములందు ఇత్తడిపాత్రల పరిశ్రమ సాగుచున్నది. ఈ మూడు గ్రామములలో అజ్జరమున ఈ పరిశ్రమ విస్తారము. ఇత్తడిపనివారు ఇచట సుమారు నాలుగువందల మంది గలరు. అందు వందమంది మాత్రము బాలురు. మిగిలినవారు అందరును పెద్దవారే. వీరు అందరును రెడ్డి, కాపు, కంచర, చాకలి, ఈడిగ, శైకాలబత్తుల కులములకు చెందినవారు. ఊరిలో ఇత్తడివ్యాపారము చేయు దుకాణములు ఐదు గలవు. ఇత్తడిరేకులు మదరాసు నుండి తెప్పింపబడును. పాతఇత్తడి కరిగించి పోతపోయుటయు గలదు. గిన్నెలమట్టులకు పోతరేకును, పైభాగమునకు రేకుఇత్తడిని సాధారణముగ వాడుదురు. బిందెలు, గుండిగెలు, తప్పేలాలు ఇక్కడ చేయబడు ఇత్తడిపాత్రలలో ముఖ్యమైనవి. కావలసిన బొగ్గు, ఆప్రాంతమున తుమ్మచెట్టు కాల్చియు, నిడదవోలు కొవ్వూరు తాలూకాలనుండి తెప్పించియు వ్యవహరించుచున్నారు. ఏడాదికి ఇక్కడి ఇత్తడిసరుకులో ఒక లక్ష ఇరువదియైదువేల రూపాయల వ్యాపారము సాగుచున్నది. రాజమండ్రి, అమలాపురము, శివకోడు మున్నగు తావులయందలి తూర్పు గోదావరిజిల్లా వర్తకులును, పాలకొల్లు, ఆకువీడు, భీమవరము, ఏలూరు మున్నగు తావులయందలి పశ్చిమ గోదావరిజిల్లా వర్తకులును, బెజవాడ, రమణక్కపేట మున్నగు తావులయందలి కృష్ణాజిల్లా వర్తకులును అజ్జరపు ఇత్తడిసరుకుకు ప్రధానమైన కొనుగోలుదారులు. నవంబరు నెలనుంచి జూన్‌వరకును అమ్మకము చురుకుగా నుండును. వానకాలము మూడు మాసములును ఇత్తడిపని చురుకుగా నుండదు. అప్పుడు ఊడ్పురోజు లగుటచే ఈ పనివాళ్లు అందరును పొలముపనులకు పోవుదురు. ఈ పనివాళ్లలో పలువురకు సొంతఆస్తులు లేవు. వారిలో పలువురు ఋణభారముచేత క్రుంగిపోవుచున్నారు. పాలకొల్లులో ముప్పది కంచరకుటుంబములు ఇత్తడిపని చేయుచున్నవి. ఇత్తడిరేకులు ఇక్కడకూడ షాహుకారులే తెప్పించి యిత్తురు. పాతఇత్తడి కరుగుటయు కలదు. బిందెలు, చెంబులు, పెద్దగరిటెలు మొదలగునవే కాకుండ పాలకొల్లు ఇత్తడిపనివాళ్లు ఇత్తడి దీపస్తంభములను విరివిగ చేయుదురు. ఈ దీపపుసెమ్మెలు ఈ ప్రాంతమునందలి సంతలలోను, తీర్థములలోను హెచ్చుగ వెలపోవును. ఏడాదికి పాతికవేల రూపాయిలకుపైగా ఇచ్చట దీపపుసెమ్మెల వ్యాపారము నడుచుచున్నది. మిగిలినపాత్రలు నెలకు నూరుమణుగుల తూకము వరకు అమ్మక మగుచుండును. పాలకొల్లుసంత ప్రసిద్ధమైనది. ఇక్కడ కూడ పనివాళ్లకు ఏడాదిపొడుగున పని ఉండుటలేదు. విస్సాకోడేరులో సుమారు పదునారు విశ్వబ్రాహ్మణ కుటుంబములు ఈపరిశ్రమలో తగిలి యున్నవి. ఇచ్చట చేయబడుసరకు చుట్టుపట్ల గ్రామములందును, పాలకొల్లు సంతలోను అమ్మక మగుచుండును.

## కృష్ణా జిల్లా

ఈ జిల్లాయందలి నూజవీడు డివిజన్‌లోని రమణక్కపేట ఇత్తడిపరిశ్రమకు ప్రసిద్ధికెక్కినది. రమణక్కపేట నూజవీటికి ఎనిమిదిమైళ్ల ఉత్తరమున ఉన్నది. ౧౯౩౯ నాటికి ఇచ్చటి పనివారిసంఖ్య ౧౩౦ మంది. అందు ౧౦౦ గురు పురుషులు; ౩౦ మంది బాలురు. పెక్కుమంది కంచరికులమునకు చెందినవారు. పెట్టుబడి అంతయు అచటి కోమట్లదే. మద్రాసు, బెజవాడ, ఏలూరునగరములనుంచి ఇత్తడిరేకు తెప్పించి కోమట్లు పనివాళ్లకు ఇత్తురు. పాతఇత్తడి కరగుటయు కలదు. చేయువస్తువులలో ముఖ్యమైనవి చెంబులు, పళ్లెములు, బిందెలు. పాతఇత్తడి కరగుటలో నగు తరుగు అంతయు పనివాడు కట్టుకొనవలసినదే. మూసలు చెన్నపట్టణమునుండి తెప్పించి కోమట్లు పనివాళ్లకు అమ్ముదురు. బొగ్గు దగ్గర ఉన్న దిగవల్లి, కొండపర్వకొండల నుండి, అడవులనుండి సరఫరా యగును. పని ఉండినచో ఒక్క అమావాస్యనాడుతప్ప ఇక ఎప్పు

డును పనిమానరు. ఏడాదిపండుగ వెళ్లిన పదునైదు దినములవరకు పని ప్రారంభింపరు. తయారైన పాత్రలను పనివాళ్లే అమ్మవలసిన అవసరము లేదు. తయారైన పాత్రలను కోమట్లు తీసికొని కృష్ణ, గుంటూరు, పశ్చిమ గోదావరిజిల్లాలలోని పల్లెలలో విక్రయింతురు. రమణక్కపేట ఇత్తడి సరకుకు నైజామురాజ్యమున చెలామణి హెచ్చు. రమణక్కపేటయందలి కోమట్లు పనివాళ్లకు ఏడాది పొడుగున పని ఈయలేకపోవుచున్నారు. సగటున ఆరుమొదలు ఎనిమిది మాసములుమాత్రమే పని ఉండును. చైత్రముమొదలు ఆశ్వయుజమువరకు ఈపాత్రల అమ్మకము చురుకుగా నుండును. మిగిలినకాలమునందు పనివారు ఖాలీగా నుందురు. అందు కొందరు సరకు అమ్ముటకు పోవుటయు గలదు. ఏడాదికి ఇచ్చట అరువదివేలరూపాయిల విలువగల పాత్రలవ్యాపారము సాగుచున్నది. కృష్ణా జిల్లాలో తిరువూరుడివిజనుకు చెందిన చిన్నంపేటలోకూడ ఇత్తడిపాత్రలు చేయుదురు.

### గుంటూరు జిల్లా

గుంటూరుజిల్లాలో ఇత్తడిపాత్రల పరిశ్రమ పల్నాటి తాలూకాలోని దుర్గిలోమాత్రమే యున్నది. ఇచట ఇత్తడితో పాత్రలనేకాక వాహనములను చేయుటకూడ గలదు. ౧౯౩౯ నాటికి ఈ గ్రామమున ఇత్తడిపనివాళ్లు ఐదుగురే యున్నారు. ఐదుగురును విశ్వకర్మకులజులే. వీరు రోజుకు ఎనిమిదిమొదలు పదిగంటల వరకు పని చేయుదురు. అవసరమగుచో ఒకరికి ఒకరు పనిలో చేదోడు అగుచుందురు. వాహనములు గజము ఎత్తు, గజము వెడల్పు ఉండుట గలదు. ఇత్తడిరేకులు నరసారావుపేటనుండి తెప్పించుకొందురు. బొగ్గు అడిగొప్పుల అగ్రహారము నుండి వచ్చును. బస్తా బొగ్గువెల పండ్రెండు అణాలు. ఇక్కడ చేయబడు ఇత్తడిపాత్రలలో బిందెలు, తప్పేలాలు, గరిటెలు, దీపస్తంభములు ముఖ్యములు. బిందెలు మొదలైనవానికి మట్టుకుమాత్రము పోతరేకు ఉపయోగించి పైన సాదారేకు వాడుదురు. ఈవ్యాపారము సాహుకారులచేతిలో బడలేదు. పనివాళ్లే స్వయముగ నిర్వహించుకొనుచున్నారు. దుర్గికి చుట్టుపట్ల, పది, పదునైదు మైళ్ల దూరమునుండి వచ్చుచుండు ఆర్డరులు నిర్వహించుచుందురు. ఏడాదికి వేయిరూపాయిల విలువగల సామగ్రిమాత్రమే ఇచట తయారగుచున్నది.



రామమహాలు - చంద్రగిరి

## నెల్లూరు జిల్లా

నెల్లూరుపట్టణమున ఇత్తడితో బిందెలు, జోడుతపలాలు, చెంబులు, భోగాణాలు చేయబడుచున్నవి. ఇత్తడిపనిలో చేయితిరిగిన మొదలి యారు ఒకడు ఏబదిసంవత్సరముల క్రితము నెల్లూరు వచ్చి ఈ పరిశ్రమ ప్రారంభించెను. పేదకాపులు కొందరు అతనివద్ద కూలికి కుదిరిరి. పని బాగుగ నేర్చుకొని కాలక్రమమున ఈకాపులు సొంతముగ కార్ఖానాలను పెట్టిరి. ప్రస్తుతము ఈ పరిశ్రమలో ఇచ్చట దాదాపు నాలుగువందల మంది పనివాళ్లు ఉన్నారు. వీరందరును వన్నెకాపు లనబడు అగ్నికుల క్షత్రియులై యున్నారు. ఇత్తడి రేకులు మద్రాసునుండి తెప్పింపబడుచున్నవి. బొగ్గు రాపూరుతాలూకాలోని ఫారెస్టుకంట్రాక్టరులు సరఫరా చేయుచున్నారు. నెలకు ఐదువేల రూపాయిల విలువగల ఇత్తడిపాత్రల వ్యాపారము ఇచ్చట సాగుచున్నది. తంజావూరు, తిరుచునాపల్లి, సేలము, దక్షిణ ఆర్కాటుజిల్లాలనుండి వచ్చు ఇత్తడిసరకుపోటీ ఇచ్చట హెచ్చుగ నుండుటచే నెల్లూరులో ఈ పరిశ్రమ క్రమాభివృద్ధి నందుట లేదు.

## చిత్తూరు జిల్లా

హిందూదేశమునందలి వివిధ ప్రాంతములనుండి అనుదినము పలువురు యాత్రికులను ఆకర్షించుచు గొప్పయాత్రాస్థల మగుటతో బాటు వస్తువిక్రయమునకు అనువైన స్థలము కూడ నైయుండు తిరుపతి ఈ జిల్లాయందే ఉండుటచే ఇత్తడిపాత్రల పరిశ్రమ ఇక్కడ ఇతరజిల్లాలలో కంటె హెచ్చు. తిరుపతిలో ఇత్తడి పాత్రలు చేయు కర్మాగారములు పండ్రెండు ఉన్నవి. ఒక్కొక్కదానిలో ముగ్గురు లేక నలుగురు పనివాళ్లు ఉందురు. పనివాళ్లలో చాలమంది మహమ్మదీయులో, కంసాలులో, బలిజలో అయిఉందురు. పెట్టుబడి అంతయు తిరుపతిలోని ఐదారుగురు వర్తకులది. పనివాళ్లకు ఇత్తడిరేకు ఇచ్చి తయారైనపాత్రలు తీసుకుని నిర్ణయముప్రకారము కూలి యిత్తురు. వంటగిన్నెలు, కేరియర్లు, నీటిబిందెలు, చెంబులు, అడుక్కులు మున్నగునవి తఱుచుగా చేయబడువస్తువులు. వర్తకుడు ఇత్తడితరుగును కట్టుకొనడు. దాని నష్టమునుకూడ పనివాడు భరింపవలసినదే. పని సంవత్సరము పొడుగునను ఉండును. కాని తిరుపతిలో విశేషప్రజ నాకర్షించు బ్రహ్మోత్సవము ప్రతిసంవత్సరము సెప్టెంబరునెలలో జరుగును కావున జూలై, ఆగష్టు, సెప్టెంబరుమాసములందు పని రద్దీగా నుండును. సాధారణముగ ప్రతినెలలోను మూడువందల మణుగుల తూకమువరకుగల పలు రకముల ఇత్తడిపాత్రలు తయారు చేయబడి అమ్మబడును.

## కడప జిల్లా

ఈజిల్లాలో ఇత్తడిపాత్రల పరిశ్రమ ఇటీవల అభివృద్ధిచెందినది. ప్రొద్దుటూరుతాలూకాలోని వనిపెంటగ్రామము ఇత్తడిపరిశ్రమకు పేరుమోసినది. వనిపెంట జనాభా ౪,౩౬౦. ప్రొద్దుటూరుకు పదునైదు మైళ్లదూరమునను, కడపకు ఇరువదిమైదు మైళ్లదూరమునను నల్లమలలదరిని ఉన్నది. ఈ గ్రామమునందలి ముసల్మానులును, మహారాష్ట్రులును ఇత్తడిపరిశ్రమలో నేర్పరులై యున్నారు. వైశ్యుల పెట్టుబడితో ఈ పరిశ్రమ నడుపబడుచున్నది. ఇత్తడిరేకులు కొత్తవి మద్రాసునుండి తెప్పింపబడును. పాతఇత్తడి కొని కరగించి పోతపోసి పాత్రలు చేయుటయు కలదు. ఇందుకు వలయు మూసలు చెన్నపట్టణమునుండి తెప్పించెదరు. బొగ్గు సరఫరామాత్రము తృప్తికరముగ లేదు. పనివాళ్లకు పని బాగుగ ఉండు వేసవిలో బొగ్గు సరఫరా సరిగా కాదు. దగ్గరలో అడవి ఉన్నను కాల్చినబొగ్గును ఆర్పుటకు తగిననీరు లేక బొగ్గుతయారు కష్టముగా నుండును. ఉదయగిరి, నంద్యాల, ఒంగోలు మొదలగుతావుల నుండి వర్తకులు వచ్చి, ఈపాత్రలను తీసికొనివెళ్లి మారుబేరమునకు విక్రయింతురు. పనివాళ్లకు సంవత్సరము పొడుగున పనిఉండదు. ఆరుమాసములుమాత్రము పని ఉండును. ౧౯౩౭ నాటికి ఈ పనివాళ్లసంఖ్య ౨౬౦ గా ఉండెను. ఏడాదికి రెండు లక్షలరూపాయిల విలువగలపని సాగుచున్నది. ఏటికి ఏడాది పని ఉండుచో ౬ లక్షలరూపాయిల విలువగలపని వరకు చేయవచ్చునని అంచనా వేయబడుచున్నది. ఆషాఢ, శ్రావణ, భాద్రపదమాసములలో ఈ పాత్రల విక్రయము విస్తారము. ఇచట చేయబడిన పాత్రలు గట్టితనమునకు పేరుమోసినవి.

### కర్నూలు జిల్లా

ఈ జిల్లాయందలి పత్తికొండ తాలూకాలోని దేవనకొండలో ఇత్తడితో చిన్నచిన్న దేవతావిగ్రహములను చేయుచుండువారు. అవి తీర్థములందును, సంతలయందును విరివిగా అమ్ముడుపోవుచుండునవి. ముఖ్యముగ బళ్లారిజిల్లాలోని ఆదోని తాలూకాలోని మంత్రాలయములో వీనివిడుదల విశేషమై యుండునది. వెండి బంగారుపనులు చేయువారే అపుడు ఈ పనినికూడ చేయువారు. ఇటీవల వారు నశించిరి. వారితో ఈ పరిశ్రమయు నశించినది.

### ఇతర ప్రాంతములు

అనంతపురముజిల్లాలో ఈ పరిశ్రమ తక్కువ యని చెప్పవచ్చును. బళ్లారిజిల్లాలోని వాలేహాళులో బండియెద్దుల మెడలలో కట్టు ఇత్తడిగంటలు చేయుదురు. తెలంగాణమునందలి పర్కాల, సిద్దిపేట, రామాయమపేట, లింగంపేట, పానుగల్లు, పోచంపల్లి, పెంబర్తి మున్నగు తావులయందు ఇత్తడిపాత్రలపరిశ్రమ గలదు. అందు ముఖ్యముగ పానుగల్లు ఇత్తడిబిందెలు అందమునకు పేర్కొనదగినవి[1].

[1] ఈవ్యాసము చాలవరకు ప్రభుత్వమువారు ప్రచురించిన 'Preliminary Report on the Cottage Industries of the Madras Presidency' అను గ్రంథము ననుసరించి వ్రాయబడినది.

---

# తెలంగాణము

**శేషాద్రి రమణకవులు**

నాణెంబైన మెఱుంగుకబ్బములతో నవ్యాకృతుల్ వాఙ్మయ
శ్రేణిం దీర్చిన సత్కవీశ్వరులకున్ సేవాప్రదేశంబు, గీ
ర్వాణాంధ్రాదిమకావ్యరత్ననికురుంబస్యందనంబై తెలం
గాణం బప్పుడు నిప్పు డుల్లసిలుటల్ కౌతూహలం బూన్చెడిన్.

కార్యాకార్యవిధిజ్ఞుఁడై శివమతాఖ్యానంబులన్ రేణుకా
చార్యుం డిందె రచించె, జైనకవిరాట్సారస్వతప్రక్రియా
వార్యప్రాభవ మిందె చెన్నలరె; విద్వన్మౌళి సింగావనీ
సర్వజ్ఞాంకున కిద్దియే భవన మీసౌభాగ్య మెన్నం దగున్.

# తెలంగాణము

కమ్మని తెల్గుబాస కాక కమ్మదనంబును గూర్చి కావ్యర
త్నమ్ముగ నాంధ్రభాగవతకల్పన జేసిన పోతరాజు మా
బమ్మెరవాసి, యందుగల పచ్చికచేలను బోతరాట్పదాం
కమ్ములు నేడు కన్ప[illegible]; పరిశోధకభావదృష్టికిన్.

రాశిన్నై కీర్తి పార[illegible]రుద్రదేవీమణి మా కులవృద్ధురాలు,
సాహిత్యవిద్యాప్రసాదప్రదాత విద్యానాథసుకవి మా యనుంగుసఖుండు
వ్యాఖ్యాశ్రీమణి జగద్వంద్యుండు మల్లినాథాగ్రణి మాకు విద్యాగురుండు
సర్వజ్ఞసింగమక్ష్మాపతి సాహిత్యభూమి కైసేయు మా పొలముకాపు

అద్వితీయాద్యశిల్పరత్నాకరంబు
ఓరుగలుపురి మాకు విహారభూమి
రాణమీఱు తెలంగాణ రత్నగర్భ
మిన్నగా మమ్ముఁ గడుపారఁ గన్నతల్లి.

కూలిన పూర్వదేవాలయంబులనుండి చిఱునవ్వు వెలయించె శిల్పలక్ష్మి
తాళపత్రగ్రంథతతినుండి వృద్ధసువాసిని భారతి పాడుచుండె
శిథిలదుర్గాంతరసీమలనుండి తత్కీర్తికన్యక భావగీతి వినిచె
చిరపరాధీనవిశీర్ణాంధ్రహృదయంబు పూర్వవైభవ మెంచి పొంగిపోవు

ఈశుభావహవేళ నహీనపూర్వ
గౌరవంబులఁ బడయఁగాఁ గాంక్షసేసి
ఆంధ్రతత్త్వంబు లోలోన నలరఁజేయ
నరుగుదెండు, త్రిలింగదేశాంధ్రులార !

కవిరాజేంద్రుల కీర్తికామినియు విఖ్యాతాత్మలౌ భూపతుల్
భువిఁ గల్పించిన శౌర్యలక్ష్మియు నభోభూభాగపర్యంతమున్
గవితాసూనమరందధారలు తెలంగాణంబుపైఁ జిల్కఁగా
నవలోకించుచు మోద మొందుటకు మే మర్థింతు మెల్లప్పుడున్.

———— ౦ ————

# ఆంధ్రరాష్ట్రము  ఖాదీపరిశ్రమ

ఆచంట లక్ష్మీనరసింహము

## ఉద్యమ ప్రారంభము

భారతమాతృ గర్భశుక్తి ముక్తామణియు, సారతపోమూర్తియు, ఆసేతుహిమాచల పృథ్వికిని మకుటరహిత సార్వభౌముడును, అనాథ దీనజన బాంధవుడును, దిగంతవిశ్రాంత యశోవిఖ్యాతుడును, నవయుగ ప్రవక్తయు నగు గాంధిమహాత్ముడు యీ దేశరాజకీయ, ఆర్థికపారతంత్ర్యమును, అజ్ఞానమును పోద్రోలుటకు చేయుచున్న కృషిలో ౧౯౨౧-వ సంవత్సరమున స్థాపించిన యుద్యమములలో ఖాదీ యుద్యమము మొదటిది. చరఖా యాయన జీవనాడి; ఆయన బహిఃప్రాణము (రోజుకు ౨౦౦ గజముల నూలు వడకనిది నిద్రపోవను ఆయన వ్రతమును, ప్రపంచ విఖ్యాతమైన ౨౧ రోజుల యుపవాసమునందు సైత మీ దీక్ష నాయన ఎటుల సాగించినదియు లోక మెరింగినదియే). ఆయన హైందవజాతికి ప్రసాదించిన మహత్తర వరములలో నిది ప్రథమగణ్యము; అన్నాతురులగు కోట్లకొలది భారతీయ దరిద్రనారాయణులకు తారకము. సర్వమత సఖ్యమునకు పునాది; జాతీయ పునర్నిర్మాణ సౌధమునకు మూలస్తంభము; గ్రామ పరిశ్రమ లన్నిటికిని జీవగర్ర.

శాంతిమాతయైన చరఖా పునరుద్ధరణ మును గూర్చియు, దాని భవిష్యత్తును గూర్చియు చెప్పుచు గాంధీజీ సగర్వముగా నది తన కమరత్వ మొసగ గలదనియు, "చరఖా ప్రాపంచిక జాతులనడుమను శాంతిసామరస్య ములను సంపాదించి, స్వయంకృపికి దారి చూపును. భావిసంతతులవారు, రాజకీయ, సాంఘీకములందు నేనొనర్చిన పెక్కుమార్పు లకు నన్ను నిందింపవచ్చును. కాని చరఖా యుద్ధరణమునకుమాత్ర మభినందించకపో" గను స్థిరవిశ్వాసము కలదనియు ప్రకటించెను.

౧౯౨౧-వ సంవత్సరము నుండియు నీ పరిశ్రమ యాంధ్రదేశమున దినదినాభివృద్ధిని గాంచుచున్నది. ౧౯౨౧ నుండి ౧౯౨౫ వరకు జరిగిన యభివృద్ధిని తెలుపునాధారములు లేకపోవుటచే, యీ రాష్ట్రమునకు ప్రతినిధిసంస్థ యగు ఆంధ్ర చరఖా సంఘమేర్పడిన ౧౯౨౬-వ సంవత్సరమునుండి యిప్పటివరకును — ౧౨ సంవత్సరములుగా నీ యుద్యమము పొందిన అభివృద్ధి, పరిణామములను గురించి సంగ్రహముగా నిట వ్రాయబూనితిని.

నైజాము రాజ్యమునందలి తెలంగాణముతో కలసి, ౧౦౫ వేల చతురపుమైళ్ల విస్తీర్ణమును, ౨ కోట్లపై చిలుకు జనాభాయు కలిగిన రాష్ట్రమున వ్యాపించిన యీ పరిశ్రమనుగూర్చిన పూర్తివివరములు తెలుపబూనుట అసాధ్యమైనను తొలుతటినుండియు నీ యుద్యమముతోగల సంబంధమునుబట్టి యిందులకు సాహసించితిని. (ఇచట చరఖాసంఘముయొక్కయు, తదనుబంధ సంస్థలయొక్కయు వివరములుమాత్రమే తెలుపవీలైనది)

## ఖాదీబోర్డులు

ఈ కాలమున ప్రజలకు దానధర్మరూపమునగాక తగిన పెట్టుబడితో ప్రతిఫలమిచ్చు వృత్తిని చూపుట లాభకరమను విశ్వాసముతో మహాత్మజీ కాంగ్రెసు ఆధ్వర్యమున వసూలు పరచిన నిధినుండి యీ యుద్యమమును ప్రారంభించెను. దేశమంతటను ఖాదీబోర్డు లేర్పడి, ౧౯౨౫సంవత్సరమువరకును, ఖాదీకార్యక్రమమును సాగించెను. కాని యా కార్యక్రమమును తీవ్రతరముగా నొనర్చుటకును, రాజకీయ ప్రాబల్యమునుండి తప్పించి, సర్వమత, పక్షాభిమానపాత్రముగా నొనర్చుటకును దీర్ఘదర్శియగు మహాత్మజీ సంకల్పించి, కాంగ్రెసు తీర్మానానుసారము అఖిలభారత చరఖా సంఘమును వేరుగా సృష్టించి, దానికి ౨౦ లక్షల నిధి నొసంగెను. (ఖాదీబోర్డులు రద్దుపరిచి, పరిపాలనను చరఖాసంఘమున కప్పగించెను.)

ఖాదీ యుద్యమము కాంగ్రెసునుండి వేరుపడుటవలన, నది యెంత త్వరితగతిని వివిధరాష్ట్రములలో వృద్ధినొంది నదియు, ౧౯౩౦-౧౯౩౨ సంవత్సరపు సత్యాగ్రహదినములలో ప్రభుత్వమువారీ యుద్యమమును రాజకీయములతో నంటగట్టి, ఎట్లు ఆర్డినెన్సుల పాలుజేయ యత్నించి విఫలులైనదియు గమనించినవారికి మహాత్ముని దీర్ఘదర్శిత్వము బోధపడగలదు. ఆ సమయమున ప్రభుత్వము వారీ రాష్ట్రమున, గౌతమీ సత్యాగ్రహాశ్రమమువంటి సంస్థలను పాడుచేసియు, ప్రజలకు భీతి గల్పించియు, ఖాదీప్రచారకులను నెన్నాడియు నెన్నో యాటంకములు కలిగించిరి. కాని యీ యుద్యమమునకు మాత్రము హానియొనర్ప శక్తులు కాలేదు. నేడు అట్టి ప్రభుత్వము మారి యాపరిశ్రమను గుర్తించి, యిందు పనిచేయువారికి సహాయ మొసంగుటకుగాను యీ సంవత్సరము ౨ లక్షల విరాళ మొసంగుట భావ్యభివృద్ధిసూచకమై, కాలపరిణామమును దెలుపుచున్నది. ముున్ముందు సైత మీవిధానము సాగించబడి, మహాత్ముని కృషి యనతికాలమున సాఫల్యము కాగలదను నాశ వొడముచున్నది.

## ఖాదీపరిశ్రమ కవకాశములు

ఈ పరిశ్రమను సాగించుటకు మనరాష్ట్రమున గల యవకాశము లపారములు. కావలసినంత ప్రత్తి పండుచున్నది. గ్రామములందు వేలకు వేలు సజీవములును, పటిష్ఠములునగు చరఖాలును, చాలినన్ని మగ్గములును కలవు. ఈ వృత్తికి సంబంధించిన పనివారందరును దేశమున విరివిగా నున్నారు.

సంతోషకరమగు మరొకవిశేషమేమన, యీ రాష్ట్రము పంజాబు, రాజస్థానువంటి రాష్ట్రములవలె నేయొకమాదిరి గుడ్డనోగాక శ్రీమంతులకు, మధ్యమ తరగతివారికి, నిరుపేదలకు కావలసిన సన్న దుకూలములు, పట్టు సరిగెరకములు, సాదారకములు, ముద్రురకములు వగైరా సమస్తవిధములైన గుడ్డలను ఉత్పత్తిచేయుచున్నది. ౭ నంబరునుండి ౨౦౦ల నంబరువరకు వస్త్రము లీ రాష్ట్రమున తయారగుచున్నవి. భారతవర్షవాసు లందరిని దిగ్భ్రమ నొందించు రింగుమజ్లిన్లు, గ్లాసు మజ్లిన్లు మనమే తయారు చేయగలిగియుండుట మహాదృష్టము. ఈ వస్త్రములకొరకు యితర రాష్ట్రీయు లందరును ఆంధ్రులకు కేలుమోడ్ప వలసినదే! అటులనే యీ రాష్ట్రపు మొదటి రకము సన్నబట్టయు పిఠాపుర యుత్పత్తియు కూడ ప్రశస్తిగడించినవి.

## ఆంధ్ర చరఖాసంఘము

అఖిలభారత చరఖా సంఘము యొక్క ఆంధ్రశాఖ ౧-౩-౨౬ తేదీని గుంటూరునందు ప్రారంభించబడెను. ఈసంస్థకు ప్రారంభము నుండియు దేశసేవాధురీణులగు శ్రీ కొండా వెంకటప్పయ్యపంతులుగారు ఏజంటుగాను, త్యాగధనులగు శ్రీ గొల్లపూడి సీతారామ శాస్త్రిగారు గౌరవ కార్యదర్శిగాను యుండి ౩ సంవత్సరములు ఘనమగు కృషియొనర్చి యుండిరి. ౧౯౨౯-వ సంవత్సరము నుండియు నీసంస్థకు ఆంధ్రనాయక మణియు, నిర్మాణ క్రియాదక్షులునగు భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారు గౌరవ కార్యదర్శిగాను, వారికి తోడునీడయై నిరంతరము ఖాదీయభివృద్ధికిని,తదీయ కళాలాలిత్యమునకును కృషిసల్పుచున్న శ్రీవేమూరి నారాయణమూర్తిగారు కార్యదర్శిగాను ఉండి యిప్పటికిని వారే దానిని నడపుచున్నారు. వీరి కాలముననే ఖాదీయుద్యమము పెక్కు విఘ్నములను గడచి, నలుదెసల ప్రాకి, ప్రభుత్వాదరణకు పాత్రమై, సర్వతోముఖమైన యభివృద్ధిని గాంచుచుండుటచే వీరు సార్థకజన్ములని చెప్పవచ్చును. శ్రీ డాక్టరుగారు బహు కార్య నిమగ్నులయ్యును, యీ యుద్యమ నిర్వహణము నెడ చూపుచున్న శ్రద్ధను గాంచిన వారెల్లరును నివ్వెరపడగలరు. ౧౯౨౯-వ సంవత్సరమునుండియు నీ సంఘ కార్యస్థానము కలంకారీ, అద్దకము పరిశ్రమల కాటపట్టును, చరిత్రాత్మకమునగు మచిలీపట్టణమునకు మార్చబడి, ప్రస్తుతము విశాలమైన స్వంత భవనము కలిగియున్నది.

ఈ సంఘమునకు ఖాదీబోర్డునుండి మార్చబడిన మొత్తము రు. ౫౭,౧౯౬-౩-౩ లును, నాగులాపల్లి క్షామనివారణనిధి బాపతు రు. ౫౦౪౨-౧౫-౩ లును మూలధనముగా నీయబడెను.

అతివిశాలమగు నీరాష్ట్రమున కీపెట్టుబడి చాల దని నాయకు లొత్తిడిచేయ, బాపుజీ శరీరక్లేశమును, శ్రమను లెక్కించక ౧౯౨౯-వ సంవత్సరములో మిక్కిలి యుష్ణమాసములగు ఏప్రిలు, మేమాసములందు ఆంధ్రదేశసంచార మొనర్చి, పెక్కు పట్టణములను, ౩౧౫ పల్లెలను సందర్శించి ఖాదీ నిధికిగాను రు. ౨,౪౬,౦౦౦ విరాళములు వసూలుపరచి, అందుండి ఆంధ్ర చరఖా సంఘమునకు రు. ౧,౭౬,౦౦౦ లనిచ్చెను. మరియు నీరాష్ట్రమున ఖాదీ పని సాగించుటకుగాను కీ. శే. డాక్టరు బ్రహ్మ జోస్యుల సుబ్రహ్మణ్యంగారికి ౨౦ వేలును, సి. వి. రంగం శ్రేష్ఠిగారికి వేయిరూపాయలును, కర్నూలు స్వదేశీస్టోర్సు తరఫున వైద్యనాథయ్యరుగారికి వేయిరూపాయలును అప్పుగా నిచ్చిరి.

## చరఖాసంఘం ఉత్పత్తిస్థానములు

౧. శ్రీకాకుళం సన్న కేంద్రము:—ప్రస్తుతము యీ సంఘముతరఫున ౮ వుత్పత్తిస్థానములు పనిచేయుచున్నవి. వీనిలో ౨ నూలు ఉత్పత్తికేంద్రములు (అమృతలూరు, కురుమద్దాలి)ను, మిగతవి నూలు, వస్త్రములనుకూడ తయారుచేయునవియు నైయున్నవి. వీనిలో ముఖ్యతమమగు శ్రీకాకుళంకేంద్రము విశాఖపట్నం జిల్లాలో నున్నది.యీకేంద్రముక్రింద పనిచేయు గ్రామములు విశాఖపట్నం, గంజాం జిల్లాలకు చేరియున్నవి.

చరిత్రాత్మకములగు సన్న మజ్లిన్లు పూర్వము డక్కాలోను, ఆంధ్రదేశమున నీ ప్రాంతములలోను తయారయ్యెడివి. డక్కామజ్లిన్లు దౌర్భాగ్యవశమున కథావశేషములైనను ఆంధ్రులయదృష్టరేఖ మంచిదగుటచే నీ ప్రాంతమునమాత్ర మా కృషి పూర్తిగా చావలేదు. (౧౫౦ సంవత్సరములనాటి పట్టుశాలి సన్న చీరయొకటిఆంధ్రచరఖాసంఘమువారి యధీనమున నున్నది.) అచటి శ్రీమంతుల యభిమాన,ప్రోత్సాహములవల్ల ౧౯౨౧-వ సంవత్సరమునకు బూర్వము కొలదిమంది యీ వృత్తివల్ల జీవించుచుండిరి.

౧౯౨౧-వ సంవత్సరములో ఆంధ్రదేశసంచారమున మహాత్మాజీకి యొకరు పొందూరు సన్నతానును బహుమాన మీయగా, నాయన మిక్కిలి యబ్బురపడి, దానిని ఖద్దరని నమ్మజాలక, వాస్తవము తెలిసికొనిరమ్మని దేవదాసుగాంధి నీప్రాంతములకు బంపెను. దేవదాసుగాంధి గ్రామములకు బోయి, యచటి ప్రజ లెటుల పత్తిని సున్నితముగా విడదీసి, స్వయముగా పట్టి, ఏకుకొని,యత్యద్భుతమైన సన్ననూలు వడుకుచున్నదియు, ఆగాలితంతువులను నిపుణులైన యచటి నేతగాండ్రెటుల చిత్రవిచిత్రములైన, మేలిరకముల యంచులతో నేయుచున్నదియు కన్నారగాంచి, బాపుజీ కెరిగింప ఆయన ఈ వుత్పత్తి నాశీర్వదించెను. అప్పటినుండియు, ప్రతికాంగ్రెసు ప్రఖ్యాతప్రదర్శనములోను యీప్రాంతపువడుకు, నేతపార్టీలవారు ఆహ్వానించబడుటయు, వారు వేలకొలది ప్రేక్షకులయెదుట తమకళా వైశద్యమును వెలిబుచ్చి, ఆంధ్రమాతకఖండకీర్తి, ప్రతిష్ఠల నార్జించుటయు జరుగుచున్నది.

౧౯౨౧-వ సంవత్సరమునుండి ౧౯౨౭-వ సంవత్సరమువరకు నీప్రాంతముల బయివేటు వర్తకులే వ్యాపార మొనర్చుచుండిరి. క్రమముగా రాష్ట్రమంతటినుండియు, బరరాష్ట్రముల నుండియు నా యుత్పత్తికి గిరాకి హెచ్చగానే వర్తకులు లాభముల కాశించి, మోసమునకు గడంగుటచే వారి ధ్రువపత్రము లన్నిటిని రద్దుపరచి, ౧౯౨౯-వ సంవత్సరము నుండియు చరఖాసంఘము స్వయముగా నచట స్థిరపడి క్రయవిక్రయములు సాగించెను.

౧౯౧౯-వ సంవత్సరమున తీసికొన్న యంకెలనుబట్టి యచట(౨౫ నంబరునుండి ౬౦ నంబరువరకు)వెలమనూలు వడుకువారు ౪,౩౨౮ గురనియు, వారి గ్రామములు ౧౧౬ నియు, పట్టుశాలినూలు (౪౦ నంబరునుండి ౨౦౦ నంబరు వరకు) వడుకువారి సంఖ్య ౧౧౪౭ మంది యనియు, వారు నివసించు గ్రామములు ౨౬ నియు తెలియుచున్నది. వారమున కొకసారి శ్రీకాకుళం, బుడితి, పొందూరు, చింతాడ, సింగిపురంగ్రామములలో జరుగు సంతలలో నీనూలు అమ్మబడుచుండును.

ఈ కేంద్రమున తయారగు వస్త్రములు, ప్రియమైనను చాలహెచ్చుమన్నిక గలవగుటచే లాభదాయకములు. ఇదివరకు అతిసన్నములోరింగుమజ్లిన్లుమాత్రమే తయారయ్యెడివి. (ఒకవుంగరముద్వారా ౫౪″ వెడల్పు ౧౬ గ. లపొడవుగల సన్నతాను దూర్చ వీలగును. ఈ రకం వస్త్రములధర గజం ౧-కి ౩-౧౨-౦.) ప్రస్తుతం పైవానిని మించిన నాణ్యములో గ్లాసు మజ్లిన్లున్ను తయారగుచున్నవి. వీనిధర ౫౧-కి ౪-౭-౦. యీ కేంద్రము ప్రస్తుతము సాలుకు లక్షరూపాయల యుత్పత్తిని చేయుచు, యింకను అభివృద్ధి కవకాశములు కలిగియున్నది. ప్రస్తుత మిచటి యుత్పత్తిని బొంబాయి, గుజరాతురాష్ట్రీయు లెక్కువగా కొనుచున్నారు.

ఆంధ్రదేశపు మహారాజులు, జమీందార్లు, శ్రీమంతులు యీపరిశ్రమను ప్రోత్సహించి, వృద్ధి నొందింతురుగాక!

౨. పురిటిగడ్డ, ఘంటశాల, గూడవల్లి కేంద్రములు:— వీనిలో మొదటి రెండును కృష్ణా మండలమునను, మూడవది గుంటూరుమండల మునను గల మొదటిరకం సన్నబట్టను తయారు చేయు కేంద్రములు. ఇచట తయారగువస్త్రములు ౨౦-౩౦ నంబరు సన్నము గలిగి, మధ్యమతరగతివారికి అందుబాటులో నుండును. ఈ ౩ కేంద్రములును ప్రస్తుత మొకలక్షరూపాయల యుత్పత్తిని గలిగి, యభివృద్ధి కవకాశములు కలిగియున్నవి.

౩. కందుకూరుకేంద్రము:—నెల్లూరు మండలమున మెట్టప్రదేశములగు కందుకూరు, కనిగిరి తాలూకాలయం దీ కేంద్రము ౧౯౨౨-వ సంవత్సరమున తొలుత కీ. శే. ఆచంట సత్యనారాయణగారిచే స్థాపించబడినది. ఆంధ్రమాత యనుగుబిడ్డలలో నొకడగు నాకర్మవీరుడు త్యాగధనుడై తను, ధన, మనఃప్రాణములను ఖాదీసేవకై యర్పించి ఈకేంద్రమును స్థాపించి, యద్వితీయమగు కృషి నొనర్చి, ౧౯౨౬-వ సంవత్సరమున నచటనే కీర్తిశేషుడయ్యెను. ఆత్మబలిదాన మొనర్చిన యీయజ్ఞాతవీరుని కృషి కికేంద్రమే నేడుసజీవస్మారకచిహ్నమై యొప్పారుచున్నది. ఇచటియుత్పత్తి ౧౨ - ౨౦ నంబర్లమధ్యనుండి, రెండవరకము గుడ్డయని వ్యవహరింపబడుచు రాష్ట్రమంతటను మంచిపేరు కలిగియున్నది. ప్రస్తుత మిచట సాలుకు ౮౦,౫౦ వేలరూపాయలఖాదీ యుత్పత్తియగుచున్నది. పేదవారగు వేలకొలది వడుకు ఏకుడు నేతకుటుంబములును, సమృద్ధియగు పత్తిపంటయు కలిగి యీ ప్రాంతము ఖాదీ యభివృద్ధి కపారావకాశములు కలిగియున్నది.

మరియు నిచటనుండియే రాష్ట్రములోని సన్నఖాదీ యుత్పత్తికి వలయు చక్కని ౧౦,౦౦౦ మణుగులమాది ప్రతివత్సరమును ఎగుమతి యగుచున్నది.

ఇదేమాదిరి గుడ్డ నుత్పత్తిచేయు గురవారెడ్డిపాలెమను మరొకకేంద్రము ఒంగోలుతాలూకాలో నున్నది.

## చరఖాసంఘ వస్త్రాలయములు

ముఖ్యపట్టణములగు మద్రాసు, నెల్లూరు, బెజవాడ, గుడివాడ, బందరు, కాకినాడ, విశాఖపట్నం, మెలియాపుట్టి, శ్రీకాకుళము లలో నీసంస్థతరఫున వస్త్రాలయములు పనిచేయుచున్నవి. పైన తెలిపిన వుత్పత్తిస్థానములలోకూడ విక్రయములు జరుపుదురు.

## ఏజెన్సీలు

ఈసంఘమునకు చెందిన వస్త్రాలయములు లేని పట్టణములలోనూ, పల్లెలలోను ఖాదీని విక్రయించుటకై యీ సంఘముతరఫున ౮౦ ఏజెన్సీ వస్త్రాలయములు పనిచేయుచున్నవి.

## ప్రయివేటు సంస్థలు

మొదటినుండియు నీరాష్ట్రమున చరఖాసంఘము ప్రయివేటుసంస్థలను ప్రోత్సహించియుండుటచే వీరియభివృద్ధి బాగుగానే యున్నది. వీరు దామాషాను చరఖాసంఘముకంటె రెట్టింపు వుత్పత్తి, విక్రయములు కలిగియున్నారు. ఇటీవల మహాత్మాజీ నూతన కార్యక్రమ మమలులోనికి వచ్చినపిమ్మట వీరిలో చాలామంది చరఖాసంఘముతో సమానముగా నిలువలేకపోవుటచే ధ్రువపత్రములు వదలుకొని వెనుకకు జారుచున్నారు. ప్రస్తుతమున్నవారిలో చాలమంది, వుద్యమ ప్రారంభమునుండియు నున్నవారగుటచే చరఖాసంఘముతోబాటు కష్టనిష్ఠురముల కోర్చి తుదివరకు నిలబడెదరని నమ్మవచ్చును.

౧౯౩౩-వ సంవత్సరమునందు వేయబడిన లెక్కలనుబట్టి, ప్రయివేటుదారు లీ పరిశ్రమయందు జిల్లాలవారీగా నీదిగువ విధమున పెట్టుబడి పెట్టియున్నారు.

| | | |
|---|---|---|
| చిత్తూరు | జిల్లా | ౧,౫౦౦ |
| కర్నూలు | ,, | ౩,౦౦౦ |
| (ఇటీవల నీజిల్లాలో మరి పెట్టుబడి పెరిగెను) | | ౧౫,౦౦౦ |
| తూర్పుగోదావరి | ,, | ౩౦,౦౦౦ |
| ప. గోదావరి | ,, | ౫,౦౦౦ |
| కృష్ణా | ,, | ౧౮,౫౦౦ |
| గుంటూరు | ,, | ౭౬,౦౦౦ |
| నెల్లూరు | ,, | ౨౧,౦౦౦ |
| అనంతపురం | ,, | ౭,౫౦౦ |
| బళ్లారి | ,, | ౧,౫౦౦ |
| నైజాము | ,, | ౩౬,౫౦౦ |
| | మొత్తము | ౨,౨౦,౦౦౦ |

వీరిలో గుంటూరుజిల్లా ఖద్దరు సంఘము వారు ముఖ్యులు. వీరు గుంటూరుమండలమంతటను వుత్పత్తి, విక్రయశాలల నేర్పరచి, సాలుకు లక్షరూపాయల వ్యాపారమును చేయుచున్నారు. ప్రస్తుతము వీరికి ధ్రువపత్రము లేదు.

కీ. శే. డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు సీతానగరమునను, పిఠాపురంలోను వుత్పత్తిస్థానముల నేర్పరచి, ఖాదీ యుద్యమాభివృద్ధికొరకు చాల కృషి చేసియుండిరి. వారు దివంగతులగుటచే ప్రస్తుత మాకేంద్రములు చరఖాసంఘముక్రిందకు రానున్నవి.

ప్రస్తుతము పనిచేయుచున్న ధ్రువపత్రసంస్థలలో ముఖ్యులను, వారు పనిచేయుచున్న కేంద్రములను దిగువ తెలుపుచున్నాను.

1. తునికేంద్రము.
   ౧. రాపర్తి జగన్నాథంగారు.
   ౨. కాపుల తమ్మిరాజుగారు.
   ౩. తిగుట వెంకట పెద్దిరాజుగారు.
2. పిఠాపురం కేంద్రం.
   ౧. తిగుట వెంకటపెద్ది రాజుగారు.
   ౨. మల్యాల వెంకట గోపాలరావుగారు.
   ౩. గౌతమీ సత్యాగ్రహాశ్రమం

—తూ. గోదావరిజిల్లా

3. చేబ్రోలుకేంద్రము.
   ౧. మల్లాది రాఘవయ్యగారు.
4. రేపల్లె కేంద్రము.
   ౧. రావు వెంకయ్యగారు.

—గుంటూరుజిల్లా

5. వీరన కనుపూరు.
   ౧. పోలవరపు గోవిందరావుగారు.

—నెల్లూరుజిల్లా.

6. తాడిపత్రి.
   ౧. ఎమ్. వీరభద్రప్పగారు.
   ౨. రాయలసీమ ఖద్దరుసంఘము.

వీనిలో కట్టకడపటిదగు రాయలసీమ ఖద్దరు సంఘము శ్రీమూల లక్ష్మీనారాయణగారొసంగిన రు. ౧౫,౦౦౦ల పెట్టుబడితో ఇటీవలనే ప్రారంభమైనది. ఈసంస్థ యచిరకాలముననే శాఖోపశాఖలుగా రాయలసీమ యంతటను వ్యాపించి, యితర మండలములకు తమవుత్పత్తిని బంపి ఆంధ్రైక్యత కెంతయు తోడ్పడుగాక!

## కలంకారీ, అద్దకం పరిశ్రమలకు ఖాదీ సహాయం

చరఖాసంఘ కేంద్రస్థానమును, కేంద్ర వస్త్రాలయమును అద్దకములకు అనాది ప్రసిద్ధి గల బందరునకు మార్చబడుటచే, ౧౬౦౦వ సంవత్సరమునుండియు వివిధరకముల చీరలు, చీటేలు, రంగురంగుల దుప్పట్లు, శాల్వాలు మున్నగు ఆకర్షవంతములగు అద్దకములు వేయబడి, ఖాదీ యీ రాష్ట్రమునను, యితర రాష్ట్రములలోను హెచ్చుగా బ్రచారమగుచున్నది. ముఖ్యముగా నీపట్టణమునకును, ప్రాంతమునకును ప్రఖ్యాతి నార్జించినట్టియు, నల్గొండరు సమ్రాట్టుచేతను, మొగలు పాదుషాలచేతను మిగుల నాదరించబడి, పాశ్చాత్య దేశములకును, యిటీవలివరకు విస్తారముగా పర్షియాకును ఎగుమతియగుచు, నొకనాడు ౩౦౦౦ కుటుంబములకీయొక్క పట్టణమునసే పని యీయగలిగి నేడు శిథిలావస్థకు వచ్చిన కలంకారీ పరిశ్రమను ఖాదీ యుద్ధరించినది. నేడు ఖాదీమీద పలురకముల కలంకారీ దుప్పట్లు, టేబిలుగుడ్డలు, డోరుకర్టెనులు తయారై, పెక్కు ప్రదర్శనములందును, కళాభిజ్ఞులగు విదేశీయులచేతను ప్రశంసల నొందుచున్నవి. ఈ విషయమున మిగుల కృషి చేసిన చరఖాసంఘ కార్యదర్శిగారగు శ్రీ నారాయణమూర్తిగారెంతయు నభివందనీయులు.

మరియు నీసంఘము హరిజనులచే నాంధ్ర జాతీయ కళాశాలయందు నేయించుచున్న ఖాదీ తివాసులును, ఫ్రాకులు వగైరా కుట్టబడిన వస్తువులును ప్రజానురాగమును బొందినవి.

## ఆర్థిక దుస్థితియందు రైతులకు ఖాదీసహాయము

దేశము నావరించిన ఆర్థికదుస్థితివలన మిగతవ్యాపారము లన్నిటివలెనే ఖాదీవిక్రయములుకూడ చాలవరకు తగ్గిపోయినవి. తాను పండించు వస్తువు లన్నిటికిని ధరలుపడిపోయి పన్నులు చెల్లించలేక కుంగుచున్న రైతునకు ఎక్కువ సహాయకారిగా నుండుటకు చరఖాసంఘమునకు హెచ్చుఉత్పత్తి చేయ వీలుగాకపోయినను, జరిపిన స్వల్పపనితోనే అది రైతుకు కొంతవరకు సుఖము గూర్పగల్గినది. ఈసమయమున రాట్నచాలనమున కలవాటుపడిన గృహిణులు, బాలవృద్ధులు సంవత్సరము పొడుగునను నూలువడికి, తమకుటుంబములకు వలయువస్త్రములు కొనవుంత నేయించుకొనియు, మిగతనూలును విక్రయింపగావచ్చిన యాదాయముతో పన్నులు చెల్లించుటకును, కుటుంబఖర్చులుజరపుటకును చాల తోడ్పడిరి. ఇందులకు నిదర్శనముగా దేవరకోట సంస్థానములోని ఒక గ్రామములను చూడవచ్చును: నాగరికతకు, వరిపంటకు ప్రసిద్ధిగాంచిన గుడివాడతాలూకావారు రాట్నపరిశ్రమ ప్రవేశించని కారణమున యప్పులలో మునిగియుండ, పై గ్రామములవారు పన్ను, బందీలు చెల్లించుకొనుచు, తిండికి, బట్టకు లోటు




బుద్ధుని శిలావిగ్రహము (అమరావతీ)

లేకుండ జీవనము చేయగలుగుట ఖాదీ మాహాత్మ్యము గాక వేరేమి?

### ఖాదీద్వారా హరిజనసేవ

ఈ యుద్యమము దరిద్రనారాయణు లందరికిని, ముఖ్యముగా సంఘదుర్నయము పాలై యధమస్థితియందున్న హరిజనులకును తోడ్పడ సమర్థమైయున్నది. పూర్వము హరిజనకుటుంబములలో సన్ననినూలు వడుకగలుగువారు పెక్కుమంది యుండిరని "మాలనూలు సన్నము, గట్టియని తలపాగల కుపయోగించువా"రని నేటికిని జనులయందు వాడుకలోనున్న నానుడి ననుసరించి తెలియుచున్నది. (అటులనే మాదిగలలోకూడ సన్ననూలు వడుకువారు కొందరు నేటికిని కందుకూరుప్రాంతములలో నున్నారు.) కాని దౌర్భాగ్యవశమున నిటీవల వీరిలో యీ కౌశలము నశించుటచే, తిరిగి యీ కుటుంబము లందు చరఖాను ప్రవేశపెట్ట యత్నములు జరుగుచున్నవి. ప్రస్తుతము చరఖాసంఘ వివిధశాఖలలోను ౧౦౦ మంది హరిజనులు మాత్రము వడుకుచున్నారు.

ఈ కుటుంబములలో నేతవృత్తి యింకను సజీవమైయుండుట గొప్పవిశేషము. చరఖా సంఘము తరఫున కందుకూరు, గురవారెడ్డి పాలెములలోను, ఆంధ్రజాతీయకళాశాలలోను సుమారు ౧౨౦ మంది హరిజన నేతగాండ్రును, కార్యాలయమున యిరువురు హరిజన నౌకర్లును బనిచేయుచున్నారు. వీరిసంఖ్య యింకను త్వరలో పెరుగుసూచన లున్నవి.

ఘంటసాల నారాయణమూర్తి, పువ్వాడ సత్యనారాయణగార్లను యిరువురు ప్రయివేటు ఖద్దరువర్తకులు సుమారు ౨౦ మంది హరిజననేతగాండ్రకు బని యిచ్చుచున్నారు.

### ఖాదీధరలు, నాణ్యములో నభివృద్ధి

ప్రారంభములోకంటె యిప్పుడు తయారగు నన్నిరకములలోను పుంజములు తరుచు చేయబడి, ఖాదీ నాణ్యములో చాలాయభివృద్ధిచెందెను. ఖాదీధరలు ౧౯౨౭-వ సంవత్సరమున సాదారకములలో గ ౧-కి ౦-౧-౦ వంతునను, శ్రీకాకుళంరకములకు గ ౧కి ౦-౨-౦ నుండి ౦-౪-౦ వంతునను తగ్గించబడెను. మరల ౧౯౨౯-వ సంవత్సరములో నొకసారియు, ౧౯౩౩-వ సంవత్సరములో ౨ సార్లును సుమారు గ ౧కి ౦-౬-౦ వంతున తగ్గించబడెను. ఇటీవలమహాత్మాజీ నూతనవిధానమునసుసరించి వడుకుకూలి పెంచుటచే ధరలు గ ౧కి ౦-౦-౬ నుండి ౦-౧-౦ వరకు పెంచబడెను. అయినను ౧౯౨౨-వ సంవత్సరమున గ ౧కి ౧-౬-౦ ధరగలసడ్డ ౧౯౨౭ లో గ ౧కి ౦-౧౨-౦ లకును, నేడు ౦-౯-౯ లకును తగ్గినదన నీలోపుగా నెంతకృషి జరిగినదియు, ధర లెంతతగ్గినదియు సులభముగా గ్రహింపవచ్చును. మన ఖాదీ యిప్పటికిని తిరుపూరుఖాదీకంటె గ ౧కి ౦-౦-౯, ౦-౧-౦ చవుక.

ప్రక్క పట్టిక యంకెలనుబట్టి ఖాదీపరిశ్రమ యీవత్సరములలో ౧౬౬౦మందినేయువారికి, ౧,౭౨,౬౧౬ మంది వడుకువారికి, ౯౪౭౦ మంది నేతగాండ్రకు నాశ్రయమిచ్చె ననియు, దామాషాను ౫౦౦ గ్రామములలో, సాలుకు ౧౫౦ మంది నేయువారు, ౨౦,౦౦౦ మంది వడుకువారు, ౧౦౦౦ మంది నేతగాండ్రు పని చేయుచున్నారనియు గ్రహించగలము. వీరి కీయబడిన మజూరీలను ప్రక్క పుటలోని పట్టిక తెలుపుచున్నది.

డాక్టరు పట్టాభిగారు తెలిపినటుల "ఖాదీ దేశీయుల జాతీయాభిమానమును, వుద్యమ తీవ్రతను తెలుపు బరామీటరు"గా నున్నట్లు పై యంకెలనుబట్టి మనము గ్రహించగలము. దామాషాను సాలుకు ౫ లక్షల ఖాదీ యుత్పత్తియై విక్రయమగుచున్నది.

గాంధీజీ సత్యాగ్రహమును సాగించిన ౧౯౩౦, ౧౯౩౨ సంవత్సరములలో ఖాదీ వుత్పత్తి విక్రయము లత్యధికముగాను, ౧౯౩౬ లో అత్యల్పముగాను కాన్పించుచున్నవి. ౧౯౩౬ లో వుత్పత్తి విక్రయములు తగ్గుటకు నూతనవిధాన ములలోనికి వచ్చుటయు, ధరలు పెరుగుటయుకూ ? కారణములై యున్నవి. ౧౯౩౨కు యావల వుత్పత్తి విక్రయము లుతగ్గుటకు దేశము నావరించినఆర్థికదుస్థితియు, జాతీయోద్యమమాంద్యమును ముఖ్యకారణములు. గతవత్సరము కాంగ్రెసు ప్రభుత్వమేర్పడి, జాతీయశక్తులు విజృంభించనారంభించుటచే (ఈ అంకెలు యింకను అసంపూర్ణములు) అమ్మకములు రెట్టింపైనవి. రోజురోజు యీ యుద్యమము నవనవోత్సాహ

### ఖాదీపరిశ్రమయందు నిమగ్నులై యున్నవారియు, వారి కీయబడిన మజూరీలయు అంకెలు

| చరఖాసంఘం లేక ధృవపత్ర సంస్థలు | సం॥రం | గ్రామముల సంఖ్య | నేయుడువారు | వడుకువారు | నేతగాండ్రు |
|---|---|---|---|---|---|
| చరఖాసంఘం | 1927 | — | 26 | 2,373 | 255 |
| ,, | 1928 | 609 | 359 | 16,529 | 1032 |
| ,, | 1929 | 674 | 486 | 20,716 | 1246 |
| ,, | 1930 | 687 | 428 | 20,779 | 1152 |
| ,, | 1931 | 373 | 74 | 14,308 | 558 |
| ధృ. సంస్థలు | ,, | 441 | 95 | 19,559 | 1838 |
| చరఖాసంఘం | 1932 | 357 | — | 25,000 } | 2400 } |
| ధృ. సంస్థలు | ,, | 500 | — | | |
| | | | | హరిజనులు | హరిజనులు |
| చరఖాసంఘం | 1933 | 327 | 50 | 11,366 + 150 | 488 + 10 |
| ధృ. సంస్థలు | ,, | 500 | 84 | 41,549 | 1098 + 25 |
| చరఖాసంఘం | 1934 | 466 | 60 | 14,985 | 564 |
| ధృ. సంస్థలు | ,, | 122 | 48 | 6,231 | 554 |
| చరఖాసంఘం | 1935 | 283 | — | — | — |
| ధృ. సంస్థలు | ,, | 186 | — | — | — |
| | | మొత్తం | 1660 | 1,72,616 | 9,470 |

| సంవత్సరం | చరఖాసంఘం లేక ధృ. సంస్థలు | ఏకుడుకూలి | వడుకుకూలి | నేతకూలి | చలువకూలి | కట్టుకూలి | మొత్తం సంవత్సరములో యిచ్చినకూలి |
|---|---|---|---|---|---|---|---|
| 1927 | ధృవపత్రసంస్థలు | 4,046 | 1,74,648 | 1,46,702 | — | — | 3,25,396 |
| | చరఖాసంఘం | — | — | — | — | — | 48,002 |
| 1930 | ,, | 1,387 | 1,05,015 | 1,21,042 | — | — | 5,10,730 |
| | ధృ. సంస్థలు | 14,911 | 1,04,364 | 1,64,011 | — | — | |
| 1931 | చరఖాసంఘం | 9,286 | — | — | — | — | 5,54,406 |
| | ధృ. సంస్థలు | 18,528 | 78,326 | 1,18,499 | — | — | |
| 1932 | చరఖాసంఘం | 3,076 | 42 005 | 80,916 | 2040 | 2,145 | 4,48,250 |
| | ధృ. సంస్థలు | 17,881 | 1,24,893 | 1,96,251 | — | — | |
| 1933 | చరఖాసంఘం | 1,818 | 71,178 | 52,235 | 1521 | 4,286 | 2,20,572 |
| | ధృ. సంస్థలు | — | 93,438 | 89,534 | — | — | |
| 1934 | చరఖాసంఘం | 2,430 | 56,218 | 49,130 | 2,203 | 5,629 | 2,76,546 |
| | ధృ. సంస్థలు | 4,500 | 95,139 | 62,449 | — | — | |
| 1935 | చరఖాసంఘం | 2,590 | 58,672 | 45,905 | 24,84 | 4,196 | 1,08,847 |
| | ధృ. సంస్థలు | — | — | — | — | — | |
| 1936 | చరఖాసంఘం | — | 26,768 | 18,671 | — | — | 1,05,070 |
| | ధృ. సంస్థలు | — | 32,506 | 27,125 | — | — | |
| | వెరశి మొత్తం | | 80,446 | 11,87,210 | 8,208 | 16,256 | 25,97,819 |

అసంపూర్ణము లగు నీ యంకెలను బట్టియైనను, సాలుకు 3¼ లక్షల ధనప్రవాహము పట్టణములనుండి గ్రామములకు మరలెనని మనము గ్రహించగలము.

ముతో పరుగులువారుచు, పూర్వపు అభివృద్ధి నొంద యత్నించుచున్నది. ప్రస్తుతము భారతదేశమువ ఖాదీయుత్పత్తిరాష్ట్రములలో నీయాంధ్రరాష్ట్రము నాలుగవస్థానమాక్రమించుచున్నది. ఆంధ్రసోదరులయభిమాన ప్రోత్సాహముల నవ్వారిగ గాంచి, నూత్నవత్సరమున నీపరిశ్రమ గతవత్సరముల రికార్డుల నన్నిటిని తలదన్ని యత్యుచ్ఛస్థానము పొందనున్నది.

## నూతన కార్యక్రమము

౧౯౩౫-వ సం॥ రమునుండియు, మహాత్ముడు చరఖాసంఘదృష్టిని వ్యాపారము నుండి స్వయంపోషకవిధానమువకును, పట్టణములనుండి పల్లెలకును, పట్టణవాసులనుండి జానపదులవంకకును మరల్చెను; చరఖాసంఘ ఆదర్శము వ్యాపారదృష్టితో వుత్పత్తి, విక్రయములు జరుపుటేగాక దేశీయులయందు స్వయంపోషకవిధానము వృద్ధియగునట్లును, ఏ రాష్ట్రమున తయారైన ఖాదీ. యారాష్ట్రముననే ఖర్చుగునట్లును మాముటగా నుండవలెనని స్పష్టపరచెను. మరియు, తరతరములనుండి యమలులో నున్నను, ప్రస్తుతమున్న వడుకుకూలి భుక్తికి చాలని దగుటచే ౮ గంటలకృషికి కనీసం ౦-౩-౦ లుండవలెనని, యీ పరిశ్రమయందు పాల్గొనువారందరును ఖాదీనే ధరించునట్లు చూడవలెనని యేర్పాటయ్యెను. ఈ విధానమువలన నొకవైపు గ్రామస్థులను ఖాదీ ధరించునట్లొనర్చుటచేతను, రెండవవైపు కొలదిగా ధరలు పెరుగుటచేతను యీ యుద్యమమునందు గొప్పవిప్ల

### రాష్ట్రములోని ఖాదీ వుత్పత్తి విక్రయముల పట్టిక

| సంవత్సరం | మొత్తం వుత్పత్తి | మొత్తం విక్రయం | |
|---|---|---|---|
| 1926 | 3,50,100 | 5,19,110 | |
| 1927 | 3,70,292 | 6,07,898 | |
| 1928 | 2,92,987 | 3,74,120 | |
| 1929 | 3,40,215 | 4,17 715 | |
| 1930 | 7,99,780 | 8,06,589 | |
| 1931 | 8,89,826 | 7,96,623 | 15 నెలలకు |
| 1932 | 7,60,978 | 5,88,749 | |
| 1933 | 7,60,963 | 4,47,714 | |
| 1934 | 4,09,396 | 4,04,740 | |
| 1935 | 3,41,366 | 4,07,565 | |
| 1936 | 2,41,361 | 1,87,445 | |
| 1937 | 2,54,054 | 3,59,882 | |

మొత్తం వుత్పత్తి 58,17,318 మొత్తం అమ్మకం 59,18,150

అంకెలు అసంపూర్ణములు.

వము కలుగునని పరక్కు రెల్లరును భయపడిరి. కాని యమోఘసంకల్పుడగు మహాత్మజీ యుద్దేశించిన ప్రకార మీ విధానము నిర్విఘ్నముగా సాగుచున్నది. ఖాదీ ధారణమువలని లాభములను గ్రహించిన గ్రామీణులు దానిని సంతోషముతో ధరించుచున్నారు. తాత్కాలికముగా తగ్గినను ఖాదీయమ్మకములు ప్రస్తుతము యథాస్థితికి వచ్చినవి.

## ప్రభుత్వసహాయము

కాంగ్రెసు ప్రభుత్వమువారీ సంవత్సర మొసంగినవిరాళమును, నూలు వడుకువారికి వారకు ౧కి ౦-౦-౩ చొప్పునను, నేతగాండ్రకు ౪ ౧కి ౦-౦-౯ చొప్పునను పంచిపెట్టుట ద్వారాను, నూతన రాట్న పరికరములను, ఏకుడు బద్దలను తక్కువ ఖరీదులకు అందచేయుట చేతను యీపరిశ్రమయందున్న పనివారందరును అపూర్వోత్సాహముతో పనిచేయుచున్నారు త్వరలో యింకను వేలకొలదిమంది క్రొత్తవారు వడుకుటకును, ఖాదీని నేయుటకును పూనుకొనగలరు. ఖాదీ వుత్పత్తి, విక్రయము లీవత్సరము అపూర్వముగా పెరుగుట నిశ్చయము. అత్యుత్తమ గ్రామోద్ధరణ కార్యమగు నీ పద్ధతిని ప్రభుత్వమువారు యింకను సాగించి, గ్రామములందీ పరిశ్రమ స్థావర మేర్పరచుకొనునట్లు తోడ్పడుదురని, మరియు ఖాదీసంస్థలు వుత్పత్తికాలమున విక్రయము లుండనిచో దూది నూలు నిలువచేయుటకు, హెచ్చు వుత్పత్తి చేయించుటకు వీలుగానుండ నున్న యిబ్బందులను తగిన ఆర్థిక తోడ్పాటు చూపి తీర్చెదరని ఆశించుచున్నాను.

మరియు మైసూరు, బరోడా సంస్థానముల మాదిరిగా నీ విశాలరాష్ట్రమున గల రాజులు, మహారాజులు, జమీందార్లు తమ ప్రాంతములలో నీ పరిశ్రమను ప్రవేశపెట్టి, కడుపునిండ తిండియు, కట్ట బట్టయు లేక అల్లాడు తోడి దేశీయసోదరుల కాధారము చూపవలెనని విన్నవించుచున్నాను.

## ఖాదీధరుల పంపకము: విజ్ఞప్తి

విదేశీ, మిల్లువస్త్రములకంటె ఖాదీ కొంచెము ప్రియమైనను, ఖాదీకై వెచ్చించు ప్రతి రూపాయయు ఎట్లు వ్యయమగుచున్నదో యీదిగువ యంకెలనుబట్టి గమనించినవారు యితర వస్త్రములను ధరించనొల్లరు.

| | |
|---|---|
| పత్తిపండించు రైతుకు | ౦-౩-౯ |
| పత్తిపట్టువానికి | ౦-౦-౬ |
| ఏకుడు మనిషికి | ౦-౧-౯ |
| వడుకు నామెకు | ౦-౩-౯ |
| నేతగానికి | ౦-౪-౯ |
| చాకలికి | ౦-౦-౬ |
| అమ్మకపువారుకు | ౦-౧-౦ |
| వెరశి | ౧-౦-౦ |

ఈ విధముగా మనము వెచ్చించు ప్రతి పైసయు నీదేశముననే నిలుపు భాగ్యలక్ష్మియగు ఖాదీని గూర్చి గాంధీజీ లంకాషైరు యాత్రసందర్భమున నుడివిన వాక్యముల నుదాహరించి ఈ వ్యాసమును ముగింతును:

"నా దేశమున అర్ధాన్నము భుజించువారును, రోజునకు అర్ధపూట యన్నము లభించనివారును కోట్లకొలది యున్నారు. మీరు శ్రమపడి మా గ్రామములను దర్శించునెడల, అచట మీకు అర్ధభోజనులై, కళాకాంతులులేక వెల్వెలబారు మొగములతోడి జీవచ్ఛవములు కాన్పింతురు. ఇట్టి ప్రజలతోకూడిన నేటి భారతవర్షము ప్రపంచమునకు కళంకదాయకము. ఇట్టి యనాథలకు చేతినిండ పనికల్పించి ఆహారమొసగి, జీవనప్రసారము మొసగునెడల నా దేశము ప్రపంచమునకు తోడ్పడగలదు."

ఆంధ్రసోదరు లీ సందేశ పరమార్థమును గుర్తించి, ఖాదీ సర్వతోముఖాభివృద్ధిని గాంచునట్లు కృషిసల్పుట కర్తవ్యము.



# జన్మభూమి



గుఱ్ఱప్పడియ ఆంజనేయులు

ఇలువేల్పుగా నిల్చె నేపుణ్యసీమలో హరిహరస్వామి, శేషాద్రిజాని;
నాయకప్రౌఢిఁ గన్నాఁ డేధరిత్రిపై విష్ణుదేవుఁడు, విశ్వపిశ్వవహుఁడు;
కాపురంబుగ నెందుఁ గాపుండు ముమ్మాలఁ బాలితాంతర్వాణి, శూలపాణి;
ప్రవహించు నేదివ్యపథి సప్తశాఖలై చదలేటియమృతంబు సంతతంబు

మిత్తి నెచ్చోటఁ గొనగోట నెత్తివైచుఁ
గొండనెత్తాల తరులతాగుల్మతతులు;
పూత కమ్మహితాంధ్రభూమాత కాత్మ
జులము మనుజులలోఁ గృతార్థులము మేము.

కనకసానువుతోడఁ గచ్చెఁ బూనిన మేటి వింధ్యాచలేంద్రంబు వెల్లగొడుగు;
మస్తకన్యస్తరామపదాబ్జరేణువు దక్షిణాపథము కుందనపుగద్దె;
సస్యజీవనలు కృష్ణాగౌతమీముఖ్య పుణ్యాపగావళుల్ పూలసరులు;
లేయెండతాల్పుతొల్లిటి ముద్దుఁ గొను వంగజలధిరాజము వన్నె లొలుకు వలువ;

సిరి కిరవు; మద్రపురమౌళి చరణపీఠి
భారతోర్వీవిభాగముల్ బంధుకోటి,
కర్ణచారిణి చల్లని కడుపుతోడు
ఎల్లజగముల మాతల్లి కెవ్వ రీడు ?

తీర్చి దిద్దినది వైదికరంగవల్లులు తనపల్కుజిలుగుముత్యాలతోడ
నిండించినది ఖండఖండాంతరద్రోణిఁ దనకళావిజ్ఞానధనముతోడ
వెలయించినది నదీవిభుముంగురులపెంపుఁ దననావికాలతాంతములతోడ
కావించినది పాలగచ్చు దిగ్గృహాలలోఁ దన సద్యశస్సుధాద్రవముతోడ

నమ్మహాదేవి యలఁతియే ? యద్రిగహ్వ
రాంతరాత్యంతదంతురితాఖిలాండ
శిల్పిచతురాస్య జనయిత్రి, సిద్ధగాత్రి
హార్దసముపేత, అస్మదీయాంధ్రమాత.

ఆజగదేకవంద్య మృదులాంకమునన్ బసిపాపనై, యని
ర్వ్యాజసుఖానుభూతి యుగపంక్తి నిమేషములట్లు పుత్తు; లే
జాజుల తోడికోడలగు జానుదెనుంగునఁ బల్కరించి, యీ
భూజగమెల్ల ముంతు నవమోహనమోద పయోధివీచికన్.

# జన్మభూమి

ఆరసి కన్నులన్ దెఱచినప్పుడె దప్పికదీఱఁ దత్పయో
ధారలఁ గ్రోలి, ప్రాకులిడి, తల్లిశరీరమునన్ దదీయవి
స్తారదయాప్రసాదమున సారెకు వర్ధిలుచున్నవాఁడ; న
క్కారుణికాగ్రగణ్య కధికంబగు దైవము మాకుఁ గల్గునే?

పుప్పొడులు గావు పచ్చకప్పురము గాదు
గందవొడి కాదు, కాదు చొక్కపు జవాది
తనువు సోకిన సురభిళోత్సాహ మొదవు
జన్మభూరేణువుల మంత్రశక్తియేమొ?

తన్నినను ద్రవ్వినను బ్రశాంతము వహించుఁ,
గోరి ప్రజనెల్లఁ దలనిడికొనుచుఁ బ్రోచు
నెఱుఁగ దలసట నిసుమంతయేని, జన్మ
దాత్రికన్నను మాజన్మధాత్రి మిన్న.

తన చిన్నారి యనుంగుబిడ్డలనిమిత్తానన్ మదీయాంబ వె
చ్చని కన్నీటఁ గపోలరక్తిమము హెచ్చన్, ముష్కరవ్రాత్యచ
క్రనితాంతోద్ధతిఁ గాలలీలఁ ద్రిజగత్కల్యాణదంబౌ పురా
తనశోభన్ బెడవాసెనయ్యొ! "మసిపాతన్ గట్టు మాణిక్యమై".

కూలిన కోటలు, నేలకు
వ్రాలిన ఇల్లాలు, పాడువడిన నగరముల్
ప్రోలఁ గనుపట్టువేళ ని
రాలంబనవీథులందు బ్రాన్పడిపోదున్.

ధాత లిఖించినాఁడో! మనతాతలు తామె బిగించినారో! కా
ళ్లేతులఁ గట్టివైచిన వివీ! కొఱమాలిన దాస్యపాశముల్,
శీతలమయ్యె రక్త; మవశిష్టము జీవకణంబు; కాని మ
న్మాతృపదానుచింతనమె మాయెద వైద్యుతవాహి యయ్యెడిన్.

తమసర్వస్వము దేశమాతృచరణద్వంద్వైకపూజాసమ
ర్థము గావించిన రాణ్మహేంద్రులు, సుధీరత్నంబు, లాచార్యస
త్తము లీనాఁడును మన్మనోనభసి నుద్యత్తారలై యాత్మతే
జములన్ జీల్చుచునున్నవా రిదె నిరుత్సాహాంధకారచ్ఛటన్.

పాలించి రొకనాఁడు పాటలీపురహస్తిశైలమధ్యక్షోణి శౌర్య మెసఁగ
మరలించి రొకనాఁడు మాద్యద్ద్విపోదగ్రపరభూపవాహినీ ప్రళయరేఖ

చెక్కించి రొకనాఁడు శ్రీజయస్తంభంబు లఖిలదిక్కుల సువర్ణాక్షరముల
పలికించి రొకనాఁడు ప్రస్తుతుల్ గంధర్వసీమంతినీవిపంచికలమీఁద

ఆంధ్రభూపుత్రకులు మదీయాగ్రజన్మ
లమ్మహాత్ముల భవ్యరక్తాగ్నిశకల
మారిపోలేదు, నివురునఁ గూరి మరగి
యున్న దీగుండెలోఁ జూచుకొన్న నిపుడు.

దాతృత్వప్రథముల్, మహాధనులు, విద్వాంసుల్, కవీంద్రుల్, ధరా
నేతల్, నీతికళాయుగంధరులు, మన్నీ లాంధ్రు లున్నారు మ
ద్ధాత్రితల్; మాతకు లే దయో! తుదకుఁ జింతాక్రాంతయై స్వేచ్ఛ — ని
ర్ఘాతంబై యిది ప్రీల్చుచున్నది మనఃకాయంబు లశ్రాంతమున్.

అన్నదమ్ముల కయ్యంబు లంతరించి
స్వీయరాష్ట్రంబు గ్రమ్మరఁ జేతికొదవి,
దాస్య ముడివోయి, మా కన్నతల్లియైన
తెలుఁగునాడున కేనాఁడు దిగులు తీఱు?

ద్రవిడ కేరళ మహారాష్ట్ర బేహారాదు లంతంత నిలిచి జోహారు లిడఁగ
నిజకిరీటచ్ఛాయ నీరాకరము దాఁటి బ్రహ్మభూములకు శోభను ఘటింప
చలువచూపుల వింత చెలువంబు లభినవకేదారపటలితోఁ గ్రీడ సల్ప
విశ్వమోహనరూపవిక్రాంతి భూగోళపటదర్పణంబునఁ బ్రతిఫలింప

నర్భకుల కెల్ల నుల్లాస మతిశయిల్ల
నాత్మసామ్రాజ్యవిజయసింహాసనమున
వేగఁ బట్టాభిషిక్తవై వెలయు మమ్మ!
జన్మభూమీ! నమస్కారశతము నీకు.

---

పగపట్టిన పన్నగిలా ఆ లోయలోనికి చొచ్చుకపోయ్యాను.

ప్రతివంకరకూ ప్రత్యక్షమైన ప్రకృతి దృశ్యసౌందర్యం మహాకావ్యంలో పుటలు తిప్పినప్పటి రసానుభూతిలా వున్నది.

నాలుగు మెలికలు. ఒక్కొక్క మెలిక మూడువందల ధనువులు. అర్ధానుస్వారరూపమై ఎప్పటికప్పుడు అఖరులా తోచిన ఆ మెలికలో రెండువైపులా నదీదేవత సంతరించిన నలభై నిలువుల యెత్తు నల్లరాతిగోడలు. చెట్లు దట్టంగా పెరిగిన కొండచరియలు, వాటిపై నీలాలశిఖరాలు. కోరలున్నట్లూ, భయంకరమైన ఖడ్గమృగాలల్లా పడివున్న నల్లరాతి బండల్లో ముప్పైధనువుల వెడల్పున రాగమాలికలు పాడుకుంటూ భోగీర ప్రవహిస్తున్నది.

పారిజాతవనాలు, అడవిమల్లెలు, ఇప్పచెట్లు, చీకటిమానులు, నల్లమద్దులు, రేగులు ఆ కొండచరియల్నంతా నిండి ఉన్నవి.

దూరాన్నుంచి ఘంటానాదాలు, భిక్కుల మంత్రస్వనాలు తుమ్మెదల ఝుంకారాలతో, పక్షుల కలకూజితాలతో కలిసి వినవస్తున్నవి.

విహారానికి వచ్చిన మృగినై ఆ లోయ చొచ్చుకుపోతిని. మావాండ్లు వెనకనే నెమ్మదిగా వస్తూ ఉండిరి. "అమ్మాయీ! ఒంటరిగా ముందు వెళ్లిపోకమ్మా!" అని మా అమ్మ అన్నమాట ఎక్కడో దూరాన్ని వినబడింది. ఒకమలుపు మళ్లింది. ఎట్టయెదుట దివ్యదర్శనం.

భోగీర ఉత్తరవాహిని అయిన అర్ధచంద్రాకారంలో నదికి ఇరవైధనువులయెత్తున రూపెత్తిన మంత్రప్రదర్శనంలా గుహలు, చైత్యాలు, విహారాలు ఒక శిల్పమాలిక, దూరాన్నుంచి కళ్లల్లో ఇంద్రధనువులాడుతూన్నవి. స్తంభాల శిల్పవిన్యాణము, చిత్రకౌశలం, విగ్రహాల సుసౌష్ఠవమూర్తిత్వము, ఆహాఁ! భిక్కుల కాశేయ కాశ్మీర కుసుమవర్ణ వికాసము, విద్యార్థుల ధవళవర్ణ ధౌతవిలాసము, నాగుల జానపదుల వివిధవర్ణ నివీతవిచిత్రత్వము—ఒక్క పెద్ద చిత్రంలా ప్రత్యక్షమైంది.



# భోగీరలోయ



అడివి బాపిరాజు



కళ్లు మూసుకొని తథాగతుని ధ్యానించుకొన్నాను. భోగీరాశ్రమ మహాపరిషత్తు సంఘారామానికి హృదయంలో చేయెత్తి జోహారు లర్పించుకొన్నాను.

నీళ్లకు నదిలోకి దిగేవాళ్లు, రంగురంగుల కలశాలను భుజాలమీద అలంకరించుకొని మెట్లెక్కేవాళ్లు, యోగులు, పురుషులు, బాలికలు, భిక్కులు; ఒకసారి భావాలు హృదయాన్ని నింపివేస్తుండగా, ఒకసారి భావాలులేని చైతన్యరహితహృదయం కల దాన్ని అవుతూ ఆగిపోతిని. పైనుండి విద్యార్థులు, భిక్షుకులు నాకేసి తేరిపార చూస్తున్నది నేను గమనించనేలేదు. ఆ ప్రథమదర్శన ముహూర్తము పరమపూజ్యమైంది.

ఆ పవిత్రప్రదేశంలో అడుగుపెట్టి అపశ్రుతి ప్రమోయించలేదుగదా నేను? ఏదో సిగ్గు అలుముకుపోయింది.

మా గురువులు శిల్పార్ణవులు. ఆయన మోము హిమాలయశిఖరంలా శాంతిపూరితమైంది. ఆయన సాధారణంగా మాట్లాడరు. అనే నాలుగుముక్కలూ సూక్తాలై, సూత్రాలై ప్రత్యక్షమవుతూఉంటవి.

చిన్నతనాన్నుంచీ చిత్రలేఖనాది కళలంటే చెలిమికత్తెల్లా అనుకొంటూ ఉన్న నన్ను ఆ ఉత్కృష్టవిద్యలో సంపూర్ణ యోగనిష్ఠాపరిపూర్ణను చేయడానికై మాళవ మహారాజ్యభార ధౌరంధుర్యులైన మాతండ్రిగారు, మహామంత్రులు ఆనందవసువులవారు నన్ను ఈ ఆశ్రమానికి ఒక్క పవిత్రముహూర్తాన పంపించినారు. మా కుటుంబం అంతా వచ్చి మా నాయనగారు ఇదివరకే నిర్మించిన గుహాచైత్యాన్ని అలంకరింపించ ఆజ్ఞ యిచ్చినారు. అలంకారాదికాలన్నీ పూర్తికాగానే మహోత్సవంతో ఆశ్రమాచార్యులకు సమర్పించాలని మా నాన్నగారి సంకల్పము.

ఆ గుహాచైత్యానికి ప్రాంగణమంటపము పూర్తి అయ్యింది. స్తంభాలు, శిల్పాలు, విగ్రహాలు, భిక్కులు నివసించడానికి లోని గదులు, శిలాతల్పాలు, ద్వారశిల్పాలంకారాలు, గర్భగృహశిల్పాలు, తథాగత గంభీర శిల్పమూర్తి, ఆసనము, ఛత్రము, తోరణాలు, ధర్మచక్రము-అన్నీ పూర్తిఅయ్యాయి. వివిధ దేశాలనుంచి శిల్పము, చిత్రలేఖనము నేర్చుకో వచ్చిన శిష్యులు, పనివాండ్రు చిత్రలేఖనాలంకారము పూర్తిచేస్తున్నారు.

మహాశిల్పి, చిత్రభవననిర్మాణ కళాకౌశలి మా గురువులున్నూ తమ శిష్యులతోపాటు మధ్యమండప మంతా జాతకగాథలు, అలంకారచిత్రములు వేస్తున్నారు.

ఒకచోట చిత్రకల్పన ఒక శిష్యుడు వ్రాసి గురువులకు చూపిస్తున్నాడు. గురువులు దానిని సవరించి వేయవలసిన వర్ణాలు చెప్పి వేరొకచోటకు వెళ్లారు. వర్ణాలు పూర్తిచేసి వేరొక శిష్యుడు నివేదించును. గురువులు రంగుల పాత్రలలో తూలికలు ముంచి చిత్రాన్ని తప్పు దిద్దుతున్నారు. గురువులే వేరొకచో రూపకల్పన కల్పించి నలుగురు శిష్యులచే వర్ణాలు నింపించుచున్నారు. చిత్రకల్పన, రూపసృష్టి వర్ణికాపూర్ణము అంతా మా గురువులే కొన్నిచోట్ల సంకల్పించి అద్భుత భావాత్మక కళావైదగ్ధ్యము ప్రత్యక్షము చేస్తున్నారు. దినముదినమూ ఆ విచిత్రోత్సవము సందర్శిస్తూ గుండెలు నృత్యాలు సల్ప ముగ్ధనైపోతూఉంటిని. నా కళ్లు అరమూ

తలు దాల్చినై; నా యవ్వనము పొంగి దిశలంటినది. నా అంగుళులు విశాలస్పృజనాభావాలై కల్పనకై యోగసిద్ధి వహింప ఉన్ముఖాలైనవి.

ఆజ్ఞకై గురువులకడ మోకరిల్లి నాను.

౨

ఎవరో బాలిక నా యెదుట మోకరించింది. ఆ మూర్తి వస్తూఉన్నదని గ్రహించడంతోనే కన్నులు చటుక్కున మూసుకున్నాను.

"ఎవరీమె?"

ఆమెతో కూడా వచ్చిన ఒక వృద్ధ—

"స్వామీ, ఈ బాలిక మాళవప్రభుని మేనమరదులవారున్ను, మాళవదేశానికి ముఖ్యమంత్రులున్ను అయిన ఆనందవసువులవారి ఏకతనయ. చిన్నతనాన్నుంచీ చిత్రలేఖనములో మంచి చాతుర్య మలవరచుకొన్నది. ఐనా ఆమె శక్తికి తగిన గురువులు లభించక పోవటంచేత విద్య వృద్ధిపొందినది కాదు. జినదేవుని ధర్మప్రచారంలా, తమ కీర్తిన్నీ లోకాల్ని ఆవరిస్తూ వుండటంచేత తమ పాదసన్నిధిని శుశ్రూష చేయటానికని మా అమ్మాయిగారు వచ్చారు. చిత్రవిద్యద్వారా నిర్వాణమార్గాన్ని స్వీకరించటానికి మా అమ్మాయిగారికి దీక్ష యివ్వవలసినదని ఆనందవసువులవారున్నూ, మేమున్నూ ప్రార్థిస్తూన్నాము."

"ఎవరయ్యా! అక్కడ? ఈ పిశాచాలని నావద్దర కెవరయ్యా వదిలిపెట్టింది? గురుద్రోహం తలపెట్టిన పాపాత్ములైన శిష్యులెవరయ్యా వారు?" అని పెద్ద గొంతుకతో అరచినాను.

ఆ వృద్ధ అంతట "అమ్మాయిగారు! లెండి పోదాము" అనుచుండ, నేను చెంగున ఆమెపైనుండి దాటి ఏదేని గొణుగుకొంటూ వెళ్లిపోయినాను. వాఘీరాశ్రమ సంఘాచార్యులైన సత్యశీల భిక్షాచార్యులకడకు చేరుకొన్నాను. సత్యశీలాచార్యులు నూరేండ్లవృద్ధు. సర్వశాస్త్రసంపన్నుడు. ఇంతైనా వీడిపోని శక్తిసంపన్నుడైన ఆ మహాత్ముడు నన్ను ప్రక్కనున్న కుశాసనముపైన అధివసింపజేసి, "తండ్రీ! ఏమింత తొందరపాటుతో వస్తూన్నావు?" అని ప్రశ్నించాడు.

పవిత్రులైన ఆచార్యులవారి పాదాలకు నమస్కరించి "భయంకరమైన ఒక విషయాన్ని తమకు చెప్పదలచుకొన్నాను. ఈ ఆశ్రమానికి ప్రథమంలో నేను వచ్చినప్పుడు నాకు రెండవజీవితంలాంటి ఆశయాల్ని కొన్ని తమతో మనవిచేసి, తమ అజ్ఞతో



లోటస్ మహల్ - హంపి.

పరమశ్రమణకునకు నాకు ప్రసాదించిన ఈనా కొద్దివిద్య సంఘానికి, లోకానికి అర్పించాలని ఈ సంఘారామం ప్రవేశించాను".

"అవును, ఆ ఆశయాలకు భంగం ఏమి వచ్చింది తండ్రీ ?"

"ఒక బాలికకు నేను చిత్రవిద్య నేర్పాలట, స్వామీ !"

"మాళవ మహామంత్రి ఆనందవసువు పాప మెరగిని తన కుమార్తెకు నీచేత విద్య నేర్పించాలని ఆశించి తథాగతుని పాదంమ్రోల అర్థయిస్తున్నాడు, బాబూ!"

"నా నియమానికి వ్యతిరేకం గదా, ఆచార్యదేవా !"

"అంత కఠినవినియమం ఎందుకు పూనావో నేను తెలుసుకోడానికి ప్రయత్నం చేయలేదు. నిన్నూ అడగలేదు. పురుషునికి బద్ధశత్రువు కాదగిన అవమానం స్త్రీ ఏమి చెయ్యగలదు, తండ్రీ? పురుషుని ఉత్తమశక్తిని పైకి విజృంభింపచేయడానికి స్త్రీయున్నూ, స్త్రీయొక్క పవిత్రశక్తిని తేజరిల్లజేయడానికి పురుషుడున్నూ ఉద్భవించారు. పవిత్రులయిన నాగార్జునాచార్యులవారి ఉపదేశం అట్టిదే; తథాగతుని పవిత్రధర్మమూ అదే!"

"అలాగయితే భిక్షుక, భిక్షుణీ దీక్ష లెందుకు గురుదేవా ?"

"ఓయి వెఱ్ఱివాడా ! దీక్ష లేనిదే నిర్వాణ మార్గం ఎట్లా అన్వేషిస్తావు? ప్రాపంచికమూరుడవై ప్రాపంచికాతీతమైన ధర్మాన్ని అన్వేషించాలి. ఆ దీక్షలో, ఆ తపస్సులో స్త్రీ పురుషు లొకళ్లకొకళ్లు అడ్డం రాకూడదు; అంటే, స్త్రీపై పురుషునికి వాంఛా, పురుషునిపై స్త్రీకి వాంఛా పోవాలి అంతవరకు ప్రపంచంలో ఉండి జినభక్తులై ధర్మమార్గావలంబకులై చివరకు ప్రపంచం వీడి నిర్వాణార్థులు కావాలి."

"ప్రభూ ! నాగార్జునాచార్యదేవులు నివసించిన పవిత్రసంఘారామం ఉన్న శ్రీపర్వతపురం కృష్ణాతీరాన్న ఉన్నది".

"అవును, ధాన్యకటక నగరానికి ఎగువను".

"అక్కడే ఒక శిల్పి ఆంధ్రబ్రాహ్మణుడు యువకుడు ఉండేవాడు. అతడు సాంఖ్యాయన సగోత్రుడు. ఇక్ష్వాకుమహాప్రభుల ఆస్థానశిల్పి."

"బౌద్ధదీక్ష వహించినవాడా ?"

"బుద్ధదేవుని విష్ణుని తొమ్మిదవ అవతారమని నమ్మినవాడు. శిల్పకర్మకీత్వా మోక్షం చూరగొనాలన్న సంకల్పం కలవాడు. సౌందర్య తత్త్వోపాసి."

"బుద్ధుడే పరమావతారం. అతని పూర్వ అవతారాలలో ఒకటి విష్ణు అవతారం."

"ఆ శిల్పికి వసంతపుష్పాల సౌరభమూ, నీలాకాశమూ, మేఘాల నీలిఅంచులు, చిరుగాలిలో పుట్టిన చిన్న కెరటాలమీద ప్రసరించి తళుకుమనే చంద్రకిరణాలు, సెలయేటి పతనాల తుంపురులు, ఇంద్రధనస్సు అంచులు, లేడికూనల చుట్టాలు, సుందరీమణుల అపాంగ వీక్షణాలు పులకరాలు కలుగజేసి అతన్ని శ్వేతతారాదేవి పాదాలకడ మోకరిల్లజేసేవి."

"ఇంత నశ్వరమైన సౌందర్యాన్నా అతను ఆరాధించినది?"

"ప్రభూ! సంఘారామంలో, రాజప్రాసాదాలలో అతనూ, అతని శిష్యులూ సృష్టించిన శిల్పాలూ, చిత్రలేఖనాలూ, ఆ యానగరాలలో అతడు నిర్మించిన భవనాలూ, స్తూపాలూ లోకమోహనమై వెలిగాయి."

"పరమదేవుడైన మహాశ్రమణకునికి గొప్ప భక్తుడే."

"చిత్తం! అతడు ఇక్ష్వాకు రాజకుమారి నొకర్తెను ప్రేమించాడు. ఆమె అతని దివ్యప్రేమకు గౌరవించి తిరిగి ప్రేమించినట్లు అభినయించింది."

"ప్రేమించనే లేదా ఏమిటి ?"

"స్వామీ ! ఆమె శుష్కహృదయ, వృథాడంబరం కలిగిన విచిత్రస్వరూపమైన శూన్యజీమూతంవంటిది. అతని ప్రేమ లోకాలనావరించింది. ఆమె అంతకన్న అనంతమైన ప్రేమలో అతన్ని ముంచివేస్తున్నట్లు నటించింది."

"ఏమా వెఱ్ఱి ఆ బాలికకు?"

"స్వామీ! స్త్రీ హృదయం ఎవ్వరు ఎరుగగలరు? రాజబంధువైన ఆమె తండ్రిని ఆమె పాణిగ్రహణానికై ఆ శిల్పి యాచించాడు. తండ్రి సంతోషముతో అనుమతి యిచ్చాడు. కాని కపటనటనానటి, కర్కశహృదయయైన ఆ బాలిక 'నే నేమిటి! ఈతనిని పెండ్లి చేసికోవట మేమి'టని వెడనవ్వు నవ్వింది. ఆశిల్పి హృదయంలో చీకటి ఆవరించుకుంది. భయంకరమైన తుపానుమబ్బులు పట్టినవి. దావానలం అతన్ని మండించినప్పుడు ఉద్భవించేపొగ అతనిజీవితం క్రమ్మివేసింది. అతనికి దైవం లేడు. బుద్ధుడు లేడు, ధర్మం లేదు, ప్రేమ లేదు."

"ఎంత వెఱ్ఱివాడై పోయినాడు !"

"వెఱ్ఱివాడు కాదు స్వామీ ! సర్వజ్ఞానమూ నశించిపోయిన పిచ్చివాడయిపోయినాడు. అతని జీవితంలోని దుర్భర విషాదము హాలాహలమై సమస్త భువనాలూ దహించటానికి బయలుదేరినట్లయింది. దేశాలు తిరిగితిరిగి ఈ ఆశ్రమానికి చేరుకొన్నాడు."

"ఓయి వెఱ్ఱిబాలుడా! యింతవిషాదగాథా నీది ? అందుకనా స్త్రీలోకంమీద నీ కింత కోపము ?"

"కోపము కాదు, భయము స్వామీ ! తమ పాదసన్నిధి చేరుకుని కొంత ఊరట పొంది జగద్గురువైన పరమశ్రమణకుని అవతారమూర్తులైన మీకు నా సేవ అర్పించి భౌతిక వాసనలనుండి దూరమై నిర్వాణానికి అర్హత సంపాదించుకోటానికి దీక్షవహించాను. నేను పూనిన ప్రతిజ్ఞలు తమకు నివేదించి శిల్పకళా దీక్షను పూనితిని. ఈ విషాదచరిత్రుణ్ణి ఒక బాలికకు గురువు కమ్మని ఆజ్ఞాపించటం నా మోక్షానికి నన్ను దూరంచేయటం అని మనవి చేసికొంటూన్నాను."

"బాపూ ! బుద్ధదేవుని పరమకరుణచేత అనన్యమైన మానవసేవ నాకు లభించింది. లోకాన్ని సంతరించటానికి పూనుకొన్న నాకు మానవహృదయం పూర్తిగ తెలుసును. శిల్పివైన నీ చిత్తవృత్తిలో ప్రేమనశించక లోతుల అణగిఉన్నది. నిర్వాణపథార్థివైయున్న నీవు స్త్రీ విషయమై భయము సంపూర్ణంగా నాశనము చేసికోవలసి ఉంటుంది. స్త్రీ మాయాదేవియొక్క అంశ; ప్రజ్ఞాపరిమిత; శ్వేతతారాదేవి. ఈ బాలికకు నీవు చిత్రలేఖన విద్య నేర్పి నీతపస్సు పూర్తిచేసికో. భయపిశాచము నీ హృదయాన్ని ముక్కలు చేయకుండా చూచుకో !"

మేము ఒక్క విఘటికాకాలము నిశ్చలులమై వేణువనము అను పేరుగల ఆమహాచైత్యంలో సంధ్యాకాలము దోరరంగుల పాకించే వరకు ధాన్యకటకపు పాలరాతి బుద్ధదేవుని

విగ్రహాలల్లా కూర్చుండిపోయాము. నా హృదయంలో జడత్వ మావరించింది. దూరాల పుట్టి యోజనశతాలు ప్రవహించి, ప్రవహించి, ఒడ్డుకు చేరి విరిగిపోయే కెరటంలా నా ఆలోచనలు వికలాలు అయిపోయినవి.

## 3

జ్యోత్స్నప్రియనాములైన మా చిత్రాచార్యులు విసవిస వెళ్ళిపోవడంతోనే అక్కడ ఆగలేక పరుగిడిపోయినాను. నా హృదయం పచ్చిగా మృణ్మయపాత్రలా భిన్నమైపోయినది. దాసీజనము ఆశ్చర్యంపడుతూ ఉండగా, తల్లి వెలవెలపోతూ ఉండగా విసవిస నడిచి 'మాళవమహారాజవిహార'గుహాలోనికి పరువిడిపోయి మంచముపై నాథునిచే నిరసింపబడిన ఉమాదేవి చేతిలోని పూలదండలా ఒళ్లుతప్పి పడిపోయాను.

నాకు మెలకువ వచ్చేటప్పటికి విహారమంతా చీకటిలో ఉన్నది. ఎక్కడో రెండు నేతిదీపాలు మినుకు మినుకుమంటూ మిణుగురులులా ఉన్నవి. ఆ చీకట్లలోంచి గుహలోని స్త్రీపురుషచిత్రమండల మంతా నావైపే కరుణాహాసావలోకనములతో పరికిలిస్తున్నది. నా మంచానికి దగ్గరగా మహాగురువు సత్యశీలభిక్షాచార్యులవారు కాలాతీతమైన స్వరూపంతో, పరమదయను ప్రసరించే వెన్నెలలు నింపే చూపులతో, ఆ ముదుసలి పెదవుల వరపూరితమైన నవ్వుల వెలిగిపోతూ ఉండగా చూస్తూ ఉన్నారు.

మత్తు నెమ్మది నెమ్మదిగా విడిపోయి బుద్ధి నిర్మలమై లోకజ్ఞానము వచ్చి చటాలున లేచి నిలుచుంటిని. పడబోయిన నన్ను మా వృద్ధదాసి అలమిపట్టుకొని "ఆచార్యులవారికి నమస్కారము చేయుము తల్లీ" అని ఉపదేశించినది.

ఆ వృద్ధాచార్యుల పాదాలకడ మోకరిల్లిపోయినాను.

"అమ్మాయీ! నీదీక్షకు చాలా సంతోషము. ఎందుకమ్మా! శిల్పమంటే నీకింత మమకారము?"

"స్వామీ!......"

"ఊరడిల్లి చెప్పమ్మా, తల్లీ! తొందర లేదు."

దాసీజనము భక్తితో కొనివచ్చి అర్పించిన పీఠముపై శాంతపవిత్రులైన ఆ వృద్ధభిక్షులు అధివసించినారు. ఆయనకడనే తల వంచి కూరుచున్నాను.

నా గొంతుకలోనుండి వినీవినంబడని స్వరముమాత్రమే ప్రవహించినది.

"స్వామీ! చిత్రకళ నేర్చుకోనినాడు నా జన్మం వృథా! నా పూజ నుసి అయిపోతుంది. నే నింక తీరని యీ గాఢపవిత్ర వాంఛను భరించనూ లేను; తోలివేయనూ లేను."

"అదేమిటమ్మా వెఱ్ఱిబాలికా! ఇంక నీకు చిత్రకళ నేర్పేవారే లేరూ?"

నేను చటాలున లేచి కూచున్నాను. "స్వామీ! నేను అందరి చిత్రలేఖనాసామర్థ్యమూ పరికిలించినాను. ప్రజ్ఞారహితుల దగ్గిర అభ్యాసము ఉన్న విద్య కొంచెమూ నశింపజేసుకోడానికేగాదా?"

"సరే నమ్మా! జ్యోత్స్నప్రియశిల్పాచార్యులవారిని నీకు చిత్రవిద్య నేర్పడానికి ఒప్పించాను. కాని వారు కొన్ని నియమాలు కోరారు. వారు చిత్రిస్తూ ఉంటే వెనకనుంచి చూచి నేర్చుకోవాలట; ఎదుటబడకూడదు. వారు లేనప్పుడే గోడలపై చిత్రలేఖనము కల్పించాలట. అది వారు తర్వాత దిద్దగలరు. ఫలకాలపై రచించిన నీచిత్రాల్ని వారికడకు సేవకులచేత పంపిస్తే వారు సరిచూడగలరు..."

"స్వామీ! ఏలాంటి నియమము శాసించినా సరే, నాకు చిత్రవిద్య ప్రసాదిస్తే చాలు. నేను ధన్యురాల్ని; నాజన్మం అంతా తరించింది."

కులపతి సత్యశీలాచార్యులు వృద్ధత్వములో కూడా కాంతివీడని తనకన్నులతో నవ్వుకొంటూ వెళ్లిపోయారు.

ఈవరము నా కేలా ప్రసాదింపబడింది! ఎంతటి అపూర్వసంఘటన! ఈభిక్షును పూవు మధువును దాచుకొని సంభావించినట్లు ఎంత పూజింపగలనో! తీగలలో స్వరాలు చేరినట్లు, వసంతంలో సౌరభాలు పొదువుకు పోయినట్లు నాలో ఈశిల్పవిద్య హత్తుకు పోవాలిగాక!

## ౪

త్వరలో శుభముహూర్తం చూసి నాకడ ఈ విచిత్రపద్ధతిని చిత్రవిద్యను అభ్యసింప దీక్ష వహించింది ఆ బాలిక. ఆమె పేరు కల్హారమాలయట. విషాలు హృదయాలల్లో దాచుకొన్న ఈపాపజన్ములకు, మారపిశాచి ఆయుధాలకు చిక్కని పేర్లుమాత్రం పెద్దారు వెఱ్ఱివాళ్లయిన పురుషులు. జినదేవుడు స్త్రీతత్వంతో లోకాలు ఎందుకు మలినంచేశాడో! బుద్ధదేవునికి పవిత్రమైన ఆనలభైరోజుల మహాతపస్సులో జరిగిన పరీక్ష నాకు ఎన్ని సంవత్సరాలు జరుగనుందో.

ఆ బాలిక రచించే చిత్రాలల్లో ప్రజ్ఞ ఉన్నది. వర్ణజ్ఞానమూ బాగానే తెలుసును. ఆడవాళ్లు రేఖానైపుణ్యం ఎలా సంపాదించుకోగలరు చెప్మా. ఈ చిన్నది తీరైనరేఖలు ప్రవహింపజేస్తోవుంది. ఎక్కడో తప్పువస్తూ ఉన్నది, నిజమే. కొందరువిద్యార్థులు ఇన్ని సంవత్సరాలు నేర్చుకుంటూ కూడా ఇప్పటికీ రేఖాశక్తి అలవడజేసుకోలేకుండా ఉన్నారు. ఆమెకుంచెలు ఆమే కట్టుకుంటుందిట— విచిత్రమే. అతిలలితాలైన వేళ్లల్లో శక్తి ఉండదుకదా! ఈ బాలికవేళ్లు పురుషుని వేళ్లల్లా ఉంటవేమో. ఆ బాలికే పురుషునిలా ఉంటుందేమో. మెరుములా వచ్చి నాదగ్గిర వాలినప్పుడు అస్పష్టంగా తోచింది నా కామూర్తి. ఆరూపము సుందరవిగ్రహమే. ఛీ! ఈస్త్రీనామకపిశాచిని ఎందుకు తలపోసుకొంటున్నానో.

ఆమె రచించిన చిత్రాలు సవరించడం నా కారోజుల్లో ఎంతో హేయమైన పనై వేధించింది. నేను సృష్టింప సంకల్పించిన శిల్పాలుగాని, చిత్రాలుగాని నా హృదయంలోనే ఇంకిపోయినవి. కీలుబొమ్మలా ఏదో దిద్దేవాణ్ణి. లోలోన మన్యపుజ్వరం బాధించే వాడిలా చిక్కిపోయినానట. నెమ్మదిగా చేతులకు ఒణుకు ప్రారంభిస్తుందా అన్న భయము అంకురించింది. ముప్పది ఐదేండ్లు నడుస్తూ ఉన్న నా జవసత్వాలు నాకు దూరమైపోతున్నవి. తప్పనిసరిగా విద్యార్థులకు విద్య నేర్పడం ఎల్లాగో పెట్టుకున్నాను. తక్కినకాలాలు మా విహారగుహాలో అంతరకందరంలో ఆ కఠినశిలావేదికపై పండుకొని ఉండడమే తప్ప అడవులలోనికి విహారానికి వెళ్లలేకపోయేవాడను.

ఒకరోజున కల్హారమాల రచించిన చిత్రము సవరించడానికి మాళవ మంత్రిగారి విహారానికి పోయినాను. నేను రచించిన బోధిసత్వుని

ప్రక్కనే ఒక్క బాలికామూర్తిచిత్రాన్ని చూచినాను. ఎవరు చిత్రించినారు ఆ బొమ్మను? ఎందుకు చిత్రించినారు? నా ఆజ్ఞలేనిదే ఏ మూర్ఖుడు చిత్రించ సాహసించాడు? ఆ విగ్రహము విస్తుపోయినట్లు నావైపు చూస్తూ ఉన్నది. గాలిపీలుస్తున్నట్లే ఉన్నది. కొంచెము సంప్రదాయ విరుద్ధముగా ఉన్నది. సమభంగాకృతిని త్రిభంగమూర్తికడ కల్పించుట అపశ్రుతిభూయిష్ఠము.

ఇంతలో ఆ విగ్రహము కదిలి నెమ్మదిగా చేతులు జోడించి తలవంచుకొన్నది. అది మూర్తికల్పన కాదు; ప్రాణపూరితమైన బాలికామూర్తి. నాగుండె ముడుచుకొనిపోయింది, విస్ఫారితమైపోయింది. మహావేగాన భేకీభాంకారాలు వాయించ నారంభించింది. చైతన్య రహితుడనై అట్లనే నిలుచుండిపోతిని.

ఆ సౌందర్యము అలౌకికము. ఆమె ముఖాన నిశ్చలత్వము, ప్రజ్ఞాపరిమితత్వము, శాంతి, నిర్మలకోమలకాంతి, అత్యంత నిగూఢసత్యము తాండవమాడుచున్నవి. స్త్రీముఖము చూడనన్న నా ప్రతిన నట్టేట సుడిగుండాలలో మునిగిపోయినది.

"నువ్వు దేవబాలికవా ?" అని గబగబ ముందుకు పోయి ఆమెను ప్రశ్నించాను.

"ప్రభూ !— నేను — కల్హారమాలను — మాళవమంత్రి — కుమార్తెను——"

"నా శిష్యవా ? హ,హ, హ,హ......" అని వెడనవ్వు నవ్వుతూ చివాలున వెనక్కి తిరిగి ఆ అడవులలోకి మహావేగాన వెళ్లిపోయినాను. నా హృదంతరాళాల కారు చీకట్లు కానట్టి, వెలుగుకానట్టి శూన్యమేదో ఆవరించుకుంది. నా ఒళ్లు కంపించింది. నేను భరించలేని భయంకరానందము పరవళ్లుకట్టి నన్ను ముంచి సుళ్లలో తిప్పి అతిలోతులకు లాగి, ఎక్కడకో విసిరికొట్టింది.

భయంకరమృగాలు ఆ అడవులలో సంచరించుతూ ఉంటవనేమాట మరచిపోయి నేనే నిశాచరమైన వ్యాఘ్రమువలె ఆ చెట్ల నీడల్లో పడిఉంటిని. రాత్రల్లా దూరాన, తోడేళ్లు, చిరుతలు అరుస్తూఉన్న విషయమే గ్రహించలేదు.

నాకు పెనుభూతాలు కనబడలేదు; పాములబుసలు వినబడలేదు. విషపుచెట్టు యొక్క లేత ఆకు ఎంత కోమల సుందరమైఉన్నప్పటికీ, అది విషపూరితమే అయినట్లు, సౌందర్యం పుంజీభవించిన స్త్రీమూర్తులన్నీ విషపూరితలే. ఈవిషము సేవించిన్నీ దహించబడకుండా జినదేవుని కరుణవల్ల ఒకనాడు బయటపడ్డాను. నేడు మళ్లీ ఈ విషప్రయోగం ఏ మహత్తరకారణంచేత నన్ను తాకిందో! అమిత జాగ్రత్తతో గమనిస్తూవున్న నాదీక్ష కర్కశహస్తాల పాలబడి కటికినేలబడిన మట్టిబొమ్మలా ముక్కలు ముక్కలైపోయింది.



("ఏమిటినువ్వీరోజు చిత్రించుకొంటున్నది"-పుట: 65)

ప్రపంచానికి దూరంగా వుంచగదా అని ఈ సంఘారామానికి చేరాను. ప్రపంచమే నన్ను తరుముకుని తరుముకుని ఇంద్రుణ్ణి తరుముకు వెళ్లిన బ్రహ్మహత్యాపాతకంలా నన్ను వెంబడించింది. ఏనాటి ప్రారబ్ధ మిది?

ఆబాలిక ఎంత నిర్మలచరిత్రం నటిస్తున్నది! అతి నిర్మలమైన నీళ్లు కలిగిన కాసారంలాంటి హృదయం కలిగిన మనిషిలా ఉంది. ఆమె దివ్యసౌందర్యాన్ని రసపూర్ణమైన కళాస్వరూపంలోనికి దింపటానికి సమయాలు పాటింప నవసరంలేని దివ్యచిత్రమూర్తిత్వంలా ఉన్నది. ఇంత అందము విషపూరితమై ఉండగలదా? ఆ ఇక్ష్వాకు బాలిక మాత్రం సౌందర్యవతి కాదా? చలించిన ఈ నామనస్సును కట్టివేయటానికి తపస్సులో నామనస్సును పవిత్రం చేసికోవాలి.

ఇంతట్లో తూర్పుదేసను ఎఱ్ఱజీరలు సాగినవి. ఏలాగో ఆశ్రమానికి చేరుకొన్నాను. ఈ బాలికకు ఇంక విద్యచెప్పకుండా ఉండటానికి వీలులేదు. సత్యశీలాచార్యులవారి ఆజ్ఞ అనుల్లంఘనీయము. ఈ దివ్యవృద్ధుడు తన ఆజ్ఞతో నన్ను కట్టివేసినాడు. ఆబాలికకు చదువుచెప్పమని నన్ను ఒప్పించే సందర్భంలో ఏవో విచిత్రమైన — భావగర్భితమైన మాటలన్నారు. ఆయనమాట లమోఘములు: సత్యస్వరూపములు. ఇప్పుడు జరిగినదంతా వారికి నివేదించి, వారి యాదేశానుసారంగా నడుచుకోవటమే నాధర్మం అని నిశ్చయించుకొన్నాను.

దర్శించిన మరుక్షణంలో సత్యశీలభిక్షాచార్యులవారు చిరునవ్వు నవ్వుతూ నన్ను కూర్చుండమని సైగచేసి, 'నాయనా! నీలో శుభ పరిణతి ఆసన్నమయ్యే ధర్మసమయం వచ్చింది. నీసంఘసేవ సంపూర్ణత తాల్చాలి...”

“స్వామీ! నేను అవమానం పొందటమే ధర్మసేవా? వేళాకోళమే ఎరగని తమమాట ఈరోజున ఈలాగున చిరునవ్వులతో నిండియున్నదేమి? అది నాకర్మ మనుకొని నేను ఊరడిల్లాలిగాక!”

“ఓయీ! సౌందర్యతత్త్వోపాసీ! నీచిత్రలేఖన విద్యలో ఒక్క-చిన్నదోష మున్నదని నీవు గ్రహించలేదు. కరుణ నీవిగ్రహాలల్లో మూర్తించలేదు. సంప్రదాయజనితాలై, మూర్తిలో-రూపకల్పనలో ఏమాత్రమూ లోటులేనిచిత్రాలను ఎన్ని కల్పించినా, వాటిలో కరుణ తొణికిసలాడటం లేదు. తండ్రీ! కరుణనశించిపోయిన మరుభూమియైన నీప్రజ్ఞ “ఏకోరసః కరుణఏవ” అనేమాట మరచిపోయింది. నీబోధిసత్త్వల చూపుల్లో కర్కశత్వం ఉన్నది. యోగం ఉన్నది. బుద్ధుడు పరమకరుణామూర్తి తండ్రీ! అహింసాపూర్ణావతారము. చేతిముద్రలలో, భంగిమాలలో, వివిధస్వరూపములైన దృష్టులలో సంపూర్ణసత్యమైన దివ్యత్వం లేదు. ప్రాపంచికరూపమైన దివ్యత్వమే కరుణ. ఈ ముక్కలు నేనన్నానని విషాదపడకు. కొరతపడిన నీపూజ పరిపూర్తి చెందవద్దా?”

మరిన్ని కలవరంలోపడి మావిహారం ఎలాగో చేరుకొని విహారములోని దివ్యభిక్షువిగ్రహంమోల నాతల వాల్చి కాంతికై యాచించాను. ఘటికలు జరిగిపోయినవి. వరములా నామార్గమునాకు గోచరిస్తూ ప్రత్యక్షమైంది. “నాబొమ్మలలో కర్కశత్వ మున్నదా, ప్రభూ? ఇన్ని సంవత్సరాలూ నాతపస్సులో చంద్రగ్రహణంలా అసంపూర్ణత్వం వరించుకొనే వుందా?”

“నీనియమాలని భగవంతుని కర్పించి మానవ శీలమందు విశ్వాసంతో చిత్రకళాదీక్ష నెరపవయ్యా” అని నాకు పరమగురుని ఆదేశం వినబడినట్లయింది.

నన్ను చూస్తూనే మాగురుదేవులు, తాను తాగానట్లు “నువ్వు దేవబాలికవా?” అని ప్రశ్నించినప్పుడు ఏదో నిర్వచింపజాలని ఆనందంతో వొణికిపోయ్యాను. సామాన్యమైన మూర్తైనా అనన్యమైన ఏదో వెలుగుతో మహాసౌందర్యమూర్తిలా తోస్తారు. ఉత్తమశిల్పమూర్తి లక్షణాలు ఆయనలో కొరతపడినా కొరత పడినట్లే వుండవు. ఆరావడం వచ్చి నాబుజాలు చేతులతో నడిమిపట్టి ఇటు అటు వూపి 'ఏల ఈతప్పిదం చేశా'వని నన్ను శిక్షిస్తే, నాజన్మ పవిత్రమైందని ఊహించుకొనేదాన్ని. ఆ క్షణంలో ఆయన దివ్యుడే అయిపోయినాడు. ఆయనవేపునన్నదోవిచిత్రశక్తిఆకర్షణచేసింది. ఇంతలో ఆయన మటుమాయమై పోయినాడు. నాతప్పిదానికి నివృత్తి ఉన్నదా? ఈసత్పురుషునితపస్సు భంగంచేయటాని కుప్పవించిన పాపినా నేను? పవిత్రమైన ఆయన నియమానికి భంగం చేశాను. తత్ఫలితంగా, ఏనియమాలూ లేకుండా చిత్రవిద్య నేర్చుకోవటాని కందరూ రావచ్చునని ఆయన ప్రకటనచేశారు.

ఆమరునాటినుంచీ ఆయన నన్ను తనకడకే పిలిపించుకొని చిత్రవిద్యలోని రహస్యాలు మహాగాంధర్వంలా ఉపదేశించ మొదలుపెట్టారు. ఆయనరూపమే మారిపోయింది. ఏదోవింతశక్తిచేత అలుముకుపోయినారు. కొద్దిమాటలతోమాత్రమే వినేవాళ్ల తృప్తిని తీర్చే ఆయన ఆనాటినుంచీ ఝరీవేగంతో, తియ్యని గొంతుకతో ఘటికలు ఘటికలు మాట్లాడేవారు. ఎందుకో! ఏవేవో ప్రశ్నలు నాపై వర్షముకురిపించేవారు. ఆరోజుల్లో నాకుకలిగిన ఆనందాన్ని వర్ణించలేను. ఆయనకడ సంతతము ఉండ బుద్ధి. ఆయన పాదాంగుళులను పువ్వుల మొగ్గలను ముట్టినట్లు ముట్టి కళ్ల కద్దుకోటానికి కాంక్ష. ఉన్నట్లుండి నా కేదో వివశత్వం!

“కల్హారమాలికా! ఈచిత్రవిద్య పూర్తియైన ఆవెనక నీ వేమి చేయదలచుకొన్నావు?”

“బుద్ధదేవునిచరిత్ర రచించుకొంటూ నా జీవితం పవిత్రం చేసుకోవాలన్న కోరికే నన్ను కదిల్చివేస్తోంటుంది. అంతకన్న నామొరకు హృదయాని కేమీ తోచదు”.

“మానవుల్లోని దివ్యత్వమేకళాస్వరూపమై వెలువడుతుంటుంది. నిశ్చయమే. కాని వివాహమైన వెనక నీదీక్ష ఎట్లా సాగుతుంది కుమారీ?”

“ప్రభూ! నేను వివాహమే చేసికోను”.

“అది అసంభవము. మీతండ్రిగా రేరాజన్యునికో నిన్ను నివేదిస్తారు. నీవు మహారాణివి కావలసిన యోగ మున్నపుడు ఆయోగానికెల్లెదురీదగలవు?”

“నాజన్మమంతా తమపాదాలదగ్గరే విద్య నేర్చుకొంటూ శుశ్రూష చేస్తూంటాను!”

“ఓ వెఱ్ఱిపిల్లా! ఆడవాళ్లకి సహజమైన మాయమాటలు మరచిపోయినావు కావు”

మాగురుదేవుని మాటలకు నామనస్సు వికలమై పోయింది. నావి మాయమాట లేలాగు? నాసర్వస్వము గురుదేవుని పాదాలకడ సమర్పించటానికి సిద్ధంగా లేనా?

మాగుహలో మాగురుదేవులు రచించిన బోధిసత్త్వనిప్రక్క ఆయనదేవేరిని రచింప సంకల్పించాను. ఆచిత్రము పూర్తిఅయిన వెనుక

అది దివ్యభావపూరితము, చిత్రకళకు దివ్యమణి వంటిది అని గురుదేవులు, తోటిశిష్యులు రసజ్ఞులు మెచ్చుకుంటూఉంటే నాకు సిగ్గువేసింది.

మాగురుదేవులను ఒక్కనిమేషమాత్రము విడిచిఉండలేకపోయేదాన్ని. ఆయన నిజంగా జ్యోత్స్నప్రియులే. ఆయన గుహకు పోయి శుశ్రూషచేయడం ఎంత తోషదాయకమై ఉండేది!

ఆయనకళ్లల్లో ఒకొక్కప్పుడు జ్యోత్స్నలే ఆడేవి. ఒకొక్కప్పుడు ఆయనచూపులు మబ్బుపొదివిన వెలబాలుని కిరణాలై మరుగుపడేవి. ఆయన ఏదేని కారణాంతరాన నాకు ఉపదేశిస్తూ నన్నుముట్టినప్పుడు నా సర్వరూపమూ కరిగి సల్లనుల్లేది. అలాంటిదివ్యక్షణాలలో ఆయనా, నేనే - లోకాలహృదయం మధ్య.

## ౬

ఈబాలికాహృదయతత్త్వం నాకు అర్థంకాలేదు. ఈమెజీవితమే నాకు క్రొత్త అయినది. ఈమె తక్కిన స్త్రీలకన్న వేరా? ఇక్ష్వాకురాజవంశజ అయిన ఆనాటి ఆబాలిక అందము ఆకుపులి అందము. ఇది వెన్నెలరేఖ. వన్నెలలోని శిరీషకుసుమము. పాలవెల్లువతరగ. ఈమెఅందంలో ఏమి వంకఉన్నది? నిజముగా ఈమెహృదయం పవిత్రమైనది. ఓహో! కల్హారమాలికయా ఈమె?

ఈబాలిక నన్ను విడిచి ఒకక్షణంఉండదు. ఆమె స్వయంగా పచనంచేసి విచిత్రరుచుల భోజనము కొనివచ్చేది. నాపాదసంవాహనం చేయసిద్ధపడిననాడు ఆమె నాపాదాలస్పృశించినప్పుడు నాలో విద్యుల్లతికలు అలుముకుపోయినవి. ఆమెను నాకాగిలిలో అదిమివేయక ఏలాగు నిగ్రహించుకోగలను? నేను అధఃపతితుడను కావడంలేదుగదా?

ఆమెపెదవులు జేగర్లు నిండి అతిలలితాలైన చిగుళ్లు. ఆమెకళ్లు ఎంతపవిత్రకాంతుల్ని నేకరించుకొన్నవి! స్వచ్ఛమై కదలికలేని చెరువునీటిలో ప్రతిఫలించిన తారకాకాంతు లవి.

ఆమెఅందము నిర్మలనీలాకాశంలో తేలిపోయే తెల్లనిపక్షి. ఆమెఅందము ఆపక్షికంఠముకలోంచి విడిపోయి అనీలంలో తొణికిసలాడే పాట. ఆమెఅందము పండినపంటలోని పచ్చదనములోని పరిమళము. ఆమెఅందము వెన్నెలప్రసరింపు జిడ్డుగలతీపి. అయ్యో! ఆ అందం నాదేహంలో, నాహృదయంలో, నా ఆత్మలో లీనంచేసికొనక నాజన్మ వృథా.

ఆమె గుహలో ఒంటిగా చిత్రించుకునే కాలంలో ఆమెను, కల్హారమాలాదేవిని కలుసుకోడానికి వెళ్లాను. భగవానుడా! అతికోమలమైన ఆమెజీవితాన్ని పరీక్షచేయడానికి వెళ్లేనేను అందమయిన రెక్కలతో పూలల్లో ఎగిరే సీతాకోకచిలకను పొంచుండి కబళింపబోయే ఊసరవెల్లిలా ఉన్నాను. చిత్రించుకొంటూఉన్న ఆబాలిక ప్రజ్ఞాపరిమితలా ఉన్నది.

"ఏమిటి, నువ్వింగో చిత్రించుకుంటున్నది?"

"బుద్ధదేవునికి, ఉన్నఒక్క వస్త్రమూ అర్పిస్తున్న ఆపవిత్రచరిత్రచిత్రము రచిస్తున్నాను."

"ఏమిటి! నన్ను చూడనీ. ఓహో! ఎంత అద్భుతసృష్టి! బాలికా! నీకింక శుశ్రూష అవసరము లేదు. నీవిద్య పూర్తి అయినది."

ఈటెదెబ్బ తిన్న గువ్వలా ఆమె వణికిపోయింది. "ప్రభూ! నన్ను మీరు ప్రేమించడం లేదా? నాకై నియమాలన్నీ వదులుకొని నన్ను ఆశ్రమపల్లికన్న ధన్యురాల్ని చేసి ఒక్కసారిగా నన్ను అవసరములేని పువ్వంలా విసరిపారవేస్తారా?"

"నీకు ప్రేమనుగురించి ఏమితెలుసును?"

"ప్రభూ! ఆదివ్యవరము ప్రసాదింపబడినప్పుడు ఏమితెలిసికోవాలి?"

"నిజ్జీదానా! చటుక్కున 'నన్ను ప్రేమించడం లేదా' అని ప్రశ్నవేశావు. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా?"

"వెన్నెల అంటే కలవలకు ప్రేమా? సూర్యకాంతపువ్వు సూర్యుణ్ణి కోరుతుందా? పువ్వును తేనెను కోరుతుందా? ప్రభూ! నన్ను స్వీకరించుకోండి. నేను మీప్రేమభిక్ష లేని నాడు హోమంలోని నుసినికదా!"

"నేను ముప్పదియైదు ముసలిఏళ్లవాడను. నువ్వు నవయౌవనంలోని పదునెనిమిదేళ్ల మిసిమిపడుచువు."

"ప్రేమకు ఈడు ఉందా ప్రభూ?"

"నేను ఈక్షణం నీదేహాన్ని కోరితే నీశీలం నలిపివేసికొని నా కాంక్ష తీర్చగలవా?"

"ప్రభూ! మీప్రేమ, మీదివ్యప్రణయము ఆశిస్తున్నాను. నా నాశనానికి వెఱవను. మీకు అర్పణచేసుకొనడమే నాజీవితానికి పరమమోక్షము. ఇదిగో నామూర్తి! నన్ను మీహృదయానికి గాఢంగా గాఢంగా అదుముకోండి. నావిద్యలు మీవి; నాకలలు మీవి; నా ఆత్మ మీది."

నాదేహం వణికిపోయింది. ఎంతపవిత్ర జీవనప్రవాహము! ఆమెను తనివోవ బిగియార నాబాహువుల అదిమివేసి కౌగలించుకొన్నాను.

"కల్హారమాలికా! నన్ను వివాహంచేసుకోగలవా? నాఆత్మేశ్వరీ! ఇట్టి మహదానంద సమయంకోసమేనా జినదేవుడు ఆనాడు నన్ను రక్షించినాడు. నువ్వు నాకోసమే యిన్ని సంవత్సరాలు ఎదురుచూస్తూ ఉన్నావా? ఈ నీ దివ్యమూర్తి నాదేనా? ఈఅద్భుతమైనమోము, భారమైన ఈతలకట్టు, ఈదివ్యలోచనాలు, శ్వేతతారాదేవిచేతిలోని కమలాలైన నీయీ పవిత్రవక్షాలు, నీయీపరమదేహకాంతీ — నావేనా? నువ్వు నాదానవేనా? జినప్రభూ! నీకరుణ ఇదేనా? రా! ఆత్మేశ్వరీ, రా! మొక్కరిల్లు. పరమశ్రమణకుడే మన్ని ఆశీర్వదిస్తాడు!"

"ఆప్రభునిదాసుడనైన నేనున్నా మిమ్మల్ని ఆశీర్వదిస్తున్నాను — దివ్యదంపతులైన మిమ్ము" అని సత్యశీలాచార్యగురుదేవులు. లేచి ఆయనకడ మొకరిల్లాము.



# మహానటుఁడు

అడివి రాఘవరావు

శ్రీ శైలాన వియచ్చరన్నట శివ శ్రీ మామరుత్పథా
నీకమ్మున్ దోలివెల్గు దారిగ ప్రయాణించెన్, ప్రభూ, శంకరా
మాకన్నుల్ రసనాగ్రమున్ శ్రుతియునున్ మాధుర్యసీమల్, రస
శ్రీ కేదారము మా హృదబ్జము సమాశ్లిష్ట ప్రభావమ్మునున్.

ఏకైకభంగిక లోకాదివేదాంత పరమతత్త్వప్రభావమ్ము వెలిఁగి
ద్విత్రిభంగికలలో స్త్రీపుంగుణత్రయ నవరసరత్నసౌందర్య మొలికి
జ్ఞానముద్రాహస్త సంస్థాపనమ్మునన్ బహుమతమూలైకభావ మూది
సవ్యాపసవ్య పాదవ్యాప్తి సముపాత్త జంగమస్థావర సంగతిగని

అంగ సర్వస్వనర్తన నష్టధావి
భూతి యష్టాంగనియతి సంఫుల్లములయి
గాంగభంగిక చంద్రికా కలితగతుల
శుభ్రతరయశోజ్యోత్స్నాతిశుచియు వెలిఁగి.

తౌర్యత్రికశ్రుతి తారి సమ్మేళనైకము నాద మోంకారగతిగ మించి
ఆదిమధ్యాంత్య స్వరాశ్లిష్టశారద నాదత్రయము త్రయీవాదయి నయి
రమ్యనిషాద స్వరాయితోచ్చైర్నాద ముపనిషత్పరిణాహమును ఘటించి
ఋషభాదిషట్స్వరవృత్తిషడంగ షట్ఛాస్త్రవిస్ఫూర్తి ప్రశస్తమునయి.

తత్త్వఘనగీత గీతికా తాళగతుల
నుడుకమ్రోఁతల 'నయిఉణ్ణు' లోలిపలికి
ప్రస్తరించిన తానము ప్రణయరాగ
మసృణ మకరంద వాహిని మలకలునయి.

తాకిట తోంధదోంధి ఘృత్త దంధిమి తక్కిట లాస్యలీల, నీ
రాకల సర్వవిద్యలు పురాసుకృతమ్ములు నైఫలించి, భూ
రీకరణాంగ హారముల రీతులు శిల్పకళాసుధల్ కడున్
వాకలుగాఁ దెనుంగుధర పండినవెన్నెల లారబోఁతలో.

బౌద్ధవిహారసీమ నిలబడ్డవి ప్రాగ్దిశ చంద్రకాంత సం
బద్ధములై సమస్త కకుబంతములన్ విరళీకరించి, భా

స్వద్ధరికాంతిబోనివి నవద్యుతులారిచి, లేఁతపుచ్చెలో
బుద్ధులు పశ్చిమమ్ములగు భూములకెత్తిన వేఁగుజుక్కవై.

మును సహస్రపత్ర కమలము తెనుఁగుసిరి
గద్దెవిచ్చె వెలుఁగు తెల్గు ప్రొద్దుచిన్నె
బోధివృక్షమ్ము యజ్ఞ సంపుష్టపూర్ణ.
పరమపర్ణానిలోద్ధూత పాపపటలి.

నీమెడ నాగరాజు ధరణీభరణక్షముఁ డైన తెన్ను తేఁ
డై మహాసియముల్ పడగ లాడిన చాయల శీతరుక్సుధన్
భూములు చల్లఁగా నెసఁగు భూమిక, తంతకథా విలీన
థామయ నాటకార్థములఁ దాధ్వనియించెడు నిండు నాందిగా.

భ్రూకుంసస్థితి వామపార్శ్వమున సంపూర్ణమ్ము సీమూర్తి, రే
ఖాకారధ్వని కావ్యబుద్ధగతమున్ గాంతాద్వితీయస్థితిన్
సాకారమ్ము నిరాకృతిన్ ప్రణుత తేజఃపూర్ణమై శోఁచిన
ట్లే కావించె తెలుఁగుశిల్పి తన కేళీలోలహస్తద్యుతిన్.

పదభాగసంలగ్నవదనాబ్జనయనాంబుజాతముల్ ప్రణయపూజాసుమములు
నాతినమ్రభ్రూయుగాతిశైజసలీల వర్యాప్రదత్తధూపమ్ము రేఖ
నగ్నికానతమధ్య నాళవల్లీద్వితీయామృతాంశురుచి దీపాచ్ఛదీప్తి
మలచినకేల్మోడ్పు తొలిప్రేమనిండిన మధుకోశనైవేద్య మధురమూర్తి

భక్తిశృంగారరసమున భావమైపు
రాణదాంపత్యపూత సౌరభముబఱపి
ప్రకృతిపురుషైక్య భావసంపన్నమైన
దివ్యరేఖామహాజ్యోతి దిశలనిండె.

పడగెత్తి క్రొన్నాగు కడలందు పరవళ్లు వీరరసోద్ధతి విరిసినట్లు
శిథిలాంగవిస్ఫూర్తి స్మేరాక్షియుగ్మమ్ము హాస్యాద్భుతములు ప్రోవైనయట్లు
కెలకుల తెలికాంతి తొలకరించినకనుల్ కరుణారసాంబుధి కదలినట్లు
ఒక్కడైగురుమూర్తిచక్కనిల్చినరేఖ అద్వంద్వరసము రూపైనయట్లు

అమృతమధుమూర్తి శిల్పి లోకైకనేత
ఆమహాత్ముని ప్రతిభలో నారితేరి
అడుగునడుగున నేమూర్తి యచ్చువడిన
కథలు నతిలోకసౌందర్యనిధులు నిలిచె.

ఇంతసౌందర్యభరము మఱింతకింత
సర్వవిజ్ఞానభరము విశ్వప్రకాశ
మై పునీతమై హృదికి ప్రేగై తెనుంగు
నేల నీరు గాలి వెలుగు నింగి తన్మ
యత్వమునపెట్టు జయఘోష లంది పొంగి.

తెనుఁగుముత్తైదువు తీయనిమంగళహారతి జయలక్ష్మి నలవరించి
సాహోనినాదాతి సంరంభశ్రీకృష్ణవేణీతరంగాళివీథి తీర్చి
మధ్యాహ్నశంఖాడిమధ్వనిచ్ఛటపటల్ జయభేరి తీవ్రమ్ము చదలనించి
అతిభంగిగతిరీతి తతవినాకవిముక్త పటునారసమ్ముల ప్రభలసీని

ఫాలలోచనవహ్ని విషతుశితు
కౌప్రతాపాగ్నిశిఖల నైక్యముభజించి
ధోంధిదంధిమిధిఘృత్తల దురితగతుల
పరమమోఘోవిధాతాండవమున కదల.

ఉద్ధృతరౌద్రతాండవ మహోద్ధతిభూములు దద్దరిల్లి, భూ
భృద్ధృతి దిర్దిరై యతిగభీరమహార్ణవ తుంగవీచికా
రుద్ధదిశాంతముల్ పగిలి రుద్రమహానటరాజ భావసం
బద్ధమునై తెనుంగులయువహ్నిశిఖోరుతరప్రతాపమై.

శ్రీముఖశాతకర్ణి కనుక్రేవల నిప్వకలాడె మాగధ
స్తోమము నీఱుగాఁగఁ దజితోనరిశౌర్యమహార్ణవమ్ములుఁ
స్త్రైమముమాలి మేఘములఁ దేలి ధరిత్రి సువర్ణవృష్టిగా
సీమల వైరిదుఃఖరస శీకరకల్పిత దుర్దినమ్ముగా.

గౌతమీపుత్ర శ్రీశాతకర్ణునిచేత త్రిపురారి తా సముద్ధృతిజ్వలించి
వీరవైరిగ్రీవ విదళనారంభమ్ము మర్త్యమహామేధ మహిమ మెఱసి
కూకటివేళ్లతో కూలి యవనపహ్లావతౌత్రపాది దుర్వైరిబలము
మచ్చరిక్రీగంటిచిచ్చుఱ పాపఁజేఁ డాచకోరాద్ర్యగ్ర మంటి మండి

పూతకృష్ణానదీ పద్మజాతమంద
హాసమునవ గంగాంభోజ మందువిరిసి
అసికసౌరాష్ట్ర కుకురాదు లఖిలభూము
లాంధ్రరాజ్య ధ్వజచ్ఛాయ హాయిగాంచె.

శ్రీపులమావిరౌద్రరససిద్ధికినై జయదాము మాళవ
శ్రీపరిపూర్ణ మాహుతులు చేసెను చస్తగ భాస్కరాస్తమా
నాపదలో త్రిలింగ కరుణారుణ దీధితి శ్రీకరమ్ముగాన్
దాపట వెల్పటన్ కృతవినాశభవమ్ముల ఈశ్వరాకృతిన్.

తతవిలయప్రఘూర్ణిత సుధాంబుధు లల్లన నిస్తరంగతా
గతి విలయాంతతైజస వికాసము రేఖల తీరురీతి నా
తతపటు నర్తనాంతమున తన్మయతన్ భవదీయమూర్తితో
చి తెలుగునేల శాంతిమెయి శ్రీపద సుఖదమ్మునైనదిన్.

ఆమహాశంకరత్వమై యవతరించి
శ్రీ శివశ్రీమహారాజు శ్రీకరాధ్వ
రంపు ధూమమ్ము వేదనాదంపుపెల్లు
ఖేచరమ్ముగ చిన్మయకేళి దేవ.

జ్యోతిర్లింగమయస్వరూపమున విద్యుల్లేఖలం దాటి నీ
వాతారాపథ మంటినిల్చితివి దేవా! శర్వ! కృష్ణాసుధా
స్రోతఃపూరతటమ్మునన్ ప్రణుతమాశుశ్రీకరార్చావిధిన్
ప్రాతఃకాలము నిచ్చలున్ గొలువ నాంధ్రత్వమ్మహోద్యద్గతిన్

తెనుఁగు వజ్రాలదిన్నె వేది భవదీయ
లాస్యమునకు నాంధ్రరమకల్యాణమునకు
లాస్యకల్యాణయజ్ఞ వేళాప్రదీప్త
భవ్యహోమాగ్ని శిఖయ దీపాలదిన్నె.

# ఆంధ్రులు - రేడియో

ఇతర దేశాలలో 'మోజు' తీరిపోయి ప్రాతపడిన విషయాలు మన దేశానికి వస్తూవుంటాయి. ఇంగ్లండులో పదేండ్లకు పూర్వము ప్రబలినవి, టాకీలు, యిప్పుడు యిక్కడ ముమ్మర మగుతున్నాయి. విమానాలూ అంతే. ఇప్పుడు 'రేడియో' సంగతీ అంతే. ఆదేశాలలో రేడియో సాధారణ మయిపోయింది. పన్నెండేండ్ల పిల్లవానికికూడా రేడియో అంటే యేమిటో, అది యెల్లా పనిచేస్తుందో, ఎప్పుడెప్పుడు ఏఏ దేశాలను వినవచ్చునో తెలుసు. మనలోనో, పెద్దపెద్ద పరీక్షలిచ్చిన వారికికూడా యీ సంగతులు తెలియవు సరికదా, తెలుసుకోవాలనే అభిలాషకూడా లేదు. బొంబాయి రాజధానిలో ప్రతి వేయిమందికి వొక రేడియోసెట్టు వున్నది; మన తెనుగుదేశంలో అంతటా ప్రోగుచేస్తే రెండు మూడు వందలైనా వున్నాయో లేవో — మూడుకోట్ల ,ఆంధ్రులకు! అంతవరకూ యెందుకు? తమిళదేశంలో, వొక్క తిరుచినాపల్లిజిల్లాలోమాత్రం వున్నాయట నూటయేబదికి పైగా. మనకంటె వారు ధనవంతులా అంటే మనము వొప్పుకోము. మనకంటె వారికి యెక్కువ తెగింపు వున్నదంటే, 'ఆ! అసహాయోద్యమపు రోజులలో మనవారే యెక్కువ త్యాగం చూపించారు' అంటాము. ఉద్రేకసమయాలలో 'ఫెళఫెళార్భాటాలు చేయడము ప్రశంసనీయమే — కాని ఉడుకు సమయాలు యెప్పుడూ వుంటాయా? శాంతిసమయాలలో చేయవలసిన నిర్మాణ కార్యక్రమము యెంత లేదు? దేశము యెన్నెన్ని విధాల వృద్ధికావాలి?

ఇండియా గవర్నమెంటువారికి మాత్రము అనేక కారణాలవల్ల యీ దేశంలో రేడియోను అమితంగా అభివృద్ధి చెయ్యాలని దృఢసంకల్పం వున్నది. ఢిల్లీ,బొంబాయి,లాహోరు, పెషావరు, కలకత్తా, లక్నోలలో కొన్నిలక్షలు ఖర్చుపెట్టి చక్కని యేర్పాటులను చేసినారు; ప్రతిరోజూ యేదో వొక క్రొత్తఅందం చూపిస్తూ ముందంజ వేస్తున్నారు. అక్కడ నుండి వారు దక్షిణాపథానికి రాగా వారికి 'మద్రా'సంతా అరవంలాగే కనుపడ్డది! ఢిల్లీలోవున్న 'మద్రాసు'వా రెవరు? బొంబాయిలో, కలకత్తాలో 'మద్రాసు'వా రెవరు?-ఆఖరుకు యీ డిపార్టుమెంటు అధికారులు మద్రాసుకు వస్తే, యిక్కడ వారిని కలుసుకొని వారిని పెద్దచేసిన 'మద్రాసు'వా రెవరు?—ఆంధ్రులు మాత్రం కారు! మదరాసు రాజధానిలో రేడియోవిధానంమాట మొదట తలపెట్టినప్పుడు ఆసంగతి పేపర్లలోకూడా పడింది. కాని వారిని కలుసుకొని "'మద్రాసు' అంటే వొకసంస్థ కాదు; అందులో నాలుగుభాష లున్నాయి,— ముఖ్యంగా తెనుగు, అరవము; అరవవారికి ఆంధ్రులకు ఆశయాలలో హస్తిమశకాంతరము తేడా లున్నాయి" అని చెప్పిన ఆంధ్రనాయకు లేరీ? అట్టిసందర్భాలలో ఢిల్లీవారికి మద్రాసంతా వొకటే అనిన్ని, బెంగాలుకంతా బెంగాలీభాషలాగ మద్రాసుకంతా భాష అరవమే అనిన్ని వారికి తోచడంలో ఆశ్చర్యంలేదు. అందుచేతనే వారు యీ రాజధానిలో రేడియోస్టేషను యేర్పాటుచేస్తూ మొదట మద్రాసుస్టేషను పెట్టి తదుపరి రెండు మూడు నెలలలో తిరుచినాపల్లిలో పెడితే మదరాసు రాజధానికి చాలు ననుకున్నారు. ఆ ప్రకారము ఏర్పాటులు జరిగిపోయినాయి. "అమ్మాయికి నగలు సరిగా పెట్టలే"దని నాగవల్లిరోజున నొచ్చుకుంటే లాభ మేమిటి?

అయినా, మించిపోలేదు. ఈ మధ్య పత్రికాముఖాన్ని కొద్దిగా ఆందోళన జరిగింది. 'ఆంధ్రులకు రేడియో లేదట' అనే శీర్షికను వ్యాసాలు వెలువడినవి. ఈ వ్యాసాలు, యీ ఆందోళన చాల వుపయోగకరము; అవసరము. కాని, అంతకంటె ముఖ్యం రేడియోవిధానంలో ఆంధ్రులు నిజమైన అభిలాష, ఆసక్తి చూపించడము. ఇప్పుడు సెట్లుకలవారు వానిని నగలపెట్టెలలాగ పూజింపక ప్రపంచమంతటనుండీ వెలువడుతున్న రేడియోసమాచారాలని ఆలకిస్తూవుండాలి. స్నేహితులందరినీ వినేటట్టు చేసి అందరిచేత సెట్లను కొనిపించాలి. ఇటలీవారు నలుబది భాషలలో 'రేడియో'చేస్తున్నారు.

ఇంగ్లండూ!—జావానుండి చక్కని సంగీతం వినవస్తుంది. ఉత్తరధ్రువ మండలానికి పరిశోధనల కొరకు వెళ్లిన సోవియటుశాస్త్రజ్ఞులు వారు కనిపెట్టుతూవున్న వింతలను ప్రతి పూటా రేడియోద్వారా లోకానికి వెల్లడిచేశారు. వీనిని మన తెనుగు దేశంలో విని సంతోషించినవారు లేనేలేరు!

అసలు, మనకు యేవిషయంలో అభిలాష వున్నదో కనుగొనుట కష్టంగా ఉంది. సంగీతమా, చెప్ప నక్కరలేదు: 'త్యాగరాజు మావా' డనీ, 'మువ్వగోపాలపదాలుమా'వ నీ విర్రవీగుతాము. కాని, కాకినాడ వీథులలో సాయంత్రపువేళ సంపన్నులున్న తావులలో నడుస్తూవుంటే 'స్థిరమైన నడవడి' 'చిదిమిన పాల్గారు'తూ వుంటుంది. ఇక విశాఖపట్నం, విజయనగరంవేపు 'సింహాద్రి అప్పన్న''కావ్యోడిపదం' వింటూ వుంటాడు. అన్నిచోట్ల బస్సుహోస్యాలు, ఎలక్షను గలభాలు, డ్రామా సెట్లే. దక్షిణాదినీ డ్రామా సెట్లు వున్నాయి; తక్కువరకపు పాటలూ వున్నాయి. కాని మధురలో, తంజావూరులో ప్రతియింటిలోనూ ఆడపిల్లలు "ఎందుండి వెలసితివో" అనో, "క్షీరసాగరశయనా" అనో, "బాల కనకమయచేల" అనో ఎప్పుడూ పాడుతూవుంటారు — దివ్యంగా. కొన్ని మాటలు వారికి అర్థం కాకపోవచ్చును. ఉచ్చారణలో లోపముండవచ్చును. కాని యిప్పటి మన తక్కువరకపు కృత్రిమ హిందూస్థానీ-తెనుగు మట్లకంటె వారిపాట వేయింతలు రసవంతముగా ఉంటుంది. మగవారికికూడా చాలామందికి చక్కని సంగీతజ్ఞానం ఉన్నది. ఇకముందు, మనఅదృష్టంవలన, తెనుగు దేశంలో రేడియోస్టేషను స్థాపితమైతే, అన్ని విధాలా అధోగతికి పాలైన మన గొప్పసంస్కృతిని (Culture) ఉద్ధరించడమే ముఖ్యమైనపని. సంగీతంలో, సారస్వతంలో, రాజ్యాంగంలో, గ్రామపారిశుధ్యంలో, జిల్లా ఆరోగ్యవిధానంలో, వ్యవసాయంలో, వాణిజ్యంలో, యింకా అనేకవిషయాలలో తెనుగు రేడియోస్టేషను చేయవలసిన పని కొండంత ఉన్నది. కాని, అన్నిటిలోనూ ప్రజలసహాయం అవసరము. "నాకెందుకు" అని తప్పించుకు తిరుగుటలో మనము నిపుణులము. లక్నోలో స్టేషను పెడతారని తెలియడంతోనే జనులు 'ఎప్పు డెప్పు'డని ఉత్తరాలతో ప్రభుత్వాన్ని ముంచేశారు. మద్రాసులో శిబ్రవరినుండి స్టేషనుయేర్పాట్లుమొదలుపెట్టినారు. తమిళదేశం అంతటినుండీ రోజూ ఉత్తరాలు వస్తున్నాయట: "మీా విధాన మేమిటి? ఎట్టి సంగీ



చంద్రగిరి రాజుమహాలు

తము వినవచ్చును? ఫలానా వూళ్లో ఫలానా గాయకురాలు వున్నది. ఆమెచేత పాడిస్తారా" అని; యింకా ఎన్నెన్నో ప్రశ్నలు వస్తున్నాయట. ఇక టెలిఫోను వార్తలకు లెఖ్ఖలేదు. మచ్చుకైనా, వొక్క కార్డయినా ఆంధ్రదేశంనుంచి, వొక్క ఆంధ్రుని దగ్గరనుంచి వస్తే వొట్టట!

మరో ముఖ్యవిషయము: యీ యేడో, వచ్చేయేడో తెనుగుదేశానికి రేడియోస్టేషను శాంక్షను అయినప్పుడు మనము ఆంధ్రవిశ్వకళాపరిషత్తు సందర్భంలో చేసినట్లు 'మావూళ్లో వుంచాలి', 'మావూళ్లో వుంచాలి' అని తగాయిదాపడి అసలు కార్యాన్ని పాడుచేసుకోకూడదు. వందలు, వేలు మైళ్లదూరం ప్రసరించే కిరణాలతో పనిచేసే రేడియోకు దూరంఅంటూ లేదు. స్టేషను ఆంధ్రదేశంలో ఎక్కడున్నాసరే మంచి సెట్లుకల అందరికీ పనికి వస్తుంది. ప్రభుత్వంవారి యితర అనుకూలాన్నిబట్టి యేరాజమండ్రిలోనో, యే విశాఖపట్నంలోనో పెట్టితే బెజవాడ వారును, అనంతపురంవారును కర్రపుచ్చుకోకూడదు!

మదరాసు స్టేషనుపని ప్రారంభించిన కొద్దినెలలలో రాజధాని అంతటనూ ముఖ్యగ్రామాలలో గ్రామస్థులందరకు పనికివచ్చే పెద్ద ఉమ్మడి సెట్లను యీ గవర్నమెంటువారు నెలకొల్పుతారట. తెనుగుదేశానికంతా వొక యేబదిసెట్లు వుండవచ్చును. ఇవి మహాసముద్రంలో వానచుక్క అనవచ్చును. అయితే, ప్రతి పంచాయతీబోర్డు, ప్రతి మునిసిపాలిటీ, ప్రతి జిల్లాబోర్డు సెట్లను నెలకొల్పవచ్చు. సంపన్నులు తమ సంచీలను కొంచెము విప్పి మంచి సెట్లను కొనవలెను. అనేకులకు రేడియోయందు అభిరుచి కలిగినప్పుడు, సెట్లు విరివిగా స్థాపింపబడినప్పుడు మనము మన జాతీయ ప్రత్యేకతకు తగిన రీతులను అభివృద్ధి కావచ్చును. దేశమునుండి యీ సెట్లద్వారా ప్రభుత్వమునకు సరిమైన ఆర్జన కలిగినపుడు వారును నిపుణులను నియమించి ఆంధ్రదేశోద్ధరణకు సాయపడుదురు. కాని అన్నిటికంటె ముఖ్యము యీ విధానమందు మనవారు ఎడతెగని శ్రద్ధ చూపించి యేయే మార్గాలలో మార్పులు కలిగితే యీ విధానము పూర్తిగా పనికివచ్చునో సమయానుకూలముగా పైవారికి తెలియజేయవలెను. ఆందోళన చాలా అవసరము.

అన్నివిషయాలలోనూ ఆంధ్రులు మేలుకోవాలి. మనకోసము, మన ప్రజకోసము మనము జీవితంలో నిజమైన శ్రద్ధ చూపించాలి!

(రేడియో)



# ఆంధ్ర  ప్రబోధము

దీపాల పిచ్చయ్య శాస్త్రి

సోదరరాష్ట్రీయులు మ
ర్యాదగ భాషాప్రయుక్తరాష్ట్రంబులు సం
పాదించుకొనిరి, ఆంధ్రుఁడ !
యేదీ యాభాగ్య మింతకేనియు సీకున్ ?

లేవా వలసిన వసతులు?
కావలసినయన్ని కలవు-కార్యక్రమముల్
త్రోవబడి నిర్వహింపఁగ
లేవా ? లేకేమి ?-అయిన లేవ వదేమీ ?

శకునంబుల్ కనుపించుచున్నయవి యా
 శాస్యంబు లిప్పాటఁ ద
ప్పక చేకూరును, దేశమాతృ పదసే
 వల్ చేసి యాంధ్రప్రభల్
కకుబంతంబుల నింపఁగాఁ దగిన స
 త్కాలంబు ప్రాప్తించె నూ
రక యోచింపఁగ నేల ? కైకొనుము రా
 ష్ట్రస్థాపనాచార్యతన్.
మనవేషము, మనభాషయు
మనరాష్ట్రముమనకువలయుమనధనబలముల్
మనకె వినియోగపడవలె
మనముల్ సరివారివలెనె మనవలెనన్నన్.

సరివారందఱు సర్వరీతులను స్వే
 చ్ఛాభాగ్యముం జెంది, రీ
శ్వరదత్తం బగు ప్రజ్ఞ కల్గియును భా
 షాదాస్యబంధంపు ము
న్నరకం బీఁగఁగలేని కర్మ మిది య
 న్నా ! యెన్నినాళ్లింక ? లె
మ్మరవాయిం గొన కీవు నొక్కమొగిఁ గా
 ర్యారంభసంరంభివై.

మాఱుబాసతోన మ్రగ్గఁగావలె నన్న
బాధ యేమి మనకు భాష లేదె ?
'దేశభాషలందు తెలుఁ గులె' స్సని పేరు
వడిన భాష మనకుఁ బనికిరాదె ?

ఆంగ్ల మాంధ్రంబుకంటె నెట్లధిక మయ్యె
నాంధ్ర మాంగ్లంబుకంటె నెట్లధమ మయ్యె
ఆత్మగౌరవ మొక్క రవ్వంత యున్న
నెవరిభాషలు వారికే హెచ్చు గావె?

చెల్లియుండియు నిటు జాగుచేసె దేల ?
మీనమేషాల నెంచుటతోనె చనియె
నిప్పటికె చాలకాల మీ వింతనైన
మేలుకొనవయ్య ఆంధ్రుఁడా మేలుకనుము.

అరివీరలోక దురాలోక కాంతులఁ
 దేజరిల్లిన మన తెలుఁగుకత్తి
ద్రావిడ కర్ణాటరసికమానసరంగ
 ముల కెక్కి కులికిన తెలుఁగుపలుకు
దేవమాతృకము నదీమాతృకము నయి
 బలుపుగాంచిన మన తెలుఁగుపొలము
అన్యదురూహ మంత్రాలోచనాప్రౌఢి
 తేకువఁ గాంచిన తెలుఁగుచదురు

మఱపు తగిలెన యేమోయి ? మానసమునఁ
దలఁచుకొ మ్మొక్కపరి మేను పులకరింప
పిఱికికండ యెఱుంగని వీరశేఖ
రుఁడవు నీ వాంధ్ర ! కార్యశూరుఁడవుకమ్ము.

# నా గా ర్జు ను ని కొం ० డ

మల్లంపల్లి సోమశేఖరశర్మ

ఇప్పటికి దాదాపుగ ఏతువందల సంవత్సరములయినది బౌద్ధమతము తనజన్మభూమియయిన హిందూదేశమున అంతరించి; కాని యది దేశీయుల గౌరవాదరములకు పాత్రమై, వారి యభిమాన విశ్వాసములను చూరగొని యడ్డమాకలులేక విజృంభించిననాడు దేశమున ఆమతము వెలయింపజేసిన నిర్మాణములలో చాలభాగము నామమాత్రావశిష్టములయినను కొన్ని మాత్రము కాలపురుషుని ధాష్ట్యమున కెదురొడ్డి కొనయూపిరితో నిలిచియున్నవి; మరికొన్ని ఇండియా ప్రభుత్వమువారి పురాతత్వశాఖవారు చేయుచున్నకృషికి ఫలముగ ఏశిథిలరూపముతోనో, భగ్నాకృతులతోనో బహిర్గతములగుచున్నవి. ఈజీర్ణ బౌద్ధనిర్మాణావశేషములను, శిథిల బౌద్ధశిల్పకృతులను చూచినను బౌద్ధము జీవన్మతమై విలసిల్లిననాటి యాకళానిధానముల నిండారుప్రశస్తి వైభవశోభను మనహృదయసీమ నూహింపనైన సాధ్యముకాదు. బుద్ధజయంతుల నాక్షేత్రము లెట్టి యపూర్వ సౌందర్య విలాసములతో మెరసిపోయెడివో, ద్వీపాంతరములనుండి, దేశాంతరములనుండి యెంతటి ప్రజ నాకర్షించుచుండెడివో యెవ్వరికి దెలియును? గాలిలో పెట్టిన కర్పూరఖండమువలె హరించిపోయిన ధాన్యకటకసంఘారామ బౌద్ధపుణ్యక్షేత్రము దీపాలదిన్నె పూర్వవైభవము హృదయసీమ నెవడు నేత్రగోచరము కావించుకొనగలడు? అయినను నేడు ఈవిశీర్ణ భగ్న బౌద్ధ నిర్మాణావశేషములవలననే హిందూదేశమున బౌద్ధము ముమ్మరముగ వ్యాపించిననాడు కళ యెంతటి యుచ్చదశయం దుండెనో, అది యెంతయుత్తమశ్రేణికి జెందినదో, ఎంత సుందరమయినదో తెలిసికొన వీలగుచున్నది.

హిందూదేశమున బౌద్ధము ప్రబలిననాటి యాకళ వర్ణికాచిత్రముల రూపమునను, శిల్పచిత్రముల రూపమునను, హర్మ్యనిర్మాణముల రూపమునను రూపుకట్టుకొని వికసించినది. ఈ మూడువిధములగు బౌద్ధకళయుగూడ నేడు మనము ఈ దేశమున బొడగాంచవచ్చును. పైనుడివిన మూటిలోను వర్ణికాచిత్రమునకు అజంతా, బాఘ్‌విహారములు అసదృశములయిన చిత్రశాలలు. బౌద్ధస్తూప, సంఘారామ, గుహాలయాలు బౌద్ధహర్మ్యనిర్మాణాదుల కుదాహరణములు. బౌద్ధ మంతరించిపోవుటచేత సంఘారామములు నామమాత్రావశిష్టములయియు, గుహాలయములు 'ఖండస్ఫుటితనవకర్మాది' సంస్కారములు లేక జీర్ణములయ్యు అందందు చూపట్టుచున్నవి. పురాతత్వశాఖవారి నిరంతరకృషివలన స్తూపము లనేకములు చాలచోటుల బయలుపడినవి. బౌద్ధస్తూప, హర్మ్యనిర్మాణాదికముల ననుసరించి విలసిల్లినదే బౌద్ధశిల్పచిత్రకళ. ఆంధ్రదేశమున బౌద్ధవర్ణికాచిత్రకళ కుదాహరణములు మృగ్యములయినను స్తూప, గుహాలయముల భగ్నావశేషములకుమాత్రము కొంతవరకు కొరతలేదు.

బుద్ధుని సిద్ధాంతోపదేశములకును బౌద్ధకళకును గల సంబంధ మెంతవర కన్నది ఇంకను విమర్శనీయమేయైనను బుద్ధుని అహింసాతత్వమే, బుద్ధుని జీవకారుణ్యమే, బుద్ధుని పరమాశయమే బౌద్ధకళానిష్ణాతులకు జీవగర్రయై వారి హృదయములను ద్రవింపజేసినది. ఆనాటి బౌద్ధశిల్పుల రసహృదయమే తరగత్తి బౌద్ధకళగ జాలువారినది. బౌద్ధకళయందలి ప్రతి అంశమును ఉదాత్తవస్తుసమంచితము; ప్రసన్నకథా లలితము; కరుణరసాత్మకము; త్యాగధన విశిష్టము. బుద్ధుడు మూర్తిభవించిన కరుణాస్వరూపము. బుద్ధుని పురాతన, అధునాతన చరితము ప్రతిదియు, ప్రతివాక్కును దివ్యసందేశ గర్భితమయినది. దుఃఖానల సంతప్తమయిన లోకమునకు అది చల్లని యమృతసేచనమయి, దానికి సౌఖ్యానందప్రదమయిన చందనశైతల్య మొదగూర్చి, దానిని సాకినది. దానంజేసియే చంద్రునిచుట్టు పరివేషమువలె బుద్ధుని చుట్టు బౌద్ధకళ పరిధితీరినది.

చారిత్రకపురుషులందరివలెనే బుద్ధుడును ఒక చారిత్రక వ్యక్తియే యైనను బుద్ధసందేశముగ్ధమును, భక్తిభావవినమ్రమునయిన భక్తలోకము ఆపరమకారుణికమూర్తికి అతిమానుషశక్తులను ప్రసాదించి, యాతనికి దేవతాసింహాసనము నొసంగి దివ్యరాజ్యమున కాతనికి పట్టముకట్టినది. బుద్ధునిజన్మము, బుద్ధుని విద్యాభ్యసనము, బుద్ధుని వివాహము బుద్ధుని భోగము, బుద్ధుని త్యాగము — అన్నియు ఆలోకము దృష్టిలో అత్యద్భుతగాథలై, పౌరాణికశోభ నేకరించుకొని, దివ్యత్వముతో మెరసిపోయినవి. బుద్ధునిగాథలు — పూర్వజన్మములకు సంబంధించినవియు, ఈ జన్మమునకు సంబంధించినవియు— అనంతములైనవి. చీకటిలో తడవులాడుకొనుచు యాత్ర సాగించు అంధలోకము హృదయమును బుద్ధుడుత్తేజపరిచినట్లు ఎవ్వరును చేయలేదన్న అది సత్యదూరము కానేరదు.

కాని బౌద్ధము దేశమున బాగుగ వ్యాపించినది బుద్ధుడు నిర్వాణమునొందిన వెనుకనే. మౌర్యవంశజుడయిన అశోకుడు దశదిశలకు బుద్ధసందేశమును వినిపింప మతబోధకులను బంపినాడు. అశోకవర్ధనుని యభిమాన, ఆదరములవలన అంతవరకు మగధహద్దులు దాటకుండ ఒక స్థానికమతసంప్రదాయముగనే యుండిపోయిన బౌద్ధము అంతటినుండి ప్రపంచమతమయినది. బౌద్ధము ఆంధ్రదేశమున ప్రవేశించినదికూడ అశోకవర్ధనుని కాలముననే.

మౌర్య అశోకవర్ధనుని మరణానంతరమున బౌద్ధమునకు మగధరాజ్యమున ఆదరప్రాపకములుసన్నగిల్లినవి. అందువలన నదిరాజ్యాంతరములు వెదకికొనవలసివచ్చినది. ఇటువంటి స్థితిలోనే దాని కాశ్రయమిచ్చి యాదరించినవారు ఆంధ్రులు.

క్రీస్తుశకము మొదటి శతాబ్దులలో ఆంధ్రరాజులు రాజ్యముచేయుచుండిన కాలమున బౌద్ధమతము ఆంధ్రదేశమున విరివిగా వ్యాపించియుండెను. దానంజేసి నాడు తెలుగుదేశమున బౌద్ధుల సంఘారామములును, గుహాలయములును, స్తూపములును చాల వెలసినవి. నేడు దేశమున బౌద్ధ మంతరించిపోవుటచేత దానికి సంబంధించిన సంస్థలు నామమాత్రావశిష్టము లయినవి. అప్పటి నిర్మాణములు జనుల యనాదరమునకు పాలయి జీర్ణములై శిథిలత్వము నొందినవి. దానంజేసి నాడు బౌద్ధసంఘమునకు పుణ్యప్రదములయిన క్షేత్రము లేవో, మనికిపట్టులేవో నేటి కింకను

పూర్తిగ తెలియరాకయున్నది. బౌద్ధము పూర్తిగ నశించినపిదపగూడ కాలము రాటుపోటుల కాగి కొంతకాలము నిలిచిన బౌద్ధ స్తూపనిర్మాణములు కాలక్రమమున భూగర్భమున బడి పూడిపోయి పెద్ద దిబ్బలయినవి. అట్లు పూడిపోక యేనిర్మాణములైన నిలిచియుండినచో ఇటికలు మొదలయినవాటి నిమిత్తము మనుష్యులే వాటిని పాడుచేసినారు. ప్రాచీన బౌద్ధనిర్మాణములకొరకు పునః అన్వేషణము జరుగవలసివచ్చినది. గవర్నమెంటు పురాతత్వశాఖవారు కృష్ణా, గుంటూరు మండలములలో అచ్చటచట భూమినిత్రవ్వి చేసిన యన్వేషణమువలన ఆంధ్రదేశమునందలి ప్రాచీనబౌద్ధ క్షేత్రములు కొన్ని తెలియవచ్చినవి; ప్రాచీన బౌద్ధస్తూపాదులు కొన్ని బయలుపడినవి. ఈ పురాతత్వశాఖవారి కృషివలననే కృష్ణానదీ తీర ప్రదేశమునందలి అమరావతి, జగ్గయ్యపేట, ఘంటసాల, గుమ్మడిదుర్రు, భట్టిప్రోలు మొదలయినవి పూర్వము ప్రసిద్ధములయిన పుణ్యక్షేత్రము లనియు, ఈ స్థలములన్నిటను బౌద్ధమునకు సంబంధించిన నిర్మాణ శిల్పావశేషము లుండెననియు తెలియుచున్నది. పైని చెప్పిన స్థలము లన్నిటిలో ఒక్క అమరావతిలో మాత్రమే గొప్పబౌద్ధస్తూప నిర్మాణావశేషసంపద దొరకినది. దానిని బట్టియే బౌద్ధము వ్యాపించిననాడు ఆంధ్రులు శిల్పకళారచనమున అసమానులని తెలియవచ్చినది.

భారతీయ బౌద్ధకళాచరిత్రమున అమరావతి దొక గొప్ప ప్రకరణము. బౌద్ధాంధ్రులు శిల్పచిత్రరచనమున కొంతవిశిష్టత చూపి అమరావతీస్తూపమునకు అపరిమితఖ్యాతి తెచ్చిరి. బౌద్ధయుగమునందలి ఆంధ్రసంస్కృతికి అమరావతి యపూర్వదర్పణము. నాటియాంధ్రుల శిల్పకళాకుశలతను బట్టి భారతీయబౌద్ధకళా సంప్రదాయములలో అమరావతీసంప్రదాయ మొకటి యేర్పడి ప్రసిద్ధిగాంచినది; అంతియ కాదు, అది నాడు వర్ధిల్లిన బౌద్ధకళాసంప్రదాయములన్నిటిలో ఉత్తమమయినదని, ఉత్కృష్టమయినదని పేరుగాంచినది. వస్తువేదిచిత్రింపవలసివచ్చినను అందు బౌద్ధయుగమునాటి యాంధ్రశిల్పి అద్భుతప్రతిభ, అసమానప్రజ్ఞ చూపినాడన్న ఖ్యాతి గడించినాడు.

కృష్ణానదీతీరమున పరివ్యాప్తమయిన కళాసంప్రదాయము అమరావతిదే. బౌద్ధ ఆంధ్రశిల్పు లందరు అమరావతీశిల్పమునే వరవడిగాబెట్టుకొని తమ శిల్పకళారచనమును సాగించుచువచ్చిరి. మొన్న మొన్నటి వరకు బౌద్ధకళకు ఆంధ్రులు చెప్పకొని గర్వింపదగ్గిన యుదాహరణము ఒక్క అమరావతియే కనబడినది. గవర్నమెంటు పురాతత్వశాఖవారి కృషివలన ఇటీవల మరియొక శిల్పకళానిధానము — నాగార్జునుని కొండ — బయలు పడినది.

గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలో కృష్ణానదీ దక్షిణతీరముననున్నది నాగార్జునుని కొండ. పల్నాడు తాలూకాలోని మాచెర్ల వరకు రైలు కలదు. మాచెర్లకు నాగార్జునుని కొండకు ౧౪ మైళ్లదూరము. మాచెర్ల నుంచి జిల్లాబోర్డువారు వేసిన రోడ్డున్నది; కాని అది తగినంత మంచిస్థితిలో లేదు. మాచెర్లనుండి పదిమైళ్ల దూరాననున్న నాగులవరమువరకు బండ్లు పోవును. అచ్చటి నుండి కడపటి యైదుమైళ్ల దూరమును నడచి పోవలసినదే.

నాగార్జునుని కొండకు దగ్గరనున్న గ్రామము పుల్లారెడ్డిగూడెము. అది చారిత్రక ప్రసిద్ధిగల ప్రాంతమున నున్నను ఆగ్రామమున చారిత్రక ప్రాముఖ్యము గల వస్తువిశేషములు ఏవియు లేవు. నిజాంరాజ్యమును, చెన్నరాజధానిని విడదీయును కృష్ణానది నాగార్జునునికొండప్రక్కనుండియే ప్రవహించును. ఇది యంతయు కొండల మయమయిన ఎర్రనేల. ఇక్కడి కొండలు ౪౦౦ ల అడుగుల యెత్తుండును. ఈకొండల పార్శ్వము లడవితో నిండి ఉండును. కొండలతో పాటు పెద్దపెద్ద దిబ్బలుకూడ ఇక్కడ చూడనగును. వీటిమీదకూడ అడవి బలిసినది. ఈ దిబ్బ లన్నియు ప్రాచీన బౌద్ధనిర్మాణముల అవశేషములు. నాగార్జునునికొండ యన్నది ఈ ప్రాంతమున వాయవ్యదిశనున్న ౨౦౦ ల ఎకరముల వైశాల్యముగల యొకగుట్ట. చిత్రవిచిత్రాకృతులుగల శిఖరాలతోడి యీకొండలను జూచినచో అవి స్వాభావికముగ ఏర్పడిన కోటలవలె దోచును. వీనికితోడు రక్షణనిమిత్తము మానవుడు ఇటికతోను, రాతితోను కట్టినగోడలు మొదలయినవి కూడ ఉన్నవి. వీటి నన్నిటినిబట్టి చూడగా ఈ ప్రాంత పీఠభూమి ఒకప్పుడు ఒకదుర్గముగా నుండియుండవలెనని తోపకపోదు. ఈప్రదేశమున పాడుపడిపోయిన మధ్యయుగమునాటి శివాలయముతక్క ప్రాచీన నిర్మాణచిహ్నము లేవియు కనిపింపవు. విడివిడిగా చెదరి పడియున్న శిలాసమూహమును జూచినయెడల ప్రాచీనకాలమున ఇచట ఏవో వెత్రిమొర్రిగా కట్టిన కొంప లుండవలెనని తోచును. కోటగోడలు మొదలగువాటిని కట్టుటలో నుపయోగించిన యిటికలు ఈలోయలోని బౌద్ధనిర్మాణములలో నుపయోగించిన వాటితో సమపరిమాణము గలిగియున్నవి. మిక్కిలి పెద్దయిటిక ౨౦" × ౧౦" × ౩", అనగా పాటలీపుత్రములోని అశోకవర్ధనచక్రవర్తి రాజధానీ స్థలమయిన బులందిబాఘ్‌లో గానవచ్చినవాటంత పరిమాణముగలవే సరిగా. ఈయిటికగోడలు, ప్రాకారములు మొదలైనవి బౌద్ధులీ ప్రదేశము నాక్రమించియుండినప్పుడు కట్టినవే అయియుండవలెను—అంతకు పూర్వపువి కాకపోయినను ఈ కొండ దిగువఉపత్యకములందు శిలాప్రాకారములును, బురుజులును గలవు. ఇవి బౌద్ధయుగమునకు చాల తరువాతివి— విజయనగరాధీశుల కాలమునాటివి కావచ్చును.

బౌద్ధ అవశేషములు లోయలోమాత్రమే కానవచ్చును. పీఠభూమిమీద కొన్ని మైళ్లలెక్క త్రవ్వి చూచినారు కాని గృహనిర్మాణము లుండిన జాడ లేవియు గానరాలేదు. ఇదంతయు వట్టి రాతిభూమి; చెట్టుచేమ లేవియు పెరుగవు; నీరుకూడ దొరకదు. అందువలన మానవనివాసమునకు యోగ్యమయినదికాదు. గ్రామానికి పడమట నది వైపు ఒకకొండ ఉన్నది. నాగార్జునికొండమీదవలెనే అక్కడకూడ ఇటుకగోడలు మొదలయినవి కలవుకాని గృహనిర్మాణాదుల చిహ్నము లక్కడకూడ కనిపింపలేదు.

ఇక్కడనుండు పెద్దదిబ్బ లన్నియు బౌద్ధావశేషములే; వీటిలో కొన్ని సమప్రదేశపు మైదానముననను, మరికొన్ని కొండలమీదను నున్నవి. అక్కడక్కడ మొన్నమొన్నటివరకు నిలిచిఉన్న శిలాస్తంభమో, శిల్పాలంకృత ఫలకమో అది ప్రాచీన శిథిల నిర్మాణ స్థలమని సూచించుచు వచ్చినవి. ఇటువంటి శిథిలావశేషములున్న ప్రదేశము అమరావతీప్రదేశముకంటెను పెద్దది. ఈ లోయమధ్య నుండిన నగరము ఒక తట్టున నదిచేతను, వేరొకతట్టున దుర్గప్రాకారాదులచేతను,

పశ్చిమోత్తరముల బాగుగా ప్రాకారాదులచే నిండిన కొండలచేతను పరిరక్షితమైనదగుటవలన ప్రాచీనకాలమున అది శత్రుజనదుస్సాధముగా ఉండియుండవలెను. ఆకాలమున సముద్రము నుండి ఓడలు సరాసరి నాగార్జునుని కొండవరకు వచ్చుటకనువుగ నుండునట్లు కృష్ణానది ఇప్పటికన్న వెడల్పుగను, సముద్ర మిప్పటికన్న దగ్గరగను నుండియుండవచ్చును. అదియునుగాక ఈ పట్టణమునకును, కృష్ణానదికి సమీపముననే గల యితర బౌద్ధాధినివేశములకు గోలి, చేజెర్ల, అమరావతి, జగ్గయ్యపేట, ఘంటసాల, గుమ్మడిదుర్రు, బెజవాడ, భట్టిప్రోలు మొదలయినవాటితోను సుకరముగా రాకపోకలు, వ్యాపారము కూడ జరుగుచుండియుండవలెను. ఎందువల్లననగా, ఈ లోయలో బయలుపడిన స్తంభములు, దూలములు, విగ్రహములు, శిల్పఫలకములు చేయుటయందు నుపయోగపడిన పాలరాతి బండలు స్థానికముగ త్రవ్వి ఎత్తినవియు కావు, కొండలమీదినుండి తీసికొనిపోయినవియు కావు; అవి నదివెంటనే వచ్చియుండవలెను.

౧౯౨౬లో ఈ ప్రాంతమున శిథిలమయిన బౌద్ధస్తూపమునొద్ద నిలిచియున్న కొన్ని స్తంభాలమీద చెక్కియున్న మూడు ప్రాచీన బ్రాహ్మీ శాసనములు కనబడుటనుబట్టి ఈ స్థలము చాల ప్రాచీనమైనదయి యుండునని యూహించి పురాతత్వశాఖవారు ఇచట పరిశోధనలారంభించినారు. మొట్టమొదట ఈ ప్రాంతమున ఇట్టి పరిశోధనలు జరపినవారు యమ్. హామీద్ ఖురైషి అనువారు. వారు అక్కడ ఒకటి రెండువారములు మాత్రమే ఉండి పరిశోధనలు జరపినను వాటికి ఫలితముగ గల ప్రాచీనశాసనములును, రెండు శిథిలాలయములును, అనేకములు 'అమూల్య' శిల్పచిత్రములును బయలుపడినవి. వాటినిబట్టి ఇది ప్రాచీనబౌద్ధ అధినివేశమని, బౌద్ధకళానిధానమని తేటపడినది.

ఇక్కడ బయలుపడిన శాసనములును, ౧౮౮౨ లో జగ్గయ్యపేటలో దొరకిన ప్రాచీన బ్రాహ్మీశాసనములునుకూడ ఇక్ష్వాకు వంశమువారు వేయించినవి. వాటినిబట్టి క్రీస్తుశకము మూడునాలుగు శతాబ్దులలో కృష్ణానదీప్రాంతాన ఇక్ష్వాకువంశజుల మని చెప్పుకొన్నవారు పరిపాలించుచుండిరని తెలియుచున్నది. ఈ శాసనముల ననుసరించియే యిచ్చటి మహాచైత్యమున బుద్ధధాతువు నిక్షిప్తమయినట్లు స్పష్టమయినది. దేశమరాజకము పాలయినకాలమున ఇచ్చటి మహాస్తూపమును, దానికి సంబంధించియున్న చిన్నస్తూపములును—నిధినిక్షేపములు వెదకువారివలననో మరియెవరివలననో — నాశనముచేయబడినవి. అందువలన నింతవరకు స్తూపవేదికలుమాత్రమే నిలిచియున్నవి. వాని పైభాగములెల్ల నశించిపోయినవి.

సపరివారముగ శంకరాచార్యులవారు ఇక్కడికి వచ్చి బౌద్ధులను తరిమివేసిరనియు, వారి నిర్మాణములను భగ్నముచేసిరనియు ప్రతీతి కాని యది యెంతవరకు నిజమో తెలియదు. కాని ఆలోయలో ఈబౌద్ధనిర్మాణశిథిలావశేషములు కాన్పించిన మాగాణిభూమి యంతయు ప్రాచీనకాలమున శంకరాచార్యమఠమున కిచ్చినదానమని తెలియుచున్నది. ఇప్పటికి నది తన్మఠాధిపతులకే చెందియున్నది. వారి యనుమతితోనే ఇక్కడ పురాతత్వపరిశోధకశాఖవారు త్రవ్వపని జరపియున్నారు.

ఇక్కడ నల్లరాళ్లబోడు కొండమీద నున్న ఆలయము చప్టామీది శాసనమువలన సింహళద్వీపమునుండి బౌద్ధభిక్షువులు వచ్చి యాకొండమీద నివసించుచుండినట్లును, వారచట నొకస్తూపమును, సంఘారామమును నిర్మించినట్లును, పడమటిదిశపారుపన విజయపురి అను పట్టణముండినట్లును తెలియుచున్నది. నల్లరాళ్లబోడుకు దగ్గరగా చాల చిన్నకొండ లున్నవి. వాటి శిఖరాలమీద చిన్నస్తూపాల శిథిలాలు చూపట్టును. మహాస్తూపమునకు తరువాత ముఖ్యమయిన నిర్మాణములన్నియు నల్లరాళ్లబోడుమీదనే యున్నవి. దీనిమీద త్రవ్వగా రెండుస్తూపములు, ఒక యాలయము, సున్నము ఇటికతో కట్టిన సంఘారామములు, దానికి సంబంధించిన గృహములు ఉన్నవి. ఈ నల్లరాళ్లబోడే 'శ్రీపర్వత'మను పేర వ్యవహృతమయినట్లు శాసనములవలన తెలియుచున్నది. శ్రీపర్వత సంఘారామమునసే మహాయానబౌద్ధసంస్థాపకుడయిన నాగార్జునాచార్యులవారు తమ చరమదశ గడపినట్లు టిబెత్తు బౌద్ధగ్రంథములవలన తెలియుచున్నది. ఇచ్చట బుద్ధధాతువు నిక్షిప్తమయి, యిది పవిత్రక్షేత్రమగుటచేతను నాగార్జునాచార్యులవారి కిది నివాసస్థల మగుటచేతను దూరదేశములయం దుండినట్టియు, ద్వీపములయం దుండినట్టియు బౌద్ధులకు గొప్ప యాత్రాస్థల మయ్యెనని యూహింపదగియున్నది.

నాగార్జునునికొండస్తూపము ఇటికతోను, సున్నముతోను కట్టిన ఒక మహానిర్మాణము. శాసనములం దిది 'మహాచైత్య'మను పేర బరగుచున్నది. అండాకృతిగల స్తూపభాగము అయిదడుగులయెత్తును, ౧౦౨ అడుగుల వ్యాసమునుగల గుండ్రని వేదికమీద నిర్మితమయినది. నాశనముకాగా ఇప్పటికి మిగిలియున్నదెల్ల ఈవేదికయే. ఈ వేదికచుట్టు ప్రదక్షిణము చేయుటకు పదుమూడడుగుల వెడల్పుగల ప్రదక్షిణపథమున్నది. దీనినిచుట్టి ప్రాయికముగ అయిదడుగులయెత్తుగల యిటికగోడ - ప్రాకారము - కలదు. ఈ ప్రాకారరేఖలో నాలుగువైపుల ఒక్కొకటి పదునాలుగడుగుల వెడల్పుగల నాలుగుద్వారము లున్నవి. వీటి పునాదులుమాత్రమే ఇపుడు మిగిలియుండుటచేత ఇవి యెట్లుండెడివో తెలిసికొన సాధ్యముకాదు. మొత్తముమీద ఈ నిర్మాణము బౌద్ధుల ధర్మచక్రము నమూనా ననుసరించి కట్టబడినట్లు తోచుచున్నది. ప్రాకారరేఖ చక్రము; ప్రదక్షిణమార్గము ఆకులు; వర్తులవేదిక చక్రపు నడిగుబ్బ.

ఈ స్తూపముత్తరభాగమున త్రవ్వగా పగిలిపోయిన ఒక కుండలో బుద్ధధాతువు కనిపించినది. ఇది బుద్ధునిదేయని తలంచుచున్నారు; ఇది బటాణిగింజంత పరిమాణముగల యొక చిన్న యెముకముక్క. దీనిని ముప్పాతిక అంగుళము వ్యాసముగల ఒక బంగారు బరిణెలో పెట్టి మరల నాబరిణెను బంగారు పువ్వులు, ముత్యములు మొదలైనవానితో గలిపి ౨ ౧/౨ అంగుళముల యెత్తుగల స్తూపాకారముననున్న ఒక రజతకరండమున నుంచి పదిలపరిచినారు. ఈరజతకరండమును మరల ఒక కుండలో నుంచి, దానికి దెబ్బ తగలకుండునట్లు కుండనిండ ఎర్రమట్టి పోసి, గట్టిచేసి, దానిమీద మూతిదగ్గర స్ఫటికపు పూసలను గ్రుచ్చినారు. ఈవిధముగ భద్రపఱిచినను కుండయు, రజతకరండమును భగ్నమయినవి. కొంతకాలముక్రిందట, పూర్వము మృగదావము విలసిల్లిన సారనాథక్షేత్రమున బౌద్ధులు 'మూలగంధకుటీవిహారము' నిర్మించిన సందర్భమున అచ్చటి బౌద్ధభిక్షుసంఘమునకు హిందూ

దేశపు గవర్నమెంటు పురాతత్వశాఖవారు ఈనాగార్జునినికొండ మహాచైత్యమున దొరకిన బుద్ధధాతువును దానముచేసినారు. ఈవిధమున ఇప్పటికి రమారమి పదునారువందల సంవత్సరములకు పూర్వమే ఇక్ష్వాకుభూపతుల రాజ్యకాలమున ఇచ్చటి మహాచైత్యమున నిక్షిప్తమయిన బుద్ధభగవానుని ధాతుశకలము నేటికిని సార్నాథ్ మూలగంధకుటీవిహారమున పదిలముగ నున్నది.

౧౯౩౭-౩౮, ౧౯౩౮-౩౯ సంవత్సరములలో ఈ ప్రాంతమున జరిగిన త్రవ్వపనివలన మూడు సంఘారామములును, ఆరు బౌద్ధాలయములును, అనేకములు స్తూపములును బయలుపడినవి. బౌద్ధభిక్షువులు వసించు ప్రదేశమును సంఘారామ మందురు. సంఘారామములు మూటిలో రెండు నల్లరాళ్లబోడుమీదనున్నవి; మూడవది నల్లరాళ్లబోడుకు పడుమటగా దాదాపు మైలుదూరమున నదికెదురుగ నున్న కొండమీద నున్నది.

ఇచ్చటి స్తూపముల నన్నిటిని ఇటికలతో కట్టినారు. వాటి ముందుభాగమున వివిధములయిన శిల్పచిత్రములు చెక్కిన శిలాఫలకములనుపేర్చి సున్నముతో అతికినారు. సుందరములయిన ఇట్టి శిల్పఫలకములు వందకుపైగా దొరకినవి. ఈ ఫలకములమీది శిల్పకళ యంతయు ఇదివరలో చెప్పినట్లు అమరావతీసంప్రదాయము ననుసరించినదే. ఇట్టి శిల్పఫలకములేకాక గొప్ప చెక్కడపుపనితో ముద్దుగ మూటగట్టు శిలాస్తంభములు మొదలయినవి కూడ కొన్ని దొరకినవి. ఈ శిల్పసంపదనంతను అచ్చటనే యుంచి, దానిని భద్రపరుచుటకొక చిత్రవస్తుప్రదర్శనశాలను గట్టుచున్నారు.

పురాతత్వశాఖవారు ఈ శిల్పకృతులను ఎంతగ భద్రపరుచుచున్నను — [illegible]డనో మారుమూలప్రదేశమున నుండుటచేత వీనిలో కొన్నికొన్ని శిల్పఫలకములు పోవుచున్నవి. ఈఫలకములమీది శిల్పచిత్రముల సౌందర్యమును గ్రహింపగల అభిరుచి మనలో సన్నగిలుటవలనను, ఈ శిల్పముల విలువను మనము గ్రహింపజాలక పోవుటవలనను ఈ శిల్పకృతులను గొన్నిటిని మనము ఇదివరకే గోల్పోయినాము. విదేశములనుండి హిందూదేశకళాసంపదను జూడవచ్చు యూరోపియనులు, అమెరికనులు మొదలగువారిలో, వీటిలో నొకటియైన నెట్లయినను సంగ్రహించుకొని పోవలెనని యత్నించువారును కొందఱు గలరు. ఈకారణముననే ఈ నాగార్జుననికొండ శిల్పములను గురించికాని, కళనుగురించికాని ఇంకను ఇచ్చట సరిగా ప్రకటన కాకపోయినను ఇచ్చటి శిల్పకృతులు కొన్ని అప్పుడే — ఎన్ని కట్టుదిట్టములు చేసినను, ఎంత భద్రముగ కావలియుంచినను — ఫ్రాన్సుదేశమునందలి పారిస్‌నగరము మ్యూజియమునకును, కొన్ని అమెరికా మ్యూజియములకును తరలిపోయినవి. ఇది చాల విచారకరమయిన విషయము. ఇట్టి శిల్పసంపద తమకు లేదని వగచి యూరోపియనులును, అమెరికనులును ఒక్కొక్క శిల్ప ఫలకమును వందలకొలది ధనము పోసి రహస్యముగ కొనుక్కొని పోవుచుండ అట్టిది పుష్కలముగ నున్న మనము దానివిలువను తెలిసికొనలేక ఆ నిక్షేపమును చేతులార జారవిడుచుకొనుచున్నాము. పురాతత్వశాఖవారు ఎన్ని కట్టుదిట్టములు చేసినను దేశీయులయిన ఆంధ్రులకు వీటిని గట్టిగా భద్రము చేసికోవలెనను దీక్ష, తపన లేకపోయినచో కార్యములేదు. అందువలన ఆంధ్రు లెవరికివారే ఈ కళానిధానమును సంరక్షించుకొనదీక్ష వహించవలెను; ఒక్క శిల్పకృతిపోయినను ఒక పెన్నిధానము పోయినట్లు భావింపవలెను. ముఖ్యముగా ఈ నాగార్జునునికొండ శిల్పకళానిధానములను గాపాడుభారము ఆ పరిసరములనున్న గ్రామవాసులది. ఏశిల్పఖండమయిన పోయినచో వెంటనే తగుచర్య తీసికొనవలెను. ఇచ్చట బయలుపడిన శిలాఫలకములమీది చిత్రములు ఎంత అందమయినవో ఇందు ప్రకటితమయిన చిత్రముల ననుసరించి తెలిసికొనవచ్చును.

ఇందు ప్రకటించిన చిత్రము లన్నియు నాగార్జుననికొండ స్తూపములకు సంబంధించిన శిలాఫలకములమీద చెక్కినవే.

సాధారణముగ స్తూపపురాలమీద చెక్కుచిత్రములు బుద్ధుని జీవితమునకుసంబంధించిన గాథలో, బుద్ధుని పూర్వజన్మములకు సంబంధించినగాథలో అయియుండును. బుద్ధుని పూర్వజన్మములకు సంబంధించిన గాథలనే జాతకకథ లందురు. ఇందు ప్రకటితము లగుచున్న చిత్రము లన్నియుమాత్రము బుద్ధుని జీవితమునకు సంబంధించినవే.

అమరావతీ, నాగార్జుననికొండ స్తూపపు కళ ననుసరించియే జావా(యవద్వీపము) యందలి జగత్ప్రసిద్ధమయిన బోరోబొడోరు స్తూపపుకళను తీర్చినారని కళాభిజ్ఞులు చెప్పుదురు. అమరావతీ, నాగార్జుననికొండ స్తూపములయందలి బౌద్ధకళప్రాబల్య మొక్క బర్మా,జావా మొదలయిన ప్రదేశములయందలి కళమీదనేకాక చీనాదేశపుకళమీదకూడ నుండినట్లు ఈక్రిందిపంక్తులవలన తెలియుచున్నది.

"If we turn to the sculptures from Nagarjunikonda we may observe in them essential features of style and composition which correspond to those pointed out in the reliefs from Nan-Hsiang T'ang. The Nagarjunikonda relief is composed in a similar fashion, though with greater freedom and far more movement in the figures. It is particularly interesting to us as an example of South India Sculpture of the third or fourth century presumably exercised decisive influence on the Buddhist art of Funan, from where it may have been transmitted to China in a some what modified form"

ఈపై పంక్తుల ననుసరించి బౌద్ధయుగమునాటి ఆంధ్రకళ ప్రాగ్దేశకళ కెట్టి విశిష్టత కలిగించినవో, దీని ప్రాబల్య మెంతవరకు ప్రాకినదో సుకరముగా గ్రహింపవచ్చును.

[పై నాగార్జుననికొండ వివరణము గవర్నమెంటు పురాతత్వ శాఖవారి నివేదిక ననుసరించి.]

# చిత్రముల వివరణము

[ ఆర్కియొలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, డైరెక్టరు జనరలుగారు ఈ నాగార్జునుని కొండ స్తూపపు ఛాయాచిత్రముల నిచ్చి వాటిని ప్రకటింప దయతో అనుమతి యొసంగినందులకు కృతజ్ఞులము. ఇందు ప్రకటితములయిన నాగార్జునుని కొండ చిత్రములకు మాతృకలు వారిచ్చిన ఛాయాచిత్రములే.]




౧. స్వప్నఫలకథనగాథ

**మొదటి చిత్రము :**

శుద్ధోదనుడు కపిలవస్తునగరము రాజధానిగా శాక్యరాజ్యము నేలుచుండినరాజు. అతని భార్య మాయాదేవి ఒకనాటిరాత్రి భవిష్యద్బుద్ధుడు—ఇతనిని బౌద్ధులు బోధిసత్త్వుడందురు—ఒక తెల్లని యేనుగరూపమున దనగర్భమున బ్రవేశించినట్లు ఒకకల గనును. మరునాడుదయమున ఆమె తనభర్తకు స్వప్నవృత్తాంతము నెరిగించి దానిఫలము నెఱుంగగోరును. శుద్ధోదనుడు స్వప్నఫలాదులను జెప్పగల శాస్త్రజ్ఞులను పిలువనంపించును. వారు వచ్చి మాయాదేవి గర్భము దాల్చెననియు, ఆమెకు మహారాజాధిరాజో, జగద్వ్యసననివారణకారణుడయిన బుద్ధుడో యుదయించు ననియు జోస్యము చెప్పుదురు. శుద్ధోదను డిది విని చాల సంతోషమునొంది వచ్చినవారిని జాంబూనదాంబరాభరణాదు లిచ్చి సత్కరించి వారికి విందుచేయును. ఈ విషయమును దెలుపునది ఈచిత్రము.

ఎడమవైపున సింహాసనాసీనుడయినవాడు శుద్ధోదనుడు. అతనికి చేరువ నున్న తాసనమున గూర్చున్న యువతి మాయాదేవి. ముగ్గురు జ్యోతిష్కులు విందునడువ గూర్చుండియున్నారు. అర్ఘ్యపాద్యాదు లిచ్చుచున్నవాడొక పరిచారకుడు; వెనుక నిలబడ్డవారును, శుద్ధోదనుని పాదసమీపమున గూర్చున్నదియు —పరిచారికా జనము.

**రెండవ చిత్రము :**

మాసప్రాప్తి కావచ్చినయంతట మాయాదేవి దేవదహమను గ్రామమునందలి తనపుట్టినింటికి బయలుదేరును. త్రోవలో కపిలవస్తునగరమునకు సమీపముననున్న లుంబినీవనమున ఆమె యించుక విహరింపగోరును. అందామె యొకప్లక్షవృక్షముక్రిందికి బోయి దాని కొమ్మ నొకదానిని పట్టుకొనియుండగా నొప్పులు ప్రారంభమయి ఆమె శీఘ్రముగనే ఒక మగబిడ్డను కనును. ఈశిశువే బుద్ధుడు—ప్రపంచ పరివ్యాప్తమయిన మహామతమునకు స్థాపకుడు. వెంటనే లోకపాలురు వచ్చి యాబిడ్డను పొత్తిళ్లలో నిడుకొని లాలింతురు. ఇది తెలుపునదే యీచిత్రము.



౩. బుద్ధుని జననము

చెట్టుకొమ్మ పట్టుకొని నిలుచున్నది మహామాయ. ఆమెకు వింజామర వేయుచున్నది చెలికత్తె. కుడిపైపున నిలబడిన నలుగురు లోకపాలకులు. వారు పట్టుకొన్నది పొత్తిలిగుడ్డ. అందే శిశువు ఉన్నట్లు భావన.

మొట్టమొదట బౌద్ధశిల్పులు బుద్ధుని చిత్రించువారు కారు. సర్వమునకు అతీతుడేయిన బుద్ధుని చిత్రించుట ఎట్లని, అతనిని చిత్రింపవలసివచ్చినచోట నాస్థలమును ఖాళీగ నుంచువారు; కాని కాలము గడచినకొలది ఈ శిల్పిసమయము మారినది. శిల్పులు బుద్ధుని యాకారమును చిత్రింపజొచ్చిరి. ఆశిల్పసమయము మారుచున్న కాలమున చిత్రించిన చిత్రములివి. పట్టిపొత్తిలి శిశువుగ నుండిన బుద్ధునికి సూచనగ గ్రహింపవలెను. ఒకరమణి యా పొత్తిలికి నమస్కరించుచుండుటవలన గూడ ఈ బుద్ధభావము ద్యోతక మగుచున్నది.

## మూడవ చిత్రము :

బుద్ధుడు జనించినప్పుడు అనేకములయిన వింతలు పొడచూపినవి. ఈ వింతలను కనుగొన్నవాడు అసితు డనుమహాముని. అసితుడు హిమవత్పర్వతసీమను దపమాచరించుచుండగా ఈ వింతలను జూచి, దీనికి కారణము బుద్ధజననమేయని తన దివ్యదృష్టిని దెలిసికొని ఆదివ్యశిశుసందర్శనార్థము అంతరిక్షమునుండి ఎగిరి కపిలవస్తు నగరమునకు వచ్చెను. వచ్చి శుద్ధోదనుని సందర్శించి యాశిశువును జూపవేడెను. అంతఃపురమునుండి శిశువును గొనివచ్చి అసితునికి జూపుదురు. ఆశిశువుచేత అసితునికి మ్రొక్కింపకపూర్వమే యతడాశిశువునకు ప్రణమిల్లి కన్నీరువిడుచును. శుద్ధోదనుడు అందులకు కళవళమంది, శిశువు అల్పాయుష్కుడనియా, లేక మరేకారణమున కన్నుల తడి పెట్టుకొనుచుంటిరని అసితు నడుగగా అతడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను : "మహారాజా! ఈశిశువు కొరకుకాదు నేను విచారించుట; నాకొరకే. ఈ శిశువు బుద్ధుడై జగద్వ్యసననివారకుడు కాగలడు. నేనిప్పటికే కడువృద్ధుడనైనాను. బుద్ధుడైన యీ లోకోత్తర పురుషుని ధర్మబోధ వినుటకు నేను బ్రతికియుండనుగదా యని విచారించుచున్నాను."

తరువాత, మ్రొక్కులు చెల్లింప నాశిశువును శుద్ధోదనాదులు తమ యిష్టదేవతు నాలయమునకు గొనిపోవుదురు. ఆలయములోపల ప్రవేశించి శిశువును తమ యిష్టదేవతకు చూపినవెంటనే ఆ విగ్రహము చైతన్యముకలదై ఆ శిశువునకు నమస్కరించును.

పైని పేర్కొనినవిషయము లీ చిత్రమున చిత్రింపబడినవి. చిత్రమునందలి కుడిపైపు అర్థభాగమున మొదటిగాథయు, ఎడమపైపు అర్థభాగమున రెండవగాథయు చిత్రితములయినవి. కుడిపైపుచిత్రమున దిసువయాల గూర్చున్నవాడు అసితుడు. అతనిని ప్రశ్నించుచు సింహాసనముమీద గూర్చున్నవాడు శుద్ధో




౩. అసిత దేవాలయ గాథలు



౪. మహాభినిష్క్రమణము

దనుడు. అంతఃపురమునుండి శిశువును పాత్రిల్లో గొనివచ్చి చూపుచున్నారు. ఆపాత్రిలియే శిశువునకు (బుద్ధునికి) సంకేతము. ఆపాత్రిలియందలి శిశువునకు నమస్కరించుచున్నది ఒకగరిత. శుద్ధోదనాదులకు వెనుకనున్నవారు పరిజనము.

ఎడమవైపు చిత్రమున ఒకస్త్రీ దేవతావిగ్రహమునకు పాత్రిట నిడికొని బుద్ధుని చూపుచున్నది. ఆశిశువు దివ్యాంశ స్ఫురించుటకై ఉభయపార్శ్వముల నిరువురు స్త్రీలు వింజామరలు వేయుచున్నారు. పీఠము ముందు ఒకస్త్రీ తన అభీష్టార్థసిద్ధికొరకు ప్రణమిల్లుటవలన అది దేవతాపీఠమని; ఆపీఠము మీఁది విగ్రహము దేవతయని విదితమగుచున్నది. ఆ దేవతా విగ్రహమున కెగువ మూలగ చిత్రించిన హర్మ్యభాగమువలనను, దానికి ప్రక్కగ బారిసంకులు ఊదుచున్నట్టియు, మద్దెల వాయించునట్టియు వారివలనను అది యాలయమన్న విషయము స్ఫురించును. పీఠముమీఁదనుండి ఇంచుక ముందునకొరిగి చేతులు జోడించుకొని నమస్కరించుచున్నవాడు శాక్యులయిష్టదైవము.

## నాలుగవ చిత్రము :

ఇది మహాభినిష్క్రమణగాథను దెలుపు చిత్రము. శుద్ధోదనుడు ఆశిశువునకు సర్వార్థసిద్ధుఁడని నామకరణము చేయును. ఇతఁడు బాలచంద్రునివలె దినదిన ప్రవర్ధమానుఁడై యుక్తవయస్సున క్షత్రియోచితవిద్యలందు బరిపూర్ణుఁడయి పదునారవయేట యశోధరయను రాజకన్యకను బరిణయమగును. శాస్త్రజ్ఞులు చెప్పిన జోస్యమును దలంచుకొని శుద్ధోదనుడు తనతనయుఁ డెక్కడ సర్వసంగపరిత్యాగము కావించి బుద్ధుడగునోయని భయపడి యతనికి ప్రపంచదుఃఖ మేమియు దెలియకుండునట్లు సర్వభోగములను ఏర్పాటు కావించి యతనిని భోగపరతంత్రుని జేయ బ్రయత్నించును; కాని దైవవశమున సర్వార్థసిద్ధునికంటబడిన నాలుగు దృశ్యములవలన — మొదట నొకవృద్ధుఁడు, పిదప ఒకవ్యాధిగ్రస్తుడు, అటువెనుక నొకశవము, పిదప నొకసన్యాసి — అతనిజీవితదృక్పథము మారి, సర్వసంగపరిత్యాగముచేసి అతఁడు సన్యాసము స్వీకరింపగోరును.

తనయుని తలంపు సడి కనుగొన్న శుద్ధోదనుడు పురద్వారమును మూయించి కట్టుదిట్టము లెక్కువ చేయును. సర్వార్థసిద్ధుడు సర్వసంగపరిత్యాగముచేసి కపిలవస్తునగరము నుండి అర్ధరాత్రమున అశ్వారూఢుఁడై బయలుదేరి పోవుచుండ ఒకదేవత వచ్చి మూసియుంచిన పురద్వారములను తెరచియుంచును. సురక్ష




౫. మారధర్షణము



౬. మారధర్షణము

డెక్కలచప్పుడువిని కావలిభటులు మేల్కొం దురని యక్షులు వచ్చి సర్వార్థసిద్ధు డెక్కిన గుఱ్ఱము డెక్కలను చేతితో బట్టుకొందురు.

సర్వార్థసిద్ధుని యీపురనిర్గమనమునే బౌద్ధులు మహాభినిష్క్రమణ మందురు ఈవస్తువే యిం దు చిత్రింపబడినది.

గుఱ్ఱముమీద నున్నవాడు సర్వార్థసిద్ధుడు. ఆత డెక్కిన గుఱ్ఱము పేరు కంటకము. గుఱ్ఱ ముయందు అంగీతొడిగికొని పోవువాడు



౭. ధర్మచక్రారాధనము

సర్వార్థసిద్ధుని సారథి చండకుడు. అతనికి నమస్కరించువారు, వింజామరలు వేయువారు దేవగణములవారు.

### అయిదవ,-ఆరవ చిత్రములు :

ఇవి మారధర్షణగాథను దెలుపు చిత్రములు. మారుడు బౌద్ధులకు శనివంటివాడు. దుష్టుడు. సజ్జనులను దుష్పథమున ద్రోయుటయే యతని వృత్తి. అతడు మూర్తీభవించిన దుర్గుణపుంజము. సర్వార్థసిద్ధుడు బోధివృక్షముక్రింద నాసీనుడయి 'జగత్తునందలి దుఃఖమును నివారించు టెట్లు? సత్యపథ మేది' యని దానిని తెలిసికొన దీక్షవహించి ధ్యానయోగ ముద్రాంకితుడయి యున్నతరి, మారుడు అప్సరసలయిన తనపుత్రికలను ఆటపాటలచేతను, ఏనుగపై నెక్కి వచ్చినవాడు మారుడు. బోధివృక్షముక్రింద గూర్చుండి తపముచేయుచున్నవాడు సన్యాసము స్వీకరించిన సర్వార్థసిద్ధుడు. ఎడమవైపున ఏనుగప్రక్కనున్న స్త్రీలు మారునితనయలు. మారుడు కోపముతోను, చికాకుతోను బుద్ధునిమీద కుంతాయుధమును విసరివైచుచున్నాడు. చేసిన తన ప్రయత్నమంతయు వ్యర్థమగుటచే చిత్రమున కుడివైపుభాగమున ఏనుగనెక్కి సర్వార్థసిద్ధునికి నమస్కరించుచు మరలిపోవుచున్నట్లు చూపబడినాడు. మిగిలినజనము మారుని పరివారము.

రెండవచిత్రమున మారునిపుత్రికలు తమ నృత్తగానవిద్యలను ప్రదర్శించి బుద్ధుని తపస్సుకు భంగముకలిగింప బ్రయత్నించుచున్నా



౮. స్తూపారాధనము

విలాసములచేతను అతనితపస్సుకు భంగము కలిగించి అతని పూనికనుండి మరలింప బంపును. కాని వారు విఫలప్రయత్నలగుదురు. పిదప మారుడు తన దుష్టపరివారముతోపోయి యాతనిపై బాణములువేసియు, కుంతములు వైచియు నానావిధముల నాతనిని హింసించును. తుదకు తన ప్రయత్నమంతయు వ్యర్థమయిన పిదప నతడు తన పరివారముతో మరలిపోవును. ఈ గాథయే ఈ రెండు చిత్రములందును చిత్రితమయినది.

రు. మిగిలినవారు మారుని పరివారములోనివారు.

### ఏడవ చిత్రము :

ధర్మచక్రారాధనము. సర్వార్థసిద్ధుడు జగద్వ్యసనరహస్యమును దెలిసికొని 'బోధి'త్వము నొంది బుద్ధుడయ్యెను. ఇతడు తనధర్మమును మొదటిమారు వారణాసిప్రక్క గంగాతీరమునగల మృగదావమున కరిగి యచ్చట బోధించెను. బౌద్ధశిల్పకళలో బుద్ధుడు మొదటిమారు బోధించిన యీ మతబోధకు 'ధర్మచక్రము' సాంకేతికమయినది. బుద్ధుని మొదటి బోధతో ధర్మచక్రము తిరుగుటకారంభించినది. దీనికి 'ధర్మచక్రప్రవర్తన' మని బౌద్ధుల వ్యవహారము. శిల్పమున బుద్ధుడుచేసిన యీ మొదటిమతబోధను, బుద్ధధర్మమును దెలుపుటకు 'ధర్మచక్రము'ను చిత్రించుచుందురు.

బౌద్ధమతావలంబులయిన యుపాసకులు (సర్వసంగపరిత్యాగము చేయకయే బుద్ధధర్మము నవలంబించువారు) ధర్మచక్రము నారాధించుచున్నారు. ధర్మచక్రపీఠమునకు దిగువ నుభయపార్శ్వములను, చిత్రింపబడిన మృగములు మృగదావమును, ధర్మచక్రప్రవర్తన గాథను జ్ఞప్తికి దెచ్చును.

### ఎనిమిదవ చిత్రము :

బౌద్ధకళయందు స్తూపము బుద్ధుడు నిర్వాణము నొందెననుటకు సాంకేతికము; అనగా బుద్ధధాతువు లాస్తూపాంతర్భాగమున నిక్షిప్తములై యున్నవని భావము. ఉపాసకులు స్తూపము నారాధించుచున్నారు.

మరొక్కవిషయము : బుద్ధుని జీవితగాథలను చిత్రించుటలో శిల్పి నడుమ వినోదము



౯. నాగార్జునునికొండ స్తూపపుఆకృతి

కొరకు స్త్రీ పురుషుల జంటలను, నాగరాజు నాగకన్యకల చిత్రములను చెక్కుచు వచ్చినారు. వాటికిని బుద్ధుని జీవితగాథలకును ఏమాత్రము సంబంధము లేదనియు, అవి కేవలము వినోదముకొరకే యనియు జ్ఞాపకముంచుకొనవదగును.

# 'తెనుఁగు తెలివికై - తెనుఁగు కలిమికై'

కవికొండల వేంకటరావు

తెనుఁగుతెలివికై - తెనుఁగుకలిమికై
పట్టినపట్టు విడిచిపెట్టకుర!
పుట్టిన దిచ్చట
మెట్టే దిచ్చట
మట్టైతే మన
నాగావళికిన్
తుంగభద్రకున్
మధ్యనుగల్ల
అమరలోకమున!

తెనుఁగుతెలివికై - తెనుఁగుకలిమికై
పట్టినపట్టు విడిచిపెట్టకుర!
గోదావరియున్
కృష్ణా గయున్
కవలకన్నెలై
కడలిఁ దరించే
అంజ గొలువరా!
జడిమ నుడుగరా!

తెనుఁగుతెలివికై - తెనుఁగుకలిమికై
పట్టినపట్టు విడిచిపెట్టకుర!
సింహాచలసీమాంబుధారలు
వేంకటాద్రిరమణీయదృశ్యములు
రోమాంచముగా
మేల్కాంచుమురా!

తెనుఁగుతెలివికై - తెనుఁగుకలిమికై
పట్టినపట్టు విడిచిపెట్టకుర!
చెన్నపట్టముతో సరిపెట్టకుర!
తంజాపూరూ మునుపుమనదేరా!
శ్రీకాకుళము సిగబంతిగను
నాట్యంబాడే తెనుఁగుతల్లి తెలి
మంజీరధ్వని తిరుమలనాయక
మందిరంబులో సందడింపవలె!

తెనుఁగుతెలివికై - తెనుఁగుకలిమికై
పట్టినపట్టు విడిచిపెట్టకుర!



పెనుకొండయందు పూజాపురస్కారములు లేక పాడుపడిన ఒక దేవళము

# చిట్టితల్లి నృత్యము

కొండేపూడి సుబ్బరావు

సంజకాంతులు పోయి చలువవెన్నెల మిగిలె
వలపుమంటల దరిసి వాసంతములు రగిలె
సౌందర్యతృష్ణతో సకియహృదయము విరిసె
కినరాని కనలేని కాంతిప్రకృతి మెఱసె.

తళుకువెన్నెలలోన మలయానిలములోన
ప్రసవగంధములోన మధుమాససుధలలో
తొలివలపువేడిపొంగులలోన పులకించి
పరవశత నాట్యమ్ము నెఱపినది యాబాల.

చిన్నారి చిట్టి లేకన్నెవలపుల మొగ్గ
ఆ యరణ్యముమధ్య నాటపాటల నెఱప
పూవుకన్నుల విచ్చి తాపగాలుల మెచ్చి
ప్రకృతియె మనసిచ్చి ఫక్కునా నవ్వినది.

ఆవసంతుని తోట నావెన్నెలలపీట,
ఆ తెమ్మెరలబాట నా తావిపెల్లులనాట
చిట్టితల్లీ పాట చిట్టితల్లీయాట
లమృతమ్ము చిలికించె నానందములు నించె.

తెలినిగ్గుపాలబుగ్గలమీద సుడివడగ
నాడు పిల్లల జూచి హసియించుతల్లివలె
చిట్టితల్లీఆట సిరులు కనుగొని అడవి
వాసంతకుసుమదరహాసముల సోలినది.

చిట్టితల్లీపాడ చిట్టితల్లీయాడ
అడవితల్లికి నెంత యానందమో కాని
కుసుమపత్రము లెల్ల కోటికన్నులు కాగ
రెప్పవాల్చక బాలనృత్యమ్ము చూచినది.

అలరువాసన విరియు నామనుల నేలలో
మిసిమివెన్నెల కురియు నిసుకపడకలమీద
తెలుగునది చిరునవ్వు నురువురాల్చెడిచోట
ఆ బాల నవ్యనృత్యశ్రీలు చెలువలరె.

రేరాణి తనకన్ను రెప్పవాల్చనిచోట
ఒదిగి పిట్టలు గూళ్ల నిదురజెందనిచోట
ముడుచుకొను లేమొగ్గ విడిచినవ్వెడుచోట
ఆ బాల నవ్యనృత్యశ్రీలు చెలువలరె.

చలువవెన్నెల సోనలు జాలువారెడి నేల
కమ్మతెమ్మెరకన్నె కదలమానిన సీమ
పూవురేకుల తీయ తావు లెగసిన బయల
ఆ బాల నవ్యనృత్యశ్రీలు చెలువలరె.

చలిరాజు ఛూపువెన్నెలలు ప్రాకెడునడవి
ననబోడితీయందనాలు రేగెడుత్రోవ
పడుచుటామని వలపు పరిమళించెడు వనుల
ఆ బాల నవ్యనృత్యశ్రీలు చెలువలరె.

పుడమిపై ఆమనిగ పుష్పసౌదామనిగ
చెట్టుతుదియాకుగా చిరుపూవురేకుగా
వనితతొలివలపులో నునులేతతలపుగా
నటియించె చిట్టి నవనాట్యమధురిమ లెగయ.

---

* "చిట్టితల్లి" పూర్వంపు తెలుగురాజు కూతురు. మానవులు నిర్మించుకున్న కృత్రిమ జీవితములో ఆమెకు సౌఖ్యము లేకపోయినది. అందుననే, ప్రకృతిసౌందర్య రామణీయకతలు పల్లివిరిసే అడవిలోనే చిట్టితల్లి ఆడుతూ, పాడుతూ ఉండేది. సంగీత నృత్యములు చిట్టితల్లి చిన్ననాడే అభ్యసించినది. సౌందర్యపూజ ఆమె బ్రతుకుబాట కళారాధన నిత్యకృత్యము. ఇది చిట్టితల్లి పూర్వకథ. ఒకనాటి పండువెన్నెల్లో వసంతము పరిమళము చిమ్మే అడవిదారులలో చిట్టితల్లి నృత్యముచేస్తుంది. ఇది ప్రస్తుతకథ. కావ్యంలో ఒకభాగం,

నిదురలో కలలుగా నదిలోని అలలుగా
పెదవిపైనవ్వుగా మృదులతను పువ్వుగా
మెలిదిరుగుపవనముగ తలలూపు వనముగా
నటియించె చిట్టి నవనాట్యమధురిమ లెగయ.

అందమున వ్రాలి ఆనందమున సోలుతూ
బరువుతో కదలి పెన్మరువుతో మెదలుతూ
రాసముల మలగి సువిలాసముల తొలగుతూ
నటియించె చిట్టి నవనాట్యమధురిమ లెగయ.

పైరగాలికి నాడి పడగెత్తు త్రాచువలె
నల్లిమబ్బుల జూచి నటియించునెమ్మివలె
చదలుపై నృత్యమ్ము సలుపుజాబిల్లివలె
నటియించె చిట్టి నవనాట్యమధురిమ లెగయ.

గోదావరీనదీకూలమ్ము లొరసికొని
తేలితూలెడు తరంగాలవలె నుప్పొంగి
తమ్మికొలకులలోని తరగవలె సుడిదిరిగి
నటియించె చిట్టి నవనాట్యమధురిమ లెగయ.

ఇంత యాడినగాని ఇంత పాడినగాని
పెదవిపై చిరునవ్వు చెదరిపోవకె వెలుగ
కనులలో చలువలే కరగిపోవక నిలువ
నటియించె చిట్టి నవనాట్యమధురిమ లెగయ.

ఆమెమధుగానముల కనుకూల మగురీతి
చలువకన్నుల వలపు తలపోత కనువుగా
తాళలయవర్ణముల్ తప్పకుండగనిల్చి
నటియించె చిట్టి నవనాట్యమధురిమ లెగయ.

హస్తచాలనరీతు లంద మెగజిమ్మగా
మృదుపాదగతవృత్తరేఖ సొంపులుమీర
ఒడలివంపుల పొలుపు లొయ్యారమొలుకగా
నటియించె చిట్టి నవనాట్యమధురిమ లెగయ.

కనులకాటుక రేక కరగిపోనేలేదు
వాలుజడలోపూలు వసివాడనేలేదు
చిగురుబుగ్గలకాంతి చెదరిపోనేలేదు
నటియించె చిట్టి నవనాట్యమధురిమ లెగయ.

ఏదివ్యభామినియొ ఏ రసస్నాతయో
మృదుగానలీలలో మధులాస్యతృష్ణలో
నవకళాస్నిగ్ధసౌందర్యజీవనమందు
ధన్యమై యొకదివ్యకన్య యైనది చిట్టి.
తన మధురజీవితమ్మునె కావ్యముగ పాడి
ఆ జీవితమ్మె నాట్యమ్ముగా నాడి ఆ
మూర్తిసుప్రేమభరముగ్ధమై జగమెల్ల
సత్కళాజీవముల వికసింపజేసినది.

ఆ కళాపూర్ణుడు, ఆ వెన్నెలల రాజు
వలపుపొంగుల నెదను పట్టజాలను లేక
ఆ సుధామధుమూర్తి నా కళాజీవికను
తనవెలుగుకౌగిళుల దాచికొని నవ్వికొనె.
వెన్నెలలచెఱగులో వెలుగుకౌగిలిలోన
క్రొంగ్రొత్తకళ నా కుసుమకోమలగాత్రి
వెలిగి నటియింప నీ విశ్వవిశ్వము గూడ
న జీవనములోన నటియించిన ట్లయ్యె.

ఆలమున ఘోరకరవాలమ్మువలె మెఱసి
తళుకు లీనెడు నల్లత్రాచువలె నాడుచును
సోగగా సాగు నాజూకువాంఛ కదల
నటియించె చిట్టి నవనాట్యమధురిమ లెగయ.

చిత్రకారుడు ప్రేమ చిగురించుచిత్తమున
పసిడికుంచియతోడ వ్రాయు రేఖాచిత్ర
నాట్యసుందరివోలె నవనవోన్మేషమున
నటియించె చిట్టి నవనాట్యమధురిమ లెగయ.

ఆర్యవిజ్ఞానమధురామృత మ్మొలుకంగ
భరతనృత్యోత్సవప్రాభవమ్ము చెలంగ
హైందవామలకళాసౌందర్యములు పొంగ
నటియించె చిట్టి నవనాట్యమధురిమ లెగయ.

చిట్టితల్లీ మృదుశ్రీగానమధురిమలు,
ఆ బాలనవ్యనృత్యశ్రీలు-సంతతము
విరిసంజ త్రోవలనె మెఱసిపోవు నటించు
కలరుతమ్ములు మ్రోసి తొలికోయిలలుకూసె.

చిట్టితల్లీ! మృదుశ్రీవిలాసార్ద్రితే
జస్వినీ! నిత్యవాసంతవర్చస్వినీ!
సత్కళాజీవితస్నపిత తాపస్వినీ!
జీవితస్వచ్ఛసుశ్రీహాసినీ! స్వస్తి.

("చిట్టితల్లి" కావ్యమునుండి.)

# ఆంధ్రోద్యమము - ఆంధ్రరాష్ట్రనిర్మాణము

మల్లెల శ్రీరామమూర్తి

భాషాప్రయుక్త రాష్ట్రవిభజన సిద్ధాంతమునకు భారతజాతీయమహాసభ ఎన్నడో అంగీకరించినది. కాంగ్రెసురాజ్యమున రాష్ట్రములను విడగొట్టినది. విశ్వవిద్యాలయములలో రాష్ట్రభాషలలోనే విద్యగఱపవలెనని రవీంద్రకవీంద్రునివంటి భాషాకోవిదులు గగ్గోలు పెట్టుచున్నారు. భాషాప్రయుక్త రాష్ట్రవిభజనమాత్రమును మొదలు ప్రేరేపించినవారు ఆంధ్రులు. బ్రిటిష్‌ప్రభుత్వముకూడ భాషాప్రయుక్త రాష్ట్రవిభజన కంగీకరించినది. ౧౯౩౫-వ సంవత్సరపు నూతన ఇండియాచట్టమున సింధు, ఒరిస్సాలను ప్రత్యేకరాష్ట్రములుగ ఏర్పాటుచేసిరి. ఇంకను విభజించుటకు చట్టమునుబట్టి అవకాశము గలదు.

## ఆంధ్రోద్యమము

ఆంధ్రప్రజల ఆర్థిక, రాజకీయ, సాంఘికాభివృద్ధికొఱకును, ఆంధ్రభాష, ఆంధ్రకళలు, ఆంధ్రవిజ్ఞానము, ఆంధ్రసారస్వతములను పెంపొందించుటకును కొందరు ఆంధ్రప్రముఖుల ఊహలతో ౧౯౧౧-వ సంవత్సరమున ఆంధ్రోద్యమమారంభమైనది. ౧౯౧౩-వ సంవత్సరమున ఆంధ్రోద్యమస్వరూపము బాపట్లలో జరిగిన ప్రథమాంధ్రమహాజనసభాపూర్వముగ ప్రత్యక్షమైనది.

## ఆంధ్రదేశ విస్తీర్ణము

ఆంధ్రజిల్లాలను ప్రత్యేకరాష్ట్రముగ నేర్పరచవలెనను భావము ఆంధ్రోద్యమ మారంభమైన నాటినుండి బయలుదేరినది. ౭౫ వేల చతురపుమైళ్ళ విస్తీర్ణము, దాదాపు రెండుకోట్లజనాభా, సాలుకు ఇంచుమించు ఎనిమిదికోట్ల రూపాయల ఆదాయము గలిగి ఏకఖండముగ ౧౨ జిల్లాలుగలిగిన ఆంధ్రదేశమునకు ప్రత్యేకరాష్ట్రము కోరుటన్యాయమని, యివ్వవలయునని సర్వేసర్వత్రా ఎన్నడో అంగీకరింపబడినది. ౩౨వేల చతురపుమైళ్ళ విస్తీర్ణముమాత్రము గలిగిన ఓఢ్రులు, ౪౮వేల చతురపుమైళ్ళ విస్తీర్ణము గలిగిన సింధుదేశము ప్రత్యేకరాష్ట్రములుగ విభజించినప్పుడు, యీరెంటికి మించిన వైశాల్యము, ఆదాయము గలిగిన ఆంధ్రరాష్ట్రమును ప్రత్యేకించగూడదని ఎవరు చెప్పగలరు?

## ఆంధ్రరాష్ట్రాందోళన

౧౯౧౩-వ సంవత్సరమున బాపట్లలో జరిగిన ప్రథమాంధ్రమహాసభనాటనుండి నేటివరకు ఆంధ్రులు ప్రత్యేకరాష్ట్రమును కోరుచు అనేకమహాసభలలో తీర్మానములు చేయుచు ప్రభుత్వమునకుపంపుచున్నారు. ౧౯౧౮-వ సంవత్సరమున కలకత్తాలో జరిగిన అఖిలభారతదేశీయ మహాజన సభలో



ఆంధ్రులకు కాంగ్రెసులో ప్రత్యేకరాష్ట్రమొసంగి అరవలనుండి విడగొట్టిరి. ఇంతవరకు ఆంధ్రులను మద్రాసీయులని పిలుచుచుండిరి. ప్రత్యేకరాష్ట్రము కావలెనని ఆందోళన నారంభించిన ఆంధ్రులు తొలుత ౧౯౧౭-వ సంవత్సరమున మాంటేగు ప్రభృతులు భారతదేశమునకు విచ్చేసిన సందర్భమున ప్రత్యేకరాష్ట్రము కావలెనని విజ్ఞప్తి నొసంగిరి. ౧౯౧౪-వసంవత్సరమున ప్రథమాంధ్రమహాసభాధ్యక్షులగు స్వర్గీయ బయ్యా నరసింహేశ్వరశర్మగారు ఇంపీరియల్ కౌన్సిలులో ఆంధ్రరాష్ట్రమును ప్రత్యేకించవలెనను తీర్మానమును ప్రవేశపెట్టిరి. జాయింటు పార్లమెంటరీ కమిటివారికి కీ॥ శే॥ మోచర్ల రామచంద్రరావుగారు ఆంధ్రరాష్ట్రమును ప్రత్యేకించవలెనని నివేదించిరి. మాంటుఫర్డు నివేదికలో భారతవర్షమున భాషాప్రయుక్త రాష్ట్రవిభజన ఆవశ్యకమని నిరూపించుచూ నూతనరాష్ట్రములను నిర్మించుటకు వసతులు కల్పించిరి. ౧౯౨౨-వసంవత్సరమున ఢిల్లీఅసెంబ్లీలో జయంతి రామయ్యపంతులుగారు ఆంధ్రరాష్ట్రతీర్మానమును ప్రవేశపెట్టిరి. పిమ్మట ౧౯౨౭-వ సంవత్సరమున మద్రాసు శాసనసభలో పిల్లలమర్రి ఆంజనేయులుగారును, భారతశాసనసభలో వరహాగిరి వెంకట జోగయ్యగారును, స్టేటుకౌన్సిలులో వేమవరపు రామదాసుగారును ప్రత్యేకాంధ్రరాష్ట్ర తీర్మానముల నుపపాదించిరి. మద్రాసు శాసనసభలో ఆంజనేయులుగారి తీర్మానము అత్యధికసంఖ్యాకులచే అంగీకరింపబడినది. మరల ౧౯౨౪-వ సంవత్సరమున ఆంజనేయులుగారు బడ్జెటు చర్చలో తెచ్చిన ఆంధ్రరాష్ట్రమును గూర్చిన కోతతీర్మానముకూడ అంగీకరింపబడినది; అనగా, మద్రాసు (పూర్వపు) శాసనసభలో ఆంధ్రరాష్ట్రమును ప్రత్యేకించవలెనను తీర్మానము రెండుపర్యాయములామోదింపబడినది. ౧౯౨౮ లో వెలువడిన నెహ్రూ నివేదికలోను, ౧౯౨౮ లో కలకత్తాలో జరిగిన భారతజాతీయసభలోను ఆంధ్రరాష్ట్రమును ప్రత్యేకించవలెనని తీర్మానించబడినది. నెహ్రూ నివేదికలోని అఖిలపక్షసభవారి ౫-వ తీర్మానము ఇట్లున్నది—

"(అ) కర్నాటకమును, ఆంధ్రదేశమును ప్రత్యేకరాష్ట్రములుగా విభజించుటకు అవసరమగు చర్యగైకొనుట——"

౧౯౩౦ లో వెలువడిన సైమనుసప్తకము వారి నివేదికలోకూడ ఆంధ్రరాష్ట్రసమస్య తీవ్రముగ నాలోచింపవలయునని వ్రాయబడినది. ౧౯౩౧లో లండనులో జరిగిన రెండవ

సంద్రబల్ల సమావేశమున నేటి మద్రాసు కార్మికమంత్రి గౌ॥ వి. వి. గిరి, బొబ్బిలిరాజాగార్లు ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకతను నిరూపించుచూ విడివిడిగా పెద్ద మెమోరాండములను సమర్పించిరి. మరల ౧౯౩౭ లో స్టేటు కౌన్సిలులో ది॥ బ॥ జి. నారాయణస్వామి శెట్టిగారు ఆంధ్రరాష్ట్రమును గూర్చిన తీర్మానము పంపిరి.

## ఆంధ్ర విశ్వవిద్యాలయము

చిరకాలముగ ఆంధ్రులుకోరుచున్న కోర్కెలఫలితముగ ౨౬-౪-౨౬ న స్వర్గీయ పానుగల్లు రాజావారి కృషివలన ఆంధ్రవిశ్వవిద్యాలయము విజయవాడలో స్థాపితమైనది. విశ్వవిద్యాలయ మేర్పడినందులకై ఆంధ్రులలో చేరలేని సంతోషము కల్గినది గాని చివరకది విషమ పరిస్థితులలోనికి వచ్చినది. విశ్వవిద్యాలయ కార్యస్థాన, స్థలనిర్ణయ విషయమున ఆంధ్రులలో తీవ్రాందోళన రేగినది. స్వస్థలాభిమానులై ఆంధ్రులు పిచ్చిభ్రమలకులోనై తగవులాడిరి. విశాఖపట్నం మొదలు అనంతపురంవరకు గల పట్టణములవారు విశ్వవిద్యాలయ కేంద్రములకొఱకు, కార్యస్థానముకొఱకు అఱ్ఱులు చాచిరి. ఆవేశ మధికమైనది. అసలు విషయము మరచి స్థలాభిమానమునకు ప్రాకులాడి బెజవాడలోని కార్యస్థానము నూడబెరికిరి. బెజవాడలోనే విశ్వవిద్యాలయమున్నచో తగవు లప్పుడే అంతరించెడివి. తుదకు విశ్వవిద్యాలయముకార్యస్థానము వాల్తేరుకొండలలో చేరినది. ఆంధ్రులలో చీలికలకు కారణభూతమైన ఆంధ్రవిశ్వవిద్యాలయపు చట్టమును సవరించి, రాయలసీమ కళాశాలలను ఆంధ్ర విశ్వవిద్యాలయమున చేర్చినగాని ఆంధ్రైక్యత సిద్ధించదని నాయకులు నేటికి గుర్తింపగలిగిరి.

## ఆంధ్రరాష్ట్రనిర్మాణ మేల కాలేదు?

పైన వివరించిన విషయములను బట్టి ౨౫ సంవత్సరములనుండి చరిత్రాత్మకముగ పోరాడుచున్న ఆంధ్రులకు సర్వార్హత లుండియు, విశ్వవిద్యాలయ మేర్పడియు ప్రత్యేకరాష్ట్ర మెందు కేర్పడలేదనునదియే ఇప్పటి ప్రధానసమస్య. ఆంధ్రవిశ్వవిద్యాలయముపట్ల పెద్దదెబ్బ తినిన కడప, కర్నూలు, బళ్లారి, చిత్తూరు, అనంతపురం (రాయలసీమ) జిల్లాలవారు ఆంధ్రరాష్ట్రమే అక్కరలేదనియూ, ఆంధ్రవిశ్వ విద్యాలయమున చేరమనియు ప్రచార మారంభించిరి. మద్రాసు మాకు చేరువగనుక మద్రాసు విశ్వవిద్యాలయముననే యుండెద మనిరి. విశాఖపట్నమున ఆంధ్రవిశ్వ విద్యాలయమును పెట్టి అనంతపురం వారిని చేరుమనుటకూడ న్యాయముకాదు. రాయలసీమ అయిదు జిల్లాలలోని కళాశాలలు మద్రాసువిశ్వవిద్యాలయమున నుండుట, ఆ జిల్లాలనుంచి ఆంధ్రవిశ్వ విద్యాలయము సెనేటుకు ప్రతినిధులు వచ్చుట తటస్థించినది. రాయలసీమవారికి ఆంధ్రరాష్ట్రముపట్ల తీరని అసంతృప్తి ప్రబలి, కొంతమంది ఆంధ్రరాష్ట్రము వద్దనుటవరకు వచ్చినది. రాష్ట్రము సిద్ధింపకపోవుట కిది యొకకారణము. ఇంతియగాక ౧౯౧౯ నుంచి ౧౯౩౭ మార్చివరకు (మధ్య కొంత కాలము తప్ప) మద్రాసుప్రభుత్వమునకు ప్రధానమంత్రులైన జస్టిస్‌పక్ష ఆంధ్ర నాయకులు ఆంధ్రరాష్ట్ర నిర్మాణముపట్ల మహోపచారము గావించిరి. పానుగల్లు రాజాగారు మాత్రము విశ్వవిద్యాలయ మేర్పడిన కొంతకాలమునకు స్వర్గస్థులైరి. రాష్ట్రముకొఱకు వారును చేయవలసినంతపని చేయలేదు. జస్టిస్‌పక్షమువారు ఆంధ్రరాష్ట్రనిర్మాణముపట్ల ఎట్టి శ్రద్ధయు చూపలేదు. సైమన్‌కమీషనువారికి జస్టిస్‌పక్షమువారు స్వాగతమిచ్చియూ ఆంధ్రరాష్ట్రము మాటయైనను చెప్పలేకపోయిరి. లండను రౌండుటేబిలు సభలో అనుకూలముగ మాట్లాడిన బొబ్బిలిరాజుగారికి ప్రధానమంత్రిత్వము లభింపగనే బుద్ధి మారి వ్యతిరేకులైరి. ఆంధ్రుల పక్షమున లండనురాయబార మేగిన కూర్మా వెంకటరెడ్డిగారికి లా మెంబరుపదవి, తర్వాత గవర్నరుపదవి రాగానే ఆంధ్రరాష్ట్రమే అనవసరమని తోచినది. దాదాపు ౧౬ సంవత్సరములు మద్రాసు ప్రభుత్వాధికారమును చలాయించిన జస్టిస్‌కక్షి ఆంధ్రనాయకులు ఆంధ్రరాష్ట్ర నిర్మాణముపట్ల చూపిన ఉదాసీనతను, ద్రోహమును భావిచరిత్రకారుడు వ్రాయగలడు. ౧౯౨౧-వ సంవత్సరము నుండి జాతీయోద్యమమున మునిగిపోయిన ఆంధ్ర కాంగ్రెసునాయకులకు రాష్ట్రసమస్య పట్టలేదు. శాసనసభల బహిష్కారము, సైమన్‌కమీషను బహిష్కారము, శాసనోల్లంఘనము, ఉప్పు సత్యాగ్రహము మున్నగువానిలో జాతీయనాయకులుండుటచే రాష్ట్రసంపాదన అడుగునబడినది. అటు ప్రభుత్వమును నడపిన జస్టిస్‌పక్షము వారియొక్కయు, ఇటు జాతీయనాయకులయొక్కయు ఉదాసీనతవలన ఆంధ్రరాష్ట్ర సమస్య అడుగునబడినదిగాని ప్రజలలో ఉత్సాహము లేక కాదు. ఆంధ్రరాష్ట్రమును సాధించుటకు నేనని ముందుకు వచ్చిన నాయకుడు లేకపోవుటే ఇప్పటికి రాష్ట్రము సిద్ధింపకపోవుటకు కారణమని తేలినది.

## రాయలసీమవారి తప్పు ఎంత?

విశ్వవిద్యాలయము తగాదాలలో వ్యతిరేకులైన రాయలసీమవారిది తప్పాయని చర్చింపవలసియున్నది. నిరంతర క్షామపీడితులగు రాయలసీమ ప్రజలలో దారిద్ర్యము నృత్యము చేయుచున్నది. విద్యాగంధము శూన్యముగనున్నది. వారి మొఱలు వినువారు లేరు. ఎంత కాలమునుంచియో రాయలసీమవారు కోరుచున్న తుంగభద్రా ప్రాజెక్టు కాగితములమీద మద్రాసు, మైసూరు, నైజాం ప్రభుత్వ బల్లలలో తిరుగుచున్నది. ఎప్పటి కది బయలుపడునో తెలియదు. ఉత్తరాంధ్రులా రాయలసీమవారిని త్రోసిరాజనుచున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయమును బెజవాడనుండి వాల్తేరు కొండలకు సాగనంపిన ఉత్తరాంధ్రులను రాయలసీమవాసులు నమ్ముటెట్లు? బలహీనుని బలవంతుడు అణగద్రొక్కుట సహజము గదా! ఇట్టి స్థితిలోనున్న రాయలసీమవాసులు ఆంధ్రరాష్ట్రమున, విశ్వవిద్యాలయమున చేర మని చెప్పుటలో చాల అర్థమున్నదని సర్కారు ఆంధ్రులు గ్రహించుటావశ్యకము. ఈనాడు రాయలసీమ - సర్కారు ఆంధ్ర నాయకు లీ విషయమున సోదరభావమున చర్చించుకొనుచున్నందున త్వరలో భేదము లంతరింపగలవు.

## అరవల ప్రతికూలత

ఆంధ్రులలో సోదరభావముగ భాగముల వద్ద గల్గిన తగాదాను ఊతగ గొని అరవసోదరులు రాయలసీమాంధ్రుల నంటకాగి ఆంధ్రులలో చీలికలను పెంచుటకు తోడ్పడిరి. ఉత్తరాంధ్రులపై రాయలసీమవారికి వ్యతిరేకభావమును కలుగజేసిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయమున చేరవద్దనిరి. ఆంధ్రరాష్ట్రము రాయలసీమకు లాభదాయకము గాదనిరి. మద్రాసు విశ్వవిద్యాలయముననే యుండుడనిరి. అరవలలోనుండిన అండల మెక్కుండు మనిరి. ఆంధ్రరాష్ట్రము వచ్చిన అరవలకు నష్టమని వారికి

బాగుగ తెలుసును. ఆంధ్రులు కలసియున్నచో వారి (ఆంధ్రుల) ధనముతో మెట్టూరు ప్రాజెక్టువంటివి ఇంకను కొన్ని కట్టుకొనవచ్చును; పెద్ద ఉద్యోగము లన్నియు అరవవారికి అప్పగించవచ్చును. ఇంకను ఇట్టివెన్నియినను చేయవచ్చును. ఇది అరవల ఆంతరంగికము. పత్రికలలో ఆంధ్రులలో భిన్నాభిప్రాయము లున్నవని గోరంతలు కొండంతలుగ ప్రకటించుటకు అరవలు జంకలేదు. ఇట్టి కపటోపాయము లెన్నాళ్లు కొనసాగును?

## ఆంధ్రనాయకుల తలలు తిరిగినవి

ఆంధ్రులతర్వాత ఆందోళన నారంభించినప్పటికి ఆంధ్రదేశములో సగభాగము లేని ఓఢ్రులకు, సింధునాసులకును ప్రత్యేకరాష్ట్రములు వచ్చినవి. విశాలమైన ఆంధ్ర భూభాగము (బరంపురం ప్రాంతములు) ఓఢ్రమున కలసిపోయినది. మద్రాసునుంచి తమిళసోదరులు ఆంధ్రులను తరుము ప్రయత్నములు చేయుచుండిరి. చెన్నపట్నము తమదేనని చెప్పుటకు అరవలు సాహసింపగలిగిరి. మద్రాస ప్రాచీనమునుండి ఆంధ్రులదని చరిత్రలు చెప్పుచున్నను అరవలు లెక్కలు గణించుచున్నారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఆంధ్రులకు ఎండమావుల చందముగ నున్నది. అయిదుజిల్లాలు గల రాయలసీమ ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు దూరముగ నున్నది. ౭౦ మంది ఆంధ్ర అసెంబ్లీ సభ్యులు మద్రాసు సభలో నున్నను నాయకత్వము అరవలపాలైనది. పది మంత్రిపదవులు, పది పార్లమెంటరీ కార్యదర్శి పదవులు, నాలుగు అధ్యక్షోపాధ్యక్ష స్థానములు ఉన్నను అయిదుజిల్లాల ప్రతినిధులుగల రాయలసీమ వాసుల కొకటికూడ లభించలేదు. కౌన్సిలులో సభ్యుడుగ గవర్నరుచే నామినేటు చేయబడిన రాజన్ గారికి మంత్రిపదవి లభించినదిగాని, ఎన్నుకోబడిన అయిదుజిల్లాల ప్రతినిధులుగల రాయలసీమాంధ్రులకు మంత్రిపదవి కాదుగదా తుదకు పార్లమెంటరీ సెక్రటరీ పదవికి గతిలేకపోయినది. ఆంధ్రరాష్ట్రమే ఏర్పడియున్నచో రాయలసీమవారి కిట్లు జరుగునా? జరిగిన వారూరకుందురా? రాయలసీమాంధ్రనాయకులు నూహ యీరహస్యమును గమనించి ఆంధ్రరాష్ట్ర సంపాదనకు, రాయలసీమ ఆంధ్రవిశ్వవిద్యాలయమున చేరుటకు మార్గముల నన్వేషించుచున్నారు. ఇట్టి శుభసమయమున ఆంధ్ర విశ్వవిద్యాలయకార్యస్థానము, విశ్వవిద్యాలయము విశాఖపట్నం చేరుటకు నేనే చాలవరకు బాధ్యుడనని, బాధ్యతగలిగిన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు బహిరంగముగ ప్రకటించి పశ్చాత్తాపమును ప్రకటించిరి. కొలదికాలముక్రితము శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు బెజవాడ బహిరంగ సభలో నుపన్యసించుచూ బెజవాడకు నేను లోగడ విశ్వవిద్యాలయ సందర్భమున మహాద్రోహము, మహాపాప మొనర్చితి ననియు, ఆ పాపపరిహారార్థము బెజవాడలో శ్రీ రంగయ్యప్పారావుగారి కాలేజి ప్రారంభించుచుంటి ననియు వెల్లడించిరి. రామలింగారెడ్డిగారి యీ హృదయపరివర్తనము ఆంధ్రైక్యతకు ప్రబల సహకారి యని వేరుగ చెప్పవలెనా? పైన వ్రాసిన కారణములతో ఆంధ్రనాయకుల కందరికి (రాయలసీమ - సర్కారు ఆంధ్రులు) తలలు తిరిగినవి రాయలసీమకళాశాలలను ఆంధ్రవిశ్వవిద్యాలయమున చేర్చవలెనను చర్చలు బయలుదేరినవి. ఆంధ్రరాష్ట్రస్థాపన ప్రధానముగాని కార్యస్థాన మెక్కడను ప్రశ్న ప్రధానము గాదని నాయకులు గ్రహించి ప్రకటించుచున్నారు. ఆంధ్రైక్యత ప్రధానము. ఆంధ్రులలో రాష్ట్రనిర్మాణమునందు భిన్నాభిప్రాయము లేదు. ఆంధ్రరాష్ట్రనిర్మాణ మావశ్యకమను నినాదము ఆంధ్రదేశమంతటను మ్రోగుచున్నది. రాయలసీమ - ఉత్తరాంధ్రనాయకులు పరస్పర సహకారములతో సంభాషించుకొనుచున్నారు. ఈ ప్రయత్నములు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు రహదారీ మార్గములు గావా?

## ఆంధ్ర మహాసభలు

ప్రథమాంధ్రమహాసభ బాపట్లలో జరిగిన ౧౯౧౩-వ సంవత్సరము నాటినుండి నేటివరకు (౧౯౩౭ అక్టోబరు బెజవాడసభతో) ఆంధ్రదేశమున ౨౩ మహాసభలు (ప్రత్యేకసభలతో) జరిగినవి. తొలి ౪ మహాసభలు మహావైభవముగ జరిగినవి. రాజకీయకారణములచేత తరువాతి సభలలో మొదటియుత్సాహము లేదు. ఆంధ్రమహాసభాస్థాయిసంఘము నిద్రపోవుచూ పని చేయుచున్నది. రాజకీయములతో ఎట్టి ప్రసక్తి లేని ఆంధ్రమహాసభ వైభవముగ నుండుటకు బదులు వైధవ్యదశకు తిరిగినది. ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు రాయలసీమవాస్తులు విముఖతతో నున్నారనుట యథార్థముకాదు. విశ్వవిద్యాలయకార్యస్థానముతగాదాలో వచ్చిన భేదాభిప్రాయమే వారి విముఖతకు ప్రధాన సూత్రమైనది. ఆంధ్ర మహాసభలకు అధ్యక్షత వహించిన స్వర్గీయులు పానుగల్ రాజా, నెమలి పట్టాభిరామారావు, వేదము వేంకటరాయ శాస్త్రిగార్లును, శ్రీయుతులు గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, ఎ. రంగనాథ



అమరావతీ స్థూపములోని శిల్పసంపత్తి

మొదలియారు, కట్టమంచి రామలింగారెడ్డి, ఓ. లక్ష్మణస్వామి, సర్వేపల్లి రాధాక్రిష్ణయ్య, కె. కోటిరెడ్డి, దేశపాండ్య సుబ్బారావుగార్లు రాయలసీమవాసులై యున్నారు. రాయలసీమ జిల్లాలలో ఆంధ్రమహాసభలు చాల జరిగినవి. అధ్యక్షులైనవా రందరును ఆంధ్రప్రజల మన్ననల నందినవారు. ఆంధ్రవిశ్వవిద్యాలయ మేర్పడిననాటినుండి నేటివరకు ఉపాధ్యక్షస్థానము రాయలసీమనాయకుల కైవసమున నున్నది. ఆంధ్రమహాసభాధ్యక్షులైన రాయలసీమ నాయకు లందరును ప్రత్యేకరాష్ట్రమునకై కృషి సల్పిన ధీరులైయున్నారు. అట్టితరి రాయలసీమవారు రాష్ట్రనిర్మాణముపట్ల భిన్నాభిప్రాయు లనుట తథ్యము కాదు.

## చరిత్రాత్మకమైన బెజవాడసభ

చైతన్యరహితముగ నున్న ఆంధ్రమహాసభకు జీవము కలిగించి ఆంధ్రైక్యతకు పునాది వేయు సంకల్పముతో ఆంధ్రమహాసభ బెజవాడలో జరుపవలె నను భావము బెజవాడ యువకులలో ప్రబలినది. మద్రాసు మంత్రులగు గౌ॥ రాజగోపాలాచారి, రాజన్ ప్రభృతులు ఆంధ్రరాష్ట్రనిర్మాణముపట్ల పలికిన నిరసన వాక్కులు ఆంధ్రప్రజలను ఆగ్రహపరచినవి. ముఖ్యముగ యువకుల నుద్రేకపూరితులను గావించినవి. దేశమంతటను ఆంధ్రరాష్ట్ర తీర్మానములు చేయబడి ప్రచారము సాగుచున్నది. ప్రజలలో ఉద్రేకము హెచ్చినది. తగిన అదనుగదా యని బెజవాడలో ౨౫-వ ఆంధ్రమహాసభ (౧౯౩౭ అక్టోబరు ౨౫, ౨౬ తేదీలను) జరుపుటకు ముహూర్తము నిశ్చయింపబడినది. పక్షభేదములు పాటింపని నిఖిలాంధ్రదేశ ప్రతిబింబము ప్రత్యక్షముకావలె నను కుతూహలముతో మహాసభఏర్పాట్లు చేయబడినవి. ఆంధ్రమహాసభతోపాటు ఆంధ్రమహాసభారజతోత్సవముకూడ ఏర్పాటు చేయబడినది. ఈసభల ఆధ్వర్యము వహించుటకును, ఉపక్రమించుటకును రాయలసీమాంధ్రనాయకులగు శ్రీ కె. కోటిరెడ్డి, హాలాహల్వి సీతారామరెడ్డి, టి. యన్. రామకృష్ణారెడ్డి, కల్లూరు సుబ్బారావుగార్లు ఆహ్వానింపబడిరి. నిఖిలాంధ్ర దేశములోని సకలపక్షప్రముఖులకును ఆహ్వానము లంపబడినవి. రాయలసీమనాయకులు భక్తి పురస్సరముగ గౌరవింపబడిరి. అన్నిజిల్లాలనుంచియు ప్రతినిధులు, నాయకులు వచ్చిరి.

మహాసభలనాటి కోలాహలము, ఉత్సాహము వర్ణింపనలవికాదు. ఏనుగఅంబారీలమీద విజయవాడ నగరవీథులలో మేళతాళ భజనలతో రాయలసీమ నాయకు లూరేగించబడిరి. విజయవాడమహాసభ ఆంధ్రైక్యతకు విజయచిహ్నమయినది. సభల కార్యక్రమమంతయు సినిమా తీయబడెను. ౧౯౩౭ లో బెజవాడలో జరిగిన ఆంధ్రమహాసభల వైభవము కని విని ఎఱుంగని దని ఆంధ్రవృద్ధనాయకులు ఆశ్చర్యపడిరి. వేలప్రజలు, నాయకులును సమావేశమైన నిండుమహాసభ నేత్రోత్సవముగ నుండెను. ఆహ్వానసంఘాధ్యక్షు లగు శ్రీ చల్లపల్లిరాజాగారు మహాసభల కార్యక్రమమున వీరయువకునివలె ఉత్సాహమును ప్రకటించిరి. అట్టి బెజవాడ ఆంధ్రమహాసభల అహ్వానసంఘ కార్యదర్శిగానుండు భాగ్యము లభించినందుల కుప్పొంగు చున్నాడను.

## డా॥ పట్టాభిగారి నాయకత్వము

ఆంధ్రనాయకప్రముఖులును, అర్థికశాస్త్ర విశారదులును, మహావక్తలును, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘాధ్యక్షులును అగు శ్రీ డా. భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు ఆంధ్ర మహాసభలో ప్రధానభారమువహించి రాయలసీమవారికిని, ఉత్తరాంధ్రులకునుగల అపోహలు తొలగించుటకై ఆంధ్రైక్యమునుగూర్చి మహోపన్యాస మొసంగిరి. శ్రీ కె. కోటిరెడ్డి, సీతారామరెడ్డి, రామకృష్ణారెడ్డి, కల్లూరు సుబ్బారావుగార్లు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమత్యవసరమని ప్రకటించిరి. ఆంధ్రోద్యమమునకు మూలపురుషులగు న్యాపతి సుబ్బారావుపంతులు, దేశభక్త కొండా వెంకటప్పయ్యగార్లు 'వృద్ధులమగు మేము ఆంధ్రరాష్ట్రమును చూచుటకే జీవించియుంటి' మని చెప్పినపుడు సభలో హర్షధ్వానములు మిన్నుముట్టినవి. నేడాంధ్రరాష్ట్ర నిర్మాణోద్యమమునకు డాక్టరు పట్టాభిగారు నాయకత్వము వహించి ప్రచండాందోళనము చేయుచున్నారు. డా. పట్టాభిగారి రాయలసీమ సంచారమువల్లనే రాయలసీమవారి కోర్కెలు బాహాటముగ వెల్లడియైనవి. విశాలమైన అయిదుజిల్లాలుగల రాయలసీమసోదరులకు వలయు సర్వ సౌకర్యముల నొసంగవలయుననియే డా. పట్టాభిగారు ప్రకటించుచున్నారు. డా. పట్టాభిగారి ప్రకటనలను ఉత్తరాంధ్రులు బలపరచుచున్నారు. ఆంధ్రమహాసభారజతోత్సవ సభాధ్యక్షులగు టి. యన్. రామకృష్ణారెడ్డిగారు కొన్ని హామీలను కోరిరి. ఆంధ్రాభ్యుదయమును, ఆంధ్రరాష్ట్రమును కాంక్షించు ప్రతివారును అందుల కంగీకరించెదరు.

## ఆంధ్రైక్యత

ఆంధ్రులలో రాయలసీమవారికి సర్కారువారికి అభిప్రాయభేదము లున్నవను అరవల వాదనకు స్వస్తిచెప్పవలసిన సమయము వచ్చినది. బెజవాడ మహాసభలో జరిగిన చర్చలలో యీవిషయము స్పష్టమైనది. ఉత్తరాంధ్రుల పక్షమున డా. పట్టాభిగారు 'ఇదివరకుచేసిన పొరపాట్లున్నచో క్షమించ'మని రాయలసీమవారినికోరిరి. ఆంధ్రనాయకు లందరు ఐక్యముకొఱకు కృషిసలుపుచున్నారు. ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షులగు కట్టమంచి రామలింగారెడ్డిగారును, రాయలసీమనాయకులును రాయలసీమ కళాశాలలను ఆంధ్ర విశ్వవిద్యాలయమున చేర్చుటకు మంచిప్రయత్నములు చేయుచున్నారు. వారి ప్రయత్నములు సఫలములుకాగలవని ఆంధ్రదేశ ముఖ్విళ్లూరుచున్నది. బెజవాడలో జరిగిన మహాసభలో నియమింపబడిన ఉపసంఘమువారు ఆంధ్రదేశైక్యవిధానమును నిర్ణయించిరి. అందు రాయలసీమవారితోపాటు డా. పట్టాభి, దేశభక్త వెంకటప్పయ్యగార్లు సంతకములు చేసిరి. ఆంధ్రైక్యమే ప్రధానసమస్యగ నెంచవలెనుగాని చిల్లరసమస్యలకు ప్రాధాన్యమీయతగదు. రాయలసీమవాసుల కోర్కెల నంగీకరించుటకు ఉత్తరాంధ్రులు సిద్ధముగనున్నారు. రాయలసీమ నాయకులు, ప్రజ లీసమయమును గుర్తించి రాష్ట్రసంపాదనకు తీవ్రకృషి సలుపవలసి యున్నది.

## గతమును మఱచిపోవలెను

రాయలసీమవారును, సర్కారువారును గతమును మరచిపోయి ముందు కార్యక్రమమాలోచించవలెను. వెనుకటి సందేహములను విడనాడి ౧౧ జిల్లాలవారును ఐకకంఠ్యముగ రాష్ట్రమును కోరవలెను. పూర్వచరిత్రను స్మరించుటవలన ఫలితములేదు సరిగదా ముందు జరుగవలసినకార్యక్రమమునకు భంగమువాటిల్ల వచ్చును. ఆంధ్రరాష్ట్రమున చేరమని రాయలసీమవారు భీష్మించుచో ఫలితము రాయలసీమవారే అనుభవింపగలరు.

## అనుమానములకు తావులేదు

ఉత్తరాంధ్రులు బలవంతులని, పశ్చిమాంధ్రులు బలహీనులని రాయలసీమవారు భీతిల్లరాదు. ఆంధ్రరాష్ట్రములో సగభాగముగనున్న రాయలసీమ సోదరులను సర్కారాంధ్రులు త్రోసివేయుదురని తలచుట యుక్తము కాదు. రాయలసీమ - సర్కారుసీమ అను భేదమును అంతరింపజేసి అందరము ఆంధ్రమాతపుత్రుల మను భావముతో నిఖిలాంధ్రదేశాభివృద్ధికి అందరు నడుములు బిగించవలెను. రాయలసీమ ౫ జిల్లాలను త్రోసివేసుకొని సర్కారాంధ్రులు రాష్ట్రమును సాధించుకొనగలరా? అటులో యింత కాలహరణమేల జరిగినది? 'హిందూ', 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' పత్రికలు మీలో మీకుగల తగవులను సర్దుకొనుడని ఆంధ్రులకు ఏల సలహాయిత్తురు? పశ్చిమోత్తరాంధ్రులందరు ఏకమైనగాని ఆంధ్రరాష్ట్రము లభింపదని వేరుగ చెప్పవలెనా?

## రాయలసీమవారి బాధ్యత

నేడాంధ్రమహాసభాకార్యస్థానము అనంతపురమునయున్నది. రాయలసీమవారే ఆంధ్రమహాసభను నడపు అధినేతలుగ నున్నారు. సర్కారాంధ్రులపక్షమున డా. పట్టాభిగారు నాయకుడై మహారథుడై సారథ్యమును చేయుచున్నారు. రాయలసీమవారి కోర్కెలను సర్కారాంధ్రులు గమనించుచున్నారు. న్యాయమగు వారికోర్కెలను అంగీకరించుట సమంజసమని డా. పట్టాభిగారు ప్రకటించుచున్నారు. అందులకు సందేహము లేదు. ఇదివరకే రాయలసీమవారు చాల కాలహరణము చేసిరి. ఇప్పుడైనను రాయలసీమాంధ్రనాయకులు, ప్రజలు ముందుకు వచ్చి వారికష్టములను, వారికోర్కెలను వెలిబుచ్చి రాష్ట్రసాధనకు పూనుకొనుటను చూచి ఏ ఆంధ్రుడుప్పొంగకుండును?

## ఇది మంచితరుణము

ఆంధ్రరాష్ట్రనిర్మాణమున కిది మంచితరుణము. ఘడియ రేమరురాక ఎప్పుడో, వచ్చునో రాదో దేవునికెరుక. అఖిలభారత కాంగ్రెస్ సంఘమువారు ఆంధ్రరాష్ట్రమును విడగొట్టవలెనని మద్రాసు కాంగ్రెస్ మంత్రివర్గమునకు ఫర్మానా పంపిరి. అటుపిమ్మటనే ఆంధ్రేతర మంత్రులు కొందరు ఆంధ్రరాష్ట్రమామాక్షిప్తమేనని చెప్పసాగిరి. కాంగ్రెస్‌సభ్యులు అత్యధికముగనున్న మద్రాసు అసెంబ్లీశాసనసభలలో ఆంధ్రరాష్ట్ర తీర్మానము ఏకగ్రీవముగ అంగీకరింపబడగలదు. మద్రాసులోని 'హిందూ', 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్', 'మద్రాసు మెయిల్' పత్రికలు ఆంధ్రరాష్ట్ర విభజనను బలపరచినవి. తెలుగుపత్రికలు రాష్ట్రమునకై గాఢకృషి సలుపుచున్నవి.

## ప్రజల ఉత్సాహము

ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకై ఆంధ్రదేశప్రజ లాబాలగోపాల ముర్విళ్లూరుచున్నారు. అనేకజిల్లాబోర్డులు, పురపాలకసంఘములు, పంచాయతి సంఘములు 'ఆంధ్రరాష్ట్ర నిర్మాణ' మత్యవసరమని తీర్మానించినవి. అనేక సభలలో ఆంధ్రరాష్ట్రతీర్మాన మామోదింపబడుచున్నది. ముఖ్యముగ ఆంధ్రయువకులు, విద్యార్థులు, స్త్రీలు ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకై తీవ్రకృషి సలుపుచున్నారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘమువారు యీ విషయమై ప్రత్యేకశ్రద్ధ వహించుచున్నారు.

## ఆంధ్ర అసెంబ్లీసభ్యుల బాధ్యత

అఖిల భారత కాంగ్రెస్ సంఘము ఆంధ్రరాష్ట్రమును ప్రత్యేకించమని తీర్మానించినది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘము తీవ్రకృషి సలుపుచున్నది. వెంటనే ఆంధ్రరాష్ట్ర తీర్మానమును అసెంబ్లీ శాసన సభలలో ప్రవేశపెట్టిఅంగీకరింపజేయవలసినబాధ్యత ఆంధ్రశాసనసభ్యులమీద నున్నది. ఆంధ్రమంత్రులు గా॥ ప్రకాశం, గిరి, గోపాలరెడ్డి గార్లు తమ అంగీకారమును ప్రకటించిరి. ఆంధ్రరాష్ట్రమును సాధించి ఆంధ్ర కాంగ్రెస్ నాయకులు శాశ్వతకీర్తిని బడయుదురుగాక!

## ఆంధ్రప్రజల కర్తవ్యము

ఆంధ్రరాష్ట్రనిర్మాణ మగువరకును ఆంధ్రప్రజలు ఏమరక యుండవలెను. నాయకులను, శాసనసభ్యులను, ప్రభుత్వమును వత్తిడిచేయుచుండవలెను. ఇప్పటి ఉత్సాహమును వేడిని చల్లారనీయక రాష్ట్రము సిద్ధించువరకును దీక్షవహించవలెను. ప్రజలు మందగించిరా, ఉద్యమము అట్లే యుండును.

## రాష్ట్రేతరాంధ్రులు

పన్నెండుజిల్లాలలోని ఆంధ్రప్రజలేగాక రాష్ట్రేతరముగా బొంబాయి, కలకత్తా, మధ్యరాష్ట్రములలోను, దక్షిణదేశమున మైసూరు, నైజాంసంస్థానములలోను, బర్మాలోను కోటికిపైగా ఆంధ్రులు నివసించుచున్నారు. వారందరి కష్టసుఖములను ఆంధ్రమహాసభాస్థాయిసంఘమువారు విచారించవలసియున్నది. ప్రత్యేకరాష్ట్ర మేర్పడినగాని వారి కష్టములు తొలగించుటకు సాధ్యము కాదు. అయిననూ ఆయా రాష్ట్రప్రభుత్వములతో ఉత్తరప్రత్యుత్తరములు జరిపి రాష్ట్రేతరాంధ్రుల కష్టనివారణకై యత్నించుట ఆంధ్రమహాసభవారివిధియని మనవిచేయుచున్నాను. రాష్ట్రేతరాంధ్రులు సంఘములను స్థాపించుకొని, పత్రికలలో ఆందోళన చేయుచూ వారివారి విషయములను ఆంధ్రమహాసభాకార్యస్థానము( ఇప్పుడు అనంతపురము )నకు పంపుచుండవలెను. ఆంధ్రమహాసభా స్థాయిసంఘమున రాష్ట్రేతరాంధ్రులకు తగిన ప్రాతినిధ్య మొసంగలేదు. అది అన్యాయము గాన తగిన ప్రాతినిధ్య మొసగి లక్షలుగ నున్న రాష్ట్రేతరాంధ్రుల పురోభివృద్ధికి పాటుపడవలెనని ఆంధ్రమహాసభాధికారులకు విన్నవించుచున్నాను.

## ముగింపు

'ఆంధ్రోద్యమము—ఆంధ్రరాష్ట్ర నిర్మాణము'ను గూర్చి విపులముగ చర్చించితిని. ఆంధ్రులందరు స్వల్పవిషయములపట్ల భిన్నాభిప్రాయములను విడనాడి ఏకమనస్కులై, రాష్ట్రసంపాదనకు దీక్ష వహించి సత్వరముగ ఆంధ్రరాష్ట్రమును సాధించెదరనియూ, ఆంధ్రభాషామతల్లిని, ఆంధ్రమాతను ఆంధ్రులందరు ముక్తకంఠముచ పూజించి, వారు భారతవర్షమున తొల్లింటివలె ప్రతాపశౌర్యములుకల్గి మహోన్నతస్థాన మాక్రమించవలెననియు, ఆక్రమింతురనియూ ఆశించుచున్నాను. ఆంధ్రోద్యమస్థాపనాచార్యులగు శ్రీ దేశభక్త కొండ వెంకటప్పయ్య, ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగార్ల వంటి వృద్ధుల జీవితకాలముననే ఆంధ్రరాష్ట్రస్థాపన వారిమనంబుల సంతోషతరంగముల నూగించవలెను, ఊగించగలము అను నుత్సాహ ధైర్యములతో ఈ వ్యాసమును ముగించుచున్నాడను.

" ఆంధ్రమాతకు జై "

# ప్రత్యేకాంధ్రరాష్ట్రము: ఆంధ్రోత్కళ సమస్య

గండికోట సత్యనారాయణమూర్తి

సర్వతోముఖాంధ్రాభివృద్ధికి ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణ మావశ్యకమని ౧౯౧౩ లో బాపట్లనగరమందు కీర్తిశేషులైన సర్ బయ్యా నరసింహేశ్వరశర్మగారి అధ్యక్షతను జరిగిన ప్రథమాంధ్రమహాసభనాటి నుండి గుర్తింపబడి, నేటివరకూ ఆంధ్ర రాష్ట్రోద్యమమునుగురించి తీవ్రమైన ప్రచార ప్రబోధములు జరుగుచున్నను, భాషాప్రయుక్త హైందవ రాష్ట్ర పునర్విభజన సిద్ధాంతము అఖిలభారతీయ కాంగ్రెసు మహాసంస్థయు, మాంటేగ్యూ ఛెల్మ్స్‌ఫర్డురిపోర్టు, నెహ్రూకమిటీ రిపోర్టు, సైమన్‌కమిషన్ రిపోర్టు మొదలగు నవి ఆమోదించుచున్నను, ఆ సూత్రము ననుసరించియే మొన్న మొన్ననే ప్రత్యేకోత్కళ రాష్ట్రము నకై ఆందోళనమును లేవదీసిన ఉత్కళసోదరులకు ప్రత్యేక మగు ఒరిస్సారాష్ట్రము ౧-౪-౧౯౩౬ తేదీ నుండి లభించుటయే కాక ఆంధ్ర ప్రాబల్యముగల బరంపురము, పర్లాకిమిడి మొదలగు తెలుగుసీమ లనేకము ఆంధ్రుల కష్టనష్టములను పాటించకయే ఒరిస్సాలో అన్యాయముగా చేర్చబడినను, ఆంధ్రు లే తద్విషయమై తగినంత శ్రద్ధవహింపక ఊరకుండుట మిగుల శోచనీయము.



దేశోద్ధరణకై బద్ధకంకణులైన కాంగ్రెసువా రిప్పుడు మదరాసు ప్రభుత్వములో పలుకుబడి గల అధికార పదవులను స్వీకరించియున్నారు. ౩౦-౧౦-౩౭ తేదీన కలకత్తాలో సమావేశమైన అఖిలభారతీయ కాంగ్రెసుసంఘమువారు సత్వర ప్రత్యేకాంధ్రరాష్ట్రావశ్యకతను గురించి ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు సంఘాధ్యక్షుడు శ్రీ డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారు రూపొందించిన తీర్మానము నంగీకరించిరి. ఆంధ్రావనియందంతటను ప్రత్యేకాంధ్రరాష్ట్రసిద్ధికై తీవ్రతమమగు ఆందోళనము నేడు ద్విగుణీకృతోద్రేకముతో ప్రజ్వరిల్లుచున్నది. రాయలసీమ ఆంధ్ర సోదరులకున్ను తతిమ్మా ఆంధ్రులకున్ను కల భేదభావములు తొలగిపోవుటకు ఇటీవల బెజవాడలో జరిగిన ప్రత్యేకాంధ్ర మహాసభవారు నియమించిన స్థాయి సంఘమువారు జయప్రద మయిన కృషి సలుపుచున్నారు. మద్రాసు శాసనసభలోని ఆంధ్ర ప్రతినిధులు ప్రత్యేకాంధ్ర రాష్ట్రసిద్ధికై పాటుపడుటకు సంసిద్ధులైయున్నారు. భావి ఆంధ్రరాష్ట్రపు వైశాల్యము, జనసంఖ్య, ఆర్థికసంపత్తి ప్రత్యేక రాష్ట్రోద్యమమునకు సుముఖముగా నున్నందునను, ౧౯౩౫-వ సంవత్సరపు 'గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆక్టు'వలన ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణమునకు క్లిష్టపరిస్థితు లేర్పడజాల వని రాజనీతిజ్ఞులు స్థిరీకరించినందునను, ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రసిద్ధి కరతలామలకమైయున్నది.

ఈతరుణముననే అన్యాయముగా ఒరిస్సాలో చేర్చబడిన తెనుగుప్రాంతములను భావి ఆంధ్రరాష్ట్రములోనికి తీసుకువచ్చుటకై ఆంధ్రోత్కళ సమస్యను పునరుద్ధరించి, నూతనోత్కళరాష్ట్ర నిర్మాణకాలమున గంజాం-విశాఖపట్టణముజిల్లాల ఆంధ్రులకు జరిగియుండిన అన్యాయమును తొలగించుటకుగాను సకారణమగు వాదనలను ఆంధ్రులు అధికార్లకు నివేదించవలసియున్నది. ఆంధ్రరాష్ట్రము నుత్తరపుసరిహద్దును నిర్ణయించునపుడును, ఒరిస్సారాష్ట్రము దక్షిణపు సరిహద్దు నేర్పరచినపుడును ఆంధ్రులకు జరిగిన అన్యాయమును కార్యదీక్ష వహించి ఆంధ్రమహాజనులు పారదోలవలెను. సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సారస్వత విషయములలో ఒరిస్సాలో నుండిపోయిన ఆంధ్రసోదరులకు మహత్తరమైన కష్టనష్టములు వాటిల్లుచున్నవి. ఓఢ్రుల ప్రత్యేక సౌకర్యమునకై ఏర్పడిన ఒరిస్సారాష్ట్రము ధనాభావముచే క్రుంగిపోవుచూ పరిపాలనాచక్రమును నడిపించుటకే కేంద్రప్రభుత్వమువారి

సాంవత్సరిక విరాళమును కాశించుచున్నపుడది ఆంధ్రుల సౌకర్యములను గమనింపదు. ఆంధ్రులకు ప్రత్యేకప్రాతినిధ్య ముండదు. అల్పసంఖ్యాకసమస్యను లేవదీయు శక్తి మన ఒరిస్సాలోని ఆంధ్రసోదరులకు లేదు. మొన్న మొన్నటివరకు ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి యాజమాన్యముననున్న దక్షిణ ఒరిస్సాలోని కాలేజీలను కలకత్తా విశ్వవిద్యాలయమువారి అధీనమం దుంచుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఆంధ్రభాషలో విద్యావిధానము జరుగుభాగ్యము మన ఒరిస్సా ఆంధ్ర సోదరుల కుండదు. ఒరిస్సా కనుగుణమగు ప్రత్యేకచట్టములు నిర్మింపబడినపు డచ్చటి ఆంధ్రుల సౌకర్యము గమనింపబడదు. ఉద్యోగము లాంధ్రుల కికమీదట ఒరిస్సాలో దొరకుటయే దుర్లభమగును. ఉత్కళపక్షపాతముకల ఓఢ్రజమీందారుల సంకుచితాదర్శములకు ఆంధ్రు లాహుతి కావలసి యుండును. మొన్న మొన్నటివరకు తతిమ్మా ఆంధ్రులతోపాటు ప్రత్యేకాంధ్రరాష్ట్రమును వాంఛించుచుండిన మన ఒరిస్సా ఆంధ్ర సోదరులు ప్రత్యేకరాష్ట్రము ఆంధ్రులకు సిద్ధించబోవు చున్నపుడు రాష్ట్రేతరాంధ్రులుగానా పరిగణింపబడవలెను? అక్రమముగా ఒరిస్సాలో చేర్చబడిన ఆంధ్రప్రదేశములను మన ఆంధ్రావనిలో కలిపించుట కవసరమగు ముఖ్యమైన వాదనలను ఈ దిగువ క్లుప్తీకరించుచున్నాడను:—

ఇప్పటికి సుమారు ౧౩౦౦ సంవత్సరముల క్రిందట జైమినిసూత్రములకు భాష్యము రచించి ఆంధ్రదేశమందు కర్మమార్గ ప్రధానమైన వైదిక ధర్మమును వ్యాపింపజేసిన ఆంధ్రోత్తముడు కుమారిలభట్టు కాలము నాటికికూడ జయమంగళపురము తెలుగుదేశమున్ను ఓఢ్రదేశమున్ను కలియు సరిహద్దున కలదని "జినవిజయ"మందలి ఈ దిగువ శ్లోకమువలన స్పష్టమగుచున్నది:—

శ్లో॥ ఆంధ్రోత్కలానాం సంయోగే పవిత్రే జయమంగలే । గ్రామే తస్మిన్మహానద్యాం భట్టాచార్యః కుమారకః॥

ఈ జయమంగళమను గ్రామము సుప్రసిద్ధమైన ఛత్రపురమునకు ఉత్తరముగా శాపురము మొదలగు గ్రామములతో ఋషికుల్యానదీతీరమందు ఉన్నది.

హంటరుగారి ఒరిస్సాచరిత్ర( -వ సంపుటము, ౧౮-వ పేజీ)లో నిట్లున్నది:— "గంజాంజిల్లా ఎంతమాత్రమున్ను ఒరిస్సాలోని భాగముకాదు. కృష్ణ, గోదావరి, విశాఖపట్నం, గంజాంజిల్లాలు ఉత్తరసర్కార్లనిపించుకొనుచున్నవి. గంజాం సదరు ఉత్తరసర్కార్లలోని భాగమై యున్నది. క్రీస్తువెనుక ౭౪-వ సంవత్సరమునుండి ౧౧౩౨వరకు ఒరిస్సాదేశమును పాలించిన కేసరివంశపు రాజుల రాజ్యమునకు ఋషికుల్యానది దక్షిణపు సరిహద్దై యున్నది."

బాబూ ప్యారీమోహన్ ఆచార్జిగారి ఒరిస్సా చరిత్ర (౨౦-వ పేజీ) లోనూ, హంటరుగారి ఒరిస్సాచరిత్ర (౧-వ సంపుటము, ౭౦-౧౭౧ పేజీలు)లోనూ, ఆరమ్సు 'హిస్టరి ఆఫ్ హిందూస్తాన్' (౧-వ సంపుటము, ౩౩౫-వ పేజీ)లోను వ్రాయబడిన వ్రాతలనుబట్టి గంజాంజిల్లా అథమము ౪౦౦సంవత్సరముల కాలము ఉత్తరసర్కార్లతో కలిసియుండి, దక్షిణోత్తరరాజ్యములకు త్రోవయై యున్నట్లు కానవచ్చుచున్నది. మహమ్మదీయుల కాలమందుగాని, ఫ్రెంచివారి కాలమందు గాని, ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీవారి హయాములో గాని గంజాంజిల్లా ఒరిస్సాలోని అంతర్భాగముగా నుండలేదు.

శాసనములను బట్టి విమర్శించినచో, ప్రస్తుతము ఒరిస్సాలో చేర్చబడిన గంజాంజిల్లా భాగమందు ఓఢ్రులకంటె తెనుగువారే ప్రాచీనులని తెలియవచ్చుచున్నది.

గంజాంజిల్లాను విడదీసి ఒరిస్సాలో కలుపుట ఆంధ్రప్రాబల్యము గల ఉత్తరసర్కారులకు శిరస్సు కొట్టినట్లుండును.

ఇండియా గవర్నమెంటువారి తరఫున హెర్బర్టు రిస్లీగారు ౩-౧౨-౧౯౦౩ తేదీని శ్రీకాకుళము తాలుకాతప్ప శేషించిన గంజాంజిల్లా యావత్తున్నూ గంజాం-విశాఖపట్నముజిల్లాల మన్య ప్రాంతముల నన్నింటిని బంగళా ప్రభుత్వము లోనికి తీసుకువచ్చిన బాగుండునేమో, మీ యుద్దేశమేమని చెన్నపురిప్రభుత్వమువారికి ఉత్తరము వ్రాయగా, అప్పటి మద్రాసు గవర్నమెంటు ఛీఫ్ సెక్రటరీ యం. హామిక్ దొరగారు ౨౦-౮-౧౯౦౪ తేదీని వ్రాసియుండిన విపులమగు జవాబులో ఈయుద్దేశింపబడిన మద్రాసు రాష్ట్రభాగములను అన్యరాష్ట్రముతో కలిపినచో కలుగనున్న భాషావిషయకపు టిబ్బందు

లను, మన్య ప్రాంతములకు అన్యదేశ మిశ్రమమువలన రానున్న పరిపాలనా విషయకమగు ప్రతికూలాంశములను, వర్తకపు బాటల విషయములో ప్రతిబంధకములు మొదలగు వాటిని తెలిపియుండిరి. జయపురము సంస్థానమును ఒరిస్సాలో చేర్చుటకు గల ఆక్షేపణలను సి. ఏ. హెండర్సన్, ఐ. సీ.యస్. గారు ౧౯౩౦లో ఒరిస్సాకమిటీవారికి తమ ప్రత్యేక సాక్ష్యములో విరివిగా దెలిపియుండిరి (చూడుడు: ఒరిస్సాకమిటీ నివేదిక, ౨-వ సంపుటము, ౧౮౪-౧౮౮ పేజీలు). ౩౦-౯-౩౨ తేదీన గంజాం జిల్లాకలక్టరు గెల్లెటీదొరగారు గంజాం మన్యనివాసుల మహాసభ జరిపి వారిని ప్రశ్నింపగా వారందరున్ను ఒరిస్సాలో చేరుటకు తమ కిష్టము లేదనియే చెప్పియుండిరి. ఈ మన్య ప్రాంతములందలి ప్రజలు తరతరములనుండి ఆంధ్రుల సంపర్కము కలిగియున్నారు. ఈ ప్రదేశములలో కూడా తెనుగువారనేకులున్నారు. జయపురము జమీందారీ వ్యవహారము లన్నియు చిరకాలమునుండి తెనుగులోనే జరుగుచున్నవి. అచ్చటి ముఖ్యవర్తక మంతయు తెనుగు వారిదే. ౨౫-౫-౧౯౩౫ తేదీని దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి అధ్యక్షతను పార్వతీపురములో జరిగిన ఏజెన్సి మహాసభలో నీ క్రింది తీర్మానము సభాసమ్మతమై అధికార్లకు పంపబడెను: — సాంఘిక, ఆర్థిక, రాజకీయ విషయములలో వెనుకబడి యున్న ఆటవికజాతులు గల గంజాం విశాఖపట్నముజిల్లాల ఏజెన్సి భాగములు వరదలకున్ను, కాటకములకున్ను ఆటపట్టయినట్టిన్ని, ఆర్థికముగా పరపతి లేనటువంటిన్ని ఒరిస్సా రాష్ట్రములో చేర్చుట ఆటవికజాతుల పురోభివృద్ధికి విరోధము" (యువ॥ శ్రావణ శుక్ల ౫, యువ॥ శ్రా॥ శు. ౧౨, యువ॥ భా॥ శు. ౧౦ తేదీలు గల "సత్యవాణి" లో నేను విశాఖపట్నం మన్యప్రాంతముల నేల ఒరిస్సాలో చేర్చకూడదో విపులముగను, సకారణముగను వ్రాసియుంటిని).

౧౯౩౧ జనాభా లెక్కల ప్రకారము బరంపురము బీ. భాగమునందు మొత్తము ౯౬,౫౬౫ జనసంఖ్యలో ౨౩,౧౦౪ గురు జాతినిబట్టి ఓఢ్రులున్నూ ౨౫,౯౨౪ గురు భాషనుబట్టి ఓఢ్రులున్నూ కలరు; తెనుగువారు జాతినిబట్టి ౬౭,౦౯౭ గురు, భాషను బట్టి ౬౯,౫౪౫ మంది గలరు. బరంపురము పట్టణమందు తెనుగువారు నూటికి ౪౮ చొప్పున, ఓఢ్రులు ౪౭ చొప్పున గలరు. ఇండియామంత్రిగారు ఈవిషయ మంగీకరించుచూ "ఆర్థిక విషయములనుబట్టి చూచినను బరంపురమునందు ఓఢ్రులకన్న తెనుగు వారికి యెక్కువ హక్కులు కలవనుటకు సందియము లే"దని వ్రాసియుండియు, ఒరిస్సాకు దక్షిణభాగమున ఓఢ్రులకు ముఖ్యపట్టణము లేదనెడు అసందర్భపు కారణమును చూపుచూ ముఖ్యముగా తెలుగు వారి కృషివలన పెంపొందిన బరంపురము పట్టణమును ఒరిస్సాలో చేర్చుట అన్యాయము; ఆంధ్రుల దౌర్భాగ్యము.

జాతినిబట్టి చూచినా, భాషను బట్టి చూచినా పర్లాకిమిడి జమీందారీలో నేభాగముకూడ ఒరిస్సాలో చేర్చరాదు; కేవలము పర్లాకిమిడి మహారాజావారి కోరిక ననుసరించియే అన్యాయముగాను, అక్రమముగాను జమీందారీలోని రైతులు, ఈనాందార్లు, తదితర ప్రజలును కూడదని మొరపెట్టినను వినక, ఆ జమీందారీలో సుమారు మూడవ వంతు, ముఖ్యపట్టణమగు పర్లాకిమిడితోసహా, ఒరిస్సాలో కలిపివేసిరి. జమీందారీ లోని రెండువంతుల భాగము మద్రాసులో వదలివేయబడెను. ఈ తాలూకాలో ఉత్కళ ప్రాబల్యముగల ప్రదేశము కనీసము ౧౦ చదరపుమైళ్లమేర వ్యాపించినదైనా ఎక్కడను కనబడదు. ఈ తాలూకా ప్రతిభాగమందున్న ఆంధ్రుల ప్రాబల్యమే గోచరించుచున్నది. ప్రస్తుతము ఒరిస్సాలో చేర్చబడిన పర్లాకిమిడి తాలూకాలో భాషనుబట్టి చూచినచో తెనుగు వారు ౬౪,౯౬౫ గురున్నూ, ఓఢ్రులు ౫౨,౪౮౧ మందిన్ని కలరు. ఈ పర్లాకిమిడి జమీందారీ యెస్టేటును చీలికచేసి కొంత భాగమును ఒరిస్సాలో కలిపినందున ప్రజలకే కాదు; పర్లాకిమిడిమహారాజునకును కూడ అనేకకష్టనష్టములు వాటిల్లుచున్నవి. ౧-౪-౩౬ తేదీని పర్లాకిమిడి 'యాంటీ ఎమాల్గమేషన్ సొసైటీ' ప్రధానకార్యదర్శిగా నుండిన నేనున్ను, నాసహాయ కార్యదర్శియు, పర్లాకిమిడి ఆంధ్రుల తరఫున లండన్ నగరమునకు రాయబారిగా వెళ్లియుండినట్టియు శ్రీ

గిడుగు వెంకటసీతాపతి పంతులుగారున్ను పర్లాకిమిడి-ఒరిస్సా సమ్మేళనమును విపులముగా నిరసించుచూ నివేదికలను ప్రచురించి అధికార్లకున్ను, వార్తాపత్రికలకున్ను పంపియుంటిమి.

౧౯౦౪-వ సంవత్సరమునుండియు చెన్నపురి ప్రభుత్వమువారు గంజాం-విశాఖపట్నము జిల్లాలనుండి ఏభాగమునుగాని విడదీయుటకు తమ అసమ్మతినే తెలుపుచుండిరి. ౧౯౨౧, ౧౯౨౪, ౧౯౨౭, ౧౯౨౮, ౧౯౩౦ సంవత్సరములలో మరల మరల ఈ యుత్కళరాష్ట్రీయ సమస్య ఉదయించినపుడు చెన్నపురిరాష్ట్రమునుండి ఏభాగములను వేరుపరచి ఇతరరాష్ట్రమునకు చేర్చుటకై చేయబడిన ప్రయత్నములనైనను సకారణముగనే మద్రాసు ప్రభుత్వమువారు నిరోధించుచుండిరి. ౧౯౨౪-వ సంవత్సరమున భారతప్రభుత్వమువారు నియమించిన 'ఫిలిఫ్-డఫ్ విచారణసంఘము' పిలువని పేరంటముగా తమ్మడుగని విషయములను గురించి నివేదించియుండిరని మద్రాసుప్రభుత్వమువారా సంఘపు నివేదికను బహుభంగుల తీవ్రవిమర్శలకు గురిచేసిరి. సైమన్ కమిషన్ వారిచే నియమింపబడిన 'అట్లీ ఉపసంఘమువారు' పర్లాకిమిడి తాలూకానుగాని, జయపురము మన్యప్రాంతములనుగాని ఒరిస్సాలో చేర్చకూడదనిరి. ఒరిస్సా సరిహద్దుసంఘము (ఓడోనెల్ కమిటీవారు) జాతి, మాతృభాష, రెండవ ముఖ్యభాష, ఆ ప్రాంతీయుల అభిప్రాయము - ఈవిషయముల ననుసరించియే ఉత్కళరాష్ట్ర సరిహద్దుసమస్య పరిష్కరింపబడవలెనని అభిప్రాయపడుచూ, మొదటి మూడుషరతుల ననుసరించి పర్లాకిమిడి జమీందారీని చెన్నపురి రాష్ట్రమం దుంచుటయే ఆవశ్యకమనిరి; నాల్గవవిషయమందు మాత్రము పర్లాకిమిడిమహారాజావారి అనుచరుల సాక్ష్యమును, అందలి తప్పుసూచనలను ఆమోదించి ఫూకన్ మెహతా లనే ఇరువురు సభ్యులు అన్యాయముగా పర్లాకిమిడి తెనుగువారే ఒరిస్సాసమ్మేళనము నపేక్షించుచుండిరని వ్రాసిరి; సాక్ష్యసారమును సూక్ష్మబుద్ధితో పరిశీలించి ఓడోనెల్గారుమాత్రము పర్లాకిమిడి తాలూకాను ఒరిస్సాలో కలుపగూడదని తన ప్రత్యేక నివేదికలో వ్రాసిరి. ఈ పర్లాకిమిడి-ఒరిస్సాసమ్మేళనమే జరిగినయెడల పర్లాకిమిడి తాలూకా తెనుగువారే కాదు, చుట్టుపట్లనుండు తెలుగువారందరుకూడ ఒరిస్సాసమ్మేళన మనర్థదాయకమని అచిరకాలములో తీవ్రతరమగు ఆందోళనము సలుపుదురని కూడ వ్రాసిరి. ఈ ఒరిస్సాసమ్మేళనము ఎంతమాత్రము తమకిష్టములేదని సకారణముగ నిరూపించుచూ పర్లాకిమిడితాలూకా ఆంధ్రులు ౧౬౨ మహజర్లు ఇండియా కార్యదర్శిగారికి పంపించియుండిరి. మొదట శ్వేతపత్ర నిర్ణయముప్రకారము పర్లాకిమిడి ఒరిస్సాలో చేర్చబడకపోయిననూ, పర్లాకిమిడి మహారాజావారు తమ పలుకుబడి ప్రభావముననో, పట్టుదల కారణముననో తమకు నష్టదాయకమైనను జమీందారీలోని మూడవ భాగమును ఒరిస్సాలో కలిపించిరి.

భావి ఆంధ్రరాష్ట్ర నిర్మాణకాలమందు ఆంధ్రులు కార్యశూరులై ఈ అన్యాయములనన్నింటిని నిర్మూలనమొనర్చి అక్రమముగా ఒరిస్సాలో చేర్పబడిన భాగములనన్నింటిని ఆంధ్రరాష్ట్రములో చేర్పించి తమ ఆత్మగౌరవమును కాపాడుకొనెదరుగాక!

---

# ఉత్కళ - ఆంధ్ర సమస్య

## గంజాము, విశాఖపట్టణము ఏజెన్సీ భాగముల స్థితి

దూర్వాసుల వరాహనరసింహము

ఉత్కళుల నిరంతరాందోళన సామర్థ్యమున, అందు ముఖ్యముగ పర్లాకిమిడి రాజుగారి ప్రయత్నప్రాబల్యమున, ముప్పాతిక మూడువీసములు మన యాంధ్రుల సమయోపేక్షాభావమువలన అధికాంధ్రసంఖ్యాకములైన గంజాం మండలమందలి పర్లాకిమిడి బరంపుర ప్రాంతములును, విశాఖపట్టణమండలమందలి జయపుర, గుణుపుర ప్రాంతములును అసందర్భముగ అన్యాయముగ, ఆంధ్రుల కనంగీకారముగ, ఆర్థికాధారశూన్యమైన యుత్కళరాష్ట్రమున త్రోయబడినది మొదలు ఉత్కళాంధ్రసమస్య ప్రారంభమై, ఓఢ్రుల కేవల స్వార్థపరత్వమువలనను, సహనరాహిత్యమువలనను తీవ్రమై, తక్కువసంఖ్యగల జాతుల జన్మహక్కుల కాపాడుచు పక్షపాతము లేక న్యాయవంతులుగను ఉండవలసిన ముఖ్యాధికారుల యుత్కళపక్షపాతమున నిబిడమై, తుద కది ప్రస్తుత మిచ్చటి యాంధ్రులకు హృదయశల్యమై యున్నది. ఈ సమస్యకు గురియై బాధితులగుచున్న ఆంధ్రుల యవస్థ యాంధ్రమహాజనులయొక్కయు, ఆంధ్రనాయకులయొక్కయు దృష్టిపథమును ఇంతవరకు నాకర్షించలేకపోయినను ఇటుపైనైన నాకర్షించిననేకాని వీలులేని పరిస్థితులు కలుగు సమయము వచ్చుటచే దరిద్రరాష్ట్రమున పడి యిక్కట్టులపాలై యున్న యాంధ్రులయెడ గల సోదరభావముననో, ఒరిస్సారాష్ట్ర నిర్మాణకాలమున ఆంధ్రదేశము కోలుపోయిన ప్రదేశముల పునస్సంగ్రహణ దీక్షాపేక్షనో, గట్టి పట్టుదల కలిగి, కార్యసాధనకుతూహలులై విశేషప్రయత్నముతో నాంధ్రులును, నాయకులును, ముఖ్యముగ చెన్నరాష్ట్ర శాసనసభాంధ్రసభ్యులును తగినంత యాందోళన కావించి జయమును పొందిననేకాని కాగల యాంధ్రరాష్ట్రము సంపూర్ణరాష్ట్రము కానేరదు.

చెన్నపురినుంచి ఒరిస్సాలో మొన్న చేర్పబడినది కాక మరికొంతభాగముకూడ నొకప్పుడుత్కళమున కలసియుండి తర్వాత చెన్నపురిలో సంక్రమించినట్టు సూచించుచు తమ జాతీయ సంఘసౌకర్యమునకై తిరిగి దానినొరిస్సాలో చేర్చవలసియున్నదని ఉత్కళుల వాదన సారాంశము. మిగిలియున్న దనుకొన్న దానివిషయమై యింకను అప్పుడప్పుడు అనామకసంఘముల పేర తీర్మానము లుపపాదింపబడుచున్నట్లు, ఆంధ్రరాష్ట్ర విభజన ప్రయత్నమున వృథాప్రాతఃర్థికభావము వహించి యాంధ్రులంపెడి సమాచారముల తమ ప్రచురణాశక్తత చూపు ప్రత్యుత్తరములతో త్రిప్పివేయు "హిందూ" పత్రికాముఖమున మృషాసమాచార ప్రచారణమూలముగా నాందోళన జరుగుచునేయున్నది. ఈ ప్రాంతము లెప్పుడైన ఒరిస్సాలో నంతర్భూతములై యుండె ననుకొనుట వట్టి దుర్భ్రమ.

ఆంధ్రదేశమందలి, తద్వారా చెన్నపురి రాజధానియందలి యుత్తరమండలమైన గంజాముత్కళదేశముయొక్క దక్షిణ సరిహద్దును తగిలియుండుటచే ఉత్కళులు కొందరు — చిరకాలమై యుండవచ్చును — తమ సుఖజీవనార్థము దక్షిణముగా వచ్చి యా మండలమున నాంధ్రులతో కలసి నివసించి నానాటికి సంఖ్యాభివృద్ధినొందినను విద్యయందును, నాగరికతయందును వెనుకబడి యుండినందున చెన్నపురి ప్రభుత్వమువారు వారికి చదువుకొనుటకు సగముజీతములు చేసియు, ఉద్యోగము లిచ్చునపుడు ప్రాధాన్యమొసంగియు అనేక సౌకర్యములు కలుగజేయుచు వచ్చిరి. తత్ఫలితముగా ఇప్పటి కింతవారై వారిలో కొందరు మహాశయులు కళ్లుతెరచి స్తన్య మిచ్చిన తల్లి చంటినే కరచినచందాన ఇప్పుడు ఆ ప్రభుత్వమువారు తమకు "సవతితల్లి సహాయము" చేసిరని చెప్ప సాహసించుచున్నారు.

---

అది యట్లుండ ఉత్తరసర్కారులు బ్రిటిషువారి స్వాధీనమునకు వచ్చిన క్రీ. శ. 1766 సంవత్సరమునుంచియే కాక అంతకుముందు ఫ్రెంచివారిక్రిందను, తత్పూర్వము మహమ్మదీయుల దొరతనముక్రిందను నుండునపుడు—మొత్తము సుమారు 400 సంవత్సరములనుంచియు, అంతకుమున్ను హిందూరాజుల రాజ్యమందునుకూడ — గంజాము ఆంధ్రదేశభాగముగానే యుండెను గాని యుత్కళమున నున్నటుల ఎవ్విధమైన నిదర్శనలేశములును లేవు. అది అశోకునికాలమందును, మహాభారతకాలమందు సహితము ఆంధ్రదేశముననే యున్నదనుటకు ప్రబల నిదర్శనములు కలవు. ఇంతియకాక హంటరు దొరగారు వ్రాసిన ఒరిస్సాచరిత్రమున చిలుకసరస్సు దక్షిణమున నున్న కొండలవరుసయె యుత్కళరాజ్యమునకు దక్షిణసరిహద్దని వక్కాణింపబడియున్నది. కావున నుత్కళుల ఈ వాదము మిథ్యావాదమై యున్నది. ఉత్కళముతో నొకదిక్కున కలసియున్న గంజాంమండలమే యిట్లు చారిత్రకాంశములచే ఆంధ్రదేశమని దృఢపడుచుండగా ఇక మరియు దక్షిణమునుండి యుత్కళముతో ఏ దిక్కునను ఏ సంబంధమును లేని విశాఖపట్టణ యేజన్సీప్రాంతము లాంధ్రదేశములోనివే యని వేరుగ చెప్ప నవసరము లేదు. ప్రస్తుత జయపురరాజవంశపు మూలపురుషుడైన వినాయకదేవు సూర్యవంశస్థుడును, జమ్మూరాజవంశజుడును అయిన కనకసేనునికి ముప్పదిమూడవతరమువా డనియు, దక్షిణదేశమునకు వచ్చి శిలావంశజుడైన నందాపురరాజు కుమార్తెను వివాహమై తద్రాజ్యమునకు రాజయ్యెననియు జయపుర రాజవంశానుచరితము (Family chronicles) వలన తెలియవచ్చుచున్నది. వినాయకదేవునకు రాజ్యమును, కన్యను ఇచ్చిన శిలావంశపు రాజైన ప్రతాపగంగరాజు ఆంధ్రుడు. దీనివలన జయపురజమీందారీప్రదేశము ఆంధ్రదేశమే యని మరియు దృఢముగా స్థిరపడుచున్నది. వినాయకదేవుదరిమిలాను క్రీ. శ. ౧౫౯౭ మొదలు ౧౬౩౭ వరకు నందాపురరాజ్యమేలిన వీరవిక్రమదేవు శాసనములవలన "నందాపురంపట్టీ" యని వాడబడుచున్న అరఅగ్రహారములు తెలుగుబ్రాహ్మణుల కిచ్చినట్టును, వీరవిక్రమదేవు పిమ్మట ౧౬౩౭ మొదలు ౧౬౬౯ వరకు

రాజ్యము పాలించిన కృష్ణదేవమహారాజువద్ద పెరుమాళ్ల బసవయామాత్యుడను తెలుగు బ్రాహ్మణుడు మంత్రిగా నున్నటులను సీమంతినీకల్యాణ మను తెలుగుగ్రంథమువల్లను, నరసింహవాజపేయి యను ఆంధ్రబ్రాహ్మణుడు ఆస్థానతర్క పండితుడుగా నున్నట్టు గంగవంశానుచరితమువల్లను తెలియవచ్చుచున్నది. తెలుగులిపిలో నున్న వీరవిక్రమదేవు శాసనములవల్లను, క్రీ. శ. ౧౦౫౦ మొదలు ౧౩౭౪ వరకు చాలమట్టుకు తెలుగు లిపిలోనే యున్న బస్తరురాజ్యమందలి శాసనములవల్లను, తెలుగువారును, తెలుగుభాషయు పై రెండురాజ్యములలో ౮, ౯ వందల సంవత్సరముల క్రిందటనుంచి యున్నటుల స్పష్టమగుచున్నది. మొదటి విశ్వంభర దేవుకిమ్మట ౧౬౭౬ మొదలు ౧౬౮౧ వరకు జయపురమేలిన కృష్ణదేవమహారాజు ఉత్కళబ్రాహ్మణుల రప్పించి విశేషభూవసతు లిచ్చియాదరించెను. నిజ మిట్టులుండ "ఇల్లు చొరబెట్టిన వాసాలు లెక్కపెట్టినట్లు" ఆంధ్రదేశమునకు వచ్చిన యుత్కళులు ఆంధ్రులను, ఆదిమనివాసులైన యడవిజాతులవారలను అటుంచి మధ్య తామే స్వదేశస్థులము (Sons of the soil) అని ఎట్లు చెప్ప సాహసించుచున్నారో దురూహ్యముగ నున్నది. ఇంతియకాక విశాఖపట్టణము డిస్ట్రిక్టు గెజటీరులో ఉత్కళులు విదేశస్థులని (Foreigners) స్పష్టపరచబడియున్నది. జయపుర యేజన్సీప్రాంత పర్వతపంక్తులయందలి కనుమలజాడలు, నదుల పారుదల చొప్పు, వాని ప్రవాహోపయోగములు, విశాఖపట్టణ సమ ప్రదేశములతో వాణిజ్య సౌకర్యమునకు గల బాటలు, ప్రస్తుతపు రోడ్డుకాక జనుల కాలినడక రాకపోకల కనుకూలములగు కనుమల నడిమార్గములు కల ప్రదేశస్వభావము—వీటినన్నిటినిబట్టియు, ఉత్కళముతో నట్టి యెట్టి సౌకర్యములకు వీలు లేకపోవుటనుబట్టియు చూడ జయపుర సంస్థానము విశాఖపట్టణమండలముతోనే ప్రకృతిసిద్ధమైన సంబంధము గలదిగా నున్నది.

పై నుదాహరించిన చారిత్రక, శాసనిక, భౌగోళిక, గ్రాంథికాంశములవలన గంజాము మండలమందలి యే ప్రాంతముగాని, విశాఖపట్టణ మండలమందలి యేజన్సీప్రదేశముగాని యెన్నడును ఉత్కళదేశములో నంతర్భాగమై యుండలేదనియు, ఉత్కళరాష్ట్రమున క్రొత్తగా చేర్చిన యావత్తు చెన్నపురి భాగమును ఆంధ్రదేశమందలిదే యనియు నిశ్చయ మగుచున్నది.

ఉత్కళులు తామున్న ప్రదేశ మంతను ఉత్కళరాష్ట్రములో చేర్చవలసియున్నదని చెప్పుటకు ఆధారముగా చూపిన యింకొక కారణము తమ జనసంఖ్య ఆంధ్రుల సంఖ్యకంటె నధికమని. ఇరుగుపొరుగుల నున్న రెండుదేశములయొక్క పరిహద్దు ప్రాంతములలో ఈ దేశమువా రాదేశమున, ఆదేశమువారీదేశమున పరిహద్దునకు కొంతదూరమువరకు వ్యాపించుటయు, లేదా రెండుదేశములలోను ఎక్కువ నివాసయోగ్యమయిన ప్రదేశములో ఇతరదేశమువారు క్రమక్రమముగ ప్రవేశించియుండుటయు సహజముగ ప్రపంచమంతటను కానబడుచున్నది. అంతమాత్రమున, వచ్చినవారి సంఖ్య హెచ్చుగ నున్నను ఆ ప్రాంతమును వారి మొదటిదేశములో చేర్చమనుట న్యాయమా ? అందుకు ప్రభుత్వమువారుగాని దేశస్థులుగాని యొప్పుకొందురా ? బలవంతముగ చేర్చినచో అచ్చటి నివాసులకు అన్యాయము చేయుట కాదా ? ఉత్కళములో నిప్పుడు చేర్చివేసినదానికి ప్రభుత్వమువారుగాని, ఆంధ్రులుగాని అభ్యంతరములు చెప్పిరి కాని అంగీకరించుట లేదు. కావున యథాప్రకారస్థితికి తెచ్చుటయే విధి. వారి సంఖ్య



చంద్రగిరిలోని రామమహాలుయొక్క శిథిలపురోభాగము

రైనను తదితరుల సంఖ్యకంటె అధికమా యనిన అదియును లేదు.

ఉత్కళరాష్ట్ర విషయమైన యాందోళన ప్రారంభమై సుమారు ౨౦ సంవత్సరములకు అధికముగా కావచ్చినది. ౧౯౦౧-వ సంవత్సరమునకు పూర్వపు జనాభాలెక్కలలో గంజాంమండలమున ఉత్కళులు నూటికి యేబదిమంది యుండెడివారు. ఆందోళన ఆరంభమైన పిమ్మట ఎత్తిన ౧౯౦౧-వ జనాభాలో ఓఢ్రము వచ్చిన కొన్ని యాంధ్రజాతులను, కొన్ని యడవిజాతులను ఓఢ్రులనుగా వ్రాయుట మొదలగు మాయోపాయములచే ఓఢ్రుల సంఖ్య ౧౦౦ కి ౭౫ వరకు పెంచబడినది. జనుల న్యాయాధికత్వములు చెప్పవలసిన అన్ని సమయములందును వారు ౧౯౦౧ సంవత్సర జనాభాలెక్కలనే నొక్కి వక్కాణించుచుండిరి. తుద కా లెక్కలు తప్పని తెలిసినపిమ్మట ప్రభుత్వము వారుకూడ తప్పని యొప్పుకొనిరి. దరిమిలా జనాభాలలో యథాప్రకారముగ ౧౦౦ కి ౫౦ మందే వచ్చిరి. దీనివలన అధికమునకు కారణము స్పష్టమగుచున్నది. ౧౯౩౧-వ సంవత్సరమునకు రాష్ట్రనిర్మాణాంశము తీవ్రమైన యాలోచనలో నుండుటచే ఆ సంవత్సరజనాభాలో గంజాముమండలమునకు ఒక ప్రత్యేకో ద్యోగి ని ఏర్పాటుచేసి పై పరామరిక చేయించుటయేకాక జనాభా పై యధికారి తాను స్వయముగా తణిఖీచేసి పర్లాకిమిడి ఒరియా సూపర్వైజర్లు పై చెప్పిన ద్రోహమునకు ఒడికట్టిరనియు, అది తనకు విచారకరముగ నున్నదనియు సెన్‌సస్ రిపోర్టు ౧౪-వ వాల్యూమ్, ౩౦౩-వ పుటలో వ్రాసియున్నారు. ఇందువలన రాష్ట్రసంపాదనకై ఉత్కళు లెట్టిపని చేయుటకును జంకలేదని తెలియవచ్చుచున్నది. ఆ యిద్దరు ఉద్యోగులును కనిపెట్టనివి ఎన్ని యున్నవో తెలియదు. అంత జాగ్రతతో పనిచేయించిన గంజాంజిల్లాలోనే అట్టి సాహసకృత్యము జరిగియుండ, ఎట్టి పరామరిక లేక, ప్రాముఖ్యమున్న కొందరి యుత్కళుల పలుకుబడికిలోనైన విశాఖపట్టణ ఏజన్సీలో అట్టి ద్రోహ కృత్యములు చాల జరిగియుండుననుటకు ఏమి సందియము? ఏజన్సీలో ౧౮౯౧, ౧౯౦౧, ౧౯౧౧ సంవత్సరముల జనాభాలలో ఉత్కళులలో చేర్చరాని కొన్ని జాతులను పొరపాటున చేర్చి లెక్కించుటచేతను, ౧౯౨౧, ౧౯౩౧ సంవత్సరములలో దురుద్దేశపూర్వకముగ చేర్చి లెక్కించుటచేతను ఉత్కళుల జనసంఖ్య హెచ్చుగ కనబడుచున్నను పక్షపాతములేక ఇప్పుడు లెక్కించినచో ఆదిమనివాసుల సంఖ్య అధికముగను, ఉత్కళులయొక్కయు ఆంధ్రులయొక్కయు సంఖ్య రమారమి సమానముగను ఉండక తీరదు. ఉత్కళాంధ్రుల జనసంఖ్య కొంచెము హెచ్చుతక్కువగా సమానమని గెజటీరుకూడ దృఢపర్చుచున్నది. ౧౯౦౧సంవత్సరము దరిమిలాను ఆంధ్రు లనేకులీప్రాంతమునకు వచ్చి కాపుర ముండుటచే వారి సంఖ్య హెచ్చుగుటకు మారుగ తగ్గియుండుటకు కారణము వేరుగ వెదకనక్కర లేదు. ఇంత యేల? ఈ జయపురసంస్థానమే రాష్ట్రములో నుండవలయునను అంశము నిష్పాక్షికముగను, సహేతుకముగను, పూర్తిగను ఆలోచింపవలసినచో ఆంధ్రులసంఖ్య అధికమా, ఉత్కళులసంఖ్య అధికమా అను ప్రశ్నతో నిజముగ సంబంధము లేదు. అధిక సంఖ్యాకులును, ఆదిమనివాసులును, అనాగరికులును, ప్రభుత్వమువారిచే రక్షితవ్యులును, ఆర్థికాధారహీనులును అయిన నోరులేని యడవిజాతులవారిని ఏరాష్ట్రము తగినంత ధనము వెచ్చించి, దేశము వెల్లడిచేసి, అన్ని విధముల వృద్ధిచేసెడు శక్తి గలిగియున్నదో అట్టి రాష్ట్రమున జయపుర ముండవలయును. దినవెచ్చమునకే ఇండియా ప్రభుత్వమువారి సహాయము నర్థించుచు ఏపని చేయుటకును డబ్బులేక, చేతులు పిసికికొను రిక్త యుత్కళ రాష్ట్రమునకు వారి నుద్ధరించు సామర్థ్య మెట్లు గలుగును? పర్వతారణ్యప్రదేశ వస్తు సామగ్రుల విశాఖపట్టణము రేవున కెగుమతి చేసి ఈ యడవి ప్రజల ఆర్థికాభివృద్ధి చేసెడు సదుద్దేశముతో చెన్నపురి ప్రభుత్వమువారు అధిక ధనవ్యయమున నారంభించి, కొంత పని చేయించిన "అనంతగిరి - జయపూరురోడ్డు" దిక్కైన చూడక ఒరిస్సా ప్రభుత్వమువారు ఉపేక్షించి యూరకుండుట డబ్బులేకయే కదా! కల్లుసారాల త్రాగుడుచే డబ్బు కర్చుపెట్టుకొని ప్రజలు చెడిపోవుచుండుట చూచి కాంగ్రెస్ ప్రభుత్వమువారు మద్రాసు మొదలగు రాష్ట్రములలో త్రాగుడు బహిష్కారము చేయ ప్రయత్నించుచుండగా రాత్రింబగళ్లు తిప్పత్రాగి, డబ్బు పోగొట్టుకొని, శరీరములు పాడుచేసికొని, తిండికిలేక, అధిక దుఃఖములపా లగుచున్న ఈ యేజన్సీప్రజల త్రాగుడు కట్టిపెట్టు ప్రయత్నము ఆకాంగ్రెస్ ప్రభుత్వమువారే ఒరిస్సాలో ఏమైన చేయగలుగుదున్నారా? మరి యేబదివత్సరములకైన ఈ ప్రజల కట్టియదృష్టము పట్టనేర్చునా? అట్టి స్థితిలో ప్రభుత్వమువారికి రాబడి తక్కువ, చేయవలసిన వెచ్చ మెక్కువ గల జయపురసంస్థానమును ఒరిస్సాలో చేర్చినందువలన ఒరిస్సానాయకులకు వ్యర్థమనోవిలాసము కలుగుట తప్ప ఎవరికి లాభమైనది? ప్రభుత్వమువారికా, ఆర్థిక దారిద్ర్యమునకు తోడు వ్యయ మధికమగుట; ప్రజలకా, సౌకర్యశూన్యతయేకాక అధోగతి కవకాశముగలుగుట తటస్థించును.

పై కారణములచేతను, ఓఢ్రము మరచిపోయి ఆంధ్రమునే వాడుచున్న శిష్టకరణములు ఓఢ్రులేకాని యాంధ్రులు కానేరనట్లు తమ భాషను మరచిపోయి ఓఢ్రమునే వాడుచున్నట్టియు, తమభాషను ఓఢ్రమును కూడ వాడుచున్నట్టియు ఆదిమజాతులవారు కొందరు ఓఢ్రుల జనసంఖ్య హెచ్చించుటకు జనాభాలో ఓఢ్రులుగా వ్రాయబడినంత మాత్రమున ఓఢ్రులు కానేరని కారణముచేతను జనసంఖ్య ననుసరించి రాష్ట్రయోచన చేయుటకుగాని, అథవా న్యాయముగా యోచించినను ఈ ప్రాంతముల నొరిస్సాలో చేర్చుటకుగాని ఎంతమాత్రమును వీలులేదు. ఆర్థికముగా చూచినచో రాష్ట్రమునకే అనిష్టకరము.

పూర్వమున నున్నవారుకాక సుమారు ౭౦, ౮౦ సంవత్సరములు మొదలు ౧౦ సంవత్సరముల క్రిందటివరకు గల కాలమున అనేకులైన యాంధ్రులు వివిధజాతులవారు తమ జన్మస్థలములతో గల సంబంధములనెల్ల వదలుకొని, కుటుంబములతో నీ యేజన్సీకి వచ్చి నివాసముల స్థిరపరుచుకొని తమ కనుకూలములైన వృత్తులలో ప్రవేశించి సుఖజీవనము చేయుచున్నారు. కొందరు వివిధశాఖల యుద్యోగములలోను, కొందరు వర్తకములోను, కొందరు వ్యవసాయములోను, కొందరు వివిధములైన చేతిపనులలోను, మరి కొందరు బళ్ల పెరకువయందును ప్రవేశించియున్నారు. ఇచ్చటి వర్తకు లందరును, మిల్లు బస్సు లారీ సొంతదారులందరును ఆంధ్రులే. బళ్లవాండ్రు, తాపీపనివాండ్రు, కట్టుపనివాండ్రు, బంగారము, వెండి, యినుము,

కర్రపనివాండ్రును, క్షౌరకులును, కంట్రాక్టుదారులును ఆంధ్రులే. ఎక్కువగాని, తక్కువగాని మూలధనముపెట్టి చేయవలసిన అన్ని పనులలోను ఆంధ్రులు లేనిది లేదు. చదువుకొన్నవారిలో ఆంధ్రులసంఖ్యయే హెచ్చు. అధికముగా పన్నులు కట్టువారును ఆంధ్రులే. ఇచ్చటి నాగరికతకు కారణమైనవారును, సంవత్సరమునకు ౫ లేక ౬ రూపాయిల చొప్పున కొన్ని సంవత్సరములకు ముందుగా సొమ్మిచ్చి, నెలకు పిచ్చుకుంచముతో పుట్టెడు చొప్పున భత్యమిచ్చుట, గైరుహాజరైన దినములకు రోజుకు రెండణాలచొప్పున ముజరా పుచ్చుకొనుట వగైరా షరతులతో యిచ్చిన సొమ్ము తీరువరకు పత్రము వ్రాయించుకొని బానిసలచేతనువలె పనులు చేయించుకొను ఉత్కళులవలెగాక వయసునుబట్టి ౪,౫ లేక ౬ రూపాయిల చొప్పున నెలజీతము లిచ్చి పనులు చేయించుకొనుచు అడవిజాతులవారికి సదుపాయము చేయువారును ఆంధ్రులే. ఇన్ని విషయముల ప్రాముఖ్యము కలిగియున్నను ఇందుదహరించు ఉత్కళసోదరుల వర్తనమువలన అధికారుల యనాదరణవలన ఉత్కళరాష్ట్రమున నాంధ్రులభవిష్యత్తు అంధకారబంధురముగా తోచుచున్నది; ఏలయన, ఈ ప్రాంతములు ఉత్కళరాష్ట్రమున చేరినపిమ్మట ఉత్కళసోదరు లాంధ్రులను తమతోడిపాటు సమానహక్కులు గల యేకరాష్ట్రీయులనుగా సుహృద్భావమున చూడక ఎక్కడనుండియో కొట్టుకొనివచ్చినవారినివలెను, ఉత్కళమున నెట్టి హక్కులకును అనర్హులైనవారినివలెను ఊహించుచు విద్వేషభావమున నున్నారు. ఉత్కళరాష్ట్రము ఉత్కళులకే యనియు, తదితరుల కెట్టిహక్కులును అం దుండజాల వనియు చాటుచున్నారు. దానికనుగుణముగా రాష్ట్రారంభము మొదలు ఒరిస్సాప్రభుత్వమువా రేర్పరచిన అన్నిశాఖల యుద్యోగములలో పాట్నా హైకోర్టువారిచే నిష్పక్షికముగా నియమింపబడిన యిద్దరును, వైద్యశాఖలో నొకరును, ముప్పదిమంది ఎక్సైజు సబ్ ఇనస్పెక్టర్లలో నొకరును, అచ్చటచట చిన్న గుమాస్తాపనులలో నున్నవారిలో కొంతమందియు తప్ప తక్కిన అనేక యుద్యోగములలోను ఉత్కళులేకాని తగిన యభ్యర్థులున్నను ఆంధ్రులు నియమింపబడలేదు. సబ్ డిప్యూటీ కలక్టర్లలోగాని, పోలీస్ సబ్ ఇనస్పెక్టర్లలోగాని తెలుగువారిని వేయలేదు.

ఉద్యోగమునం దధికకాలము గడపినట్టియు, అధికార్హత కలిగినట్టియు ఆంధ్రోపాధ్యాయుల హక్కుల త్రొక్కిపెట్టి వారి దిగువనున్న యుత్కళుల పైకి త్రోయుచున్నారు. గుణుపురము హైస్కూలు ప్రధానోపాధ్యాయుని యుద్యోగానంతరమున ఆ పనిలో నియమింపబడుటకు తగిన యెక్కువ సర్వీసు మొదలగు అర్హతలు హక్కులును గల ప్రథమసహాయోపాధ్యాయుడైన యొకయాంధ్రుని, అతనితర్వాత యెక్కువ సర్వీసు అర్హతకల జయపురము హైస్కూలు ప్రథమసహాయోపాధ్యాయుడైన మరియొక ఆంధ్రుని తప్పించి సర్వీసులోను, గ్రేడ్‌లోను వారిరువుర దిగువను ఉన్న ఒరిస్సా ప్రధానమంత్రిగారైన గౌరవనీయులగు విశ్వనాథదాసుగారి సమీపబంధువును ప్రధానోపాధ్యాయపదవిలో నియమించిరి. కొన్ని పాఠశాలలలో ఆంధ్రపండితులను తీసివేయవలసినదిగా కోరాపుట్టిమండల సంఘములో ఔద్యోగిక తీర్మానము లుపపాదింపబడియున్నవి. రాజకీయోద్యోగములలో జాతి మతభేదములు చూడక కేవలము అర్హతననుసరించే వ్యక్తుల నియమించవలయునని ప్రభుత్వనివేదికలో ప్రచురింపబడియున్నను ఫలితమునకు పై గుణుపుర ప్రధానోపాధ్యాయపదవియే తార్కాణ. కొన్ని మాసముల క్రిందట పోలీస్ సబ్ఇనస్పెక్టర్ల యెంపుడు సమయమున కొందరాంధ్రులు వెళ్లగా జిల్లా కలెక్టరు ఆర్. సి. యస్. బెల్ దొరగారు వారిని మొదటే పొమ్మని సూపరింటెండెంటుగారు చెప్పినపైని మరల రప్పించిరట; కాని ఉత్కళులకన్న యాంధ్రు లుత్తమముగా నుత్తీర్ణులైనను ఫలితముమాత్రము సున్న. నిష్పక్షికముగా అన్ని జాతుల శ్రేయస్సును చూడవలసిన ఆంగ్లేయాధికారులే యిట్లొకపక్షమువారైయుండ ఆంధ్రులకు న్యాయ మెట్లు దొరకగలదు? ప్రస్తుత కోరాపుట్టి మండలము ప్రజాప్రతినిధిపాలనకు కొరవడిన ప్రదేశమగుటచే స్థానికపాలనాసంఘసభ్యత్వమున కిప్పుడు నియామకమే కాని యెన్నికలు లేనందున ఔద్యోగికాధ్యక్షుడగు కలక్టరు సభ్యుల నియమించును. ప్రస్తుత మండలసంఘసభ్యులలో అనౌద్యోగికాంధ్రు డొక్కడును లేడు. తాలూకాసంఘములో నొక్కడు మాత్రము కలడు. జయపురములో ఆంధ్రులు చెల్లించుపన్ను లుత్కళులు చెల్లించువాని కంటె నధికమైనను గ్రామపాలనాసంఘములో నితరనియుక్తులు పోగా మిగిలిన యేనమండ్రలో యిద్దరే యాంధ్రులు కలరు. ఒరిస్సారాష్ట్ర శాసనసభ్యులలో కోరాపుట్టి మండలమునుండి ఎన్నికలచే ముగ్గురును, హీనస్థితి గల జాతులతరఫున నియుక్తులిద్దరును మొత్తమైదుగు రుండవలయును. కొన్ని స్థానికపరిస్థితులచే ఎన్నికలలో నాంధ్రులు నిలబడుటకు వీలులేక గవర్నరుగారి వద్దకు రాయబారము వెళ్లిన నియుక్తులలో నొక్క యాంధ్రుడైన చేర్చవలయునని మనవి చేసికొనినను ఆంధ్రులప్రార్థన మంగీకరించరైరి. ఒరిస్సా గవర్నరుగారు గత నవంబరులో కోరాపుట్టి దయచేసినప్పుడు ఆంధ్రులు రాయబారమంపి తమ ప్రతిబంధకముల నన్నిటిని వ్రాతమూలమున విశదపరుచుకోగా ప్రత్యేక ప్రత్యేకముగా అంశములు చర్చించునపుడు ఒకవిధముగా నొప్పుకొనుచు, వారు ఆంధ్రపండితులగురించి జవాబు యిచ్చుటలో, "పండితులను తీసివేసినచో ఆంధ్రోత్కళులకు సమాన ప్రతిబంధకమే కదా" యని సెలవిచ్చిరి. ఒక్క ఆంధ్రపండితులనే తీసివేయుటకు ఏర్పాటని రాయబారులు మనవిచేయగా జవాబు చెప్పక యూరకొని మొత్తమున మీ యసంతుష్టికి కారణము లేదని పంపివేసిరి. దరిమిలాను అదివరకు అనుమతిని పొందని యుత్కళుల రాయబార మంగీకరించి, వారి యంశములనుగురించి మాటలాడుచు గవర్నరుగారు చెన్నపురిలో ఉండిపోయిన యుత్కళుల ప్రతిబంధకముల విషయమై వ్రాయలేదేమని అడిగినట్లు తెలియవచ్చినది. అది సత్యమే అయినయెడల వారికి ఉత్కళులయెడ గల సుముఖత్వమును, ఆంధ్రులయెడ గల పరాఙ్ముఖత్వమును స్పష్టమగుచున్నది. అట్టిజాడల కనిపెట్టియే కాబోలు తెలుగు కోర్టుభాషగా నుంచక, ఒక్క ఒరియానే యుంచవలయునని, అధికారయుక్తోద్యోగములనుంచి యాంధ్రులను తొలగించి యుత్కళుల నియమించవలయునని, తాము కొండజాతులు కలిసి జనసంఖ్యలో ౧౦౦ కి ౯౬ మంది యున్నామని యసత్యప్రచారముకావించుచు, తమసంఖ్య ఆతరమునకు వచ్చువరకు ఆంధ్రులకు మాని తమకే యుద్యోగము లిచ్చుచుండవలయునని, వర్తకమంతయు ఆంధ్రులే చేయుచున్నందున వారి కనుకూలముగా ఎగుమతి దిగుమతులకు రాకపోకలకు ఉపయోగించకూడదను నుద్దేశముతో సాలూరు ఘాటీరోడ్డు

బహిష్కరించవలయునని, పాఠశాలలలో కేవలము ఒరియాభాషనే నేర్పవలయునని ఇచ్చటి యుత్కళప్రముఖులు కొందరు ఆందోళన కావించుచున్నారు. విద్యాభ్యాసనము మాతృభాషామూలమున జరుపు ప్రయత్నముతో ఒరిస్సాప్రభుత్వముపా రోకసమితి నేర్పాటు చేసినట్లు తెలియవచ్చుచున్నది. దాని ఫలిత మాంధ్రభాషయెడల ఎట్లు పరిణమించునో తెలియదు.

ధాన్యము, బియ్యము, చింతపండు, శనగలు, గోధుములు, తోళ్లు, ఆవాలు, వలిశలు, పిప్పలిమోడి, రెల్లచెక్క, కరక్కాయలు, కలపమున్నగునవి జయపురమునుండి సాలూరు విజయనగరములకు ముఖ్యముగా ఎగుమతి యగును. ఆ స్థలములనుంచి జయపుర ప్రాంతమునకు ఉప్పు, కిరసనాయిలు, బట్టలు, నూలు, కాగితములు వగైరా వ్రాతసామగ్రులు, కిరాణాసామానులు, తమలపాకులు, ఇనుపసామానులు, నూనె, నెయ్యి, సున్నము మొదలగునవి దిగుమతి యగును. జయపుర ధాన్యము సాలూరు, బొబ్బిలి, గజపతినగరం తాలూకాలలోను, బియ్యము వగైరాలు విజయనగరము, విశాఖపట్టణపు మార్కెట్టులలోను ఖర్చగును. వలిశలు వగైరాలు పైకి ఎగుమతి యగును. నవరంగపురమునుండి జయపురముమీదుగా రెండు బస్సులును, సాలూరునుంచి నవరంగపురమువరకు రెండు బస్సులును జనుల రాకపోకల నిమిత్తమును, ఎగుమతి దిగుమతుల నిమిత్తమును — రాను ముప్పది, పోను ముప్పది — లారీలును, వందలకొలది బండ్లును ప్రతిదినము తిరుగుచుండును. సాలూరు ఘాటీమీద లెక్కించినచో ప్రతిదినము వచ్చెడి పోయెడి బండ్లు సుమారు ౧౫౦౦ లకు తక్కువ యుండవు. సాలూరు గొప్ప వర్తకస్థలమగుటచే సాధారణవర్తకమే కాక యావత్తు కొండవర్తకమును సాలూరుతో జరుగుచున్నది. ఉత్కళుల యాందోళన సాలూరు ఘాటీరోడ్డు విడిచిపెట్టి కోరాపుట్టినుంచి రాయగడకు పక్కారోడ్డు వేయవలయునని —. ఉద్దేశము? ఆంధ్రదేశముతో సంపర్కము లేకుండ చేయుటకు. ఈ రోడ్డు వేయుట సర్వజనసమ్మతమే. ఇదివరకే చెన్నపురి ప్రభుత్వమువారు లక్ష్మీపురమువరకు కొంత వేయించియే యున్నారు. కోరాపుట్టి ప్రాంతమునుండి రాయగడ ప్రాంతమునకు అటునుంచి యిటు పోవలసిన యుద్యోగులకు ప్రజలకుమాత్రమే ఉపయోగించును గాని వర్తకమునకుగాని, దిగువదేశముతో రాకపోకలు జరుపుటకుగాని, విస్తారము చుట్టుదారి యగుటచే అధికవ్యయమే కాక మిక్కిలి యసదుపాయముకూడ కలుగును. పొట్టంగి తాలూకానుంచి సాలూరుతో జరుగు కొండ వ్యాపారమునకు అవసరముగాని, వీలుగాని బొత్తిగా లేదు సరేకదా సాధారణవర్తకమునకును మిగుల ప్రతిబంధకమై యుండును. ఒకబియ్య ముదాహరణగ తీసికొని చూచిన తక్కినవానినిగురించియు తెలియగలదు. ధాన్యపుపంట రాయగడ, గుణుపురప్రాంతములందు అధికము. కావున క్రొత్తమార్గము ద్వారా జయపురబియ్యము ఎగుమతిచేసినచో సముద్రమున కుప్పదర్శనమువలె నుండును. రాయపురప్రాంతములందును వరిపంట విస్తారముగా నుండుటచే జయపురబియ్య మవసరము లేదు. కాగా, తిరిగి విజయనగరమునకే రైలుమార్గమున పంపవలయును. చుట్టుదారివలన కలిగెడు అధికఖర్చులకుతోడు రాయగడనుంచి రైలుపై నెగుమతిచేయుటకు నిలువవలన కలుగు ఖర్చులు కలిపి బియ్యము నమ్మవలసివచ్చును. అందుచే దూసినుంచియు, గుణుపురమునుంచియు, రాయపురమునుంచియు వచ్చు బియ్యముతో సమముగా నమ్ముటకు వీలులేక జయపురములో ధర తగ్గించవలెను. తగ్గించినయెడల వ్యవసాయదారులగు కొండజాతివారి కొంప మునుగక తీరదు. సాలూరు రోడ్డుకారణమున కలిగిన వర్తకముచే ఇచ్చటి పంటలకు ధరలు కలిగి వ్యవసాయదారులకు ఒక పూటకైన ఇపు డన్నము దొరకుచున్నది. మరియు ఈ యేజన్సీలో అవసరమై, దిగువనుంచి వచ్చు ఉప్పు వగైరాలకు కూడ క్రొత్తమార్గమున వచ్చుచో ధర లధికమగును. అందుచే ఇచ్చటి వ్యవసాయదారులు "గోడపెట్టు చెంపపెట్టు" అన్నట్టు రెండువిధములను నష్టముపొంది తిండికిలేక యుందురు. ఇంతియగాక వర్తకులు, బస్సు, లారీ, మిల్లుల సొంతగాండ్రు, బండ్లవాండ్రు అయిన ఆంధ్రులకే కాక ఆ దెబ్బ దేశమంతకు తగులును. కావున ఒరిస్సాప్రభుత్వమువారు దూరదృష్టిలేని కొందరి యుత్కళుల ఆందోళనను సరకుగొనక నూతనమార్గము పూర్తియైన పిమ్మట సాలూరురోడ్డును విడిచిపెట్టక తగిన మరమ్మత్తులు చేయించుచు యథాస్థితిలో నుంచెదరు గాక!

ఈ ప్రదేశమందలి ప్రజ లందరియొక్క నానావిధ సౌకర్యములకై చెన్నపురి ప్రభుత్వమువారు సంవత్సరమునకు మొత్తమున 30 లక్షల రూపాయీల చొప్పున వెచ్చము చేయుచు వచ్చిరి. ఆవిధముగా ఖర్చుపెట్టుటకు ఒరిస్సాప్రభుత్వమువారికి శక్త్యెక్కడిది? ఈ యన్ని కారణములచే కోరాపుట్టి మండలమందున్న యాంధ్రు లొరిస్సాలోనే యుండవలసినచో పెక్కు ఇక్కట్టులకు పాలుకావలసివచ్చును. దీనికి కర్తవ్యము ఆంధ్రనాయకులు ప్రబలప్రయత్నము చేసి ఒరిస్సాలో కలుపబడిన యాంధ్రభాగముల మరల ఆంధ్రరాష్ట్రమున చేర్పించుటయే.

# ఆంధ్రవాణి

కేసరి ఆదినారాయణ శర్మ

ముగురుమూర్తులు నీకు ముత్యాలహారమ్ముఁ జేసి వైచిరి; మురువుఁ జిలుకరించి
నిజువేద యొక్కండు నిర్మలభక్తి యను కమ్మకస్తురి తిలకమ్ము దీర్చె
కుమ్మరకొలముది కొమ్మ యొకర్తుక మగఱాల హావణిల్లు మకుట ముంచె
శృంగారరసపిపాసి యొకం డమృతబిందువులఁ జిందు నొక కొన్ని ఫలము లిచ్చె
ముద్దుపల్కుల దిట్ట మూచూపఁగాఁ గల్గెఁ బారిజాతమ్ముల సౌరభమును
వెలవెలందుక యొర్తు వెలలేని బంగారుచీరఁ గట్టఁగఁ బెట్టి సౌరు గూర్చె
గడన కెక్కఁగఁ జేసె నీ నుడులకడిమి
'నల్లికల బిగువు'ను జూపి యయ్యె యొకఁడు
'మృదుల వాగ్గుంభనము' నొక్క మేటి చాటె
నఖిలహితవాణి! కల్యాణి! ఆంధ్రవాణి!

కల్పనాచాకచక్యములోనఁ జేమించి పింగళివారింటఁ బెరిఁగినావు
ఒకమాట పై కని యొండు రెండర్థాల భూషణాదులచేతఁ బొలిచినావు
భావరంజక పద లావణ్యమును గూర్చి చేమకూరకుఁ బస చేర్చినావు
అచ్చంపుబాస మాటాడఁగా నేర్చి తిమ్మన్నలతో నాట లాడినావు
ఔర! నీపెంపు నీసొంపు నీరసజ్ఞ
తా విశేషపాకంబును నీ విలాస
చేష్టలును జూడఁజూడ నచ్చెరువు సూవె
అఖిల హితవాణి! కల్యాణి! ఆంధ్రవాణి! *

'విజ్ఞానచంద్రికా' విహారణమ్ముల నల్పి 'సాహితీసభల' విశ్రాంతి గాంచి
ధృతి 'నాంధ్రపత్రికా' తేజమ్ము నెలరించి 'భారతీ' కీర్తి నింపార నెఱపి
'గ్రంథమాలా'వనుల్ గలయంగఁ ద్రిమ్మరి 'అవతారతత్త్వా'ల నవధరించి
'నవ్వులతోఁట'లోఁ బువ్వుల నూరిచి 'సర్వస్వఖను'లను సరగ నెమకి
'కృష్ణవేణియు' నీకళాతృష్ణఁ దీర్ప
లలితనీరాజనము 'గృహలక్ష్మి'యిడఁగ
'విశ్వవిద్యాలయా'ంగన విందు వెట్ట
హాయిఁ గనినట్టి రాణి వీ వాంధ్రవాణి!

* సూచన:—గీతములోఁ బై పాదములకు వరుస కలదు. మొదటిపాదములోఁ గళాపూర్ణోదయము, రెండవపాదములో రెండర్థాల యలంకారము లని, రెండర్థాలచే రామరాయ భూషణాదుల నని, మూఁడవపాదములో లావణ్యము లవణ సంబంధ మని రెండవ యర్థము, నాలవపాదములో తిమ్మన్నలతో ననుట కూచి మంచి, పుష్పగిరివారలతో ననియు గమనింపఁగలరు. కే. ఆ.

శ్రీరంగపతి భక్తి సేవించి మధురమీనాక్షీశు పదపూజన మ్మొనర్చి
వేంకటప్రభునకు వినతుల నర్పించి కాళహస్తీశు నగ్గలిక మ్రొక్కి
రంగనాయకుని నారాధించి సింహపురీశ్వరు నర్చలఁ బ్రీతుఁ జేసి
కిష్కింధ వీక్షించి కృష్ణరాయని సభాస్థానాంగణమున స్వేచ్ఛగఁ జరించి
శ్రీమల్లికార్జును సిరిగిరిలోఁ జూచి యతని వాకింటికి నతు లొనర్చి
కంబానఁ బొడమిన ఘను నహోబిల నృసింహుని ముక్తిధనదునిఁ గని యెఱింగి

కొండవీడును నద్దంకి గోలకొండ
రాజమహేంద్రమ్ము పలనాడు రాచకొండ
లెలమిఁ బర్యటనమ్ములఁ జెలఁగి తౌర!
అఖిల హితవాణి!, కల్యాణి! ఆంధ్రవాణి! *

కృతికన్యకల కర్హపతుల నన్వేషించు కవిశేఖరులఁ గాంచఁ గలుగునపుడు
భువనప్రశస్తమై పొలుచు భాషాసేవ నిఖిలాభినంద్యమై నెగడునపుడు
శిల్పకల్పనయం దనల్పచాతురిఁ జూపు కవిలోకనుతు లందఁ గలుగునపుడు
అభినవమార్గవిహారులై యెసఁగు భావకవుల ధృతి నెన్నవలసినపుడు

ప్రాజ్య సామ్రాజ్య వైభవోపమ సుఖమ్ము
నంది యానందమును గాంచునట్టి ధన్య
వీవెకద నిస్తులామోద భావవిలస
దర్థభూషారుచిరవాణి! ఆంధ్రవాణి!

కాశినాథునివంశకలశాబ్ధిచంద్రుండు నిన్ను గోముగఁ బెంచుచున్నవాఁడు
శ్రీపాదవంశప్రసిద్ధమౌక్తికము నిన్ హైనసేయఁగల దిట్ట గాఁడు చెంత
చెళ్లపిళ్ల కులాబ్ధిశీతాంశుఁడు గలండు నీకీర్తి దిక్కులు నిండఁజేయఁ
బిఠాపురనేత పేరోగమున నిన్ను రుదార నెలకొల్పి యరయుచుండు
పండితసత్కార భవ్యకీర్తి సమగ్రశీలి యున్నాఁడు గద్వాలజేఁడు
జాషువకవి నూత్నభూషణములు మేల్మిసూడిద లయి నీకు సొగసు దెచ్చు

జయపురాధీశ్వరుఁడు నిన్ బ్రశస్తరత్న
ఘటితసింహాసనాసీనగా నొనర్చు
నీదు మురిపెంపు నుడిసొంపు నేర్పు గూర్పు
అఖిలకల్యాణములరాణి! ఆంధ్రవాణి!

---

*సూచన:—పైఁ గనిన క్షేత్రాదులెల్లను నాంధ్రకావ్య పురాణాదిక ప్రసిద్ధంబు లగుట నాంధ్రవాణి పర్యటనమ్మునఁ జేర్పఁగల్గితి నని మనవి.

కే. అ.



# ఫెడరేషను: రాష్ట్రములు - ధనసమస్య

తిమ్మరాజు సత్యనారాయణరావు

"ధనమూలమిదం జగత్" అనేలోకోక్తి అందరికీ తెలిసినదే. అది వ్యక్తులవిషయంలో ఎంత నిజమో, ప్రభుత్వాలవిషయంలోనూ అంతే నిజము.

మన రాష్ట్రంలోనూ, ఇంకా ఆరురాష్ట్రాలలోను కాంగ్రెసుమంత్రివర్గా లేర్పడినవి. పరిపాలన ప్రజాప్రతినిధుల చేతులలోనికి వచ్చింది. ప్రజలందరూ గంపెడాసతో ప్రభుత్వం ఏమేమో చేసి తమస్థితిని ఒక్కసారిగా బాగుచేసేస్తుందని ఎదురుచూస్తున్నారు. విద్యావ్యాప్తి కావాలి; త్రాగేటందుకు, వ్యవసాయానికి నీళ్లు కావాలి; రోడ్లు, వంతెనలు కావాలి; ఆస్పత్రులు, డాక్టర్లు, మందులు, మంత్రసానులు కావాలి; వ్యవసాయాభివృద్ధికి పరిశోధన, ప్రచారము, ప్రదర్శనము కావాలి; రైతులు తయారుచేసిన వస్తువులు అమ్ముడుపోయే ఏర్పాట్లు కావాలి; వారికి తగురీతిని అప్పులుకావాలి; కార్మికులకు, పేదలకు ఇండ్లు కావాలి; అనాథలకు అన్నం కావాలి; నిరుద్యోగులకు ఉద్యోగం కావాలి; పరిశ్రమలకు సహాయం కావాలి; పల్లెటూళ్లకి రేడియోలుకావాలి! అక్కరలేని దేమున్నది? అన్నీ కావాలి.

అంతేకాదు; పన్నులు — ముఖ్యంగా భూమిపన్ను తగ్గాలి!

ఇన్నిటికి కావలసినడబ్బు యెక్కడనుండి వస్తుంది? ఖర్చులు ఎక్కువ కావాలి — పన్నులు తగ్గాలి!

రాష్ట్రీయ ప్రభుత్వాల ధనసమస్య అన్ని సమస్యలకు కీలకంవంటిది.

ప్రభుత్వానికి ధన మంతా ప్రజల నుండియే రావాలి. ప్రజలిచ్చే పన్నులద్వారా వచ్చినడబ్బు ప్రభుత్వం ఖర్చుపెడుతుంది. అయితే, మనదేశంలో ఒకప్రభుత్వమే కాదు మూడుతరహాల ప్రభుత్వా లున్నాయి:—

(౧) కేంద్ర, లేక ఫెడరల్ ప్రభుత్వము.

(౨) రాష్ట్రప్రభుత్వాలు. — మన మదరాసురాజధానిలోని ప్రభుత్వంవంటివి.

(3) స్థానికప్రభుత్వాలు - - అనగా మునిసిపాలిటీలు, డిస్ట్రిక్టుబోర్డులు, పంచాయితీలు మొదలయినవి.

ఈ మూడుతరహాల ప్రభుత్వాలకు డబ్బు ప్రజలవద్దనుండియే రావాలి; అంటే, ప్రజలు పన్నులద్వారాను, ఇతరవిధాలను, చెల్లించే డబ్బు ఏదో ఒకవిధముగా ఈ ప్రభుత్వాలు పంచుకోవాలన్నమాట. ఈ పంపకము సరిగా కుదరకపోతే చాలా చిక్కులు వస్తాయి. ఒక ప్రభుత్వానికి డబ్బు చాలకపోవచ్చును; లేదా ఒకప్రభుత్వం ఇంకోప్రభుత్వంమీద డబ్బు కోసం ఆధారపడి స్వాతంత్ర్య మంతా కోల్పోవవచ్చును.

స్థానికప్రభుత్వాలు రాష్ట్రప్రభుత్వాలకు లోబడినవి. అందుచేత వాటిసంగతి ప్రస్తుతం తలపెట్టక, ఫెడరేషన్‌కి, రాష్ట్రాలకి ఆదాయ వ్యయపంపకం ఎలా జరగవలెనో, ఎలా జరగిందో కొంచెం ఆలోచిద్దాం.

ఫెడరల్ ప్రభుత్వము దేశ మంతటికి సంబంధించినది. దేశమందలి ప్రజలందరికిని కావలసిన వ్యవహారాలు చూసేది. దేశాన్ని పరదేశీయుల దాడినుండి రక్షించుట, ఇతరదేశాలతో రాజకీయ సంబంధాలు, దేశానికంతటికీ సంబంధించిన వర్తకము, వాణిజ్యము, పరిశ్రమలు, రైల్వేలు మొదలయినవి ఫెడరేషన్‌కు చెందినవి. రాష్ట్రప్రభుత్వాలు ఆయా ప్రాంతములకు ప్రత్యేకముగా అవసరమయిన పనులు చేసేవి. వ్యవసాయము, విద్య, ప్రజల ఆరోగ్యము, స్థానికపరిశ్రమలు, న్యాయ నిర్వహణము, శాంతిభద్రతలు కాపాడుట, స్థానిక స్వపరిపాలన మొదలయినవి రాష్ట్రప్రభుత్వాలు నిర్వహించాలి. కొన్నిపనులు రెండింటికీ సంబంధించినవే కాని, చాలా భాగం రెండు తరహాల ప్రభుత్వాలూ వేర్వేరుపనులు చూసుకుంటాయి.

తమతమ పనుల విషయములలో ఏ ప్రభుత్వానికి ఆప్రభుత్వము పూర్తిగా స్వతంత్రముగా ఉండాలి. ఇది ఫెడరల్ విధానము యొక్క ముఖ్యలక్షణము. ఫెడరేషనుకి రాష్ట్రాలు లోబడవు; ఫెడరేషన్ శాఖలకు పనులలో రాష్ట్రాలసమ్మతి అవసరంలేదు. ఇందులో ఏ ఒక ప్రభుత్వమయినా రెండవదాని అనుగ్రహంమీద ఆధారపడితే అది ఫెడరల్ విధానము కానేకాదు.

అందుచేత, ఈ ప్రభుత్వాలకి, తమతమ పనులు నెరవేర్చుకోడానికి కావలసిన సొమ్ము ఇతర ప్రభుత్వాల నడగవలసిన అవసరం లేకుండా వేరే యేర్పాటుకావాలి. అలా యేర్పాటు చేయడంలో ఈక్రింది ముఖ్యసూత్రాలు గమనించాలి.

(౧) ఏ ప్రభుత్వానికి ఏర్పాటుచేసిన సొమ్ము ఆప్రభుత్వం పెట్టవలసిన ఖర్చులకు

సరిపోవాలి (Adequacy). లోటెవింతఖర్చు మీద పడేసి, కొత్తపన్ను వేసి కిచ్చి, మీకు వేరే యేర్పాటు చేశామంటేమాత్రం లాభ మేమిటి?

(2) ఒక ప్రభుత్వంచేసే పనులకు, దానికి చూపించిన ఆదాయాధారములకు పొత్తు కుద రాలి (Suitability).

మాటవరుసకు మన చెన్నరాజధానికి మద రాసులోను విశాఖపట్నంలోను దిగుమతి అయ్యే సరుకులమీద పన్నులువేసుకొని ఆదా యం రాబట్టుకోమన్నా రనుకుందాము. మనం పన్నులు వేస్తాం; మనకంటె బొంబా యిలో తక్కువవేశా రనుకుందాం. అప్పుడు సరుకు లన్నీ బొంబాయిలోనే దిగుతాయి, ఇక్కడ రేవులకు రానేరావు. అక్కడకూడా మనం వేసేటంతపన్నులే వేసేలాగ చూసే అధి కారం మనకు లేదు. కనుక, అన్ని రేవులలోనూ ఒకేరీతిని పన్నులు విధించేలాగున చూడా లంటే ఆపని ఫెడరేషన్ చెయ్యాలిగాని రాష్ట్రాలు చెయ్యలేవు. అందుచేత ఎగుమతి దిగుమతిపన్నులు ఫెడరేషన్‌కి కుదురుతాయి కాని, రాష్ట్రాలకు కుదరవు. ఆవిధంగా ప్రభు త్వం చేసే పనులకు, దానికిగల ఆదాయాధా రాలకు పొత్తు కుదరాలి. లేకపోతే ఆదాయం సంపాదించడం కష్టమవుతుంది.

(3) ప్రభుత్వాల కిచ్చిన ఆదాయము ప్ర స్తుతం సరిపోవడమేకాక, అవసర మయితే పెరిగేదిగా ఉండాలి (Elasticity).

పరిస్థితు లెల్లప్పుడూ ఒకలాగే ఉండవు. హఠాత్తుగా పెద్దఖర్చేదయినా రావచ్చును; కాలక్రమేణా ప్రభుత్వాలు చేయవలసిన కార్యాలతోపాటు ఖర్చులుకూడా పెరగక మానవు. ఒకయుద్ధం వచ్చిం దనుకుందాం. ఫెడరల్ ప్రభుత్వము ఇతరులను యాచించ వలసిన అవసరం లేకుండా తగినధనము తెచ్చు కోగలిగిన స్థితిలో ఉండాలి. రాష్ట్రప్రభు త్వాలుకూడా తాము ప్రజాశ్రేయస్సుకోసం కావలసినవాటికి యెక్కువగా ఖర్చుపెట్టవల సినకొలది, తమ ఆధారములద్వారా ఎక్కువ ఆదాయం తెచ్చుకోగలగాలి.

(4) ఫెడరేషన్‌లో చేరిన రాష్ట్రాలు, సంస్థానాలు అన్నిటికీకూడా ఈ పంపక ములో అన్యాయం లేకుండా సమానస్థితిలో ఉండేలాగ చూడాలి (Equity); అనగా, ఒకరాష్ట్రానికి ముఖ్యమైన అవస రాలకే డబ్బు లేకుండా ఉంటే, ఇంకో రాష్ట్రానికి ఇష్టంవచ్చినట్లు ఖర్చుపెట్టేలాగ ధనమివ్వడంవంటి అన్యాయాలు జరగరాదు. అంతేకాదు; ఫెడరేషన్ ధనవంతములయిన రాష్ట్రాలనుంచి రాబట్టిన ధనమునుంచి పేద రాష్ట్రాలకు కావలసిన ధనసహాయం చేయాలి.



పెనుకొండకోట ముఖద్వారము

ఈ సూత్రా లన్నిటికీ సరిపడేలాగ పంపకముచేయడం చాలాకష్టము. రెండవసూత్రము ననుసరించి కార్యనిర్వహణమునుబట్టి ఆధారములు పంచిపెట్టితే, చాలా ఆధారాలు ఫెడరల్ ప్రభుత్వానికే పోతాయి— రాష్ట్రములకు డబ్బు చాలదు. అందువలన, కొన్ని ఆధారములు డబ్బు వసూలుచేయడానికి ఫెడరేషన్ చేతిలో పెట్టి, వానిలో భాగమో, పూర్తిగానో, నిర్ణయమైన ఒకపద్ధతిప్రకారం రాష్ట్రాలకుపంచిపెట్టమనడం సామాన్యముగా జరుగుతూఉంటుంది.

ఈ సూత్రములు మనస్సులో నుంచుకొని, ప్రస్తుతం అమలులోఉన్న పంపకపుపద్ధతి సరియైనదా కాదా అని పరిశీలించాలి. మొదట ఇంతకు పూర్వమున్న పద్ధతినీ, ప్రస్తుతపద్ధతి యేర్పడినవిధమునూ కొంత పరిశీలిస్తే మంచిది.

౧౯౨౦-వ సంవత్సరానికి పూర్వము కేంద్రప్రభుత్వానికి, రాష్ట్రప్రభుత్వాలకు ఖర్చులు ఆదాయం పంచుకొనే యేర్పాట్లేవో ఉండేవికాని, రాష్ట్రాలకు ధనవిషయంలో నిజమైన స్వాతంత్ర్యమేమీ ఉండేదికాదు.

౧౯౨౦ లో మన రాజ్యాంగవిధానము మారింది. రాష్ట్రాలలో ద్వంద్వ ప్రభుత్వ విధానము ఏర్పడినది. కొన్ని పరిపాలనా శాఖలను విడదీసి ప్రజాప్రతినిధుల బలము మీద నియమింపబడిన మంత్రులచేతిలో పెట్టారు. రాష్ట్రములకు కొంచెం స్వాతంత్ర్యం కలిగించడానికి కొన్ని ఆదాయాధారములు ప్రత్యేకం రాష్ట్రాలకి, కొన్ని ప్రత్యేకం కేంద్ర ప్రభుత్వానికి యిచ్చారు. ఆ విధానము ప్రకారము కేంద్రప్రభుత్వాని కిచ్చిన ఆదాయాధారా లివి:—

(౧) సుంకములు (కస్టమ్సు— ఎగుమతి దిగుమతి పన్నులు).

(౨) ఆదాయపుపన్ను (ఇన్‌కమ్‌టాక్సు).

(౩) ఎక్సయిజు పన్నులు, మత్తుపదార్థములమీద కాక మిగిలినవి (ఎక్సయిజు పన్నులనగా దేశంలో తయారై దేశంలోనే ఉపయోగపడే వస్తువులమీద విధించే పన్నులు).

(౪) రైల్వేలవలని ఆదాయము.

(౫) పోస్టాఫీసు, టెలిగ్రాఫు—వీనివలని ఆదాయము.

రాష్ట్రప్రభుత్వాల కిచ్చిన ఆధారములు:—

(౧) భూమిపన్ను.

(౨) నీటిసెస్సులు.

(౩) ఆబ్కారీ (మత్తు పదార్థములమీద ఎక్సయిజు పన్నులు).

(౪) అడవులవల్ల ఆదాయము.

(౫) కోర్టుఫీజు.

(౬) రిజిస్ట్రేషన్ ఫీజు.

(౭) స్టాంపులు.

(౮). ఆదాయపుపన్ను పెరుగుదలలో ఒక స్వల్పభాగము.

ఇవికాక 'షెడ్యూలు పన్ను'లని — ప్రకటనలమీద, వారసత్వపు ఆస్తులమీద, గుఱ్ఱపు పందెములమీద, సినిమాలు మొదలయిన వేడుకలమీద పన్నులు విధించుకొనే అధికారం రాష్ట్రప్రభుత్వాల కిచ్చారు.

ఇదివరకు కేంద్రప్రభుత్వమునకు చెందుతూ ఉన్న భూమిపన్నువంటి ముఖ్యమైన ఆధారాలు రాష్ట్రప్రభుత్వాల కిచ్చివేయడంవలన కేంద్ర ప్రభుత్వానికి వచ్చేలోటు భర్తీచేయడానికి, రాష్ట్రాలన్నీ కొంతకొంత మొత్తము ఏటేటా కేంద్రప్రభుత్వానికి చెల్లించుకోవలెనని యేర్పాటుచేశారు. ఆ మొత్తము లివి —

| | | | |
|---|---|---|---|
| మదరాసురాజధాని | రు. | ౩౪౯ | లక్షలు. |
| యునైటెడ్ ప్రావిన్సెస్ | ,, | ౨౪౦ | ,, |
| పంజాబు | ,, | ౧౭౫ | ,, |
| బెంగాలు | ,, | ౬౩ | ,, |
| బొంబాయి | ,, | ౫౬ | ,, |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | ,, | ౨౨ | ,, |
| అస్సాం | ,, | ౧౫ | ,, |
| బీహారు, ఒరిస్సా | ,, | ఏమీ లేదు. | |

ఈ మొత్తములు కేంద్ర ప్రభుత్వమునకు వీలు కాగానే తగ్గించి క్రమేణా రద్దుచేయాలని నిర్ణయించారు.

దీనివల్ల జరిగిన దేమిటంటే, రాష్ట్రప్రభుత్వాలకు ప్రత్యేకముగా ఆదాయాధారాలేర్పడినవికాని, నెత్తిమీద బోలెడంత ఖర్చు పడింది. బాగా ఖర్చుపెట్టవలసిన శాఖలు — విద్య, ఆరోగ్యము, పరిశ్రమాభివృద్ధి, స్థానిక స్వపరిపాలనవంటివి మంత్రుల చేతులలోనికి వచ్చాయి. ముఖ్యమైన రివిన్యూవంటి శాఖలు గవర్నరుచే నియమింపబడిన కౌన్సిలర్ల చేతిలోనే ఉండిపోయాయి. గవర్నరే సర్వాధికారి; ఆయన దేనినయినా త్రోసిరాజని తన యిష్టంవచ్చినట్టు చేయవచ్చును. పైగా ప్రతి చిన్న విషయానికికూడా గవర్నరు జనరల్ గారి (వైస్రాయిగారి) అనుమతికావాలి; ఆఖరుకి అప్పు తెచ్చుకోడానికికూడా ఇండియా గవర్నమెంటువారిని ఆశ్రయించ వలసినదే కాని ఏమీ స్వతంత్రం ఉండేదికాదు. అందరికిపైన ఇంగ్లండులో ఉన్న ఇండియామంత్రి సమస్త విషయాలపైనా సర్వాధికారాలు చెలాయిస్తూ ఉండేవాడు.

ఖర్చు మీదపడింది, స్వతంత్రం లేదు, డబ్బు లేదు! ఒకచేతితో యిచ్చిన డబ్బు, ఇంకో చేతితో పైనచెప్పిన ముడుపులరూపకంగా తీసేసుకున్నారు. ఇంక, బొంబాయి, బెంగాలువంటి రాష్ట్రాలకు భూమిపన్ను ప్రత్యేకించి యిచ్చినంతమాత్రాన ఆట్టే డబ్బు చేరలేదు. అక్కడ వర్తకము, పరిశ్రమలు బాగా అభివృద్ధి చెందాయి. ఆదాయపుపన్ను బాగా వస్తుంది. అందుచేత ఈ ఆదాయపుపన్నులో మంచి భాగం తమకియవలసినదని ఈ రాష్ట్రాలవారు అలజడిచేయడం ప్రారంభించారు.

ఈ విధానంక్రింద రాష్ట్రప్రభుత్వాలకు పని జరుపుకోడం కష్టమయిపోయింది. ప్రతి రాష్ట్రంలోనూ ఆదాయము ఖర్చుకి చాలక లోటుకనబడుతూ వచ్చింది. కేంద్రప్రభుత్వం పుచ్చుకుంటున్న మొత్తములు వదిలేయాలని రాష్ట్రాలు చాలా అలజడిచేశాయి. చివరకు, ౧౯౨౫-౨౬లో ఈ మొత్తములు తగ్గించడం ప్రారంభించి, ౧౯౨౮-౨౯ నాటికి పూర్తిగా రద్దుచేశారు.

సైమన్ కమిషన్ విచారణ : — ద్వంద్వ ప్రభుత్వవిధానము విఫలం కావడాని కొక కారణము ధనవిషయమైన యేర్పాట్లు సరిగా ఉండకపోడమే. కోట్లకొలది ప్రజలుగల దేశంలో, ప్రజల అభివృద్ధికి కావలసిన కార్యాలు నెరవేర్చాలంటే బోలెడంతసొమ్ము కావాలి. ఈ కార్యాలమీద ఖర్చు క్రమేణా పెరిగేది కాని తగ్గేదికాదు. ఈ కార్యాలన్నీ నెరవేర్చవలసిన బాధ్యత రాష్ట్రప్రభుత్వాలది. కాని, రాష్ట్రప్రభుత్వాల కిచ్చిన ఆదాయాధారములు పెరిగేవి కావు. భూమిపన్ను అప్పటికే తడిసిమోపెడైనది. ఇంక తగ్గవలసినదేకాని హెచ్చరాదు. మద్యపాననిషేధం అవలంబించినకొలది ఆబ్కారీ ఆదాయం నశించిపోతుంది. పెర్మనెంటు సెటిల్మెంటులో ఉన్న బెంగాలువంటి రాష్ట్రాలలో భూస్వాములు ధనవంతు

లవుతూఉన్నా భూమిపన్ను ఎప్పటిలాగే ఉంటుందికాని పెరగదు. ఇంక ఆదాయం వచ్చేది ఎల్లాగ ?

కేంద్రప్రభుత్వానికో, పెట్టవలసినఖర్చులు న్యాయంగా చూస్తే తగ్గాలిగాని హెచ్చకూడదు. అన్నిటికంటె ముఖ్యమైనది సైన్యం మీద ఖర్చు బాగా తగ్గించవచ్చును. అప్పటిలో సాలీనా దాదాపు ౬౦ కోట్ల రూపాయిలు ఖర్చుపెట్టేవారు. ఇప్పుడు రు. ౪౫ కోట్లకు తగ్గినది. ఇంక ఆదాయాధారాలన్నీ కాలక్రమేణా దేశస్థితి బాగుపడినకొలది హెచ్చేవేకాని తగ్గేవికావు. సుంకములు, ఆదాయపుపన్ను, రైల్వేఆదాయము, ఎక్సయిజు పన్నులు - ఇవన్నీ అల్లాంటివే.

ఖర్చు పెరుగుతూ ఉండి బాగా సొమ్ము కావలసిన రాష్ట్రాలకు పెరగని ఆదాయాధారాలు వచ్చాయి. ఖర్చు తగ్గుతూరావలసిన కేంద్రప్రభుత్వానికి పెరిగే ఆధారాలు వచ్చాయి.

ఈ స్థితిలో, సైమన్ కమీషన్ వారు రాజ్యాంగపథానాన్ని గురించి విచారణ చేయడానికి వచ్చారు. ధనవిషయంలో ఆకమీషన్ కి సలహాదారుగా ఉన్న సర్ వాల్టర్ లెయిటన్ అనే సుప్రసిద్ధ ఆర్థికవేత్త ఒకచక్కని నివేదిక తయారుచేశాడు.

ఆనివేదికలో, కేంద్రప్రభుత్వంవారి ఖర్చు తగ్గించి కొంత ఆదాయం రాష్ట్రప్రభుత్వాలకివ్వడం ముఖ్యమైన సూచన. అదికాక, కొన్ని కొత్తపన్నులు కేంద్ర ప్రభుత్వమే విధించి, వసూలుచేసి, రాష్ట్ర ప్రభుత్వాలకు పంచి పెట్టాలని సూచించాడు. మూడవది — రాష్ట్ర ప్రభుత్వాలకు కొన్ని కొత్తపన్నులు విధించుకోడానికి అధికారం యివ్వాలని సూచించాడు. ఈ మూడువిధాలా రాష్ట్రప్రభుత్వాల ఆదాయం వృద్ధిచేస్తేనేగాని ప్రజోపయోగకరములైన కార్యాలు చేయడానికి వీలుండదని ఆయన స్పష్టంగా చెప్పేశాడు. ఆయన నివేదికలో సూచించిన పంపకపు పద్ధతి యిది:

(౧) కేంద్ర ప్రభుత్వానికి చెందిన ఆధారాలలో, ఆదాయపుపన్ను ఏరాష్ట్రంలో నయినాసరే వసూలయినదానిలో సగం ఆ రాష్ట్రానికి ఇయ్యవలెను. ఇది బొంబాయి, బెంగాలువంటి పారిశ్రామిక రాష్ట్రాలకు సంతృప్తికరంగా ఉంటుంది.

ఉప్పుపన్నువలని ఆదాయము క్రమేణా రాష్ట్రాలకు పంచిపెట్టవలెను.

వర్తక వాణిజ్యములపై స్టాంపుల రూపకముగా విధించేపన్ను కేంద్ర ప్రభుత్వానికే చెందవలెను.

(౨) రాష్ట్రప్రభుత్వాలు కొత్తగావిధించదగిన పన్నులు :—

(i) వ్యవసాయదారుల ఆదాయములపై ఇదివరలో ఆదాయపు పన్ను లేదు. ఈపన్నును విధించవలెను. దీనివలన మదరాసు, యునైటెడ్ ప్రావిన్సెస్, పంజాబు మొదలయిన వ్యావసాయిక రాష్ట్రాలకు, పెర్మనెంటు సెటిల్మెంటు క్రిందనుండి భూమిపన్ను హెచ్చించలేని బెంగాలు, బీహారుల వంటి రాష్ట్రాలకు లాభం కలుగుతుంది.

(ii) ఆదాయపు పన్నుపై, రాష్ట్రముల అవసరం నిమిత్తము, నూటికి ౨౫ వరకు రాష్ట్రాలు అదనపు పన్ను విధించుకోవచ్చును.

(iii) "టెర్మినల్ టాక్సెస్", అనగా రాష్ట్రాల పరిహద్దులలోఉండే రైల్వే స్టేషన్లు మొదలయినచోట్ల, ఒకరాష్ట్రం నుంచి ఇంకోరాష్ట్రానికి పోయే సరకులమీద, ప్రయాణీకులమీద చిన్న పన్నులు విధించుకోవచ్చును.

(iv) ఇదివరకున్న 'షెడ్యూలు'పన్నులు ఇదివరలోలాగే రాష్ట్రాలకు చెందవలెను.

(౩) కేంద్ర ప్రభుత్వమే విధించి రాష్ట్రప్రభుత్వాలకు పంచిపెట్టే పన్నులు:— ప్రజలంతా ఉపయోగించే సిగరెట్లు, అగ్గిపెట్టెలు మొదలయిన వస్తువులమీద ఎక్సయిజు పన్నులు విధించి, అవి రాష్ట్రాలకు జనాభానుసరించి పంచిపెట్టవలెను. కాలక్రమేణా వీనిలో ఉప్పుపన్నుకూడా చేర్చాలి. ఇలా చేస్తే, ప్రజాబాహుళ్యం కలిగి ఇతరవిధాల అభివృద్ధిలేని బీహారు, ఒరిస్సా, అస్సాం మొదలయిన రాష్ట్రాలకు లాభం కలుగుతుంది. ఈ పన్నులు విధించడంలోను, హెచ్చుచేయడంలోను రాష్ట్ర ప్రభుత్వాలతో సంప్రదించి కేంద్రప్రభుత్వమే యేర్పాట్లు చేయవలసి ఉంటుంది. ఎప్పుడయినా కేంద్రప్రభుత్వానికి అవసరమయితే ఆదాయపు పన్నుమీదను, పైనచెప్పిన ఎక్సయిజుపన్నులమీదను అదనపుపన్నులు (సర్ ఛార్జీలు) విధించుకోవచ్చును.

లెయిటన్ గారు సూచించిన యీవిధానమంత చక్కనిపద్ధతి యిదివరలో ఎవరూ సూచించియుండలేదు. కేంద్రప్రభుత్వానికి, రాష్ట్రప్రభుత్వాలకి, స్వాతంత్ర్యానికి లోటు రాకుండా, ఆదాయాధారాల నిర్వహణమునకు సరియైనరీతిని, రాష్ట్రప్రభుత్వాలకి అవసరమయిన డబ్బు ఏర్పాటుచేస్తూ, పారిశ్రామిక రాష్ట్రాలకు, వ్యావసాయికరాష్ట్రాలకు, ప్రజాబాహుళ్యంగల పేదరాష్ట్రాలకు సహాయం చూపగలిగిన విధానము ఇదొక్కటే.

అయితే, ఈ విధానం అమలులోకి రాలేదు. ౧౯౩౧వ సంవత్సరంనుంచి ఆర్థికమాంద్యం దేశంమీదపడి కేంద్రప్రభుత్వానికే డబ్బు చాలకపోయెను. ఇంక రాష్ట్రాల కిచ్చేదెక్కడ ? అదికాక, శాసనోల్లంఘనం ప్రారంభం కావడం, సైమన్ నివేదిక మూలబడడం, రౌండుటేబులు సమావేశాలు జరగడం, ఫెడరేషన్ ఏర్పాటుచేస్తామనడం, ఆ ఫెడరేషన్ లోకి స్వదేశసంస్థానాలుకూడా వస్తామనడం — ఇవన్నీ జరిగినవి. బ్రిటిషు ఇండియారాష్ట్రాలను, స్వదేశసంస్థానాలను కలిపి ఫెడరేషన్ యేర్పాటుచేసే ఉద్దేశముతో ౧౯౩౫-వ సంవత్సరపు గవర్నమెంటు ఆఫ్ ఇండియాఆక్టు తయారయినది. దీనిప్రకారము, రాష్ట్రాలలో గవర్నర్లకిచ్చిన ప్రత్యేకాధికారములకు లోబడి, పరిపాలనంతా ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రతినిధుల చేతులలోనికి వచ్చింది. పూర్వము వలె సెక్రెటరీగారికి, ఇండియామంత్రికి రాష్ట్రాలకు సంబంధించిన ప్రతిచిన్నవిషయంలోనూ జోక్యము చేయనక్కరలేదు. ధనవిషయంలోకూడా, అప్పులు తెచ్చుకోడానికి, పన్నులువేసుకోడానికి, ఇష్టంవచ్చినట్లు ఖర్చులలో మార్పులుచేయడానికి — కొలదిమినహాయింపులుపోగా — స్వాతంత్ర్యమున్నది.

కాని, కేంద్రమున, పూర్వపు గవర్నమెంటు ఆఫ్ ఇండియా పోయి, కొత్తఫెడరల్ గవర్నమెంటు వస్తుంది. బ్రిటిషు ఇండియా ప్రతినిధులు, స్వదేశసంస్థానాధీశులచే పంప

బడిన ప్రతినిధులు కలిసిన శాసనసభలు రెండు ఏర్పడతాయి. వైస్రాయిగారి కిచ్చిన ప్రత్యేకాధికారములల్లా ఉండగా, సైన్యము, రాజకీయ వ్యవహారాలు మొదలయినవి ప్రజాప్రతినిధులచేతుల్లోకి రానేరావు. ధనవ్యవహారాలు పేరునకుమాత్రం ఒకమంత్రిచేతిలో ఉన్నా, ఆయనకువెనక వైస్రాయిగారిచేత నియమింపబడిన ఒక 'సలహాదారు' ఉంటాడు. ఆ 'సలహాదారు' సలహానుసరించి మంత్రి నడుచుకోవాలి; అనగా, అసలు ముఖ్యవిషయాలేమీ ప్రజాప్రతినిధులచేతిలో ఉండవన్నమాట. ప్రజాప్రతినిధు లేమయినా చేయదలచుకున్నా నిరంకుశప్రభువులు, బ్రిటిషువారికి విశ్వాసపాత్రులు అయిన సంస్థానాధీశుల ప్రతినిధులు ప్రతిదానికీ అడ్డం వస్తారనడాని కేమీ సందేహంలేదు. ఫెడరేషన్ ఇటువంటిదైనప్పుడు, ఫెడరల్ ప్రభుత్వము వారినుండి ధనసహాయం రాష్ట్రప్రభుత్వాలు ఆశించజాలవని వేరే చెప్పనక్కరలేదు.

ఈ కొత్త ౧౯౩౫-వ సంవత్సరపు చట్టము ప్రకారం యీ క్రిందిరీతిని ఆదాయాధారాల పంపకం జరిగింది:—

1. ఫెడరేషనుకు (కేంద్ర ప్రభుత్వానికి) ప్రత్యేకంగా యిచ్చిన ఆధారములు :

(౧) దిగుమతిపన్నులు (ఉప్పుమీద మినహాయించి); రైల్వేలవలని ఆదాయము, ఫెడరల్ ప్రభుత్వమువారుచేసే యితర వ్యాపారములవలని లాభము; రిజర్వుబ్యాంకులాభములలో భాగము; కంపెనీలపై ఆదాయపు పన్ను.

(౨) ఎగుమతి పన్నులు; ఉప్పుపన్ను; మత్తుపదార్థాలు కానివాటిమీద ఎక్సయిజుపన్నులు.

వీనివలనిఆదాయము ఫెడరేషన్‌కే చెందుతుంది; కాని ఫెడరల్ గవర్నమెంటువారు, వారి యిష్టానుసారము, ఈ ఆదాయమంతాగాని, లేక ఇందులో కొంతగాని, రాష్ట్రప్రభుత్వాలకు ఇయ్యవచ్చును. లెయిటన్ గారు సూచించినట్లు ఇదంతా రాష్ట్రాలకు పంచిపెట్టవలెననే షరతు లేదు.

కాని, జనపనారమీద యెగుమతి పన్నువలన వచ్చినఆదాయంలో సగానికి తక్కువకాకుండా జనపనారపండించే బెంగాలు, అస్సాం మొదలయిన రాష్ట్రాలకు ఇచ్చితీరాలి. ఇది ఆ రాష్ట్రాలకు ప్రత్యేకసహాయంకోసం యేర్పడినది.

2. ఫెడరల్ ప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వాలు పంచుకొనేవి :

(౧). ఆదాయపుపన్ను (వ్యవసాయదారుల ఆదాయములమీద, కంపెనీలమీద మినహాయించి)

ఇది కేంద్రప్రభుత్వంవారే వసూలుచేసి, ఇందులో సగానికి తక్కువ కాకుండా, ముప్పాతికకు ఎక్కువ కాకుండా ఒక నిర్ణీతభాగం రాష్ట్రాలకు పంచిపెట్టాలి. ఫెడరేషన్ క్రిందనున్న ప్రాంతాలలో వసూలయిన ఆదాయపుపన్ను, ఫెడరల్ ఆఫీసర్ల జీతాలమీద పన్ను, ఫెడరేషన్‌కే చెందుతాయి

అత్యంతావసరం వస్తే ఫెడరల్‌గవర్నమెంటు ఆదాయపు పన్నుపై అదనపు పన్ను విధించవచ్చును.

3. రాష్ట్రాలకు చెందే ఆధారాలు :

(౧) వ్యవసాయంచేసే భూమికాక యితర విధముల ఆస్తిపై వారసత్వపుపన్నులు; రైల్వేలమీద, విమానములమీద తీసికొనిపోబడే వస్తువులమీద, ప్రయాణికులమీద విధించే టెర్మినల్ పన్నులు; హుండీలు, చెక్కులు, ప్రామిసరీనోట్లు, ఇన్సూరెన్సు పాలసీలు, రసీదులు వగైరా పత్రముల మీద అంటించవలసిన స్టాంపులవలని ఆదాయము.

ఇవన్నీ రాష్ట్రాలకు చెందేవేగాని, వీనికి సంబంధించిన శాసనాలువగైరా కేంద్రప్రభుత్వమే చేయాలి. ఫెడరేషన్‌కి అవసరమయితే వీనిమీద అదనపు పన్నులు విధించవచ్చును.

(౨) భూమిపన్ను; అబ్కారీ; వ్యవసాయదారుల ఆదాయములమీద పన్ను; పైనచెప్పినవికాక యితరస్టాంపులు; అడవులు; రాష్ట్రప్రభుత్వాలు నడిపించే యితర పరిశ్రమాదులవలని లాభములు; ఇంకా రాష్ట్రప్రభుత్వాలకు ప్రస్తుతంచెందే ఇతరాధారాలు.

వీనివలన వచ్చే ఆదాయం అంతా రాష్ట్రాలకే చెందుతుంది. వీటినిగురించిన శాసనాలు, వసూళ్లు వగైరాపని అంతా రాష్ట్రప్రభుత్వాలే చేయాలి.

ఈ కొత్తవిధానము చాలావరకు లెయిటన్ గారి సూచనలనే అనుసరించినది. కాని కొద్దిమార్పులవలన రాష్ట్రప్రభుత్వాల స్థితి నీరసించినది. లెయిటన్‌గారు రాష్ట్రప్రభుత్వాలకే పంచిపెట్టాలన్న ఎక్సయిజు పన్నులు ప్రస్తుతం ఫెడరేషన్‌కే చెందుతాయి. ఎన్నడయినా ఫెడరలు గవర్నమెంటువారికి వీలయి, దయపుట్టిగే, వైస్రాయిగారు అనుమతిస్తే, అప్పుడు ఆ డబ్బు రాష్ట్రాలకు, సంస్థానములకు పంచవచ్చును. అదయినా జనాభా ననుసరించి కాదు; వారి యిష్టప్రకారము. ఆదాయపుపన్నుమీద అదనపు పన్ను విధించుకొనే అధికారం రాష్ట్రాలకు లేదు.

పైన చెప్పినవి కాక కొత్తపన్నేదయినా విధించుకోవలెనంటే, రాష్ట్రాలయినాసరే, ఫెడరల్ గవర్నమెంటయినా సరే వైస్రాయిగారి అనుమతి పొందాలి.

ఈ విధానమంతా వెంటనే అమలులోనికి రాదు. రాష్ట్రాలకు ఆదాయపు పన్నులో రావలసినభాగం కొంతకాలంవరకు ఫెడరేషనే అట్టేపెట్టుకుంటుంది. క్రమేణా వీలునుసరించి ఇది రాష్ట్రాల కిచ్చివేస్తారు. కొత్తగా యేర్పడిన కొన్ని రాష్ట్రాలకు డబ్బు చాలదు గనుక, వాటికి కొన్ని గ్రాంటులిస్తారు.

నీమియరు నిర్ధారణ:— ఆదాయపు పన్నులో ఎంతభాగం ఏరాష్ట్రానికి ఎప్పుడు వచ్చేది, ఏరాష్ట్రానికి ఎంతగ్రాంటు యిచ్చేది, ఈరాష్ట్రాలు ఇదివరలో కేంద్ర ప్రభుత్వం దగ్గర తీసుకొన్నఅప్పు ఏవిధంగా సర్దేది-ఈ విషయాలు నిర్ణయించడానికి సర్ ఆటో నీమియర్ గారనే ఆర్థికవేత్త విచారణచేశారు.

నీమియరుగారు విచారణ చేసేటప్పటికి కేంద్ర, రాష్ట్రప్రభుత్వాల పరిస్థితు లేమీ బాగులేవు. ౧౯౩౧-వ సంవత్సరం నుండి విజృంభిస్తూయున్న ఆర్థికమాంద్యంవలన అన్ని ప్రభుత్వాల ఆదాయాలూ కొరతపడి ప్రతి బడ్జెట్టులోనూ లోటే కనిపిస్తూవచ్చినది. కేంద్రప్రభుత్వానికి ఏటా రైల్వేల లాభాలలో

భాగం వచ్చేది. ఆభాగం ౧౯౨౯-౩౦ లో రు. ౬ కోట్ల ౨౫ లక్షలవరకు వచ్చింది. అటువంటిది ఆలాభమంతా నశించి నష్టం కనపడడం ప్రారంభించింది. ఇందువలన కేంద్ర ప్రభుత్వ మేమీ పంచిపెట్టలేని స్థితిలోనికి వచ్చింది. రాష్ట్రాలలో ఖర్చులు తగ్గించు కొన్న మదరాసువంటి రాష్ట్రంలో తప్ప మిగిలిన అన్నింటిలోనూ లోట్లే కనిపించినవి.

ఈ స్థితిని సరిపెట్టి కొత్త రాజ్యాంగవిధానం అమలులోనికి వచ్చేరీతిని నీమియరుగారు నిర్ధారణ చేయవలసి వచ్చింది. ఆయన నిర్ధారణ ఈ క్రిందివిధంగా చేశారు:—

(౧) ఆదాయపుపన్నులో సగం (౫౦%) రాష్ట్రాలకివ్వాలి.

(౨) కాని, మొదటి ౫ సంవత్సరాలలో, ఈ భాగంలోనుంచి, రైల్వేలవలన కేంద్ర ప్రభుత్వానికి వచ్చే సొమ్ము కలిపి రు. ౧౩ కోట్లు ఏటా రావడానికి ఎంతకావాలో అంత సొమ్ము కేంద్రప్రభుత్వమే మినహాయించుకుంటుంది.

(౩) తరువాత ౫ సంవత్సరాలలో, గత సంవత్సరంలో మినహాయించుకున్న దానిలో సంవత్సరాని కొకవంతు చొప్పున హెచ్చిస్తూ వచ్చేభాగం రాష్ట్రాలకివ్వాలి. అంటే, ౧౦ సంవత్సరాల తరువాతకాని యీ భాగం పూర్తిగా రాష్ట్రాలకు రాదన్నమాట. ఈలోపుగా ఏకొంచెమయినా రావాలంటే అది రైల్వేలమీద, కేంద్ర ప్రభుత్వానికి వచ్చే లాభంమీద ఆధారపడి ఉంటుంది.

(౪) ఆదాయపు పన్నులో భాగం రాష్ట్రాలకు పంచిపెట్టేటప్పుడు ఈ క్రిందిరీతిని పంచిపెట్టాలి:—

| | | | |
|---|---|---|---|
| మదరాసు | నూటికి | ౧౫ | వంతులు |
| బొంబాయి | ,, | ౨౦ | ,, |
| బెంగాలు | ,, | ౨౦ | ,, |
| సంయుక్తరాష్ట్రాలు(యు.పి.) | | ౧౫ | ,, |
| పంజాబు | ,, | ౮ | ,, |
| బీహారు | ,, | ౧౦ | ,, |
| మధ్యపరగణాలు (సి.పి.) | ,, | ౫ | ,, |
| అస్సాం | ,, | ౨ | ,, |
| సరిహద్దురాష్ట్రం | ,, | ౧ | ,, |
| ఒరిస్సా | ,, | ౨ | ,, |
| సింధు | ,, | ౨ | ,, |

(౫) ఇదికాక, రాష్ట్రాలు కేంద్రప్రభుత్వానికియ్యవలసిన అప్పు నంతటిని మదింపువేసి, అంతా నూటికి ౩½ వడ్డీ చొప్పున ౪౫ సంవత్సరాలలో తీర్చుకొనేలాగున యేర్పాటు చేశారు. దీనివలన ప్రస్తుతం కొన్ని రాష్ట్రాలకు యీ క్రిందిరీతిని ఖర్చులు తగ్గుతాయి:

| | | |
|---|---|---|
| మదరాసు | ౨౬.౨ | లక్షల రూపాయలు |
| బొంబాయి | ౪.౨ | ,, |
| సింధు | ౦.౭ | ,, |
| సం.రా. (యు.పి.) | ౧.౯ | ,, |
| పంజాబు | ౧.౭ | ,, |
| మధ్య పరగణాలు (సి. పి.) | ౨.౪ | ,, |

కొన్నిరాష్ట్రాలు కేంద్రప్రభుత్వానికియ్యవలసిన అప్పు పూర్తిగా రద్దు చేయబడినవి. దానివలన వారికి యీ క్రిందిరీతిని లాభం కలిగింది.

| | | |
|---|---|---|
| బెంగాలు | రు. ౩౮ | లక్షలు |
| బీహారు | ౨౫ | లక్షలు |
| అస్సాం | ౧౫½ | ,, |
| సరిహద్దురాష్ట్రం | ౧౨ | ,, |
| ఒరిస్సా | ౯½ | ,, |
| మధ్యపరగణాలు(సి.పి.) | ౧౫ | ,, |

(౬) జనపనార ఉత్పత్తిచేసే బెంగాలు, బీహారు, అస్సాం రాష్ట్రాలకు ఎగుమతి పన్నులో నూటికి ౬౨½ వంతులు ఇయ్యవలెను.

(౭) ఇన్ని చేసినా సరియైన ఆర్థికస్థితిలోనికి రాలేకపోయిన రాష్ట్రాలకు ఈక్రింది గ్రాంటులు ఏటా యివ్వవలెను:

సంయుక్తరాష్ట్రాలు (యు.పి.) రు. ౨౫ లక్షలు (౫ సంవత్సరాలవరకే.)

అస్సాం రు. ౩౦ లక్షలు.

సరిహద్దు రాష్ట్రం రు. ౧౦౦ లక్షలు (౫ సంవత్సరములతరువాత యీ గ్రాంటును గురించి తిరిగి విచారణ చేయాలి.)

ఒరిస్సా—రు. ౪౦ లక్షలు (మొదటి సంవత్సరంలో ౪౭ లక్షలు; తరువాత ౪ ఏండ్లవరకు ౪౩ లక్షలు.)

సింధు—రు. ౧౦౫ లక్షలు. (క్రమేణా యీ గ్రాంటు తగ్గింపబడును.)

నీమియరుగారి నిర్ధారణ రాష్ట్రాలన్నిటికీ న్యాయం చేసిం దని చెప్పలేము. కాని, అన్ని రాష్ట్రాలూ లోటులేకుండా ఆదాయవ్యయాలు సరిపెట్టుకొనేటందుకు కావలసిన యేర్పాటుమాత్రం చేసింది. దీనివలన రాష్ట్రాలలో ప్రజాపరిపాలన ప్రారంభం కావడానికి కావలసిన పరిస్థితులుమాత్ర మేర్పడినవి.

## రాష్ట్ర ప్రభుత్వాల ధనసమస్య

ఇంతవరకు ధనసమస్యయొక్క చరిత్ర, ఇప్పటికి తేలిన పంపకపు స్వరూపమును తెలుసుకున్నాము. ఈ పరిస్థితులలో ప్రజా ప్రతినిధులయిన కాంగ్రెస్ వారి ప్రభుత్వాలు రాష్ట్రాలలో ప్రారంభించినవి. ఈ కొత్త రాజ్యాంగవిధానప్రకార మేర్పడిన ధన విభజనను సరియైనదేనా? మనం మొదట్లో చూచిన సూత్రాలకు సరిపోతుందా?

ఆదాయాధారముల విభజన ప్రభుత్వాలు చేసే పనుల ననుసరించియే ఉన్నది. దేశమంతటా వసూలు చేయవలసినవి, రాష్ట్రాల సరిహద్దులలో ఇముడనివి అయిన సుంకములు, ఆదాయపుపన్ను, కొన్ని ఎక్సయిజులు మొదలయినవి ఫెడరేషనుకే చెందుతాయి. రాష్ట్రాల కిచ్చిన ఆధారాలుకూడా రాష్ట్రాల కార్యముల ననుసరించినవే.

కాని, ఇల్లాగ యిచ్చిన ఆధారాలు రాష్ట్రాల ఖర్చులకు సరిపోవు. అందుకనే ఆదాయపుపన్నులో సగం రాష్ట్రాలకు చెందవలె నన్నారు. కాని ఎన్నడో గాని యీభాగం రాష్ట్రాలకు రాదు. ఎక్సయిజు పన్నులు ఇప్పట్లో రాష్ట్రాలకు పంచిపెట్టరు. ఎప్పటికయినా అందులోనుంచి ఏమయినా వచ్చినా అది ఫెడరల్ గవర్నమెంటువారి దయాదాక్షిణ్యాల ననుసరించి రావలసినదే కాని నిశ్చయంగా ఆశించడానికి వీలులేదు.

కొత్తగా విధించదగిన పన్నులు — వ్యవసాయదారుల ఆదాయంమీద పన్నులు, వారసత్వపు పన్నులు, టెర్మినల్ పన్నులు ఉన్నాయి. కాని ఇవి విధించడం కష్టమయిన సంగతి. వీనివలన ఎంత వస్తుందో యేమీ తెలియదు.

అవసరమయిన పరిస్థితులలోనయినా అదనపుపన్నులు విధించుకొనే హక్కు రాష్ట్ర ప్రభుత్వాలకు లేనేలేదు.

ఇదంతా చూస్తే ఈవిధానంవలన వచ్చే డబ్బు రాష్ట్రాలలో పెట్టవలసిన ఖర్చుకి ఎంత

మాత్రమూ సరిపోదని, అవసరాలు పెరిగిన కొలది పెరిగేలక్షణం ఈ ఆదాయానికి జొత్తిగా లేదని స్పష్టమవుతుంది.

ఇంక - రాష్ట్రాల కన్నిటికి ఈ విభజనలో న్యాయం జరిగిందా ? ఒకవిధముగా జరిగిన దనే చెప్పవచ్చును. ప్రతిరాష్ట్రంవారికి ఇంకా రావలెననే ఉంటుంది కాని, ఇది ఒకరీతిగా అన్ని రాష్ట్రాల అవసరాలను గమనించియే చేయబడినది.

ఇట్టి పరిస్థితులలో బయలుదేరిన రాష్ట్ర ప్రభుత్వాలు ఈధన సమస్యను ఎట్లు పరిష్కరించగలవు ? ప్రజలకు కావలసిన కార్యాలన్నీ ఎలా నెరవేర్చగలవు ?

మనకు ముఖ్యమైనది మదరాసు రాజధాని గనుక, ఈ రాజధానియొక్క ధన సమస్యను కొంచెం పరిశీలించి చూద్దాం.

మదరాసు రాజధాని ఆదాయ, వ్యయములు (౧౯౩౫-౩౬).

| ఆదాయము : | | లక్షల రూపాయలు |
|---|---|---|
| (౧) భూమిపన్ను | ... | ౭౪౧.౨౦ |
| (౨) అబ్కారీ | ... | ౪,౦౮.౨౬ |
| (౩) స్టాంపులు | ... | ౨,౦౮.౧౯ |
| (౪) అడవులు | ... | ౪౪.౯౭ |
| (౫) రిజిస్ట్రేషన్ | ... | ౩౧.౧౫ |
| (౬) సేద్యాలు పన్నులు | ... | ౮౩ |
| (౭) నీటిఆదాయము | ... | ౨.౦౨ |
| (౮) వడ్డీలు | ... | ౨౧.౩౪ |
| (౯) పరిపాలనా శాఖలు వగైరా | ... | ౧,౪౭.౯౭ |
| | | ౧౬,౦౬.౪౨ |

| వ్యయము. | | లక్షలరూపాయలు. |
|---|---|---|
| (౧) పన్నులు వసూలు చేయుటకు | ... | ౧,౩౦.౩౧ |
| (౨) కాలువలు, అడవులు వగైరా | ... | ౯౦.౧౯ |
| (౩) ఋణాలమీద వడ్డీ | ... | ౬౩.౫[illegible] |
| (౪) పరిపాలనఖర్చులు | ... | ౨,౭౬.౨౨ |
| (౫) కోర్టులు, జైళ్లు వగైరా | | ౧,౨౦.౮౩ |
| (౬) పోలీసు | ... | ౧,౬౭.౬౯ |
| (౭) విద్య | ... | ౨,౫౫.౮౭ |
| (౮) వైద్యము | ... | ౯౩.౦౩ |
| (౯) ప్రజారోగ్యము | ... | ౨౪.౨౬ |
| (౧౦) వ్యవసాయము | ... | ౪౦.౭౪ |
| (౧౧) పరిశ్రమలు | ... | ౨౨.౬౦ |
| (౧౨) ఇతరశాఖలు | ... | ౫౬.౪౭ |
| (౧౩) సివిల్ వర్క్సు | ... | ౧,౨౩.౨౨ |
| (౧౪) పింఛనులు, అలవెన్సులు | | ౯౦.౪౩ |
| (౧౫) ఇతరములు | ... | ౩౪.౭౭ |
| | | ౧౫,౯౦.౧౯ |

ఇప్పు డున్న ఆదాయాధారములలో అన్నింటికంటె ముఖ్యమైనది భూమిపన్ను. కాని యీపన్ను తగ్గవలెనని ప్రజ లందరు కోరుచున్నారు. ఈసంవత్సరపు బడ్జెటులో ౭౫ లక్షలరూపాయలు రెమిషన్ ఇచ్చియే ఉన్నారు.

దీని తరువాత ముఖ్యమైనది అబ్కారీ. దీనివలన ౪ కోట్ల రూపాయలకు పైగా వస్తోంది. కాని కాంగ్రెసువారు మద్యపాన నిషేధమును పూర్తిగా అమలులో ఉంచదలచుకున్నారు. ఇది సేలం జిల్లాలో అప్పుడే ప్రారంభమైనది. ఒక్క సేలంలో నిషేధం వల్ల యేటా ౨౬ లక్షలు నష్టం వస్తుంది. ఈ కార్యక్రమం పూర్తిగా సఫలమయ్యేసరికి ౪కోట్లరూపాయిల ఆదాయంనశించిపోతుంది.

ప్రభుత్వమువారు ఋణగ్రస్తులకు సహాయము చేయబూనినారు. అందువలన కోర్టుల ఆదాయము తగ్గినా, స్టాంపులవలని ఆదాయముకూడా తగ్గిపోవును.

ఇంక ఖర్చు సంగతి: — ప్రస్తుతం చేసే ఖర్చులలో తగ్గించడానికి అవకాశాలు తక్కువ. మొత్తము వ్యయంలో నూటికి ౧౫ వంతులు తగ్గించుటకే వీలులేదు. గవర్నరు, సివిల్ సర్వీస్ ఉద్యోగులు మొదలయిన వారి జీతాలు తగ్గించడానికి అధికారం లేదు. మిగిలిన ఉద్యోగుల జీతాలు తగ్గిస్తారు గాని అందువలన ఏ కొలది లక్షలోమాత్రమే మిగులుతుంది. ఉన్నతవిద్య మొదలయిన వానిలో కొంత ఖర్చు తగ్గినా, ఇతర విధాల ఖర్చులలో హెచ్చే దాని కేమీ సరిపోదు.

ఇంతవరకు విద్యావ్యాప్తి, వైద్యసహాయము, ప్రజారోగ్యము, వ్యవసాయము, పరిశ్రమలు మొదలయిన ప్రజోపయోగకరములగు కార్యాలపై చేసే ఖర్చు బహు స్వల్పము. అంతా కలిపి మొత్తము ఖర్చు రు.



అమరావతిలోని స్తంభశిల్పము

౧౬ కోట్లలోను, దాదాపు రు.౫ కోట్లు అవుతోంది.

మనరాజధానిలో ౪౬౭ లక్షల ప్రజలున్నారు. ప్రజాసంఖ్యనుబట్టి చూస్తే—విద్యావిషయంలో మనిషికిసాలునకు ౦-౮-౦ ఖర్చగుచున్నది! ప్రజారోగ్యానికి తల కొకపావలా అయినా ఖర్చు పెట్టడంలేదు; వ్యవసాయాభివృద్ధికి, పరిశ్రమలకు కలిపి గ్రామానికి దాదాపు రు. ౧౦౦ మాత్రమే ప్రభుత్వము ఖర్చుపెట్టగలుగుతున్నది; అనగా, తల కొక ౦-౨-౬ మాత్రమే నన్నమాట! ఇతర దేశాలలో ఈవిషయాలమీద పెట్టే ఖర్చుతో పోల్చిచూస్తే ఇది బహు తక్కువ. వీటిమీద ఇంకా అనేకరెట్లు ఖర్చు పెట్టగలిగితేనే గాని దేశసౌభాగ్యం వృద్ధికాదు.

ఇంక ఈధనసమస్యను ఎదుర్కొనడానికి ఏమి ఉపాయములు కలవు?

(౧) ఇదివరలో అవుతున్న అన్ని విధాల ఖర్చును జాగ్రత్తగా పరిశీలించి ఎక్కడెక్కడ తగ్గించడానికి అవకాశ మున్నదో అన్ని విధములా తగ్గించాలి. ముఖ్యంగా, ప్రభుత్వంవారు కట్టించే నిర్మాణాలలోను, పరిపాలనా శాఖలలోను అనవసరమైన ఖర్చులు లేకుండా చూడాలి.

(౨) ధనము తప్పక కావలసినది కనుక, కొన్ని కొత్తపన్నులు విధించక తీరదు. ఆ పన్నులు విధించేటప్పుడు, వానిభారం మోయగలిగిన జమీందార్లు, ధనవంతులు మొదలయినవారిమీదనే ఎక్కువగా పడేలాగున మాత్రం చూడాలి. అందుకు వీలయినంత త్వరలో ధనవంతులయిన భూస్వాముల ఆదాయములపై పన్నులు, వారసులకు సంక్రమించే ఆస్తులపైని పన్నులు విధించాలి. ప్రపంచంలోని ప్రతి నాగరిక దేశంలోను ఇవి అప్పుడే వృద్ధిచెందియున్నాయి.

(3) వడ్డీవ్యాపారంవల్ల జీవించేవారు, వర్తకులు మొదలయినవారు, రైతులతో పోల్చి చూస్తే, రాష్ట్రప్రభుత్వాని కిచ్చేది బహు స్వల్పము. అందువలన లైసెన్సులద్వారా, వృత్తిపన్నులద్వారా, వ్యాపారంమీద పన్నులద్వారా వారినుండి మరింత ధనం రాబట్టవలెను. ఈ సంవత్సరం మిల్లుబట్టల వర్తకులపై లైసెన్సులు విధింపబడినవి. ఇట్టివి యింకా వ్యాప్తం చేయవలెను.

(౪) ప్రజలకు చాలామందికి అవసరం అయిన పరిశ్రమలు, వ్యాపారాలు ప్రభుత్వమే అవలంబించి, ప్రజల కుపయోగకరంగా నడుపుతూ, వానివలన లాభాలుకూడా సంపాదించవచ్చును. విద్యుచ్ఛక్తి తయారుచేయుటలో, ట్రాంవేలు మొదలయినవి నడుపుటలో అట్టిలాభములు రాబట్టవచ్చును. ఇంకా ఏయేపరిశ్రమలు - ఉదాహరణకు ఇనుపరేకుల వంటివి — అవలంబించవచ్చునో విచారించవలెను. అడవులను బాగా పెంపొందించి వానివలని ఆదాయము వృద్ధిచేయుటకు ప్రయత్నించాలి.

(౫) కేంద్రప్రభుత్వంవారు అనవసరంగా పెరుగుతూన్న ఖర్చులను తగ్గించి రాష్ట్రప్రభుత్వాలకు రావలసిన ఆదాయపు పన్నులో భాగం, వారీయవలసిన ఎక్సయిజు పన్నులలో భాగం త్వరలో ఇచ్చేలాగున చూడాలి. ఇది అన్నింటికంటె కష్టమయినది. ఎందుచేతనంటే ప్రజాప్రతినిధుల పలుకుబడిని అణచివేయడానికి వీలయిన రీతిని ఫెడరేషన్ నిర్మింపబడినది.

(౬) రాష్ట్రాలలో ప్రజోపయోగం నిమిత్తము పెట్టవలసిన ఖర్చులో చాలభాగం శాశ్వత నిర్మాణములపై ఖర్చు — రోడ్లు, వంతెనలు, కాలువలువగయిరాలు — వీనికి కావలసిన ధన మంతా ఋణాలరూపకంగా తేవచ్చు. ఇట్టిఋణాలు విరివిగా తెచ్చి వ్యవసాయమూ, పరిశ్రమలూ బాగా వృద్ధి అయేలాగ చూస్తే ప్రజల ఆదాయాలు వృద్ధిఅవుతాయి; ప్రజలు ఇంకా పన్నులు ఇచ్చుకోగలుగుతారు. అయితే, ఈ అప్పులమీద చెల్లించవలసిన వడ్డీకి, అసలులో కొంచెం భాగానికిమాత్రం ఏటా మామూలు ఆదాయంలోనే ఏర్పాటుచేయాలి.

(౭) స్థానికప్రభుత్వాలఆదాయవ్యయములను బాగా పరిశీలించి కట్టుదిట్టము చేసి, సాధ్యమైనంతవరకు వారిఆదాయము అక్కడి ప్రజలపై విధింపబడిన పన్నులద్వారా రాబట్టేలాగున చూడవలెను.

ఈపద్ధతు లన్నిటిని అవలంబించి రాష్ట్రముల ఆదాయము వృద్ధిచేయవచ్చును. ఏమయినా, రాష్ట్రప్రభుత్వాల ధనసమస్య చాలా క్లిష్టమయినది. దీనిని సంతృప్తికరంగా పరిష్కారము చేయగలిగితే కాంగ్రెసువారు దేశాభివృద్ధికి గట్టిపునాది వేసినవా రవుతారు.



# శిలాప్రతిమ

శివశంకరశాస్త్రి

* శిలాప్రతిమ *

బహుదినాలనుండి పరికించుచున్నాను
వింత గొలుపు నీదువిధము మిగుల!
పవలు రేలు నీవు ప్రాణప్రియా యంచు
పాడుచుందు వేమి పడతిగూర్చి?

ప్రతిదినమ్ముగూడ నుతియించుచున్నావు
కఠినశిలలు జాలి గరగునట్లు
నిజసుధార్ద్రదృష్టి నిలిపి నీపై నామె
ఎన్నడేని కనికరించెనొక్కొ?

* సాధకుడు *

స్నిగ్ధహృదయాబ్జ మైన నాజీవితేశ్వ
రీకృపాలోకనము ప్రసరించువరకు
భ్రమరరూపముతో నామె శ్రవణపాళి
పాటపాడుచు వేడుదు ప్రత్యహమ్ము.

* శిలాప్రతిమ *

కఠినహృదయురాలు కాదేని యాకన్నె
మౌన మింతకాల మూను టెట్లు?
నిష్కలంక మైన నీ ప్రేమలహరిలో
కరగిపోవ దేమి కన్నెమనసు?

* సాధకుడు *

స్నిగ్ధహృదయాబ్జ మైన నా జీవితేశ్వ
రీకృపాలోకనము ప్రసరించువరకు
సుమపరాగమ్ము నై యామెసుందరాంఘ్రి
పంకజము లంటి సేవింతు ప్రత్యహమ్ము.

* శిలాప్రతిమ *

కుశలబుద్ధివయ్యు కొంచెమేనియు తత్త్వ
మరయకున్నవాడ వక్కటకట!
ఇంత వెర్రి వయిన ఏవిధమ్ముగ నీవు
సంచరింపగలవు జగములోన!

* సాధకుడు *

ఈ విచిత్రజగత్తుతో ఏల నాకు
ఓ ప్రమాదేవి! ప్రేయసి యొకతె చాలు
సకలలోకము లబ్ధమౌ సరణి దోచు
ప్రియ హృదయసద్మమందు వ్యాపించియుండ.

* శిలాప్రతిమ *

ప్రతిదినమ్ము నీవు ప్రమవిగ్రహంబును
కన్నులార జూచుచున్నవాడ
వయిన నిన్ను భ్రమయె ఆవరించిన దేల
సాంద్రమిహికవోలె సరళబుద్ధి!

* సాధకుడు *

గాఢవిశ్వాస మొక్కటే కలదు తల్లి!
నన్ను ప్రేయసి కరుణ నేనాటి కైన
స్వీకరింపకపో దని; చెప్పజాల
తక్కు గలవి సమీక్షించి తర్కదృష్టి.

* శిలాప్రతిమ *

వెర్రిమాట! గాఢవిశ్వాస మున్నంత
మాత్రముననె యేమి మంచి కలుగు?
వివిధవిషయములను విమృశింపకున్నచో
నిజము తెలియు టెట్లు నీకు తండ్రి!

* సాధకుడు *

నిజము ప్రియురాలుమాత్రమే; నిఖిలలోక
మెట్లు చరియించుచున్న నా కేమి చింత!
పూర్వమెరుగుదు ననుభవపూర్వకముగ
తల్లి, నాప్రేయసీమనోధర్మ మెల్ల.

* శిలాప్రతిమ *

అయ్యో, యేమి వెర్రి! అన్యథా భావింప
కుందువేని యడుగు దొక్కమాట:

దేనివలన నీవు దేవతగా నెంచు
చుందు వామె నెప్పు డోకుమార ?

> సాధకుడు <

ఆమె మానవయువతియే యగుట నిజము
కాని ఆయమపల్కులు కర్ణగోచ
రమ్ము లైనంత నాకు నిర్జరమనోజ్ఞ
మధురసంగీతనాదముమాడ్కి దోచు

ఆమె మానవయువతియే యగుట నిజము
కాని ఆయమరూపమ్ము కానవచ్చి
నంతనే నాకు సర్వలోకైకనయన
హారిసౌందర్యదేవతయట్లు దోచు

ఆమె మానవయువతియే యగుట నిజము
కాని ఆయమ మెత్తని మేను సోకి
నంతనే నాకు పారవశ్యమ్ము కలిగి
అద్వితీయమహానందమట్లు తోచు !

> శిలాప్రతిమ <

చాలుజాలు కోయి ! సామాన్యురాలిపై
నిట్టి దృష్టి యుండు టేమి సొగసు !
ఇంక నెపుడుగూడ నిట్లు మాటాడకు
ప్రాజ్ఞు లెల్ల నిన్ను పరిహసింత్రు

> సాధకుడు <

అఖిలము సహింపగలదు గాఢానురాగ
మట్టియెడ లజ్జయును దుస్సహమ్ము కాదు
ప్రాజ్ఞులకు నేను పరిహాసపాత్ర మెప్పు
డగుదు, నప్పుడె నాదోష మన్నమాట

> శిలాప్రతిమ <

శుభము కల్గ నీకు నభిమతం బగునేని
సరళమానసుండ, సత్వరముగ
ఉజ్జగింపవలయు నూహాములో గూడ
ఆమె కన్వయించునట్టి వెల్ల

* సాధకుడు *

ఆర్ద్రహృదయముతో ప్రియురాలు నాకు
తొలుత నొసగిన ప్రణయవస్తువుల నెల్ల
మరణకాలమునందు సమ్మదముతోడ
ఎడదపై జేర్చి ప్రాణముల్ విడుతుగాక !

నిఖిలసౌందర్యసముదాయనిలయమైన
ప్రణయినీదివ్యముఖచిత్రపటమువంక
మరణకాలమునందు సమ్మదముతోడ
వీక్షణము నిల్పి ప్రాణముల్ విడుతుగాక

అఖిల మధురాతిమధుర నామాతిశాయి
యైన ప్రియురాలి నామధేయమ్ము నేను
మరణకాలమునందు సమ్మదముతోడ
తడబడక పల్కి ప్రాణముల్ విడుతుగాక !

> శిలాప్రతిమ <

నాకు జాలి కల్గినది గాని నీమీద,
కరగ దేమి యామె కరకు మనసు ?
కాని లెమ్ము ! బుద్ధి కర్మానుసారిణి,
కొంతవడికి నిజము గోచరించు

[అంతర్ధానమగును]

*   *   *

> సాధకుడు <

అహరహోపాస్యదేవత యైన చంద్ర
కాంతపాషాణనిర్మిత కిప్రమమూర్తి
ఈప్రమాదేవియే ద్రవియించె గాని
నీకుమాత్రము, ప్రియురాల, నెనరు లేదు !

అన్యభావము లన్నిటి నవల ద్రోసి
చిత్తసద్మమునం బ్రతిష్ఠించి దేవి,
నిన్ను ధ్యానించుచున్నాను నిరత మేను,
నీకుమాత్రము నామీద నెనరు లేదు !

ప్రవిమలప్రేమరస సుధాపాన మత్త
వివశహృదయుండనై లజ్జ విడిచి, నిన్ను
స్తవము చేయుచునుందు నక్తందినమ్ము
నీకుమాత్రము నామీద నెనరు లేదు !

దైవవశమున నీసన్నిధాన లాభ
మొదవగా, దేవి, గర్వము నుజ్జగించి
పాదములమీద వాలితి ప్రణయవశత
నీకుమాత్రము నామీద నెనరు లేదు !

["సాధకుడు" అను కావ్యములోని ఘట్టము]

# ఫెడరలు, యూనిటరీ ప్రభుత్వములు

## భారతదేశమునకు తగినదేది?

అంబటి సుబ్బరాయశ్రేష్ఠి

నూతన భారతరాజ్యాంగ చట్టము (The New Indian constitution act) రాష్ట్ర స్వాతంత్ర్యము (Provincial autonomy) తో ప్రారంభించి ప్రవేశపెట్టబడిన నాటనుండి "ఫెడరేషను", "ఫెడరలు ప్రభుత్వము" అను రెండు శబ్దములు రాజకీయ రంగమున ప్రతిధ్వనులీనుచున్నవి ఆ చట్టము ననుసరించి ప్రభుత్వమువారు "ఫెడరలు విధానము"ను భారతదేశ కేంద్రప్రభుత్వముగ ద్వరలో ప్రవేశపెట్టనున్నారు కాంగ్రెసువారయ్యది బహులోప దోషభూయిష్ఠమని వాదించుచు, తత్ప్రవేశమునే ప్రతిఘటింప నున్నారు "ఫెడరేషను" స్థాపింపబడినగాని యాంధ్ర రాష్ట్ర నిర్మాణము కాజాలదని కొందరనుచున్నారు కనుక "ఫెడరలు ప్రభుత్వము" అనగా నేమో, దానికిని "యూనిటరీ ప్రభుత్వము"నకును గల భేదమేమో, వానిలో నేది మన భారతదేశమునకు సాంఘి, కార్థిక నైతిక పరిస్థితులబట్టి యెక్కువ సమంజసము, లాభకరము నగునో తెలుసుకొనుట ప్రతిభారతీయుని కర్తవ్యము

'సంధి' లేక 'సమాధానము' (Treaty or agreement) అను నర్థమిచ్చు, 'లాటిను' (Latin) భాషయందలి 'ఫోడసు' (Foedus) అను శబ్దమునుండి యీ 'ఫెడరలు' శబ్దము గ్రహింపబడినది వర్తమానకాలమున 'ఫెడరలు ప్రభుత్వ' మనగా, రెండు మూడు స్వతంత్ర ప్రభుత్వముల కలయికవలన నేర్పడిన యొక నూతన సంయుక్త ప్రభుత్వమని పరిగణింపబడుచున్నది ఇట్టి కలయికలచే నేర్పడు సంయుక్తప్రభుత్వములు పలుతెఱగులుగా నున్నవి (౧) అంతర్జాతీయ సంయుక్త పరిపాలనా సంస్థలు (International administrative unions), (౨) వ్యక్తి సంయుక్త సంస్థలు (Personal unions), (౩) సత్యసంయుక్త సంస్థలు (Real unions), (౪) కాన్ఫెడరేషనులు, (౫) ఫెడరేషనులు అనియవి యైదువిధములు

"సూయజుకాలువ" (Suez canal)ను పరిపాలించు బ్రిటిషు, ఫ్రెంచివారి సంయుక్త పరిపాలనాసంస్థవంటి వంతర్జాతీయ సంయుక్త పరిపాలనాసంస్థలుగా పేర్కొనబడుచున్నవి. రెండు మూడు స్వతంత్రరాజ్యముల కొక్కడే రాజు ఏ కారణములచేనైన నేర్పడిన, వ్యక్తి సంయుక్త పరిపాలనా సంస్థలేర్పడును పదునేడవ శతాబ్దాదియందు ఇంగ్లండు, స్కాట్లండు లను ప్రత్యేక స్వతంత్ర రాజ్యములకు రెంటికి 'మొదటి జేమ్సు' అనువాడొకడే రాజుగా నేర్పడెను మన దేశమందు గూడ పూర్వచాళుక్య, చోళరాజ్యములకు రెంటికి కులోత్తుంగచోళుడు రాజయ్యెను ఇందు రెండు స్వతంత్రరాజ్యములకు ప్రభువొకడగుట తప్ప యితర సంబంధ మేమియు నుండదు

ప్రభు ఐక్యతయేకాక, ప్రత్యేకరాజ్యములకు వలయు నేకొన్ని ముఖ్యవిషయములందేని సంయుక్త పరిపాలనము నవలంబించిన, సత్యసంయుక్తసంస్థ సంభవించును ౧౮౧౫-వ సంవత్సరమునుండి ౧౯౦౫-వ సంవత్సరము వఱకు విదేశ విషయములందు (Foreign affairs) ఏకీభావముగల్గి, తదితర విషయముల స్వాతంత్ర్యము పాటించుచుండిన "నార్వే, స్వీడనుల సంయుక్తత" యట్టిదియే సుమారు ౧౦, ౧౧-వ శతాబ్దములందు నాంధ్రదేశమున పేరుకెక్కిన పెనుగొండ మున్నగు నష్టాదశ వర్తకనగరము లొక్కొక్కటియు ప్రత్యేక స్వతంత్ర నగరరాజ్యములు (city states) గా నుండినను, పరభూపాలురతోడి సంబంధములందు (Foreign relations) ఏకీభావము గలిగి, పెనుగొండనగరాధిపతియగు కుసుమశ్రేష్ఠికి లోబడియుండిరి చాళుక్యరాజగు విష్ణువర్ధనునితోటి వివాహసంబంధము తగునా, తగదా అను విషయముగూర్చి చర్చించుటకు పెనుగొండ నగరమున గూడిన సభకు పదునెనిమిది నగరములనుండియు నభ్యర్థులు (Delegates) విచ్చేసిరి ఈ యాంధ్రనగర రాజ్యసంయుక్తసంస్థ పూర్వము గ్రీసుదేశమున వెలసిన ఏకియనులీగు (Achean league) వంటిదని చెప్పవచ్చును

ఇట్టి సత్యసంయుక్త ప్రభుత్వ సంస్థలకు, (Real unions) "కాన్ఫెడరేషను" లను వానికి భేద మెంతయో లేదు ౧౬, ౧౭-వ శతాబ్దములందు మొగలుల పొగరడంచిన మహారాష్ట్ర రాజ్యసంస్థాపకుడగు శివాజీ యేర్పఱచిన యష్టప్రధాన నామక పరిపాలనాసంస్థకు లోబడక, యాతనియనంతరము మహారాష్ట్రరాజ్యము విస్తరించుకొలది బయలుదేరిన పలువురు మహారాష్ట్ర ప్రముఖులు ప్రత్యేకస్వతంత్రరాజ్యసంస్థ లేర్పఱచుకొనిరి అపుడు బాలాజీ విశ్వనాథుడను మహారాష్ట్రనియంత స్వతంత్ర మహారాష్ట్రప్రముఖు డొక్కొక్కడు తన రాష్ట్రమందు స్వతంత్రపరిపాలన చేసుకొనన నొప్పుకొనెను కాని, పరరాజులతోటి సంబంధములందెల్ల ప్రత్యేకరాష్ట్ర స్వాతంత్ర్యము పనికిరాదని, తద్విషయ వర్చకుగా నొక సర్వరాష్ట్ర సంయుక్తసంస్థను (సర్వస్వతంత్ర రాష్ట్రములపైన నా విషయమందు నధికారము చలాయింపగల శక్తిగలది) ఏర్పాటు కావించెను ఈ మహారాష్ట్ర సంయుక్త సంస్థను "రానడే" మున్నగు సుప్రసిద్ధ మహారాష్ట్ర చరిత్రకారులు "మహారాష్ట్ర కాన్ఫెడరసీ" (Maharata confederacy) అని పేర్కొనిరి

ఇట్టి కాన్ఫెడరేషనులకు, నిపుడు మన దేశమున స్థాపింపబడవలెనను 'ఫెడరేషను'కు నెంతయో భేదము గలదు కాన్ఫెడరేషనులందు వివిధప్రత్యేక స్వతంత్రరాష్ట్రము లేవో కొన్ని సామాన్యావసర కార్యనిర్వహణార్థము సంయుక్తత పాటించి, యొక సంయుక్త సంస్థ నేర్పాటు జేసి, తదధికారము దలనిడుకొనును కాని యెపుడిష్టము లేకున్న నపుడా రాష్ట్రములా సంయుక్త సంస్థతోటి సంబంధమును విడగొట్టుకొనవచ్చును. 'ఫెడరేషను'లో నట్లు విడిపోవుటకు సాధ్యపడదు 'కాన్ఫెడరేషను'లో సంయుక్తసంస్థకు రాష్ట్రసంస్థలతో మాత్రమే సంబంధముండును. 'ఫెడరేషను'లో రాష్ట్రములతోడను, తత్పౌరులతోడనుగూడ సంబంధముండును

## ఫెడరలు, యూనిటరీప్రభుత్వములకు గల భేదములు

ఫెడరలు ప్రభుత్వమునందు రాష్ట్రస్వాతంత్ర్యము (Provincial autonomy) కలదు. అందలిపౌరులు తాము వసించు రాష్ట్రము నందలి ప్రభుత్వముతోడను, ఫెడరలు ప్రభుత్వముతోడనుగూడ, అనగా రెండుప్రభుత్వములతోడను సంబంధము గల్గియుందురు. ప్రతి రాష్ట్రమునకు శాసననిర్మాణాదికములకు ప్రభుత్వాధికారము కొన్నియెరో విషయములం దొప్పియుండును. యూనిటరీ (Unitary) ప్రభుత్వమం దన్ననో అట్లు గాదు. అందు ప్రభుత్వాధికార మొక్కచోటే. ఒకటేపౌరస్వత్వము (citizenship), అనగా రాష్ట్రములును, రాష్ట్రప్రజలు నొకే యధికారమునకు లోబడియుండవలెను. అందు కేంద్రప్రభుత్వమునకే (Central government) సర్వాధికారము లుండును. రాష్ట్రములన్నియు నన్నివిషయములందును కేంద్రప్రభుత్వపు టాజ్ఞల ననుసరించుకొనవలెను. కేంద్రప్రభుత్వశాసనములే అందు చలాయింపబడి అనుసరింపబడవలెను. రాష్ట్రముల కేలాటిశాసననిర్మాణాధికారము నుండదు. ఫెడరలుప్రభుత్వముగల రాజ్యమున కేంద్రప్రభుత్వము, రాష్ట్రములతో గలిసి ఏర్పాటుగావించుకొన్న ఏకొన్నివిషయములందో స్వతంత్రాధికారము గల్గి, తద్విషయములందుమాత్రమే రాష్ట్రముల నాజ్ఞాపించును. తదితరవిషయములందు రాష్ట్రములకు సర్వస్వతంత్రశాసన నిర్మాణాధికారము లన్నియు గలవు.

## భారతదేశమునకు తగినదేది ?

ఇట్టి ఫెడరలు, యూనిటరీ ప్రభుత్వములందేది మన భారతదేశమునకు తగుననునది ప్రస్తుతాంశము. యూనిటరీ ప్రభుత్వము, భాషాభావమతజాత్యాదిక సకలవిషయములందును సమైక్యతగల్గిన నాతివిస్తీర్ణముగు దేశములందు మాత్రమే యెప్పటికి గొనసాగగలదు. అటుగానిచో ఫెడరలుప్రభుత్వమే తగినది. భారతదేశమందు భాషైక్యత, మతైక్యత లోపించుటచేసియు, నది యూరపునందు విఖ్యాతివహించిన 'యూనిటరీ ప్రభుత్వము' గల 'బ్రిటను, ఫ్రాన్సు' మున్నగుదేశములతో సమానముగు విస్తీర్ణముగల రాష్ట్రము లెన్నియో నెలయు బహువిస్తృతదేశ మగుటంజేసియు నీ దేశమునకు యూనిటరీప్రభుత్వము పనికిరాదని యెల్లరకును దెలిసియున్నవిషయమే. అశోకుడాదిగాగల హైందవప్రభువులును, మహమ్మదు-బిన్-తుగ్లకు-వంటి మహమ్మదీయ ప్రభువులును అనాదిగా నీదేశమునందు తమతమ విస్తృతరాజ్యముల నిరంకుశముగ 'యూనిటరీ ప్రభుత్వము' నేర్పాటు గావించిరి కాని, యది మూన్నాళ్ల ముచ్చటై కొలదికాలమునకే రాష్ట్రములన్నియు స్వతంత్రములై, దేశ మరాజకస్థితియందు బడి దేశీయులలో నైకమత్యము లేక అది పలుమారులు పరదేశీయుల దాడి కొలయగుచు వచ్చినది.

ఇంతియేగాక, యూనిటరీ ప్రభుత్వమును స్థాపించిన, ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణమునకు మన మొనరించునాందోళన యంతయు నిష్ఫలమగును. ఎందుకన, యూనిటరీ ప్రభుత్వమునందు స్వతంత్రరాష్ట్రప్రభుత్వము



శ్రీకృష్ణదేవాలయము – హంపి

సాగదు అట్టి స్వతంత్రప్రభుత్వము లేని ప్రత్యేకాంధ్రరాష్ట్రమువలన నేమి ఫలమనుభవింపగలము? కనుక ప్రత్యేకభాషారాష్ట్ర నిర్మాణమునకును, తదవిచ్ఛిన్నాభివృద్ధికిని, మతభాషాదికముల మించు జాత్యైక్యతను బొంది, దానిని వృద్ధిపొందించుటకు కూడ ననుకూలమైనది ఫెడరల్ ప్రభుత్వము, అనగా కేంద్రప్రభుత్వము 'ఫెడరల్' పద్ధతిని స్థాపింపబడినచో, ప్రత్యేక రాష్ట్రప్రభుత్వములు స్వతంత్రము లగుటంజేసి తత్ప్రజాభివృద్ధి నిర్విఘ్నముగా కొనసాగి సమష్టిజాత్యభివృద్ధియు, సకల భారత జాత్యైక్యతయు తప్పక కలుగునని నాయాశయము

మీదు మిగుల 'యూనిటరీ ప్రభుత్వము' స్థాపించి, సకలాధికారములను కేంద్రప్రభుత్వపుచేతిలో నిడి, తదాజ్ఞలను సకలరాష్ట్రములు సకలవిషయములందును పాలింపవలెనన్న, మతభాషాదిక భేదములవలన భేదాభిప్రాయములు జనించి, కేంద్రప్రభుత్వపు నిరంకుశాధికారమునకే భంగము వాటిల్లును ఏఢిల్లీనుండియో సర్వకాలములయందు సంతృప్తికరముగా సకలవిషయములందు సర్వరాష్ట్రము మీదను ప్రత్యేకముగను, సమష్టిమీదను వలయురీతి నధికారము చలాయింప సాధ్యము గాక, దేశ అంతరంగవిషయములను (Internal affairs) గూర్చియే యూనిటరీ ప్రభుత్వము కాలము గడుపును, దేశసమష్టికి వలయు రక్షణము (National Defence), సైన్యనిర్మాణము (Military Organization) మున్నగు విషయములను గూర్చి సరియైన శ్రద్ధ తీసికొనజాలకపోవచ్చును ప్రపంచమునం దెల్లెడల యుద్ధనినదములు వినబడు నిక్కాలమున కేంద్రప్రభుత్వము, దేశరక్షణ, సైన్యనిర్మాణాదివిషయములందు చక్కని దృష్టి నిడి, సంతృప్తికరముగా సకలరాష్ట్రసహాయమును బడసియుండుట దేశక్షేమమున కత్యంతావసరమగును అందువలన ఫెడరేషను స్థాపించిననే అట్టి సమష్టి జాతీయాభ్యుదయ కార్యములు సాధ్యమగును

దేశరక్షణ, విదేశ వ్యవహారాది విషయములందు కేంద్రప్రభుత్వమునకు లోబడియుండి దేశాంతరంగ విషయములందు స్వాతంత్ర్యము గల్గిన రాష్ట్రప్రభుత్వములు వెలయుపద్ధతిని స్థాపింపబడు ప్రభుత్వమే, అనగా 'ఫెడరల్ ప్రభుత్వమే' మన భారతదేశమునకు తగినదని ముమ్మాటికి జెప్పనగును అందుకనియే పాశ్చాత్య రాజనీతిశాస్త్రకారు డగు 'సిడ్జివిక్కు'

**"Where there are adjacent communities, anxious to preserve a real independence, but afraid of proving too weak in isolation to hold their own with powerful states in their neighbourhood, a federal union is an obvious resource"**

అనగా, స్వాతంత్ర్యరక్షణాపేక్ష కలిగి, విడివిడిగ నుండుటవలన దుర్బలములై, పొంతనున్న బలవద్రాజ్యములధాటికి తాళలేమను భీతి కలిగిన చిన్న సంఘము లిరుగుపొరుగుల నున్నప్పుడు దానికి 'ఫెడరల్ సమైక్యత'యే గతి - అని చెప్పియున్నాడు

మత భాషాద్యనేకభేదములు స్వల్పములేయైనను, తత్తద్భేదములచే నొప్పారు వివిధ రాష్ట్రములకు వలయు వివిధశాసనముల జేయుటకు గాని, వానిని శ్రద్ధగాను, సకల సమ్మతముగాను చలాయించుటకుగాని కేంద్రప్రభుత్వమునకు సాధ్యముకాదు కనుక, దేశసమష్టి క్షేమమునకు వలయు కార్యములందు సర్వాధికారముగల కేంద్రప్రభుత్వమును, తదితర సర్వ కార్యములందును స్వతంత్రాధికారము గల రాష్ట్రప్రభుత్వమును వలయునటుల మన దేశప్రభుత్వము నేర్పఱుచుట, అనగా ఫెడరలు ప్రభుత్వము నేర్పాటుచేయుట మనదేశమున కెంతయో క్షేమకారి

ఇంతియేకాక, వర్తమానకాలమున బ్రిటిషుపాలకులచే నాదరింపబడి, తమతమరాష్ట్రములందు నిరంకుశ ప్రభుత్వమును చలాయించుచుండు స్వదేశ సంస్థానాధీశు లెందఱో యున్నారు వీ రందఱును కూడ ఏదో యొక రీతిగ దేశసమష్టిలాభమున కేర్పడు కేంద్ర ప్రభుత్వమున కితర రాష్ట్రములతోపాటు సమరీతి లోబడియుండవలెనన్న ఫెడరలు ప్రభుత్వమే సరిపడునుగాని, యూనిటరీ ప్రభుత్వము పనికిరాదు ఎందుకన, ఫెడరలు ప్రభుత్వమునందు, వారు తామిపుడు చలాయించు రాష్ట్ర స్వతంత్రాధికారమున కంతగా భంగము వాటిల్లదు యూనిటరీప్రభుత్వమందన్ననో తమ యధికారములెల్ల కేంద్రప్రభుత్వమునకు ధారవోసి, కేంద్రప్రభుత్వపుటాజ్ఞలను బాలించు నుద్యోగస్థులుగా మాఱవలెను బహు సంవత్సరములుగా నధికారరుచి మఱిగిన యీసంస్థానాధీశు లిట్లు చేతురనుట కలలోనిమాట

బ్రిటిషు పరిపాలనకు లోబడియున్న మన కిట్టి ఫెడరలు ప్రభుత్వమును స్థాపించి, దానిని పెడదారిని బడకుండ సాగించుట సాధ్యమగునాయన్న – బ్రిటిషు సామ్రాజ్యాధిపత్యమునకే లోబడియున్న కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికాలయందు 'ఫెడరలు ప్రభుత్వము' విజయవంతముగా సాగుటలేదా? కనుక విస్తీర్ణమందును, ప్రజాబాహుళ్యమందును, భాషాదిక స్వల్పభేదములందును, భౌతికపరిస్థితులందును కెనడా మున్నగు వలస రాజ్యములను బోలిన భారతదేశమునందు ఆ రాజ్యములందువలె నిజమైన యధికారము గల ఫెడరలుప్రభుత్వమును నిర్మించినయెడల వివిధరాష్ట్రములమధ్యగల భాషాదిక స్వల్పాంతరంగభేదతీవ్రత త్వరలోనే యంతరించి, జాతిఐక్యతకు తగిన గట్టిపునాదు లేర్పడును స్వదేశసంస్థానాధీశులకు మొదటమొదట కొన్ని యధికారములను 'ఫెడరలుప్రభుత్వము'న కిచ్చుటకు రుచింపకున్నను, వారందరు కాలక్రమమున అట్టి యావశ్యకతను గుర్తెరిగి ఫెడరేషనులో చేరకపోరు ఇపుడు వేలువేలు రకముల ప్రభుత్వములను గల్గి, వేలువేలు బావాశయములతో పరిపాలింపబడుచున్న దేశము నందలి సంస్థానము లన్నియు బ్రిటిషుఇండియా రాష్ట్రములతోడ సమానప్రపత్తిగలిగి యొకటే కేంద్రప్రభుత్వపాలనమునకులోబడి పనిచేయునాడె మనకు దేశైక్యతయు, జాత్యైక్యతయు గల్గును, "చీలదీసి యేలుము" (Divide and rule) అను పాశ్చాత్యరాజనీతి నెదుర్కొని దాస్యవిముక్తిని బడయగలుగుదుము అట్టి మోక్షము 'ఫెడరలుప్రభుత్వము'వలననే కలుగవలెను

ఫెడరలు ప్రభుత్వమునకు మొదటిమెట్టుగా 'ఫెడరలు కోర్టు' (న్యాయస్థానము) స్థాపింపబడినది ఇది ఫెడరలురాష్ట్ర ప్రభుత్వములమధ్య నధికార విభజనను గూర్చి కల్గు తగవులనుమాత్రమే కాక యిప్రుడు రాష్ట్రములయందలి హైకోర్టులనుండి ప్రీవికౌన్సిలునకు బోవు 'అప్పీళ్ల' నన్నిటిని ఇండియాయందే పరిష్కరించును కనుక 'ఫెడరలు ప్రభుత్వ' స్థాపనవలన క్రమముగా పరదేశదాస్య విమోచన మగునని నా యభిప్రాయము

# బహుధాన్య వత్సరము

నేమాన సూర్యప్రకాశకవి

శ్రీ బహుధాన్యవత్సర మశేషజగజ్జన వర్ణనీయ నా
నా బహుధాన్యసంచయఘనస్తబకాన్విత సర్వసస్య రే
ఖా బహుధా పరిస్ఫురదఖండమహీవలయంబు దేశసే
వా బహుధన్యమాన్య బుధవర్గము వచ్చె ననర్గళస్థితిన్

శ్రీగంధశైలాగ్ర సీమ వెల్వడి యల్లనల్లన వీతెంచెఁ జల్లగాలి
బహుళానురాగసంపద మాధవుఁడురాఁగ విలసిల్లెఁ జెలువొంది విపినలక్ష్మి
హుతవహప్రీతి కున్నతసవనారంభదీక్ష వహించె సద్ద్విజకులంబు
ధాత్రీజ సౌధసంతతిఁ బల్లవప్రాప్తిఁ గరమొప్పె వరగణికాగణంబు
న్యస్తాననములై కనత్పుష్పబృంద మరందంబుఁ గ్రోలె మిళిందపంక్తి
నాళీకవని వరాటాళీసమేతమై కేళిఁ గావించె మరాళపాళి
మధురామ్రఫల మాని మదమూని పొలివోని పలుకుల లాలించెఁ గలికిఁజిలుక
సంగతాస్త్రానంగ చాపభంగిఁజెలంగె సంఫుల్లసుమలతా సంచయంబు

వరుసఁ బాడెఁ బికము, వర్తిల్లెఁ బరిణయో
త్సవము లఖిలనగర జనపదముల
రహి వహించె జగము, బహుధాన్యవత్సర
ముజ్జ్వలముగ వచ్చి యొప్పుచుండ



EDITED PRINTED & PUBLISHED BY K NAGESWARA RAO,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras

# సింప్లెక్సు

## టాకీ పరికరములు

అనగా

మేలురకము నమ్మకము సులభము

సెమి ప్రొఫెషనల్ మాడల్

సింప్లెక్సు
పోర్టబుల్
అండ్
సెమి ప్రొఫెషనల్
టాకీ పరికరములు
జగత్ప్రఖ్యాతి గాంచినవి
ట్రావెలింగు
సినిమాలకు
పర్మనెంటు
థియేటర్లకు
ఉపయోగపడును.



ఎప్పుడు స్టాకులో నున్నవి.

ఆర్. సి. ఏ.
అండ్
సింప్లెక్సు
ప్రొజెక్టర్ల యొక్కయు
ఆంప్లిఫయర్ల
యొక్కయు
విడిభాగములు

కొలంబియా
కార్బన్సు

కన్వర్టర్సు
స్క్రీనులు –
ఫిలిం సిమెంట్ లెన్సు.

**THE CENTRAL TALKIE EQUIPMENT Co.,**

20, Vepery High Road, MADRAS.

HEAD OFFICE:—48, Central Avenue (South) Calcutta. *Telegrams*: "CENTAUTO."

# వేసవికాలపు రత్నత్రయము

**"EYE" బ్రాండు**
**"స్పిరల్ గార్డు"**
**యెలెక్ట్రిక్ ఫ్యానులు**

వేసవికాలమును దీనితో యెదుర్కొనవచ్చును. గట్టివి. చౌక. "స్పిరల్ గార్డు" యెలెక్ట్రిక్ ఫ్యానులంటే దోమతెరలు అవసరములేదు.

సైజులు 8", 12", 14", 16"



**"క్లి-కో" కిరోసీన్ ఆయిలు**
చల్లదనమును, మంచి గాలినియిచ్చే ఫ్యానులు

నాణ్యమైన బ్రిటిష్ పరికరములతో చేయబడినవి.

గొనిపోవచ్చు. అందమైనవి. గట్టివి.



10 గంటలకు ఒక (పైంటు) కిరసనాయిలు చాలును.

పొగ రాదు. వాసనరాదు. నిశ్శబ్దముగా పనిచేయును.

**"రిలైయన్సు"**
ఐస్ క్రీం ఫ్రీజర్లు

నమ్మకమైనవి. ప్రాత్రిగ పూచీ యివ్వవచ్చును. తేలికగా శుభ్రము చేయవచ్చును.

సైజులు: ½ నుండి 24 క్వార్టులు.




వివరములకొరకు దిగువవారికి వ్రాయుడు:

## కే. యస్. షివ్ జీ అండ్ కో.,

సోల్ యేజెంట్లు:--బాక్సు నెం. 5, బ్రాడ్వే, మద్రాసు.
బ్రాంచీలు: కలకత్తా, కొలంబో. హెడ్ ఆఫీసు: బొంబాయి.

బిడ్డలకు:— ప్రాణదానము,

# లివర్ రెమిడీస్

ఇందు బిడ్డలకు గలుగు లివరు, స్ప్లీను (ప్లీహోదరము) వ్యాధులను ఆశ్చర్యకరముగా ఖండించునట్టి 5 రకముల ఔషధములు గలవు. బిడ్డలకు పొట్ట పెరుగుట, కాళ్లుచేతులు సన్నగిలుట, బిళ్లగట్టుట, అన్నహితవుచేయకుండుట, రక్తక్షీణము, అతిసారవిరేచనములు, జ్వరము, కండ్లుపచ్చనగుట, యీలాటివ్యాధులను అమోఘముగా ఖండించును—చిన్నబిడ్డలు మొదలు 12 సం॥రముల బాలురవరకు వాడవచ్చును. పై ఔషధము లన్నియు సమయానుకూలముగా ఆయావ్యాధులమీద వాడదగియున్నవి. యీలాటివ్యాధులలో యుత్తమమగు ఔషధ మిదియేనని అనేకులు తలంచుచున్నారు.

20 రోజులకు చాలినట్టి 5 నెంబర్ల ఔషధములు పెట్టుగల పెట్టె 1-కి రు. 2—8—0. వి. పి. ఖర్చు రు. 0—7—0

నోటు:—మావద్ద యింకా అనేకరకములగు వంట, ఖజ్జలి ఔషధములు, శస్త్రములు, ఆసవారిష్టలేహ్యములు మొదలగున వన్నియు సిద్ధముగా నున్నవి. కోరినవారికి మా క్యాటలాగు యుచితము. వ్యాధిగ్రస్తులు, తమ వ్యాధులనుగురించి తెలియపరిచినచో తగుమయిన ఔషధములను నిర్ణయించి పంపెదము.

## పి. శి. ఏ. అండు కంపెని, ఆయుర్వేదసమాజం—

పెరిదేప — నెల్లూరు జిల్లా.

మా బ్రాంచీలు: బెజవాడ, గుంటూరు, బందరు, తెనాలి, నడిపాడు, నంద్యాల, నెల్లూరు, మద్రాసు మొదలగుచోట్ల గలవు.

మోసపోకుడు! నకలురకముల గ్లిసరిన్‌సబ్బులనుచూచి మోసపోకుడు!




ఈసబ్బు, గ్లిసరిన్‌తోను లవండరు మొదలగు అత్తరులతోను సౌందర్య వర్ధకములగు పదార్థములతోను తయారుచేయబడినది. మీకు ఒక అర్ధణా గాని, అణా గాని తక్కువధరకు దొరకవచ్చును. కాని అది ఉపయోగించినందువల్ల మీ శరీరమునకు అందముగాని, మంచి సువాసనగాని, మీ మనస్సునకు ఆనందమునుగాని ఇవ్వవు. కాని మంచి గ్లిసరిన్ సోపు చేయుటచేతకాక నకలురకముల సబ్బులుచేయువారి సబ్బు నుపయోగించుటవల్ల మీ శరీరము, అందమును పోగొట్టుకొనుటయే కాక గరుకు పారును. (Harsh and Coarse)

హిమానీసబ్బులు చాల ప్రఖ్యాతిగాంచినవి.




*Presidency Agents:—*

**THE NEW STAR & Co.,**

Rajahmundry & 45, Bunder St., Madras.